## గద్వాల సంస్థాన

# తెలుగు సాహిత్య పోషణము





రచయిత

డా॥ కట్టా వేంకటేశ్వరశర్మ



**1987**

ప్రథమ ముద్రణ :
ప్రతులు 1000
1987

*

ముఖచిత్రం :
కాతోజు వేంకటేశ్వర్లు
ఉపన్యాసకులు
మహబూబ్ నగర్

*

వెల రు 60-00

*

ప్రతులకు :
సునందా పబ్లికేషన్స్
H. No. 6-1-69
హనుమాన్ పురా
మహబూబ్ నగర్ జిల్లా
ఆంధ్రప్రదేశ్

*

ముద్రణ :
ప్రసన్న ప్రింటింగ్ వర్క్స్
న్యూటౌన్, మహబూబ్ నగర్.

# "మధుర స్మృతి"

నాకు జన్మనిచ్చి నన్నింతవానిగా

చేసిన జననీ జనకులు - కీ॥ శే॥ వెంకటమ్మ,

కట్టా రామయ్య గారి పాదపద్మములకు నా ఈ గ్రంథము

అంకితము

# వ్యాసమున వివరించిన కవులు - గ్రంథములు

# ముందు మాట

పరిశోధన ఒక నదీప్రవాహము లాంటిది. ఒకరు చేసినంతవరకే అది పరిమితము కాదు-కారాదు. పరిశీలనమున్నంతవరకు ప్రతి ఒక్కరు దానిని ప్రవహింపచేస్తూ ముందుకు పోతారు. నేను చేసిన పరిశోధన పూర్తి అని చెప్ప డానికి వీలులేదు. విజ్ఞులైన పెద్దలు గావించిన గ్రంథములను గూర్చి ఎంద రెందరో నేటికిని పరిశోధన గావించి ఎన్నో దాగిన ఆణిముత్యాలను వెలికి తీసి బాహ్య ప్రపంచానికి అందజేస్తున్నారు.

విమర్శ రెండు విధములు. కవి రచించిన గ్రంథములోని రచనాపద్ధతి-రీతి, శైలి, పాకము, అలంకారములు మున్నగునవి అలంకార శాస్త్రమున కను గుణముగా నుండుటను విశ్లేషించి వివరించి చెప్పుట, ఇక రెండవది కవి ఆత్మను గూర్చి తెలిసికొనుట అత డీవిషయమును వ్రాయుటలోగల కారణాలను గ్రహించి వివరించి తెల్పుట. అనగా కవితా విమర్శ ఒకమైనచో కవితాత్మలోని విశే షాంశములను గూర్చి సహృదయుడు గ్రహించి తెల్పి వాటికి వన్నె చేకూర్చును. అట్టివాడే సహృదయుడనియు, అట్టి విమర్శయే సద్విమర్శ అనిపించుకొనును.

రత్నము సానరాయితో గీచినగాని ప్రకాశించదు. విమర్శ యున్నప్పుడే రచనకు ప్రకాశము. కాలప్రవాహములో దాగియున్న కొన్ని అముద్రితప్రతు లను ఆయా ప్రాచ్యలిఖిత గ్రంథాలయాలలో వెలికి తీసి నాశక్తికొలది ఆయా గ్రంథములలోని విశేషాంశములను ఇందు పొందుపరచుటకు ప్రయత్నము గావించినాను.

ముఖ్యముగా గద్వాల సంస్థానమందలి భాగమైన బోరవెల్లి కవుల (లయ గ్రాహి-చింతలపల్లి)ను గూర్చి ప్రాచ్యలిఖిత గ్రంథాలయం హైద్రాబాదు మరియు మద్రాసు యూనివర్సిటీ ప్రాచ్యలిఖిత భాండాగారమునుండి సేకరించుటయు జరిగినది. కొంతవరకు చారిత్రికాంశములతోపాటు వారి వంశక్రమమును, వారు రచించిన గ్రంథములను గూర్చి వివరించుటకై ప్రయత్నము గావించినాను గ్రహించిన కవుల పట్టిక ఇచ్చినాను. సవరణ చివర చూపెట్టుట జరిగినది.

‘విద్వద్గద్వాల’ యని ప్రసిద్ధి చెందిన ఆనాటి సంస్థానములోని చతుర్విధ కవితలు, ఆశుకవితావధానములు, వారి రచనా వైదుష్యములను ఉటంకించ ప్రయత్నించినాను.

ఎందరో విద్వన్మణులు, గురువులు నాకు సహకరించి నన్ను ప్రోత్సహించి నన్ను కార్యోన్ముఖుని గావించినారు. అట్టి వారిని మనసా స్మరించుచున్నాను. నన్ను ప్రోత్సహించి చేయూతనిచ్చిన కీ॥ శే॥ గురువర్యులు డా॥ దివాకర్ల వేంకటావధానిగారు నన్నాశీర్వదించి సాయపడిన కీ॥ శే॥ డా॥ పాడిబండ మాధవశర్మ గారు గురువులు బోరవెల్లి కవులను గూర్చి పరిచయము గావించి ప్రోత్సహించిన డా॥ బి. రామరాజుగారు గురువులు డా॥ సి నారాయణరెడ్డిగారు పర్యవేక్షకులుగా నుండి నన్ను అన్ని విషయాలలో సిద్ధాంతవ్యాసమునకు స్వరూపము నిచ్చి విసుగులేకుండ నా వ్యాసమును పరిశీలించి ఆశీర్వదించిన డా కేతవరపు రామకోటిశాస్త్రిగారు అముద్రిత ప్రతులనందించి చేయూత నొసగిన ఆంధ్ర వాఙ్మయాధ్యక్షులు శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్యగారు మౌఖిక పర్యవేక్షకులు వేదమూర్తులు డా బండారు రామయ్యగారు (మైసూరు), దేవరకొండ డా చిన్నికష్ణశర్మగారు (మద్రాసు). నన్నాశీర్వదించి అభిప్రాయము నిచ్చి ప్రోత్సహించిన ఆచార్య డా ఎం. కులశేఖరరావుగారు (ఉస్మానియా విశ్వ విద్యాలయ తెలుగు శాఖాధ్యక్షులు) మిత్రులు, హితైషులు డా ఇరివెంటి కృష్ణమూర్తిగారు (యువభారతి కార్యదర్శి), పరిశోధన పరిమళాల నందించిన మిత్రులు డా. గోలి వెంకటరామయ్యగారు, చక్కని ముఖచిత్రాలంకరణ గావించి వన్నె చేకూర్చిన మిత్రులు కాతోజు వెంకటేశ్వర్లగారికి నా నమస్సుమాంజలులు.

మిత్రులు ఎన్నియో గ్రంధరాజముల నిచ్చి చేయూత నిచ్చిన డా. వి. రత్నయ్యగారు, కీ॥ శే॥ గొట్టుముక్కల కృష్ణమూర్తిగారు, శ్యాలన్నగారు (గద్వాల), నా గ్రంథమునకు చక్కని ప్రింటు ముద్రించిన ప్రసన్న ప్రింటింగ్ ప్రెస్ ఆదినేత-మిత్రులు శ్రీ బి. ఆశీర్వాదం గారికి ఎందరో గురువులు, మిత్రులు హితైషులు, ప్రెస్ సిబ్బంది మున్నగువారు గలరు. వారందరి సహకారమే ఈ సిద్ధాంత గ్రంథము ప్రూపులు చూస్తు నన్ను ప్రోత్సహించిన మిత్రుడు తోటపల్లి కృష్ణమూర్తిగారు వీరందరకు నా నమస్సులు.

'ప్రమాదోధీమతామపి' అన్న సూక్తి ననుసరించి నేను పరిపూర్ణుడను కాను నా యీ సిద్ధాంత వ్యాసమున దొరలిన దొసగులు నావి- గ్రంథములు కవులవి- సహృదయులు గ్రంథమును చదివి ఏవేని సూచనలిచ్చి లేఖద్వారా పంపి ప్రోత్సహించిన వాటిని సహృదయతతో స్వీకరించి రెండవ ముద్రణమున వేసికొందునని విజ్ఞప్తి గావించుకొనుచున్నాను. సహృదయులందరు చదివి వీటిలోని విశేషాంశములను గ్రహించి యత్కించిత్ తమ కుపకరించినదని తలచిన తృప్తి పొందుదునని విన్నపము చేయుచున్నాడను

ఇట్లు
కృతికర్త

అడ్రసు:
సునందా పబ్లికేషన్
H. No. 6–1–69
హనుమాన్‌పుర
P. O. మహబూబ్‌నగర్ (జిల్లా)
ఆంధ్రప్రదేశ్

# అభిప్రాయము

17-20 శతాబ్దాల మధ్య మూడువందల సంవత్సరాల నిడివిమీద గద్వాల సంస్థానాన్ని ఆశ్రయించుకొని బ్రతికిన కవి పండితుల సంస్కృతాంధ్ర కృతులను ముద్రితాముద్రితములయిన రచనలను గూర్చి విశేషమైన కృషి చేసి శ్రీ కట్టా వేంకటేశ్వరశర్మ ఈ గ్రంథం వ్రాశాడు. ఈ పరిశోధనకు ప్రతిఫలంగా ఉస్మానియా యూనివర్సిటీ పి హెచ్. డి. డిగ్రీని సంపాదించుకొన్నాడు, అందుకు శ్రీ వెంకటేశ్వరశర్మను అభినందించాలి. ఈయన వ్రాసిన ఈ గ్రంథంలోని విశేషమేమిటంటే గద్వాల సంస్థానములోని కవి పండితుల రచనలు జగత్ప్రసిద్ధంగా దొరికేవి కావు అలాంటివాటినన్నింటిని జాగ్రత్తగా సేకరించి వాటి గుణదోషాలను స్పృశిస్తూ వాటి స్వరూపస్వభావాలను వివరించటం- అనువాద గ్రంథాలయినప్పుడు మూలానువాదాలను పోల్చిచూడటం- ఆయా కవులయొక్క కృతులయొక్క దేశకాల మూలాలను స్పష్టపరచడం- ఆయా రచనలను సోదాహరణంగా పరిచయము చెయ్యటం- వాటిల్లో కనిపించే పూర్వకవి ప్రభావాలను నిరూపించటం- ఆయా కవుల పాండిత్య విశేషాలను సూచించటం కృతిభర్తల కర్తల వంశవృక్షాలను తెలిసినంతవరకు పొందుపరచటం- మొదలుగాగల చాలా శ్రమతో కూడిన పని చెయ్యటం తమ చక్రవర్తిత్వాన్ని ఆమోదించి అందుకు గుర్తుగా సాలీనా చెల్లింపులు చెప్పినట్లు చేస్తుంటే మహమ్మదీయ ప్రభువులు దేశీయ సంస్థానాధీశ్వరులను వాళ్ళ మత సాంస్కృతిక సాహిత్య విషయాల్లో స్వేచ్ఛగా ప్రవర్తించటాన్ని ఆటంకపరచలేదు అందుకు నిదర్శనలే నిజాము రాజ్యంలోని గద్వాల సంస్థానం సంస్కృతాంధ్ర భాషాపండితుల కాశ్రయమై ప్రసిద్ధం కావటం- చారిత్రక వాస్తవమైన ఆ కారణాన్ని ఒక క్రమపద్ధతిలో శ్రీ వెంకటేశ్వరశర్మ తన శ్రద్ధాసక్తులతో కూడిన పరిశోధనాపాటవంచేత ఆ ప్రసిద్ధ భాషా సాహిత్య విలాసనాన్ని సలక్షణంగా ప్రదర్శించాడు. ఈ గ్రంథాన్ని ఆసాంతం చదివినవాళ్ళకు ఆవిలసనాన్ని దర్శించినట్లవుతుందని అనుకొంటాను. పురాణకావ్య రచనావిధానం నుండి ప్రబంధకావ్య రచనా వైదగ్ధ్యంవరకుగల సమస్త ప్రాచీనరచనాశిల్ప రమణీయకములను గద్వాల సంస్థానాన్ని ఆశ్రయించుటలోని రచనలు చేసినవారంతా దాదాపు అనుసరించి చేసి

నట్లే అనిపిస్తుంది మనకీ పుస్తకము చూస్తే. ప్రతిభ తక్కువే అయినా పాండిత్యం బాగా దాన్ని మింగుతుంది. శ్రీ కట్టా వేంకటేశ్వరశర్మ పడిన శ్రమను విద్యాంసులు తెలుసుకొంటారు.

1-11-1987

ఇట్లు

డా. కేతవరపు రామకోటిశాస్త్రి
కాకతీయ విశ్వవిద్యాలయం
తెలుగుశాఖ, వరంగల్

# అభినందన

డాక్టరు కట్టా వేంకటేశ్వరశర్మగారు గద్వాల సంస్థానంలో వికాసం చెందిన సాహిత్యాన్ని గురించి సవిస్తారంగా వ్రాసిన మంచి గ్రంథమిది. భారత దేశాన్ని బ్రిటీషువారు పట్టి పీడిస్తుంటే వానికి దాసులైన ముసల్మాను రాజులు తెలంగాణాన్ని కొల్లగొట్టుకొని తింటూ అన్ని విధాల నాశనం చేయడానికి పూను కొన్న సమయంలో ఇచట ఉండిన సంస్థానాల బడా చిన్న చిన్న రాజ్యభాగాలను పరిపాలించె ప్రభువులు, మన సాహిత్య సంస్కృతుల నామమాత్రావశిష్టాలు కాకుండా రక్షించి వాటిని చలికేంద్రాలవంటి చల్లని నీడలను ప్రసాదించినారు. తెలంగాణంలోని సంస్థానాల్లో అన్నివిధాల అగ్రగణ్యమైంది గద్వాల సంస్థానం. దాని వైశాల్యం ఆర్థికస్థితిగతులు అనేమాట అటుంచి ఆ ప్రభువులు చేసిన సాహిత్యసేవ వలననే దానికి గౌరవం ఏర్పడిందని నా విశ్వాసం అందుచేతనే ఆ సంస్థానాన్ని కవి పండితులు 'విద్వద్గద్వాల' యని సగర్వంగా పేర్కొన్నారు.

డాక్టరు శర్మగారు తమ సిద్ధాంత వ్యాసంలో ప్రజల స్మృతిపథంలో అదృశ్యమవుతున్న అనేకానేక విషయాలను సేకరించి చేర్చినారు. ఐదు ప్రకరణాల్లో విభక్తమైన ఈ గ్రంథంలో సంస్థానాల్లో తెలుగు సంస్కృతి. గద్వాల చరిత్ర, గద్వాల కవులవారి రచనలు, విద్వద్గద్వాల (సాహిత్య కార్య కలాపాలు). ఆశ్రిత కవులు వారి రచనలు, అనే విషయాలు ఉల్లేఖింపబడినాయి. ఈ గ్రంథంలో చారిత్రిక విషయాలు రాజులకు రాణులకు సంబంధించినవి ఉన్న ప్పటికి సాహిత్యవిషయిక చర్చయే ప్రధానమనీ చెప్పవచ్చు. ఒకవిధంగా గద్వాల సంస్థాన సాహిత్య చరిత్రగా ఈ గ్రంథం రూపొందింది అంటె అతిశ యోక్తి కాదు.

గద్వాల సంస్థానంలో సాహిత్యోద్యమం బహుముఖంగా కొనసాగింది. పండిత సభలు, సాహిత్యగోష్ఠులు, సమస్యాపూరణాలు, అష్టావధానాలు శతావ ధానాలు, వార్షిక సభలు, ఈవిధంగా అనేకవిధాల కవిపండితుల కేంద్రంగా అలరారుతూ ఉండేది. ప్రభువుల చల్లని నీడలో అల్పకవులు మొదలుకొని అనల్ప పండితులదాకా సాహిత్యానందాన్ని పొందుతూ ఉండేవారు. వారితో

పాటు ప్రజలకు కూడ సాహిత్యామృతము అందుతూ ఉండేది. ఈ సాహిత్య కార్యకలాపాలాను గురించి ఈ పరిశోధకుడు సూక్ష్మాతిసూక్ష్మమైన వివరాలు అందించినాడు. అంతేకాక పరామర్శ గ్రంథాల ప్రశంసకూడ దీనిలో ఉన్నది. ఇక దీన్ని చూస్తే ఇది గద్వాల సంస్థాన సంస్కృతిక సాహిత్య చరిత్రకు ఒక ప్రామాణిక గ్రంథంగా ఉన్నది ఇంత మంచి గ్రంథం వ్రాసిన డా. కట్టా వెంకటేశ్వరశర్మగారిని అభినందిస్తున్నాను.

ఇట్లు

ఆచార్య ఎం. కులశేఖరరావు

(తెలుగు శాఖాధ్యక్షులు)

ఉస్మానియా విశ్వవిద్యాలయము

30-10-1987

# ఆహ్వానము

వేదవిదులు, సత్కర్మనిరతులు, శడ్దర్శనాది మహావిజ్ఞాన సందత్సమేతులు, సాహితీ స్రష్టలు వదలిన పాదధూళిని బంగారు భరిణలో భద్రపరచుకొని, అనునిత్యం స్నానానంతరం ఆ ధూళిని ముందుగా నొసటికద్దుకొని పిదప తిలకాద్యలంకరణను చేసుకొనే ప్రభువులు ఆదరించిన సాహిత్యమెట్టిదో పరిపోషించిన సంస్కృతి యెట్టిదో తెలుసుకొనవలసిన ఆగత్యం సంస్కృతి పరిరక్షకులకు అతిమాత్రంగా ఉంది.

"గద్వాల సంస్థాన తెలుగు సాహిత్యపోషణము"ను ఈ గ్రంథం మిత్రులు శ్రీ కట్టా వెంకటేశ్వరశర్మ పరిశోధన ఫలితంగా వెలువడింది.

గద్వాల సంస్థానంకంటే ఎక్కువ ఆదాయం కల్గిన ఏ సంస్థానంకూడా సాహిత్యపోషణకు ఇంత ఉదారంగా వెచ్చించిన సందర్భాలు యావద్భారత చరిత్రలోనే అరుదని ఉటంకించడములో సాహసము ఏమీలేదు.

తమ పాండితీ విలసనంతో, తమ కవితాప్రాగల్భ్యంతో తెలుగు ప్రజలను అలరించి పునీతులను చేసిన కళామూర్తుల నెందరినో ఆదుకున్న సంస్థానము గద్వాల. 5, 6 దశబ్దాల క్రితం ఆంధ్రదేశంలోని కవిపండితులు గద్వాల గౌరవం పొందితేనేగాని తృప్తి పడేవారుకారు.

గద్వాల ప్రభువులు వేదవిదులను సత్కరించిరి. కవులను సమాదరించిరి. కళాకారులకు కానుకలిచ్చిరి. తృప్తితో కవుల కన్నులు మెరసినపుడు ఆ మెరుపులో తాము సుస్నాతులై, కృతార్థులమైతిమని భావించిరి. అవధానాలు, ఆశుకవితలు, పండితపరీక్షలు, కళా ప్రదర్శనలు పండిత సంభావనలు, గద్వాలకొక ప్రత్యేకతను సంతరించి పెట్టినవి. గద్వాల సంస్థానంలో శతాధిక సంఖ్యలో వెలిసిన కావ్యాలు, వ్యాఖ్యానాలు, నాటకాలు, గీర్వాణభాషాకావ్యాలు, ఇంకా లోకానికి తెలియనే తెలియవు. ఎందరో మహితాత్ముల సాహితీ తపస్సు ఇంకా మరుగుననే ఉన్నది ఆ సాహిత్యాన్నంతటిని సేకరించి పరిశీలిస్తే కడచిన 300 యేండ్ల గద్వాల సాహితి వెలుగును చూస్తుంది. ఎంతో జ్ఞానాన్ని, రసాన్ని ఆవిష్కరిస్తుంది ఈ బృహత్కార్యానికి పూనుకొని సాధ్యమైనంత మేరకు వెదికి వెలికి దీసి శ్రీ వెంకటేశ్వరశర్మ దిఙ్మాత్రంగా ప్రస్తుతించే ప్రయత్నం చేసినారు. గద్వాల సంస్థానం సాహిత్య సర్వస్వాన్ని తాను లోకానికందిస్తున్నానని

శ్రీ శర్మగారు చెప్పుకోవడం లేదు. ఆ దిశలో తాను త్రికరణశుద్ధిగా చేసిన ప్రయత్నమని ఆయన ప్రత్యయం.

పరిశోధన అందులోనూ సాహిత్యపరిశోధన నిరంతరంగా జరిగే తపస్సు వంటిది తానంతా చెప్పేశానని, తాను చెప్పిందే సత్యమని మరెవ్వరు చెప్పడానికి వీలులేదని, తనకుమాత్రమే చెప్పవచ్చునని నిజమైన పరిశోధకుడెవ్వడు గొప్పలు చెప్పుకోరు శ్రీ శర్మగారు మిక్కిలి ఓపికతో పరిశ్రమించి సరళమైన భాషలో తన పరిశోధనాంశాన్ని పాఠకలోకానికందించి కృతకృత్యులైనారు.

శ్రీ శర్మగారు ఉత్తమ అధ్యాపకులు విద్వాంసుల కుటుంబానికి చెందిన వారు ఆయన బంధువులందరు వేదవిదులే ఆయన సౌజన్యం, పాండిత్యం ఆయనను ఒక మంచి సాహిత్య సేవకునిగా తీర్చిదిద్దింది.

చిన్ననాటినుంచి నాకు శర్మగారు సన్నిహితులు. ఆ సాన్నిహిత్యాన్ని పురస్కరించుకొని తన సాహిత్య కృషికి సాధువాదం పలకవలసిందిగా నన్ను కోరినారు. ఈ మాటలు వ్రాయడానికి నాకు అవకాశం కల్పించిన శర్మగారి సౌజన్యమే కాని నా వైదుష్యం కాదు. వెలుగులోనికి రావలసిన సాహిత్య భండారాన్ని పరిచయం చేసిన శ్రీ భట్టం వేంకటేశ్వరశర్మగారిని మనసారా అభినందిస్తున్నాను. ఆయన చేసిన ఈ సత్కృతికి ఈ సాధువాదము. ఉస్మానియా విశ్వవిద్యాలయమునుండి Ph. D. అందుకొన్న ఈ సిద్ధాంత గ్రంథాన్ని సహృదయులు చదివి తమకు కల్గిన అనుభూతిని రచయితకు తెలియచేయాలని ఆకాంక్షిస్తున్నాను.

సంస్థానాలు, రాచరికాలు నిన్న ఏమి చేయలేదన్న తూష్ణంభావమును మానుకొని వారు చేసిన మంచి ఏదో అది ఎంతవరకనుకరణీయమో తెలుసుకోవలసిన అవసరాన్ని ఈ పుస్తకం కల్గిస్తుందని నమ్ముతున్నాను. సాహిత్యానికి కొత్త పాతల రంగులు పూసిచూసే ప్రయత్నం మానుకొంటేనే సహృదయతకు సార్థకత ఉంది. అందరినీ ఈ పుస్తకం చదువాలని ఆహ్వానిస్తున్నాను

హైద్రాబాదు
29-10-87

ఇట్లు
ఇరివెంటి కృష్ణమూర్తి
రీడరు తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము

# విజ్ఞప్తి

ఆంధ్ర దేశమునందెన్నియో సంస్థానములు వెలసినవి. ఆయా సంస్థాన ప్రభువులు కృష్ణరాయల కాలము నాటి ఆంధ్ర సాహిత్య పోషణమును దృష్టి యందుంచుకొని తర్వాత నున్న పెద్ద సంస్థాన ప్రభువులు భారత స్వాతంత్ర్యోద్యమము వరకు యథాశక్తి ఆంధ్ర భాషాభిమానులై కవి పండితులచే గ్రంథములను వ్రాయించి వారిని గౌరవించి తాము కృతికర్తలే గాక కృతి భర్తలై ఆంధ్ర సరస్వతి కమూల్యాలంకారముల నర్పించిరి. అట్టి వాటిలో తెలంగాణమున మిక్కిలి ప్రసిద్ధి చెందినది గద్వాల సంస్థానము. ఇది మహబూబ్‌నగరము (జిల్లా) లో కలదు. దీనికి "విద్వద్గద్వాల" యని కూడ ప్రసిద్ధి. ఆ సంస్థాన ప్రభువులు గావించిన తెలుగు భాషాసేవ వారాదరించిన కవుల గ్రంథములు వాటి విశిష్టతను గూర్చి తెలుపునట్టిదీ సిద్ధాంత వ్యాసము.

ఈ వ్యాసము క్రమానుసారముగానుండుటకై ఐదు ప్రకరణములుగా విభజించుట జరిగినది. అందు మొదటి ప్రకరణమున "స్థానిక సంస్థాన ప్రభువులు-సంస్కృతి", రెండవ ప్రకరణమున "గద్వాల సంస్థాన చరిత్ర-సంస్కృతి", మూడవ ప్రకరణము "విద్వద్గద్వాల".

ఇందఖిలాంధ్ర దేశము నుండి వచ్చిన విద్వత్కవి గాయక బృందము వారు పాల్గొనిన కార్తీక మాఘ మాస సభల ప్రాముఖ్యమును గూర్చి వివరించుట జరిగినది. నాల్గవ ప్రకరణమున 'స్థానిక కవులు-రచనలు, ఇందు గద్వాలకు సమీపమున నున్న బోరవెల్లిసీమ సంస్థానమునకు పూర్వమే యుండి తర్వాత గద్వాల సంస్థానములో విలీనమైనది. ఆ బోరవెల్లిసీమ యందు వెలసిన చింతలపల్లి లయగ్రాహి కవులు వారి అముద్రిత గ్రంథములు, అనంతరము పెద శోభనాద్రి కాలము నుండియు అచ్చటి కవులు రచించిన గ్రంథములు స్థానిక ప్రభువులకు లేక వారి యిలవేల్పగు శ్రీ చెన్నకేశవ స్వామి కంకిత మొసగి ప్రభువులచే సత్కరింపబడినట్టివి ఈ ప్రకరణమున పేర్కొనబడినది. ఐదవ ప్రకరణమున 'ఆశ్రిత కవులు-రచనలు, అనగా ఆయా ప్రభువుల కాలమునందు వివిధ ప్రాంతముల నుండి వచ్చిన పండితులు ప్రభువుల నాశ్రయించి కృతుల రచించి సత్కారముల నందుటయె కాగ వాటి ముద్రణమునకై ప్రభువులనుండి ఆర్థిక సాయమును పొంది కృతులను అంకితమొసంగిన కవులను పేర్కొనుట జరిగినది.

చివర ఈ సిద్ధాంత వ్యాసమున కుపకరించిన గ్రంథములు - సంచికలు వ్యాసముల పట్టిక యీయబడినది. ఇందు కేవలము గద్వాల సంస్థానమునకు సంబంధించిన విషయములు ప్రభువుల కంకితమిచ్చినట్టి గ్రంథములను గూర్చియే విపులముగా చర్చించనైనది. కవుల యితల గ్రంథముల పట్టిక అధో జ్ఞాపికలో చూపెట్టినాను.

బోరవెల్లిసీమకు సంబంధించిన అముద్రిత ప్రతుల నడిగిన వెంటనే చదువుకొని విషయము వ్రాసికొనుట కనుజ్ఞ నొసగిన ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున అప్పటి డైరెక్టరగు వాఙ్మయ మహోధ్యక్షులు శ్రీ వఝ్ఝలబూడి గోపాలకృష్ణయ్య గారికి, నన్ను ప్రోత్సహించి అడిగిన వెంటనే ఆదిపూడి వారి రచనలన్నింటిని యిచ్చి చేయూత నొసగిన అస్మద్గురువర్యులు డా॥ దివాకర్ల వేంకటావధాని గారికి బోరవెల్లిసీమకు సంబంధించిన అనేక విషయములు గుర్తు చేసి ప్రోత్సహించిన డా॥ బి రామరాజు గారికి నా యీ సిద్ధాంత వ్యాసమునకు పర్యవేక్షకులుగా నుండి చక్కని బాటను ఏర్పరచి సలహా నిచ్చి ప్రోత్సహించిన సహృదయులు డా॥ శ్రీ కేతవరపు వేంకట రామకోటి శాస్త్రి గారికి మిత్రులు హితైషులు కీ. శే గొట్టుముక్కల కృష్ణమూర్తి (గద్వాల) శ్రీ తిరుమల రావు, ఎం ఏ. గారు శ్రీ రత్నయ్య. ఎం ఏ. గారు గ్రంథములు సేకరించుటలో నెంతో తోడ్పడిరి. వారికి నన్ను ప్రోత్సహించిన ఇంకెందరో మిత్రులకు కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

తాటికొండ.
తేది 3-12-1983

విధేయుడు
కట్టా వేంకటేశ్వర శర్మ

# పరిశోధన పరిమళాలు

సహృదయులకు ఆనందోపదేశములను అందించుచు లోకకల్యాణమునకై పాటుపడుట అన్ని కళలకును పరమ కర్తవ్యము సంగీత సాహిత్యములలోను, చిత్రశిల్ప నిర్మాణములయందును, నాట్య ప్రదర్శనములలోను, ఈ ప్రధాన లక్ష్యము అంతర్వాహినిగా అలరారుచునే యుండును. ఈ ఉదాత్త లక్ష్యసాధనలో పండితుల ప్రయత్నము, కవీశ్వరుల కృషి, చిత్రకారుల దీక్ష, శిల్పుల కౌశలము, నాట్యవేత్తల యుద్యమము మున్నగునవి ప్రధాన భూమికనే వహించుచుండును. ఈ కళారాధకులందరికిని సరియగు ఆశ్రయదాతలు లభించి, సమర్థముగా సమృద్ధముగా ఆదరాభిమానములను ప్రసరింపజేసినప్పుడే ఆ విశ్వకల్యాణము సిద్ధించును.

"నిరాశ్రయా న శోభన్తే పండితా వనితా లతాః" అను ఆర్యోక్తి ఈ సత్యమునే ముక్తకంఠముతో చాటుచున్నది.

ఒకనాడు రాజరాజనరేంద్రుడు, అనంతరము మనుమసిద్ధి భూపాలుడు, పిదప రెడ్డిరాజులు, ఆ తరువాత విజయనగర ప్రభువులు, అటుపిమ్మట నాయకరాజులు చూపిన కళాభిమానములు, కావించిన కవిపండిత పోషణములు ప్రసరింపజేసిన ప్రేమాదరములు, సమకూర్చిన సహాయ సహకారములు మన కవితాభారతి కాలి అందెల కమ్మని సవ్వడులు క్రమములై చిరస్థిరముగా విలసిల్లుటకు మిక్కిలి తోడ్పడినవి.

ఈ ప్రభువుల అడుగుజాడలలో సాగుచు ఆయా సంస్థానముల పాలకులు గూడ ఒనర్చిన సాహిత్య కళాసేవలు ప్రశంసార్హములేయై యున్నవి. కవిపండితులను సమాదరించి వాసికెక్కిన సంస్థానములలో "గద్వాల సంస్థానము" ఒక ప్రముఖ స్థానము నలంకరించుచున్నది. అది "విద్వద్గద్వాల"గా వాసిగాంచుటయే యందులకు ప్రబల నిదర్శనము.

వివిధ రీతులలో విలసిల్లిన ఆయా సంస్థానముల వైభవ వైశిష్ట్యములను గూర్చియు, తదాలంబనమున బహుముఖముల వర్ధిల్లిన సాహితీ సరస్వతి వన్నె

చిన్నెల గుఱించియు, తమ కళాకౌశలముచే, ప్రతిభావ్యుత్పత్తులచే, వైదుష్య వైభవ ప్రాభావములచే సంస్థాన ప్రభువుల సమ్మానములను పొందుచు రాణ కెక్కిన కవిపండిత ప్రకాండుల కీర్తిప్రతిష్టలను గూర్చియు డాక్టర్ కె. వెంకటే శ్వరశర్మగారు తమ ఈ సిద్ధాంత వ్యాసము (ఈ గ్రంథము)లో సవిమర్శకముగా సముచితముగా యథావకాశముగా వివరించిరి.

శ్రీ శర్మగారు సంస్కృతాంధ్రములలో కృషీశ్రీములై యథాశక్తి పాండి త్యమును సంపాదించిరి. వేదభాగములను పుక్కిట బట్టిరి. స్మార్త విద్యలను జిహ్వాగ్రిమున నిల్పుకొనిరి. క్రమముగా బి. ఓ. ఎల్; ఎం. ఏ. పట్టభద్రులై. అధ్యాపక వృత్తిలో అడుగిడి విద్యార్థుల హృదయకేదారములను సుసంపన్న మొనర్చిరి. నిరంతరాయముగా శ్రీ శర్మగారొనర్చిన ఆ అధ్యయనాధ్యాపన ముల కృషి పరిణామఫలరూపమే ఈ సిద్ధాంత వ్యాసము.

ఈ పరిశోధన సందర్భముగా శ్రీ శర్మగారు గద్వాల ప్రాచీన గ్రంథాల యములను గాలించిరి. భాగ్యనగరమునను, తిరుపతిలోను, మద్రాసునందును, తాంజాపురమునను గల ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారములను అవలోకన మొనర్చిరి. లబ్ధప్రతిష్ఠులైన పండితులను దర్శించిరి అనుభవజ్ఞులైన పరిశోధ కులను పరామర్శించిరి. అనంతరము కలమును చేబూని ఈ సిద్ధాంత వ్యాస మునకు అక్షరాకృతి నిచ్చిరి.

శ్రీ శర్మగారు ఈ గ్రంథమును—

మొదటి ప్రకరణము- "స్థానిక సంస్థాన ప్రభువులు- తెలుగు సంస్కృతి" (పుటలు 1-12)
రెండవ ప్రకరణము- "గద్వాల సంస్థానచరిత్ర-సంస్కృతి" (పుటలు 13-36)
మూడవ ప్రకరణము- "విద్వద్గద్వాల" (పుటలు 37-63)
నాల్గవ ప్రకరణము- "స్థానిక కవులు - రచనలు" (పుటలు 64-182)
ఐదవ ప్రకరణము- ఆశ్రితకవులు - రచనలు" (పుటలు 183-254)

అను రీతిలో ఐదు ప్రకరణములుగా విభజించి రచన చేసిరి.

గద్వాల సంస్థానమునకును, ఆ పరిసరములనున్న ఇతర సంస్థానమునకును సంబంధించిన కవిపండిత మండలిని గూర్చియు, వారివారి రచనావిశేషములను గుఱించియు, తదితరములను గూర్చియు నేటి పరిశోధకులకు ఉపయుక్తమగు

సమాచారమును సందర్భానుసారముగా కొన్ని చోట్ల సంగ్రహముగను, మఱి కొన్ని తావుల సమగ్రముగను అందించుచున్న పరిశోధనాత్మక రచనమిది

శ్రీ శర్మగారు ఈ గ్రంథ రచనకై చేసిన కృషి ప్రశంసావహము. ముద్రణరూపమిచ్చి దీనిని అందఱికిని అందుబాటులోనికి దెచ్చుచున్నందులకు నేను వారిని మిక్కిలి అభినందించుచున్నాను.

5-11-1987
ప్రభవ-కార్తీకము
శ్రీ వాణీ గౌరీనిలయం,
హైద్రాబాద్-660.

గోలి వెంకటరామయ్య
తెలుగు ఉపన్యాసకుడు
ప్రభుత్వ డిగ్రీ కళాశాల,
జడ్చర్ల-509301 (ఆం. ప్ర.)
మహబూబ్‌నగర్ జిల్లా.

# విషయసూచిక

## మొదటి ప్రకరణము

# స్థానిక సంస్థాన ప్రభువులు తెలుగు సంస్కృతి

విజయనగర సామ్రాజ్య పతనానంతర మాంధ్ర సాహితీలతను చేతనైనంత వరకు పెంచి పోషించిన వారు దేశమునందు అనేక ప్రాంతముల గల ఎందరో సంస్థానాధీశులు గలరు. వారిలో కొందరు కవులు పండితులు మరి కొందరు లలిత కళాభిజ్ఞులై కవి పండిత పోషకులై ప్రాచీనాంధ్ర సంప్రదాయమును పరిరక్షించిన వారున్నారు.

ఆంధ్ర దేశమునందుగల మొత్తం నాల్గు వందల సంస్థానములలో సంస్కృతాంధ్ర సాహిత్యములను కళలను పోషించినది నూటికి పైబడి గలవు. పెద్ద సంస్థానములే గాక చిన్న సంస్థానములు అప్పటి జమిందారీలు జాగీర్లు మఖ్తా గ్రామములు దేశ పాండ్య, దేశముఖ్ మొదలగు చిన్న గ్రామాధికారులు సయితము ఉడుతా భక్తిగా సాహిత్య సేవ కళా పోషణము గావించి చిరస్మరణీయులైనారు. ఈ ప్రకరణమున గద్వాల సంస్థాన తెలుగు సాహిత్య పోషణమునకు పూర్వ రంగముగా గద్వాలకు చుట్టు ప్రక్కల గల సంస్థానములను గూర్చి క్లుప్తముగా తెలియపరచి గద్వాల తెలుగు సాహిత్య పోషణమును గూర్చి విపులముగా వివరించగలను. గద్వాలకు తూర్పున వనపర్తి, గోపాలపేట, జటప్రోలు (కొల్లాపురము) దక్షిణమున అలంపురము, పశ్చిమమున రాయచూరు[1], ఉత్తరమున ఆత్మకూరు సంస్థానములు గలవు.

## వనపర్తి:

ఈ సంస్థానము గద్వాలకు తూర్పు భాగమున నున్నది. సంస్థాన ప్రభువులు రెడ్డి వంశీయులు. వీరి మూలపురుషుడు వీర కృష్ణారెడ్డి[2]. వీరి సంతతివారిలో నతి ప్రసిద్ధుడు సాహితీ సరస్వతి నారాధించిన వాడగు అష్టభాషా బహరీ గోపాలరావు గారొకరు. క్రీ. శ. 17వ శతాబ్ది ప్రథమ పాదమున ఈ ప్రభువుల రాజధాని వనపర్తికి సమీపములోని సూగూరు గ్రామము. కాలక్రమ

1. నేడిది కర్నాటకలో చేరినది.
2. శేశవ పంతుల నృసింహశాస్త్రి-సంస్థానముల సాహిత్య సేవ. పుట 47.

మున వీరు వనపర్తికి విచ్చేసిరి. ఈ అష్టభాషా బహరీ గోపాల రావు సంస్కృతాంధ్ర భాషలయందసమాన పాండిత్యముగలవాడు. ఇతడు సంస్కృతమున 'రామచంద్రోదయమ'ను శ్లేష కావ్యమును శృంగారమంజరి భాణము మొదలగు సంస్కృత గ్రంథములను రచించెను. ఈ ప్రభువు శ్రీరంగాపురమునందు శ్రీరంగ నాయక స్వామి దేవాలయమును దాని ప్రక్కనే రంగసముద్రమను తటాక నిర్మాణము చేయించినాడు. వీరి సంతతివారిలో ప్రథమ రామేశ్వర ద్వితీయ రామ కృష్ణ తృతీయ రామేశ్వర మున్నగు పెద్దల (తాతగారి) పేర్లు మరల మనుమలకు పెట్టి పిలుచుట ఆచారముగా వచ్చినది. ఈ తృతీయ రామేశ్వర రావు కాలము (క్రీ॥ శ॥ 1948) ననే ఈ సంస్థానము గణతంత్ర రాజ్యమున విలీనమయ్యెను[1].

## వాఙ్మయ వికాసము :-

ఈ సంస్థానమున ఆంధ్రవాఙ్మయమెంతో యభివృద్ధి జెందినది. 150 సం॥ ములకు పూర్వము అయ్యమాచార్యులు గారు చెన్న కేశవ విలాసము. రామేశ్వర విజయము మొదలగు గ్రంథములను రచించిరి. 250 సం॥ పూర్వము చెన్నకృష్ణ కవి 'యాదవ భారతీయమ'ను శ్లేష కావ్యమును రచించెను. 200 సం॥ పూర్వమున నున్న వీర రాఘవాచార్యులు భాగవతమునకు 'వీర రాఘవీయమ'ను వ్యాఖ్యను వ్రాసెను. అకింతల సుబ్బా శాస్త్రి గారు జగమెరిగిన పండితులు. సంస్థాన ధర్మాధికారులగు హోసదుర్గం శ్రీనివాసాచార్యులు. వీర రాఘవ భూమిక ఆచార్య వైభవము, స్వభావ పద్ధతి మొదలగు గ్రంథములను రచించెను. పాపా శాస్త్రి (కడుకుంట్ల గ్రామ నివాసి) భారత సంగ్రహము, భ్రమరాంబికా సంవాదము మొదలగు గ్రంథములను రచించెను. రాజానగరము గ్రామ నివాసి వికాసిల నరసింహాచార్యులు 'భారతస్తుతి' కల్యాణి మాలతీ మాధవము కురు సంధానము ధూతాంగదము జగన్మోహన భాణము మొదలగు గ్రంథములను రచించెను. మాదిరాజు విశ్వనాథరావు గారు శిరోమణి కప్పగంతుల లక్ష్మణ శాస్త్రి గారు కలిసి, విక్రమాంక దేవ చరితము, కర్ణసుందరి నాటకములను రచించిరి. కీ॥ శే॥ మానవల్లి రామకృష్ణ కవిగారు వనపర్తి సంస్థానమున కొంతకాలము (19 శతాబ్ది) నివసించి అముద్రిత వాఙ్మయము నెంతో వెలుగులోనికి తెచ్చినారు[2].

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము. సం. 3 పుట 309.
2. విస్మృత కవులు (శీర్షిక) నన్నెచోడ కుమార సంభవము, వల్లభరాయ విక్రీడాభిరామము, మడికి సింగన సకల నీతి సమ్మతము, బద్దె గోపాలుని నీతిశాస్త్ర ముక్తావళి, భైరవకవి శ్రీరంగ మాహాత్మ్యము, ప్రబోధ మణిభూషణము మున్నగునవి.

ఇతర సంస్థానములందు వలె ఈ సంస్థానమునందును కార్తీక పూర్ణిమకు రాజానగరము నందును, మాఘపూర్ణిమకు శ్రీరంగాపురము స్వామి ఉత్సవము లందును సంస్థాన ప్రభువులు విద్వద్గోష్ఠులు జరిపించుట పరిపాటియైనది. ఈ సంస్థానమునకు విశేష వ్యాప్తి గల్పించినవారు రాణీ శంకరమ్మ గారు. ఈమె అనంతరము తృతీయ రామేశ్వరరావు గారు. వారి కాలమున ఆస్థాన విద్వాంసులుగా ఆచార్య రంగాచార్యులు నంబాకం రాఘవాచార్యులు మొదలగువారే గాక ఇతర ప్రాంతములనుండి వచ్చినవారెందరో కవులు - పండితులుండిరి. అట్టి వారిలో తర్క పండితులు ధూళిపాళ సూర్యనారాయణ శాస్త్రిగారు వేద పండితులు నూకల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వ్యాకరణ పండితులు కాశావఝుల సత్య నారాయణ శాస్త్రి వచ్చుచుండెడివారు. ధూళిపాళ వారికి నంబాకం వారికి తర్క శాస్త్ర చర్చలు, మైసూరి నుండి వచ్చిన కాశీ సుబ్రహ్మణ్య శాస్త్రి గారికి ఖండవల్లి నరసింహా శాస్త్రి ( వట్టెం గ్రామం ) గారికి మధ్య వ్యాకరణ చర్చలు జరిగెడివి. రాణీ శంకరమ్మ గారి అనంతరము తృతీయ రామేశ్వర రావు కాలమున సుప్రసిద్ధులగు తిరుపతి వెంకట కవులు, వారి నానారాజ సందర్శన సందర్భమున శ్రీరంగాపురమునకు వచ్చి ఈ సంస్థానమును దర్శించి ప్రభువులచే మన్ననలు పొందినారు [1].

ఈ సంస్థానమందలి శ్రీరంగాపురము రంగనాయక స్వామి ఉత్సవములకు గద్వాల-ఆత్మకూరు సభలకు విచ్చేసిన విద్వత్కవిగాయక బృందము వచ్చుచుండుట పరిపాటి. అందువలన శ్రీ తిరుపతి వెంకట కవులు గాడెపల్లి వీర రాఘవశాస్త్రి సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి గుడిమంచి సుబ్రహ్మణ్య శాస్త్రి తెల్కపల్లి రామచంద్ర శాస్త్రి మున్నగు పండితులెందరో విచ్చేసి ఉత్సవములను తిలకించి వనపర్తి ప్రభువులచే సన్మానములందు కొనెడివారు ఈ తృతీయ రామేశ్వరరావు కాలముననే సుప్రసిద్ధ పరిశోధకులు విద్వాంసులైన శ్రీ మానవల్లి రామకృష్ణ కవి గారి ప్రోత్సాహమున ప్రభువు 'బ్రహ్మ విద్యా ముద్రాక్షర' శాల నొకదానిని స్థాపించిరి. దీనిద్వారా కవిగారు 'విస్మృత కవులు' శీర్షికతో నన్నెచోడుని కుమార సంభవము, వల్లభరాయని క్రీడాభిరామము, మడికి సింగన సకల నీతి సమ్మతము, బద్దెన నీతిశాస్త్ర ముక్తావళి, భైరవకవి శ్రీరంగ మహాత్మ్యము,

---

1. తూ. దోణప్ప సంస్థానములు-సాహిత్య పోషణము. పుట 203. 'నానారాజ సందర్శనము'న ఈ సంస్థానమును గూర్చిన పద్యములు (వనపర్తి) అప్పటి 'ధర్మ' అనే సంచికలో సంస్థానమందలి కవి పండితుల చర్చలను ప్రచురించినారు. (ఆ సంస్థానములు పుట 203)

ప్రబంధ మణిభూషణము వేంకటేశ్వర రామాయణము మున్నగు అమూల్య గ్రంథములను వెలికి తీసి పరిష్కరించి ముద్రణము గావించి గ్రంథములకు సూర్యాలోకన భాగ్యమును గల్గించెను [1]. మానవల్లి వారు చిరస్మరణీయులు.

## గోపాలపేట:-

ఈ సంస్థానము గద్వాలకు తూర్పు దిక్కున వనపర్తికి ఆఱు మైళ్ళ దూరమున కలదు. వనపర్తి ప్రభువుల సంతతివారగు జనుంపల్లివారు వనపర్తి ప్రభువులలో పూర్వుడైన బహరీ గోపాలరావు పేరిట నిర్మింపబడిన గ్రామము కావున దీనికి గోపాలపేట యని పేరు పెట్టినారు. ఇది చిన్న సంస్థానమైనప్పటికి ప్రభువులు చేతనైనంత వరకు పండిత పోషణము గావించినారు.

పూర్వము రాజా జక్సాల్ రావు (ఈ వంశీయుడు) కాలమున పల్లా నరసింహ శాస్త్రి బుక్కపట్టణం రాఘవాచార్యులు కేశవ పంతుల సింగయ్య సిద్ధాంతి మరియు కాకునూరి అప్పకవి వంశీయులీ సంస్థానమున పోషింపబడిరి. బుక్కపట్టణం రాఘవాచార్యులు వ్యాకరణ పండితులు. ఆనంద రామాయణమును రచించిన రామచంద్రాచార్యులు శతావధాని ఇచట నుండిరి. ఇతడు బుక్కపట్టణం రాఘవాచార్యుల వారికి పెద్ద కుమారుడు. ఇక చిన్న కుమారుడు శ్రీరంగాచార్యులు - సంగీత శాస్త్ర ప్రవీణుడు.

గోపాలపేట రాణీ రంగనాయకమ్మగారి కాలమున నెందరో పండితులు వచ్చి రాణీగారిచే గౌరవమును పొందిరి. అట్టివారిలో శతావధాని జంధ్యాల సుబ్రహ్మణ్య శాస్త్రి మున్నగువారు కలరు [2].

## జటప్రోలు [కొల్లాపురము] :-

ఈ సంస్థానము గద్వాలకు తూర్పున నున్నది. సంస్థాన ప్రభువులు సురభి వంశీయులు. 'సురభి' అను పదము పరిమళము లేక కామధేనువు అని అర్థము నిచ్చును. ఈ వంశీయులు వెలమవారు. వేంకటగిరి పెద్దాపురము బొబ్బిలి వారికి ఈ వంశము వారికిని మూల పురుషుడు పిల్లలమర్రి భేతాళ నాయకుడు. ఇతనికి చెవ్విరెడ్డియని నామాంతరము గలదు.

---

1&2. కేశవపంతుల-సాహిత్య సేవ పుట 20-55.

వేంకటగిరి సంస్థాన ప్రభువులకు 'వెలుగోటి' వారని పేరు వచ్చినట్లే వీరికి కూడ మధ్య కాలమున 'సురభి' యని పేరు వచ్చినది [1] బేతాళనాయకుని పద మూడవ తరము వాడగు మాదానాయుడు జటప్రోలు (కొల్లాపురము) శాఖకు మూల పురుషుడు. ఈతడు క్రీ॥ శ॥ 1527 లో ఆనెగొంది రామరాయల వలన జటప్రోలు సంస్థానమును పారితోషికముగా బడసి వారి క్రింద సామంత రాజై ఏలుబడి సాగించెను. ఇతడే జటప్రోలులో మదనగోపాల స్వామి ఆలయమును కట్టించి స్వామిని ప్రతిష్ఠించి బ్రహ్మోత్సవాదుల నేర్పాటు చేసినాడు.

ఈ వంశీయులలో పందొమ్మిదవ తరము వాడగు మల్లానాయుని తమ్ముడు సురభి మాధవరాయలు. ఇతడు క్రీ॥ శ॥ 16వ శతాబ్ది చివరివరకు తన యన్నలు రాజ్య భారమును వహించి యున్నందున తాను కావ్య నాటకాది శాస్త్రము లందసమాన పాండిత్యము గలవాడై 'చంద్రికా పరిణయము'ను ప్రౌఢ కావ్యమును రచించెను. ఈ చంద్రికా పరిణయము ఇంచుమించుగా రామ రాజ భూషణుని సమకాలీన రచనయని పూర్వ కవి పద్యమొకటి యున్నది.

చ॥ సురభి కులానులాబ్ధిఁ బొడసూపిన మాధవరాయ చంద్రుడున్
సరస పదార్థ రంజనము సత్కృపి హృద్యముగాక చంద్రికా
పరిణయమున్ రచించె నవి భాగ్యము నీ వసుచర్య జూడగా
బరగె నిగూఢ వృత్తినటు నీకును వర్తిలె మూర్తి నామమున్[2]

ఈ మాధవ రాయలు అన్నగారగు మల్లనాయని అనంతరము జటప్రోలు రాజ్యపాలనము గావించుచు మహా మహోపాధ్యాయ ఏలకూచి బాలసరస్వతి కవిని తన యాస్థానము నందుంచుకొని తన తండ్రిగారైన మల్లభూపాలుని పేర తనకు అంకితము 'భర్తృహరి సుభాషితము' నాంధ్రానువాదమొనరించ ప్రోత్స హించి పూర్తిగావింప జేసెను. ఈ క్రింది పద్యమా విషయమును తెలుపుచున్నది.

శా॥ శ్రీ మద్బాల సరస్వతీ ప్రకట లక్ష్మీ హేతువై శాంతమై
ఆమోదావహమై నిజానుభవ వేద్యంబై అనేహోదిగా
ధ్యామేయ ప్రతిబోధ రూపమహితంబై యొప్పు తేజంబు ప్రా
పై మీకున్ సిరులిచ్చుతన్ సురభిమల్లా నీతి వాచస్పతీ[3]

---

1& 2. కేశవపంతుల-సాహిత్య సేవ పుట 20.

3. ఎలకూచి బాలసరస్వతి. భర్తృహరి సుభాషితము. కందుకూరి వీరేశలింగము చింతామణి ముద్రణాలయమున ప్రథమ ముద్రణము ఇటీవల కాకతి పబ్లికేషన్స్‌వారు దీనిని ముద్రించినారు.

ఈ గ్రంథ మీ వంశీయుల 27 తరము వాడైన వెంకటలక్ష్మారావు కాలమున ప్రథమ ముద్రణము గావించబడినది.

సురభి మాధవ రాయలు చాలా ప్రసిద్ధుడు. ఇతడు జటప్రోలు సమీప మున నున్న 'శింగవట్నం' పట్టణమందు నృసింహ సాగరమను బృహత్తటాకమును నిర్మించెను. మంచాలకట్ట గ్రామమున మాధవ స్వామి దేవాలయమును, జట ప్రోలు నందు శివాలయమును కట్టించెను. ఇతడు కవిపండిత పోషణము గావిం చెను. ఇక 27 తరము వాడగు వేంకటలక్ష్మారావు గారు తనకు సంతానము లేనందున తన జన్మస్థలము వరంగల్లు జిల్లా గురిజాల నుండి వేంకట జగన్నాథ రావును దత్తత తీసికొనెను ఇతడు కూడ పండితులను గౌరవించెను. ప్రభువు హోసమర్గం కృష్ణమాచార్యుల వారిచే 'లక్ష్మి విలాసము'ను సంస్కృత చంపూ కావ్యమును జటప్రోలు మదనగోపాల మాహాత్మ్యము మొదలగు గ్రంథములను రచింపజేసెను. ఈ కృష్ణమాచార్యులవారే తర్వాత పరకాల మఠమున 'కృష్ణ బ్రహ్మతంత్ర పరకాలస్వాములు'గా ప్రసిద్ధి చెందిరి. వేంకట జగన్నాథరావుగారు కూడ తనకు సంతానము లేనందున వెంకటగిరి సర్వజ్ఞ కుమార యాచమ నాయని నాల్గవ కుమారుడగు నవనీత కృష్ణయాచేంద్రుని దత్తత గావించుకొనెను.

## సాహిత్య పోషణము :-

ఈ సంస్థాన కాలమున నెందరో పండితులకి ప్రభువుల ప్రాపకము లభించుట వలన సాహిత్యము ఎంతగానో అభివృద్ధి గాంచినది. బ్రహ్మశ్రీ వెల్లాల సదాశివ శాస్త్రి గారు అవధానం శేషశాస్త్రి వేంకట రామశాస్త్రి (అయ్యవారిపల్లి) మొదలగు విద్వాంసులును ఎందరో వైష్ణవ పండితులు మంచాలకట్ట గ్రామమున నుండి రాజాదరణమును పొందిరి.

ఇటుల స్థానికులే గాక ఆగంతకులైన పెక్కుమంది కవి పండితులీ రాజుల కాలమున జటప్రోలును దర్శించి ప్రభువుల గౌరవమును పారితోషికములను పొందినారు. అట్టివారిలో మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి మున్నగు వారు ప్రభువు తల్లిగారగు రాణీ వెంకట లక్ష్మాంబ మరియు యువరాజగు వెంకట జగన్నాథరావు కాలమున గౌరవమును పొందిరి. శ్రీ వనం సీతారామశాస్త్రి శింగవట్నం ఓరుగంటి లక్ష్మినారాయణ శాస్త్రి కేతే పల్లి చంద్రశేఖర శాస్త్రి, శ్రీధర కృష్ణశాస్త్రి, అల్లాడి రామశాస్త్రి మున్నగు ఆ సంస్థానమున నుండి ప్రభువుల గౌరవమును పొందినారు. కొవ్వూరు నుండి

అధ్యాపక వృత్తిలో వచ్చిన శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు గారు స్నేహలతా కవితా సంఘమును స్థాపించి కవితా వ్యాసంగమునకై ప్రోత్సహించిరి. వీరు వందకు పైగా గ్రంథములను రచించిరి. సుబ్బారాయుడు రచించిన 'ప్రసన్న భారత'మిటీవల ముద్రితమైనది (1980). ఈ విధముగా జటప్రోలు సంస్థానము కవిపండిత పోషణము గావించి వాసికెక్కినది.

## అలంపురము:—

ఇది గద్వాలకు దక్షిణమున 18 మైళ్ళ దూరమునందు 'దక్షిణ కాశి' గా ప్రసిద్ధి జెందినట్టి పుణ్య క్షేత్రము. ఇచట బ్రహ్మేశ్వర స్వామి యున్నందున బ్రహ్మేశ్వరాలయ క్షేత్రము లేక సోమలాపురమనియు స్థల పురాణమును బట్టి తెలియుచున్నది.[1] పాల్కురికి సోమనాధుడు పండితారాధ్యుడు తమ కావ్యములయందీ క్షేత్రమును వర్ణించినారు. బిజ్జల తిమ్మభూపాలుని కాలమున అంతకు పూర్వము క్రీ. శ. 1850 వరకిచటి ప్రభువులు 'అసఫ్ జాహి' వంశీయులకు సామంతులుగా నుండి ఈ సంస్థానమును పాలించిరి. ఈ ప్రభువులు మటాటి (మోటాటి) రెడ్లు వెన్నూళ్ళ గోత్రము వారు. ఈ వంశీయులలో ముఖ్యముగా పేర్కొనదగిన వాడు బిజ్జల తిమ్మభూపాలుడు. ఇతడు వనపర్తి ప్రభువగు అష్టభాషా బహరీ గోపాలరావు గారికి మేనల్లుడు. సంస్కృతములో మురారికవి రచించిన 'అనర్ఘ రాఘవ నాటకమున కాంధ్రానువాదము గావించినాడు. ఈ ప్రభువునకు కృష్ణకవి యనునతడు అనువాద కార్యమున తోడైనాడు. అతడు తిమ్మభూపాలుని గూర్చి ఈ పద్యము చెప్పినాడు.'

సీ॥ కమనీయ దక్షిణ కాశికా క్షేత్రంబు
 రహిమించ నెవ్వని రాజధాని
తుంగాఖ్య గంగా తరంగ రంగన్మౌళి
 బ్రహ్మేశు డెవ్వని ప్రాలివేల్పు
పాదుషా దత్త కుంభద్ధంతి హయముఖ్య
 వస్తులెవ్వని యింట విస్తరిల్లు
ధరవంతు కెక్కు కందనవోలు దేశంబు
 గణుతింప నెవ్వని కాణయాచి

1. కేశవపంతుల-సాహిత్య సేవ పుట 57.

ఆ॥ సిరిలనొప్పు నలంపురి సీమకెల్ల
'నాడగౌడు'ను 'దేశాయి' 'నాడకరణ'
మనెడి విఖ్యాతి యెవ్వాని కలరెనతడు
వొనిచె బిజ్జల పెదతిమ్మభూవిభుండు[1].

పెద తిమ్మభూపాలుని కుమారుడు కృష్ణభూపాలుడు. ఇతనికి వనపర్తి అష్టభాషా బహరీ గోపాలరావు గారు తన సోదరి బచ్చాంబ నిచ్చి వివాహము గావించిరి. ఆ దంపతుల సంతానమే ఈ బిజ్జల తిమ్మభూపాలుడు. ఈ తిమ్మ భూపాలుని ఆంధ్రానువాదమగు 'అనర్ఘరాఘవము'ను మొదట క్రీ. శ. 1930లో వీరి వంశీయులగు పల్లెపాడు వాస్తవ్యులు బిజ్జల చంద్రశేఖర రెడ్డిగారు ముద్రించి ప్రకటించిరి. వీరి ఆస్థానమున కవులు, పండితులుండినటుల తెలియుచున్నది కాని వారి గ్రంథము లెవ్వియు లభించలేదని కేశవపంతుల వారు తమ అభిప్రాయ మును వెలిబుచ్చిరి.

## ఆత్మకూరు :-

ఇది గద్వాలకు ఉత్తరమున గల ప్రసిద్ధి చెందిన సంస్థానము. గద్వాలకు ఆత్మకూరు సంస్థానములకు మధ్య కృష్ణానది ప్రవహించును. ఈ నదియే ఈ రెండు సంస్థానములను వేరు పరచినది. గద్వాల ప్రభువులకు ఆత్మకూరు ప్రభువు లకును సంబంధ బాంధవ్యములున్నవి. ఈ వంశీయులు పాకనాటి రెడ్లు. ఇంటిపేరు ముక్కరవారు. ఈ సంస్థానమునకు మూలపురుషుడు గోపాలరెడ్డి గారు. గద్వాలవారికి ఆనాడిరువది లక్షల ఆదాయమున్నచో ఆత్మకూరి వారికి ఐదు లక్షలు మాత్రమె ఆదాయము గలదు. అయినను వితరణ గుణమునందీ ప్రభువులు గద్వాల ప్రభువులకు తక్కువ కారు. గద్వాల వలెనె ప్రస్తుతము ఆత్మ కూరు కూడ తాలూకా కేంద్రమైనది

ఈ ప్రభువులకు కులదైవము శ్రీ కురుమూర్తి శ్రీనివాసస్వామి. తిరుపతి వేంకట కవులాంధ్రానువాదము గావించిన శ్రీనివాస విలాప కావ్యమీ స్వామిని గూర్చియే రచింపబడినది. నేటికి నీ ప్రభువులు ఇచ్చిన ఇనాము భూములు అగ్ర హారము లీనాటి ధర్మాధికారుల వంశీయులనుభవించుచున్నారు. ఈ ప్రభువులగ్ర హారము లొసంగి పండితుల నాదరించి సంస్థాన గౌరవమును పరిరక్షించిరి.

1. కేశవపంతుల-సాహిత్య సేవ పుట 57.

## వాఙ్మయ పోషణము :-

ఈ సంస్థానమునందు 200 సం॥కుల పూర్వము సురపురం కేశవయ్య అనుకవి 'నిరోష్ఠ్య రామాయణము'ను రచించి అనాడు ప్రభువుగా నుండిన శ్రీ రాజాసోమ భూపాలున కంకితము గావించెను [1] రంగనాథాచార్యుల తండ్రిగారు మంగళ హారతి రాఘవాచార్యులు, రంగనాథాచార్యులు, పాదుకాస్తుతి, ధర్మసూక్తి వివరణము, హయశిరోపాఖ్యాన వ్యాఖ్య, హయశిరో రత్నభూషణము, ఈశావాస్య వివరణము, సర్వార్థ సిద్ధి వ్యాఖ్య, భావ ప్రకాశిక ఔపని షన్మణి హారము మొదలగు గ్రంథములను రచించెను. తూము రామదాస కవి (1850-1904) రాజకీయ వ్యవహర్తగా నుండి రుక్మిణీ కళ్యాణము (గేయ కావ్యము) గోపికా విలాసము, మిత్రవిందోద్వాహ ప్రబంధము, ఆంధ్ర పద నిదానము (అచ్చ తెలుగు నిఘంటువు) కాళిదాస నాటకము మున్నగు గ్రంథములు రచించినటుల ఆత్మకూరు సంచిక ద్వారా తెలియుచున్నది. ఇవిగాక ఇతడు తారాశశాంకము, భీమసేన విలాసము అను యక్షగానములను రచించినటుల ప్రతీతి గలదు.

అలుకూరు మల్లికార్జునశాస్త్రి (1871-1917) న్యాయ వేదాంత పండితులు జ్యోతిషమున 'ఖచరపేటి' యను గ్రంథమును రచించెను. జ్యోతిష శాస్త్ర సారము వాసుదేవానందము మున్నగునవి వీరి యితర కృతులు. శ్రీ శాస్త్రి గారికి 'కవిసార్వభౌమ', సకల శాస్త్రాభిజ్ఞ, పండిత సార్వభౌమ మున్నగు బిరుదములుండినవి. దీక్షితుల పాపాశాస్త్రిగారు (1862-1892) జలక్రీడ, చెంచు కథ (ముద్రితము) ఆంజనేయ శతకము మున్నగునవి రచించిరి. హోసదుర్గం కృష్ణమాచార్యులు తర్వాత (శ్రీకృష్ణ బ్రహ్మతంత్ర పరకాలస్వామి) గొప్ప విద్వాంసులు. ఇతడు ఆత్మకూరు ప్రభువుల ప్రార్థనపై శ్రీ కురుమూర్తి శ్రీనివాసస్వామిని గూర్చి సంస్కృతమున శ్రీనివాస విలాసము (చంపువు) అను కావ్యమును రచించెను తర్వాత ఈ గ్రంథమునే రాజాగారి కోరికపై తిరుపతి వేంకటకవు లాంధ్రాను వాదము గావించిరి. తిరుమల బుక్కపట్టణం రంగాచార్యులు గుణరత్నాకరము పద్మినీ పరిణయము అను చంపు కావ్యములను రచించిరి. అరిశాణం వేంకటాధ్వరి యను కవి 'లక్ష్మీసహస్రము'నకు వ్యాఖ్య వ్రాసెను క్రీ. శ. 1920 ప్రాంతమున ఈ ప్రభువులకు గురుపీఠము నలంకరించిన తర్కతీర్థ బాలసరస్వతి ఇత్యాది బిరుదములను పొందిన శ్రీ తిరుమల బుక్క-

---

1. డా. బి. రామరాజు-ఆత్మకూరు సంచిక-వ్యాసం. పుట 36.

పట్టణం శ్రీనివాసాచార్యులు తండ్రిగారగు బుచ్చి వేంకటాచార్యుల వద్దను మైసూరు కాశీలోను విద్యనభ్యసించి షట్ఛాస్త్ర పారంగతులై ఈ ప్రభువులకు రాజగురువులైరి. వీరు దర్భాంగ, జోధపురము, ఇందూరు, ధారానగరము, జమ్మూ కాశ్మీరు, మద్రాసు మున్నగు పట్టణములందు తమ విద్యా ప్రాభవము లను ప్రదర్శించి అనేక స్వర్ణ పతకములను, బిరుదములను పొందిరి. వీరు వివిధ ప్రదేశములయందు శతఘంటా కవనము ఆశు కవితా ప్రదర్శనము గావించి సత్కరింపబడిరి. వీరు తత్త్వమార్తాండ ప్రభాపటలము, సం॥ రాజ పరిణయ చంపువు, వేంకటాచార్య విజయమైన జయంతీ నాటకము మొదలగు అనేక గ్రంథములను రచించిరి.

శ్రీ సీతారామ భూపాలుని కాలమున తిరుపతి వేంకటకవులీ సంస్థానమును దర్శించి రాజు కోరికపై శ్రీనివాస విలాస కావ్యము నాంధ్రానువాదము గావించి వినిపింపగా నందలి 'గుణాలయ' అను పదమును గూర్చి శ్రీనివాసా చార్యుల గారికి జంటకవులకు వాదోపవాదములు జరిగినవి. ఉద్దండ పాండితీ వైభవోపేతులైన ఈ యిరువురు సాహితీ యుద్ధములు చేయగా రసజ్ఞులు చూచి ఆనందించినారు. ప్రభువు అటు గురునాజ్ఞ జవదాటక ఇటు గణనీయులైన జంట కవులను నిరాకరింపజాలక నడుమ నలిగినాడు. ఆరు మాసములు జరిగిన ఈ పాండితీ యుద్ధమును జూచి గురుభక్తి పరాయణుడగు రాజా సీతారామ భూపా లుడు గురువులగు శ్రీనివాసాచార్యులను ప్రసన్నుల గావించి తన ఔదార్యముచే జంట కవులను ప్రసన్నుల గావించి తృప్తిపరచినారు.[1]

ప్రభువు తాను జంటకవులకు చేయదలుచుకొన్న గజోత్సవ, భూదాన చంద్రహారాదులను వేయినూట పదహారు రూప్యములనిచ్చి సత్కరించగా నీ జంట కవులు స్వీకరింప నంగీకరించినారు. అట్టి సమయమున వీరు 'కరినెక్కించితి వృత్తి నిచ్చితి' 'ఏనుగు నెక్కినాము ధరణీంద్రుడు మ్రొక్కగ - నీ వలనన్ సర స్వతీ' మున్నగు పద్యములు చెప్పిరి.[2] ఈ పద్యమందలి 'సరస్వతీ' అను పదము ధ్వనితో చమత్కరింపబడినదని రసజ్ఞులరయుదురు గాక. 'ధరణీంద్రుడు' అని ఏకవచనమునకు బదులుగా 'ధరణీంద్రులు' అని బహువచనముగా మార్చి వ్రాయుట జరిగినదని కేశవపంతులవారి అభిప్రాయము.

1. అప్పటి ఆస్థానమంత్రి (వృద్ధులు) శ్రీ బంకట చందుగారి అభిప్రాయము నిందు పొందు పరిచినాను.

2 తిరుపతి వేంకటకవులు-నానారాజ సందర్శనము-ఆత్మకూరు పుట 75, 76.

ఆ పద్యము యొక్క భావమిటులున్నది-ధరణీంద్రుడు-ఆత్మకూరు రాజా సీతారామ భూపాలుడు. మైసూరు పట్టణమునందు సభలో పొందిన 'బాల సరస్వతీ' బిరుదము శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యులని రసజ్ఞులు సందర్భమునుబట్టి గ్రహింతురు. అనగా ఓ బాలసరస్వతీ! నీ వింతగా పట్టి చూచినందువల్లనే మేము ఆత్మకూరు నందు గజోత్సవాదులచే సత్కరింపబడితి మని జంట కవుల అభిప్రాయము.[1]

శ్రీ సీతారామ భూపాలుని వలె అతని కుమారుడు శ్రీరామ భూపాలుడు కూడ కవులను పండితులను సత్కరించి ఆస్థాన గౌరవమును నిలబెట్టినాడు. ఇతడు గొప్ప వదాన్యుడని ప్రతీతి. స్థానిక కవులలో ధర్మాధికారులగు దీక్షితుల నరసింహశాస్త్రి విదురాశ్వత్థ మాహాత్మ్యము, శ్రీరంగ మహోత్సవ వర్ణమాలిక, సత్యనారాయణ వ్రత కల్పము మొదలగు గ్రంథములను రచించెను. సంస్థాన కాలమున వీరు ధర్మాధికారులుగా నుండి తిరుపతి కవుల వంటి ఆచారవంతులైన పండిత కవుల నెందరినో తన యింట నెలల కొలది యుంచికొని వారికి తగిన సదుపాయములను గల్పించిరి. వచ్చిన కవులు రాజ మర్యాదానంతరము వెళ్ళిపోవు చుండిరి. ధర్మాధికారులగు నరసింహశాస్త్రి గారికే సంస్థాన ప్రభువులు అగ్రహారము నొసంగిరి. వీరి కుమారులు దీక్షితుల విశ్వనాథశాస్త్రిగారు సంగీత-సాహిత్యముల యందభినివేశము గలవారై 'విశ్వామిత్ర చరిత్ర' (1977 లో ముద్రితము) మున్నగు గ్రంథములను రచించిరి. ఇతర ప్రదేశముల నుండి వచ్చిన వారిలో బహుజనపల్లి వేంకటాచార్యులు జయతీర్థాచార్య లిరువురు కలిసి జానకీ పరిణయము, రాజలేఖ, రామ పూజా విధానము, రామాశ్వమేధము సత్యనారాయణ వ్రతము మున్నగు గ్రంథములను రచించిరి.

శ్రీరామ భూపాలుని అనంతరము అతని సతీమణి రాణీ భాగ్యలక్ష్మీదేవమ్మ తన కాలమున సంస్థానమునందు విద్వత్కవి పోషణము గావించెను. ఈ సంస్థానమున ప్రతి సంవత్సరము ఫాల్గుణ శుద్ధ తదియ చవితి తిథులలో విద్వత్కవి గాయక సభలు జరుగుచుండెడివి. ఆ సభలకు తెలంగాణ మండలి పండితులు-కవులే గాక ఇతర ప్రదేశముల నుండి కూడ కవి పండితులు వచ్చుచుండెడివారు.

---

1. శేషపంతులవారి-సాహిత్య సేవ పుట 41.

అట్టివారిలో బులుసు అప్పన్నశాస్త్రిగారు త్రిపురాంతకశాస్త్రి శతావధాని గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి, అవధానం చంద్రశేఖర శాస్త్రి పోతూరి కాశీపత్యావధానులు, పెద్దమందడి వేంకటకృష్ణకవి, చెమికల చెన్నారెడ్డి మున్నగు వారీ సంస్థానమును దర్శించి సత్కరింపబడిరి. ఈ విధముగా తెలంగాణమందలి సంస్థాన ప్రభువులు వదాన్యులై యథోచితముగా భాషా సేవ గావించిరి.



## రెండవ ప్రకరణము

# గద్వాల చరిత్ర - సంస్కృతి

'విద్వద్గద్వాల' యని మహా విద్వాంసులచే పొగడబడి ప్రసిద్ధి చెందిన గద్వాల సంస్థానము తెలంగాణమందలి మహబూబ్‌నగర మండలమునకు చెందినది. ఈ సంస్థాన చరిత్ర-సంస్కృతి తెలిసికొనుటకెన్నియో ఆధారములున్నవి

దీని ప్రాచీన చరిత్ర ఆరువందల సంవత్సరముల నుండి అనగా కాకతీయ రాజుల కాలము నుండి తెలిసికొనుటకవకాశము గలదు[1]. పూర్వమీ సంస్థానము రాయచూరు జిల్లాలో నుండినది. ప్రస్తుతము (భాషాప్రయుక్త రాష్ట్రాలయనంతరము) మహబూబ్‌నగర మండలములో చేరినది. సంస్థానపూర్వ చరిత్ర పరిశీలించినచో పశ్చిమ చాళుక్య చోళ కాకతీయ విజయనగర రాజులు, మొగల్ బహమని బీజాపూరు నవాబుల క్రింద ఈ గద్వాల సామంత రాజ్యముగా నుండి తర్వాత నిజాం పాలన క్రిందికి వచ్చినది.

విజయనగర రాజుల కాలము క్రీ॥ శ॥ 1565 తళ్ళికోట యుద్ధానంతరము ఈ ప్రాంతము (గద్వాల) బీజాపూరు బహమని సుల్తానుల వశమైనది బహమని సుల్తానుల యనంతరము ఔరంజేబు కాలమున 'మొగల్' చక్రవర్తుల ఏలుబడి లోనికి పోయినది. మొగల్ రాజుల క్షీణదశలో దక్కన్ సూబేదారైన అసఫ్ జాహి నిజామునకు సామాంత రాజ్యముగా మారినది. అనంతరము బ్రిటీషు సైనిక వ్యయ నిమిత్తము నిజాం ప్రభువు క్రీ॥శ॥ 1853లో రాయచూరు(గద్వాల) ప్రాంతములను కుంపిణీవారికి స్వాధీన పఱచెను. ఆనాడు కుంపిణీవారు నియమించిన కమీషనరు అధికారమునందు మూడు సంవత్సరములీ ప్రాంతము వర్తిల్లి క్రీ॥ శ॥ 1857, 58 నాటి సిపాయి పితూరి సందర్భమున నిజాంచేసిన తోడ్పాటునకు బ్రిటీషువారు సంతోషించి రాయచూరు (గద్వాల) ప్రాంతభూమిని తిరిగి నిజాం ప్రభువునకిచ్చివేయుట జరిగినది. అనంతరము నిజాం ప్రభువునకు భారత ప్రభుత్వమునకు జరిగిన ఒడంబడిక ప్రకారము గద్వాల సంస్థానము హైదరాబాదునందొక భాగమై క్రీ॥ శ॥ 1958 వరకు స్వతంత్రముగా నుండి అనంతరమాంధ్రప్రదేశ్‌లో నంతర్భాగమై సంస్థాన ప్రతిపత్తిని గోల్పోయి తర్వాత అన్ని సంస్థానములతో పాటు ఇదియును విలీనమైనది.

---

1. డా॥ తూ॥ దోణప్ప-సంస్థానములు-సాహిత్య పోషణము గద్వాల పుట 20.

అతిప్రాచీన చరిత్రను పరిశీలించినచో కాకతీయుల కాలముననే ఈ ప్రాంతమును పాలించిన పాలకులలో నొకనికి కృష్ణా తుంగభద్రా నదుల మధ్య నున్న కొన్ని సీమలపై 'నాడగౌడ' అను అధికారము లభించినటుల తెలియుచున్నది[1]. అనంతరము విజనగర రాజుల కాలమున గద్వాల రాజుల పూర్వులు సామంతులుగా నుండుటయు బీజాపూరు సుల్తానుల కాలమున 'నాడగౌడ' 'సర్ నాడగౌడ' అను అధికారములు బడసి గద్వాల రాజులు కర్నూలు నవాబు నుండి కప్పము గ్రహించుచుండుటయు జరిగినది. ఏలయన క్రీ॥ శ॥ 1290 ప్రాంతమున మాన్వి, బెణదోణి, రాయచూరు, హోసనగల్లు, అలంపురము, ఆదవాని, అయిజ అను ఏడు సీమల మీద గద్వాల వారి పూర్వులలో బుద్ధారెడ్డి (ప్రోలయరెడ్డి నామాంతరము) కి నాడగౌడరికము కాకతీయ రాజులచే సంక్రమించినదని తెలియుచున్నది[2]. వీరి ప్రాచీన పాలకులు క్రీ॥ శ॥ 1686-87 ప్రాంతమున బనగానిపల్లె, శిరివెళ్ల, నంద్యాల శిరిగుప్ప, సిద్ధాపురము, బండాత్మకూరు, అహోబిలము వరకు తమ ప్రదేశమును విస్తరింపజేసి కర్నూలు నవాబును గెలిచి విజయచిహ్నముగా నవాబు పతాకమును తెచ్చి గద్వాలలో నుంచినారు. మూడు వందల సంవత్సరముల క్రితము వరకు 'నాడగౌడ' సర్ నాడగౌడ లాంఛనములతో తర్వాత సర్వ లాజలాంఛనములతో నీ రాజులు వెలసినారు.

## దుర్గ నిర్మాణము :-

క్రీ॥ శ॥ 1663 - 1713 మధ్య పెద్ద శోభనాద్రి లేక పెదసోమ భూపాలుని కాలమున గద్వాలలో ఇపుడున్న దుర్గము నిర్మింపబడినది.

## విచిత్ర గాథ :-

గద్వాల దుర్గనిర్మాణ సందర్భమున నొక విచిత్ర గాథ జరిగినదని ఈ ప్రాంత ప్రజలు చెప్పుకొందురు. దుర్గమును కట్టిన వెంటనే కూలిపడుచుండెడిదట. ఒకనాడు దుర్గ నిర్మాతలకు స్వప్నమున నొక వ్యక్తి సాక్షాత్కరించి ఒంటిపుణక బ్రాహ్మణుని అర్పించిన దుర్గము నిలుచునని చెప్పెననియు, నిర్మాతలు కేశవాచార్యుడను వానిని బలి యిచ్చి అచటనే అతని సమాధి నిర్మించిన ఫలితముగా దుర్గము నిలిచినదనియు నా బ్రహ్మ హత్యానివారణకై యతని పేర కేశవాలయమును నిర్మించిరని యందురు. ఏది యెటులైన నీ గద్వాల ప్రభువులీ స్వామిని గొలిచి ప్రతి సంవత్సరము నిత్య పూజలు గావించుచుండెడివారు.

---

1 & 2 సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము. సం. 8 పుట 304.

## గ్రామములు-జాగీరులు :

క్రీ॥ శ॥ 1947 నాటి రెవిన్యూ రిపోర్టు ననుసరించి ఈ సంస్థానము క్రింద 103 గ్రామములు, 26 జాగీర్లుండినవి. ఒకొక్క గ్రామము క్రింద మరికొన్ని మజిరా గ్రామములు గలవు. అన్నియు గలిగి ఈ సంస్థానములో 360 గ్రామము లుండినవి.

## ఎల్లలు :

ఈ సంస్థానమునకు తూర్పున అలంపురము తాలూకా దక్షిణమున తుంగ భద్రానది (అదవాని సరిహద్దు) పశ్చిమమున రాయచూరు తాలూకా ఉత్తరమున కృష్ణానదియు గలవు. కొంతకాలము బీజపురపు రాజులకు సామంత రాజ్యముగా నుండినందున తెలుగు ప్రాంతమైనను తేట తెలుగుతనమునకు కన్నడ కస్తూరి తోడైనది.

సంస్థాన ప్రభువులు వైష్ణవ మతాను యాయులగుటచే మతాభిమానము నకు నిదర్శనముగా తిరునక్షత్రము మొదలగు పర్వదినములకు ప్రాధాన్య మేర్పడినది. అయినను సంస్థానమంతటను పెక్కు శివాలయములు, వీర భద్రా లయములు కూడ రాజాదరణమును పొందియున్నవి. స్మార్తులనేకు లాస్థాన పండితులుగాను శ్రౌతస్మార్తాధికారులుగా నాదరింప బడినారు. కొందరు మాధ్వులు పండితులు పౌరాణికులుగను నున్నారు. వివిధ ప్రభుత్వ శాఖలలో గ్రామకరణములే అధికారులు. ద్వైతాద్వైత విశిష్టాద్వైత మత సంప్రదాయ దేవాగారము లనేకములకు, మతేతరములగు మహమ్మదీయ మసీదులకును ప్రభువుల యాదరణ సహాయము లభించినది.

## వైశాల్యము :

ఈ సంస్థానము దాదాపు 880 చదరపు మైళ్ళ వైశాల్యము గలది. ఇపుడు రాయచూరు జిల్లాలోని 25 గ్రామములు సంస్థానమునకు సంబంధించిన తెలుగు గ్రామములే గలవు ఇటీవల పరిపాలనా సౌకర్యమునకై గద్వాల తాలూకాలో నున్న ఏబది గ్రామములు భాషా ప్రయుక్త రాష్ట్ర విభజన కాలమున అలంపురము తాలూకాలో చేర్చబడి గద్వాల అలంపురము తాలూకాలో గ్రామ సంఖ్య సరిసమానగా చేయబడినది.

## పంటలు :

ఈ సంస్థానము సముద్రమునకు 1068 అడుగుల ఎత్తున నున్నది. 1345-47 ఫసలీ (ఉర్దూ శతాబ్దపు సంఖ్య) ప్రభుత్వ లెక్కల నివేదిక ప్రకారమీ తాలూకా లోని సగటు వర్షపాతము 35 అంగుళములు. ఇందు 30,8000 గృహములు. దాదాపు 61 600 పురుషులు, 57,600 స్త్రీలును గలరు.[1] ఇచట ముఖ్యమైన ఆహారపు పంటలు జొన్న, సజ్జ కొఱ్ఱ ధాన్యములు. ముఖ్యమైన వాణిజ్యపు పంటలు ప్రత్తి, వేరుశనగ, కంది పెసర వంటి కాయ ధాన్యములు కూడ ఇచ్చట పండును. పూర్వమొక కవి ఇచటి పంట (వరి) లను గూర్చి ఈ క్రింది పద్యమును చెప్పెనని గో. కృష్ణమూర్తి తెల్పిరి.

చ॥ గలిగియు కృష్ణ నెత్తిన జగజ్జన కల్మష నాశ నక్రియం
మలయయి పుష్ట దర్శన విమర్థిత లౌకిక తృష్ణ క్రిందనే
వొలదియు తుంగభద్ర నిజభూరి తరంగ సముద్ర గద్దు వా
ల్తుల గడ వాళ్లిదేమో వరి ధాన్యపు సేద్యము శూన్యమెప్పుడున్[2].

ఈ సంస్థానములో నాటికి నేటికిని బావుల క్రింద వరి పండించుకొనిననే గాని అన్నము లభ్యము కాదు.

## ఆదాయము :

ఈ సంస్థానములో భూమి 16,807 ఎకరములు గలదు. రెవిన్యూ ఆదాయము 1,97,413 రూప్యములు. జాగీరుల ఆదాయము కలుపుకొనినచో మొత్తము రూ 2 52 041 రూపాయిలుండగలదు అటవీశాఖ నుండి రూ. 80,434. అబ్కారి నుండి వచ్చెడి ఆదాయము 3,48,962 రూపాయలు. ప్రెస్ నుండి రూ 18,175. రిజిస్ట్రేషన్ నుండి రూ. 1,792, న్యాయశాఖ నుండి రూ 18,175 అదాయము వచ్చెడివి. ఇవిగాక రెవెన్యూ శిస్తుపై రూ. ఒక్కం-ంట్కి 0-1-3 (9 పైసలు) వంతున వసూలయ్యే విరాళపు ఆదాయము రూ. 46,576 గలవు. ఇతరాదాయములు మొత్తము కలిసి లెక్కలలో రూపాయలు 7,31,745 కనిపించును.

---

1. రెవిన్యూ రిపోర్టు. క్రీ॥ శ॥ 1947 గద్వాల.
2. గో. కృష్ణమూర్తి. వ్రాతప్రతినుండి తీసికొనబడినది.

ఆస్తులు వారి వారసుల పేర పట్టాలు చేయించుట వలన సంస్థానమునకు నజరానాలు (బహూకరణములు) పుచ్చుకొనుట వలన సం॥ ఒక్కంటికి మొత్తము దాదాపు పది లక్షలవర కాదాయముండెడిది.

## అధికారములు :

ఈ సంస్థానము వారికి సివిల్ క్రిమినల్ జుడీషియల్ అధికారములుండెడివి. ఇచ్చట కోర్టు మునసబు సెషన్ (కోర్టు) జడ్జి పోలీసు సూపరింటెండెంట్ కలెక్టరు హోదామేరకు అధికారములుండెడివి. ఆయా శాఖలలో పై అధికారము గల అధికారులుండిరి. రాజలాంఛనములైన గుఱ్ఱములు, ఏనుగులు, ఒంటెలు పదాతిదళము గుఱ్ఱపు సవారీలు, అరబ్బులు ఫిరంగులు మున్నగునవి ఇచట గలవు. ఈ సంస్థానమున శ్రీ చెన్నకేశవ ముద్రణాలయము, వైద్యశాలలు, రహదారులు విద్యుచ్ఛక్తి, పార్కులు, అనాధశరణాలయములు శ్రీ సీతారామ భూపాలుని కాలమున ప్రారంభించబడి రాణి ఆదిలక్ష్మీదేవమ్మ (సంస్థాన చివరి పాలకురాలు) వరకు కొనసాగినవి.

## చేనేత పరిశ్రమ :

ఈ సంస్థానమున ఉత్పత్తి అయ్యెడి ఖద్దరు చేనేత వస్త్రములు ఖండఖండాంతరములలో ప్రశస్తి నొందినవి నేటికిని కొన్ని వేలమంది చేనేత పారిశ్రామికులిచట నున్నారు. ఈ తాలూకాలోని గట్టు, (గ్రామము పేరు) మాచర్ల, అయిజ, రాజవోలు, అనంతాపురము, గద్వాల ప్రాంతములలో తయారగుచున్న చేనేత చీరలు, శెల్లాలు, ధోవతులు భారతదేశమందంతటను ప్రసిద్ధి నొందినవి. ఇచటి చీరలు, రవికెలు మున్నగు వాటిని ఖండాంతర కామినీ మణులు వాటి నాణ్యతకు మోజువడి కొనుచున్నారు. ఇచటి ఖద్దరు మోటుపల్లి ఖద్దరుకన్నను క్వాలిటీలోను, నాణ్యతలోను శ్రేష్టమని ఇతర ప్రాంతముల వారు కూడ గుర్తించి మెచ్చుకొన్నారు.

## సంస్థాన పాలకులు :

ఈ సంస్థానమును మొత్తము పదకొండుగురు పురుషులు, ఎనమండుగురు స్త్రీలు రాజ్య పాలనము గావించినారు[1].

---

1. సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము. సం. 3 పుట 304.

క్రీ॥ శ॥ 1663-1713 మధ్య గద్వాల దుర్గనిర్మాణము పెద శోభనాద్రి కాలమున జరిగినటుల చారిత్రకుల అభిప్రాయము.

## పెద శోభనాద్రి :-

క్రీ॥ శ॥ 1710-34 ఇతడు కర్నూలు జిల్లా కొంతలపాడు గ్రామ మునసబు గారైన వీరారెడ్డి కుమారుడు. క్రీ॥ శ॥ 1663 సం॥లో ఇతడు బక్కమ్మ యను నామె పోషణలో నుండి క్రీ॥ శ॥ 1688-97 వరకు యుద్ధము జేసి అయిజ మున్నగు పరగణాలను గెలచి స్వాదీన మొనర్చుకొనెను ఇతడు తనను పెంచిన బక్కమ్మ పేర అయిజ గ్రామములో నొక బావిని త్రిప్పించి క్రీ॥ శ॥ 1663-1713 మధ్య గద్వాల కోట నిర్మాణ కార్యక్రమములో నిమగ్నుడయ్యెను. ఇతడు క్రీ॥ శ॥ 1706-12 మధ్య కాశీలో రామలింగేశ్వర ప్రతిష్ట మున్నగునవి గావించి 1735 వరకు జీవించెను.

## కల్లా వెంకటన్న :- (1735-40)

పెద శోభనాద్రి యనంతరము ఇతడు రాజ్యకార్య పర్యవేక్షకుడుగా నుండెను.

## రమణయ్య :- (1741-46)

కల్లా వెంకటయ్య గారి అనంతరము శోభనాద్రి భార్యలు (రాణులు) రాచకార్య నిర్వహణమునకై రమణయ్య యను వైదిక బ్రాహ్మణుని నియమించిరి రమణయ్య క్రీ॥ శ॥ 1741-46 వరకు రాజ్యము యొక్క బాధ్యతలను స్వీకరించెను.

## రాణీ అమ్మక్కమ్మ :- (1746-47)

ఈమె పెద శోభనాద్రి మొదటి భార్య, రమణయ్య అనంతరమొక సంవత్సరము వరకు స్వయముగా నీమె రాజ్య భారమును వహించి రాజ్య పాలనము గావించెను

## రాణీ లింగమ్మ :- (1747-60)

ఈమె శోభనాద్రి రెండవ భార్య 1747 నుండి 60 వరకు సంస్థానము పాలించు బాధ్యతను స్వీకరించెను. ఈమె తనకు సంతానము లేనందున ముందు

కన్నె గ్రామనివాసి యగు నాగన్న కుమారుడు తిరుమల రాయని దత్తత గావించు కొనెను ఈమె బీచుపల్లి వద్ద 'నిజాం కొండ' కోట నిర్మాణము సంగాల చెఱువు తాండ్రపాటి చెఱువు, గద్వాలలో ప్రస్తుతమున్న లింగమ్మ బావిని త్రవ్వించెను.

## రాజా తిరుమలరావు : క్రీ శ. 1760-64

రాణీ లింగమ్మగారి దత్తకుమారుడైన రాజా తిరుమలరావు 1760-64 వరకు సంస్థాన పాలనము గావించెను. తల్లియగు లింగమ్మ ప్రారంభించిన 'బీచుపల్లి వద్దనున్న నిజాంకోట నిర్మాణము నీతడు పూర్తి గావించెను.

## రాణీ మంగమ్మ : (1764- )

ఈమె తిరుమలరావు గారి మొనటి భార్య. భర్త అనంతరమీమె కొన్ని మాసములు మాత్రమే రాజ్యపాలనము గానించెను.

## రాణీ చొక్కమ్మ : (1764-68)

ఈమె తిరుమలరావు గారి రెండవ భార్య. మంగమ్మ అనంతరమీమె రాజ్య భారమును చేపట్టి బీచుపల్లి వద్ద మిగిలిన నిజాంకొండ కోట నిర్మాణమును, సంగాల చెరువు తాండ్రపాటి చెరువు గద్వాలలో నున్న లింగమ్మ బావి నిర్మాణములను పూర్తి గావించెను. ఈ చొక్కమ్మ బీచుపల్లి వద్ద గల ఆంజనేయ స్వామిని ప్రతిష్ఠ గావించెను. ఇది కృష్ణా తీరమున గలదు. భక్తులీ స్వామి సన్నిధిలో వివాహాది శుభ కార్యములు గావించుకొందురు. ఈమె తన మరిదియు, బోరవెల్లి లింగమ్మ బంధువగు రామరాయలను పిలిపించి రాజ్య భారముతో పాటు తన యిరువురు కుమారుల పర్యవేక్షణ భారమును కూడ గావించునటుల అతనిని నియమించెను.[1]

## రాజా రామరాయలు లేక రామారావు : క్రీ. శ. 1768-83

ఇతడు 1783 వరకు రాజ్య పాలనము గావించెను ఈయనకు సంతానము లేనందున రాణీ చొక్కమ్మగారి యిరువురు పుత్రులను తన కుమారులుగా భావించి విద్యా బుద్ధులు చెప్పించెను. బోరవెల్లి సీమ యందలి గ్రామముల నన్నింటినీ సంస్థానములో చేర్చి రాజ్యమును సువిశాల మొనర్చెను. ఇతని

---

1. డా. తూ. దోణప్ప-ఆంధ్ర సంస్థానములు. వాఙ్మయ పోషణము పుట 205.

కాలముననే బోరవెల్లిసీమ గద్వాలలో విలీనమయ్యెను [1] ఇతడు రాజవోలు జమీందారులతో యుద్ధ మొనరించి వారి జామీను (భూమి) లోని ఎనిమిది గ్రామములను సంస్థానములో చేర్చెను. కర్నూలు నవాబును గెలిచి అతని పసుపు జండా మరియు నగరాన్నితడు స్వాధీనపరచుకొనెను. అంతేగాక నితడు అవుకు తాలూకా బేతెండ్ల గ్రామములో శ్రీ చెన్నకేశవ స్వామిని ప్రతిష్ఠ గావించెను.

## రాజా చిన్నసోమ భూపాలుడు : క్రీ శ, 1784-1815

రాజారామరాయల అనంతరము రాజా చిన్నసోమ భూపాలుడు రాజ్యపాలనము గావించెను ఇతని కాలమొక స్వర్ణయుగముగా భావించవచ్చును. భూపాలుని పాలనలో ఎనమండుగురు కవులష్టదిగ్గజములను పేర ఆస్థానమున నుండి రాజాదరణమును పొందిరి. ఇతడు కాణాదం పెద్దనవంటి కవులనాదరించి పెద్దనచే ఆధ్యాత్మ రామాయణము, ముకుంద విలాసము, యథాశ్లోక తాత్పర్య రామాయణము మున్నగు గ్రంథములను రచింపజేసెను ప్రభువు గంగనపల్లి దొరలను ఉప్పేరు నవాబులను గెలచి వారి గ్రామములు (పరగణాలు) దరూరు మున్నగువాటిని తన సంస్థానములో చేర్చుకొని 'భూపాల్' బిరుదము నొందెను. ఇతడు తన భార్యపేర కోటలోని శ్రీ కేశవస్వామి ఆలయమునకు శిఖర ప్రతిష్టయు రామాలయ నిర్మాణమును భూదేవి ఆలయ ప్రతిష్టయు గావించెను [2]

## రాజా చిన్నరామ భూపాలుడు : క్రీ. శ. 1816-28

అన్నగారైన చిన్నసోమ భూపాలుని యనంతరము రాజారామ భూపాలుడు గద్వాల సంస్థానమును 1828 వరకు రాజ్యపాలనము గావించెను ఇతడు రాయచూరు దేశాయి మరియు నర్సింగరావులతో దోరణాల గ్రామశివారు విషయములో (దోరణాల గ్రామం గద్వాల సంస్థానములోనిది) కలహించి నిజాం నవాబు పక్షమునను సుబహానుల్లాఖాన్‌ను రప్పించి తగాదాను పరిష్కారము గావించెను. తన ఏకైక కుమార్తె యగు లింగమ్మను చోళాపుర వాస్తవ్యుడైన నల్లారెడ్డి కుమారునకిచ్చి వివాహము గావించి అల్లుని ఇల్లరికముగా జేసికొనెను. తన అనంతరము అల్లుని పేరను రాజాసీతారామ భూపాలునిగా మార్చి అతనికి రాజ్యపాలనాధికారమును సమర్పించెను.

---

1 & 2. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము సం. 3 పుట 304-305.

## ౦గా పెద్ద సీతారామ భూపాలుడు : క్రీ. శ 1828-61

ఇతనికి అనంతమ్మ, లింగమ్మ, వెంకటలక్ష్మమ్మ యను ముగ్గురు భార్య
డిరి. ఇతడు 1828 నుండి 1861 వరకు రాజ్యపాలనము గావించెను. సంతాన
తుడు.

## ణీ లింగమ్మ : (1861-63)

పెద్ద సీతరామ భూపాలుని మరణానంతరమాతని భార్య రాణి లింగమ్మ
జ్యపాలన భారమును వహించెను సీతరామ భూపాలుడు తన మొదటి భార్య
ంతమ్మ గతించగా రాణిలింగమ్మను వివాహమాడి యుండవచ్చును. ఆమెకు
తానము లేనందున ప్రభువు వెంకటలక్ష్మమ్మ (మూడవ భార్య)ను వివాహ
డెను.

## జా సోమ భూపాలుడు : క్రీ శ. 1863-66

రాణి లింగమ్మ మరియు వెంకటలక్ష్మమ్మ లిరువురును సంతాన రహితులై
సున వడ్డెపల్లి యల్లారెడ్డి కుమారుడు రాయన్న యను వానిని రాణి లింగమ్మ
త్త గావించుకొనెను వారతనికి సోమభూపాలుడని నూతన నామమిడిరి.
డు క్రీ॥ శ॥ 1863-66 వరకు మూడు సంవత్సరములు రాజ్య పాలనము
ంచెను.

## ణీ వెంకటలక్ష్మమ్మ : క్రీ. శ 1867-87

రాణి లింగమ్మ దత్త పుత్రుడగు రాజా సోమభూపాలుని యనంతరము
గానా (జనానా-స్త్రీలు) నిబంధనలను తొలగించి ఈమె స్వయముగా రాజ్య
లనము చేసినది. తనకు సంతానము లేనందున వెంకటాపురమునకు చెందిన
మం కృష్ణారెడ్డి కుమారుడగు రామన్న యను వానిని దత్తత గావించుకొని
జాం నవాబుచే దత్తు మంజూరీ చేయించుకొనెను. ఈ దత్త కుమారునకీమె
జారామ భూపాలుడని నూతన నామమిడెను. ఈమె తన పాలనలో కేశవా
ు మహాద్వారము, గోపురము మున్నగువాటిని నిర్మించెను.

## ాజా రామభూపాలుడు : క్రీ. శ. 1887-1923

రాణి వెంకటలక్ష్మమ్మ అనంతరము రాజారామ భూపాలుడు రాజ్య భార
ను వహించి సంస్థానమును పాలించెను. ఇతని జననము క్రీ॥ శ॥ 1843 తర్వాత

చిన్నవయసులోనే రాణి వేంకటలక్ష్మమ్మకు 1846లో దత్త కుమారునిగా గద్వాలకు పోయెను ఇతడు క్రీ. శ. 1865 తన ఇరువదిరెండవ ఏట రాజ్య భారమును వహించెను. ఇతనికి సంతానము లేనందున తన సోదరుడు వెంకటాపురము నివాసియైన భీమరెడ్డి కుమారుడు వెంకట రెడ్డిని దత్తత గావించుకొని అతనికి చిన్న సీతరామ భూపాలుడని నూతన నామమిడెను.

## రాణీ లక్ష్మీదేవమ్మ : క్రీ. శ. 1923-35

ఈమె రాజారామ భూపాలుని భార్య. భర్త అనంతరమీమె మరియు దత్త కుమారుడగు చిన్న సీతారామ భూపాలు లిరువురు కలసి 1935 వరకు నైజాం నవాబు పర్యవేక్షణ క్రింద గద్వాల సంస్థానము పాలించిరి. రాణిగారు జీవించి యుండగనే ఇతడు స్వయముగా రాజ్య భారమును చేపట్టెను.

## రాజా చిన్నసీతరామ భూపాలుడు : క్రీ. శ. 1935-46

ఇతడు 1913 లో మహారాణీ ఆదిలక్ష్మి దేవమ్మను వివాహమాడెను. ఈమెకు వరలక్ష్మిదేవమ్మ శ్రీలక్ష్మిదేవమ్మ యను యిరువురు కుమార్తెలు గల్గిరి. ఈయన కాలమున గద్వాల సంస్థాన ముచ్ఛ్రస్థితి నొందెను. ఈతని దాతృత్వమును ప్రశంసించుచు ప్రజలచే నీతనికి 'మహారాజు' అని బిరుదము నీయబడెను.[1]

## రాణీ లక్ష్మీదేవమ్మ : క్రీ శ 1946-47

చిన్నసీతారామ భూపాలుని యనంతరమతని భార్య ఆదిలక్ష్మిదేవమ్మ 1946 నుండి 17 సెప్టెంబరు 1947 అనగా గద్వాల సంస్థానము ఆంధ్రప్రదేశ్ లో విలీనమగు వరకు రాజ్య పాలనము గావించెను. చిన్న సీతారామ భూపాలుడు 1894 లో జన్మించెను ఇతడు మే 1913 లో ఆదిలక్ష్మిదేవమ్మను వివాహమాడెను క్రీ॥ శ॥ 1946 లో నితడు తన సంస్థానమును నైజాం నవాబు పర్యవేక్షణనుండి విడిపించుకొని స్వతంత్రముగా రాజ్య పాలనము గావించెను. ఇతడు తన పెద్ద కుమార్తె వరలక్ష్మిదేవమ్మను దోమకొండ సంస్థాన ప్రభువగు రాజా సోమేశ్వరరావుకిచ్చి వివాహము గావించెను. తనకు పుత్ర సంతానము లేనందున తన అల్లుని పెద్ద కుమారుడగు రాజా కృష్ణరామ భూపాలుని దత్తత గావించుకొనెను

1. డా. తూ. దోణప్ప సంస్థానములు-సాహిత్య పోషణము, పుట 205.

రాణి ఆదిలక్ష్మీదేవమ్మ కాలములోనే అనగా విక్రమ సంవత్సర కార్తిక
పంచమి (17 సెప్టంబరు 1947) బుధవారము నాడు గద్వాల సంస్థానము
ప్రదేశ్ రాష్ట్రములో విలీనమయ్యెను.

## త్రక స్థలములు - క్షేత్రములు :

ఈ తాలూకాలో చరిత్రి ప్రాశస్త్యము గల ప్రదేశములు - క్షేత్రము
ములున్నవి, చారిత్రక పరిశోధకు లనేకు లీ ప్రాంతమును దర్శించి అనేక
గాంశములను కనుగొనుచున్నారు.

## ూరు :

ఇది గ్రామము గద్వాలకు దాదాపు ఏడు మైళ్ళ దూరమున దక్షిణమున
మార్గమున గలదు ఈ పూడూరు తొమ్మిదవ శతాబ్దమున అత్యున్నత
నున్నటుల ఇచ్చటి ఒక శాసనము వలన తెలియుచున్నది[1]. ఇచ్చట
లయ మిటీవల నేర్పాటు గావించబడినది. ఈ ఆలయమునకు శిఖరము లేదు.
హా ద్వారము చాళుక్య శిల్ప సంప్రదాయమున నున్నది. ఈ ద్వారము
ం దున్నుచుండగా లభించినదని అచ్చటి వారందురు. ఈ గ్రామము
- దుర్గము చూడదగినది గ్రామము చుట్టు దుర్గము వలయాకారమున
లదు. అచటి మల్లికార్జునుని దేవాలయము వద్దగల శాసనములో పుండ్రె
పురె దుర్గె యశస్సోదరె అను సంజ్ఞ వలన దీని పూర్వ నామము 'పుండ్ర
' అను పేర ప్రసిద్ధి చెందినటుల తెలియుచున్నది [2]

ఈ గ్రామము గద్వాల రాజులకు మొదట నివాస స్థలమై యున్నది.
చటనుండియు గద్వాల కోటను కట్టించినారు, ఇపుడున్న మల్లికార్జున
యమునకు సమీపమున ఒక కోటగోడకు కొన్ని విగ్రహములున్నవి. ఒక
గ్రహము ఒక పురుష విగ్రహము తలపై ఏడు పడగల సర్పము గలిగి
ముద్రలో నాసీనులై యున్న జైన తీర్థంకరుని విగ్రహములు గలవు.
 మూడు తీర్థంకరుల విగ్రహములును గలవు. మల్లికార్జునాలయమునకు
స ఫర్లాంగు దూరమున నున్న వీరభద్రాలయమున నందీశ్వరుడు గల ముఖ
ము గలదు. దాని వెనుక గర్భాలయమును గలదు. దీని శిఖరము మెట్లు

---

డ శాసనము - పూడూరు. గో. కృష్ణమూర్తి - వ్రాత ప్రతి (గద్వాల)
డూరు శాసనము (తెలంగాణ శాసనములు) గద్వాల.

మెట్లుగా నిర్మింపబడి పోనుపోను సన్నగా నుండును. ఇందులో నొక శివలింగము వీరభద్ర విగ్రహములుండుట వలన ఇందలి చారిత్రికాంశములను గూర్చి తెలిసి కొనుటకు పరిశోధన అవసరమై యున్నది.

పన్నెండవ శతాబ్దమున శైవులకు జైనులకు ప్రబల వైషమ్యమేర్పడిన ఫలితముగా జైనులు క్షీణించుటయు, జైన వాఙ్మయము నశించుటయు వారి నిర్మాణముల స్వరూపములు తారుమారు గావింపబడుటయు శాసనముల వలన తెలియుచున్నది [1] దీనిని బట్టి ఈ పూడూరు జైన శైవ మత సంఘర్షణములకు నొకనాడు రంగమై యుండినటుల తోచుచున్నది. ఇందులకాధారముగా మల్లికార్జునుని గుడివద్ద చెదరిపడి యున్న విగ్రహములలో పార్శ్వనాథుని విగ్రహము మరియు ఇద్దరు తీర్థంకరుల విగ్రహములను ఆలయ సమీపమందలి నొక నల్లరాతిపై మూడు వైపుల 12వ చాలుక్య విక్రమ సంవత్సరమునాటి కన్నడ శాసనములో కూర్చొనియున్న ధ్యాన జైన విగ్రహము జైనుని ప్రశంసయు పల్లవ జినాలయ ప్రశంసయు గలవు

వీరభద్రాలయమున కుత్తరమున గల సత్రపు గోడపై గల ఒక రాతిమీద మొదటి వరుసలో నొక శివలింగము, ధ్యాన జైన విగ్రహమును రెండవ వరుసలో జైనుని క్రింద కత్తితో పోరాడుచున్న రౌతు గుఱ్ఱమును, శివలింగము క్రిందనున్న పదాతి యొకడు ఈటెతో పోరాడుచున్నట్లును, మూడవ వరుసలో రౌతు క్రింద తలక్రిందుగా పడుచున్న మనుష్యుడును, నాల్గావ వరుసలో నొక మృత దేహమును చెక్కబడియున్నవి.

ఈ శిల్పము వలన నేటి వీరభద్రాలయము పూర్వము జినాలయమనియు, అందు మల్లికార్జునుని గుడివద్ద గల పార్శ్వనాథుడును అతని యక్షిణీ యక్షులు లుండెడివారనియు, వీరశైవ మతము ప్రాముఖ్యమునకు వచ్చిన కాలమున పైన పేర్కొబడిన సత్రపు గోడలలోని శిల్పము సాంకేతికముగా తెల్పుచు జైన శైవ మత సంఘర్షణము వలన జైనులోడిపోయిరనియు అటు సిమ్మట ఇచట పల్లవ శివాలయమున శివలింగము, వీరభద్ర విగ్రహమును ప్రతిష్ఠితములై యుండినటులను స్పష్టమగుచున్నది [1]

---

1. జి. హెచ్. ఆర్. ఎస్. వాల్యూం నెం 3 పుట 2. ప. డా. యమ్. రామారావు.

## వల్లూరు :

ఈ పురము గద్వాలకు దక్షిణమున మానవపాడు స్టేషన్‌కు రెండున్నర మైళ్ళ దూరమున నున్నది ఇచట వేణుగోపాల స్వామి ఆలయము ప్రసిద్ధమైనది ఆలయపు టావరణములో నేలపై పాతబడి యున్న ఒక రాతిపై బాగుగా అరిగి పోయిన శాసనమొకటి గలదు. అందు చోళులకిది రాజధానియే కాక, కాకతి గణపతి దేవుని సామంతుడగు 'గంగయసాహిణి'కి రాజధానిగా నుండి పానుగల్లు మొదలగు ప్రదేశముల నేలినట్లుగాని శాసనము తెలపుచున్నది[1] రుద్రమదేవి ప్రతాపరుద్రుల సామంతుడగు త్రిపురాంతకుడు ఈ వల్లూరు నుండియే రాచరికము నెరపినాడు. ఇచటి శాసనము మరియు ప్రాచీన దుర్గముల చిహ్నములను బట్టి ఈ వల్లూరే చోళులకొకప్పుడు రాజధానియగు వల్లూరని చారిత్రకుల యభిప్రాయము. గద్వాలకు 15 మైళ్ళ దూరమున గల తుంగభద్ర నదీ తీరమున నున్న వేణీ సోంపురమునందు శ్రీ వ్యాస తత్త్వజ్ఞుల వారిచే నొక చేలువు నిర్మింప బడుచుండగా నచటి భూమిలో దొరికిన రెండు గోపాల స్వామి విగ్రహములలో నొకటి ఈ వల్లూరు నందు ప్రతిష్ఠింపబడినది.

## రాజవోలు :

రాజులకు నిలయమగు నీ రాజోలు శ్రేష్ఠమైన నగరమనుటకు తార్కాణముగా ప్రస్తుతము గద్వాల పట్టణము నందు వలెనే అచట సభామంటము కోట చుట్టు కందకము (అగడ్త) శ్రీ కేశవ వేణుగోపాల భూదేవి శ్రీదేవి ఆలయము లిచట గలవు రాజకవియగు రాజవోలు వెంకట భూపాలుడు గద్వాల రాజులకు బంధువు. ఇతడీ ప్రాంతమును పాలించిన ప్రభువు, రాజవోలు నగర పాలకులలో నొకడగు ఈ వెంకట భూపాలుడు 'దివ్య దేశమాహాత్మ్య దీపిక' యను 8 ఆశ్వాసముల ద్విపద కావ్యమున 'పావనంబగు తుంగభద్ర నదీతీర భాసుర రాజవోల్పట్టణాదీశుడై' యని కవి తన వంశీయులను గూర్చి తెల్పినాడు రాజవోలు సుబ్బారాయ కవి 'జయవిజయాభ్యుదయము'ను ఆరాశ్వాసముల కావ్యమును రచించెను. ఇతని జన్మస్థలము కర్నూలు మండలములోని సిరివెళ్ల తాలూకా రాజోలు గ్రామమని చాగంటివారు వ్రాసిరి.[2] కాని ఈ కవిగారి నివాసము గద్వాలకు

---

1. వల్లూరు శాసనము. డా. యం. రామారావు [వ్రాతప్రతి గో. కృష్ణమూర్తి - గద్వాల పుట. 36.

2. చా. శేషయ్య - ఆంధ్ర కవి తరంగిణి సం. 11 పుట 66.

సమీపమున నున్న ఈ రాజవోలు నగరమనుటకు నచట రాజుల కిలవేల్పగు శ్రీ వెంకటేశ్వరస్వామికి తన గ్రంథమును అంకితము గావించినటులతని గ్రంథము ను బట్టి తెలియుచున్నది. ఏలయన రాజవోలు ప్రభువగు వెంకటభూపాలుడు తన యిలవేల్పగు రాజవోలు వెంకటేశ్వరునిపై కీర్తనలు రచించెను. ఈ సుబ్బరాయ కవియు ప్రభువుల కిలవేల్పగు వెంకటేశ్వరునికే (రాజవోలు) తన గ్రంథము నంకితము గావించుటచే నీ కవి ఈ రాజవోలుకు చెందినవాడనుట కవకాశము గలదు. ఇది తుంగభద్రా నదీతీరమున కర్నూలుకు సరిహద్దున నున్నది. ఇచట తుంగభద్రా నది రెండు పాయలై ఒక లంకగా నేర్పడినది. ఇచట ప్రాచీన రాజ సౌధములలోని కొన్ని భాగములింకను అవశేషములై యున్నవి.

## ఐజ :

ఈ గ్రామము గద్వాలకు మూలపురుషుడగు బుద్దారెడ్డిగారికి జన్మస్థానమై యున్నది. గ్రామ నామమును బట్టి రాజవంశము వారు 'ఐజగౌడు'లని పేర్కొనబడినారు. ఇది గద్వాలకు 16 మైళ్ళ దూరమున నున్నది. గొప్ప వ్యాపార కేంద్రము. ఇచట మూడు ప్రాచీన దేవాలయములున్నవి. అంజనేయ దేవాలయము ప్రక్కన గల దిగుడుబావి మెట్లలో నమర్చబడిన ఒక రాతిపై శాసన భాగమొకటున్నది. అందు స్వస్తి శ్రీ మండలేశ్వర కాకతీయ ప్రతాప రుద్రమదేవ మహారాజులు ఓరుగంటి సుఖసంకథా వినోదంబున రాజ్యము సేయుచుండగా అని వ్రాసి యున్నందున ఈ సంస్థానము పూర్వము కాకతీయ సామంత రాజ్యమని తెలియుచున్నది.[1]

## మొదలుకల్లు :

ఈ గ్రామము 'బ్రహ్మాండ పురాణము'న అది శిలా క్షేత్రముగా పేర్కొనబడినది. ఇది గద్వాలకు తూర్పున పది మైళ్ళ దూరమున నున్నది. ఈ క్షేత్రమున శ్రీ వెంకటేశ్వరస్వామి వెలసిన పర్వతమునకు 'గిరిశాచలము' ని పేరు గలదు. గద్వాల రాణి ఆదిలక్ష్మీదేవమ్మ తన ఆస్థాన పండితులచే నీ 'ఆది శిలా క్షేత్ర గిరిశాచల మహాత్మ్యము' నందలి ప్రతి శ్లోకమునకు తాత్పర్యము వ్రాయించి ముద్రించెను. ఈ గ్రంథమీ క్షేత్ర మహాత్మ్యమును తెలపుట్టి చిన్నపుస్తకము సంస్కృతమున శ్లోక రూపమున వ్రాయబడినది. ఇచట ప్రతి సంవత్సరము మార్గశిర శుద్ధ

1. ఐజ శాసనము. గొ. కృష్ణమూర్తి - గద్వాల - వ్రాతప్రతి నుండి అభిప్రాయము గ్రహించబడినది.

పౌర్ణమి రోజు జరుగు స్వామివారి రథోత్సవమునకు పలు ప్రాంతముల నుండి ప్రజలు వేల సంఖ్యలో వచ్చి పాల్గొందురు. ఈ దేవాలయము చుట్టు చక్కని మంటపములు భక్తాదుల కొరకు నిర్మింపబడినవి. వివాహోపనయనాది శుభ కార్యములు మ్రొక్కుబడులీ స్వామి వద్ద జరుగుచుండును ఈ క్షేత్రమున దేవత లెల్లప్పుడు శ్రీ వెంకటేశ్వరస్వామిని సేవించుచుందురని క్షేత్ర మహాత్మ్యమున గలదు.[1] ఇది శ్రీ శేషదాసుల వారు తపస్సుగావించిన తపో భూమి.

## వేణీ సోంపురము :

ఇది గద్వాలకు 15 మైళ్ళ దూరమున తుంగభద్రా నదీ తీరమున గలదు. ఇచట తెలుగు సంస్కృతికి సంబంధించిన వేదాంత గ్రంథములను రచించి తపస్సిద్ధి నొందిన శ్రీ వ్యాస తత్త్వజ్ఞుల వారిచే నొక చెఱువు కట్టించుచుండగా భూమిలో రెండు గోపాలస్వామి విగ్రహములు లభించినవి. వీరు అందు నొకదాని నిచట మరొకటి 'పల్లూరు' లోను ప్రతిష్ఠ గావించిరి ఈ ప్రదేశమునకు 'చ్యవనకాశ్రమ'మని ప్రసిద్ధి గలదు.

## చాగదొన :

దీనిని చ్యవనకాశ్రమము లేక చాగదొన యని కూడ ఇచటి ప్రజలు పిలుతురు. ఇది వేణీసోంపురమునకు సమీపమున గలదు. ఇచట ఒక పెద్ద విశాలమైన బండ దాని ప్రక్కనే రామలింగేశ్వరాలయము గలదు. ఆ దేవాలయము వీపు గోడపై నొక శిలాశాసనము గలదు. అందు ఈ దేవాలయము చ్యవమనిచే ప్రతిష్ఠితమైనది. వారిచటనే నివసించి ప్రతి దినము తెల్లవారుఝామున వేణీసోంపురము ప్రక్కన గల తుంగభద్రా నదీ జలమును తెచ్చి రామలింగేశ్వర స్వామి కభిషేకము గావించెడివారు. ఒకనాడు చ్యవనుడు నదికి వెళ్ళజాలక ఆ బండపై కూర్చొని చింతించుచు భగవ ధ్యానము గావింప నచటనె దొన (రాతిపై నున్న గుంత స్థలము) స్వామి యభిషేకార్థ మేర్పడి ఎల్లప్పుడు నీరు కల్గియుండినందున అది చ్యవనదొన లేక చాగదొనగా మారినదనియు నిచటివారి వలన తెలియుచున్నది.

---

1. గిరీశాచల మాహాత్మ్యము. [ఆస్థాన పండితులు] గద్వాల పుట 11.

## చింతరేవుల :

ఇది ఈ తాలూకాలోని ప్రసిద్ధి చెందిన అంజనేయస్వామి క్షేత్రము. గద్వాలకు వాయవ్యమున 5, 6 మైళ్ళ దూరమున నిది గలదు. ఈ గ్రామమునకు సమీపమున కృష్ణానది ప్రవహించును ఇచట అంజనేయ విగ్రహ మూర్ధ్వ దృష్టిని గల్గియున్నది. సుమారు 6 వందల సంవత్సరములకు పూర్వము పూర్వాశ్రమములో చంద్రికాచార్యులనబడు శ్రీ వ్యాస యతీంద్రులచే నిది ప్రతిష్టతమై యున్నది ఇచటి అంజనేయ స్వామి విగ్రహమత్యుగ్రము గలది కొంత కాలము వరకచటి అర్చకులు మరణించుటచే మొదలుకల్ నివాసి యగు శ్రీ శేషదాసుల వారు స్వామి ఉగ్రతాపోప శమనమునకై అచటనే యుండి కొంత కాలము తపస్సు చేయగా అర్చకులు మరణించుట ఆగిపోయినదని అచటి ప్రజలందురు.

ఆలయము ముందుగాని మంటపము నందుగాని అపవిత్రత జరిగినచో నొక నాగ సర్పము గర్భగుడి కడపవద్ద నిదర్శముగా నర్చకులకు గన్పించుట నేటికిని జరుగుచున్నది. అర్చకులు మాధ్వులు భక్తులనేకులీ స్వామి సన్నిధికి వచ్చి సేవలు గావించుచుందురు.

## బీచుపల్లి :

ఇది గద్వాలకు తూర్పున పది మైళ్ళ దూరమున కృష్ణానది ఒడ్డునగల పుణ్య క్షేత్రము. ఇచట అంజనేయస్వామి దేవాలయము గలదు ఇచటి దేవాలయము గద్వాల సంస్థానముననున్న అతి ప్రాచీనమైనది పూర్వమా ప్రదేశమును కణ్వాశ్రమమని పిలిచెడివారు. ఈ క్షేత్రమున కెక్కువగా చారిత్రక ప్రాముఖ్యము గలదు. ఇది అటవి ప్రాంతము గద్వాల ప్రభువులు వేదోక్తముగా స్వామి పూజలు గావించుటకై బ్రాహ్మణులకు ఇనాములు (భూములు) ఇచ్చి నియమించినారు. ఈ క్షేత్రమునకు శుభా శుభకార్యములు సేవాదులు మున్నగు వాటికై వచ్చి నివసించువారికి ఆహార సామగ్రి కొరకచటి చుట్టుప్రక్కల పల్లెలే శరణ్యములు.

ఇచట అంజనేయస్వామి వెలసిన నాటినుండి బోయలు అర్చనా విధానమును జరుపుట సంప్రదాయముగా వచ్చుచున్నది. దానికొక యితివృత్తము గలదని ఇచ్చటివారు చెప్పుదురు.

అలయ నిర్మాణమునకు పూర్వము కొందరు బోయలు కృష్ణానది ఒడ్డున చల్ది (అన్నము) తినుచుండగా వారికి స్వామి యున్న బండ కన్పించినది. వారు దానిని లేవనెత్తుటకు ప్రయత్నించి సాధ్యపడక అచటనే విడిచి వెళ్ళిరి. స్వామి వారికి రాత్రి స్వప్నములో దర్శనమిచ్చి తాను వెలసిన చోటనే ఆలయ నిర్మాణము గావింపుడని తెల్పెనట బోయలా స్వామికి ఆలయమును కట్టించినారు. నాటినుండి స్వామి వారి కిలవేల్పయి వారిచే సేవలు జేయించుకొనుట ఆచారమైనది. తర్వాత గద్వాల సంస్థానాధీశులు బ్రాహ్మణులను స్వామి పూజకై నియమించిరి.

ఇచట ఒక కడిమిచెట్టు గలదు. దాని చుట్టు ఎత్తైన వేదిక గలదు. క్షేత్ర మాహాత్మ్యమునకీ వేదిక కీలక స్థానమని విశ్వసింపబడుచున్నది. ప్రతి సంవత్సరము వైసాఖ శుద్ధ పౌర్ణమి నాడిచట స్వామి ఉత్సవము జరుగును. ఈ యుత్సవ సమయమున రథము ఆ కడిమిచెట్టు వేదిక వరకు వచ్చుట ఆచారమై యున్నది. ఈ దేవాలయము స్వామి ప్రతిష్ఠను వ్యాసరాయలవారు (చింతరేవుల నివాసి) గావించిరని ఇచటివారు చెప్పుదురు. కాని అది విశ్వసనీయముగా తోచదు.

ఇచట కృష్ణానదిలో నొక ద్వీప మేర్పడినది. ఒక గుట్టమీద బలిష్టమగు దుర్గమున్నది. దీనిని 'నిజాం కొండ' అని యందురు. దాని కనతి దూరముననే సీతారామస్వామి జీర్ణాలయ మొకటి గలదు. ఆంజనేయస్వామి (బీచుపల్లి) దేవాలయమునకు వెలుపల ఒక చింతచెట్టు క్రింద శిలా స్థంభ మొకటి గలదు. దాని కిరువైపుల అరిగిపోయిన అక్షరములతో కూడిన శిలా శాసనమొకటి గలదు. దానిని మొదట కనుగొన్నవారు పరిశోధక పండితులు శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు. వారు క్రీ. శ 1914లో వనపర్తి సంస్థానము నుండి నన్నెచోడుని కుమార సంభవమును ప్రకటించుచు పీఠికలో బీచుపల్లి శాసనమును గూర్చి వ్రాసి ప్రకటించిరి.[1]

శాసనములో 'ఒరుయూఱ్పర నరేశ్వర' అను బిరుదమును పురస్కరించుకొని దాతను 'బిళ్ళచోళ' యని చదివి కవిగారు కృష్ణాతీరమున నున్న బీచుపల్లి శాసనములో 'చోళబల్లి దేవుడు విజయ యాత్ర సల్పుచు ఉత్తరాయణ పుణ్యకాలమున విశ్వనాథ దేవునకు క్రీ. శ. 902లో భూదాన మిచ్చినట్లు వ్రాసినారు. దానిని శ్రీ నడుకుదిటి వీరరాజు పంతులుగారు గ్రహించి కవిగారి నాదమును

1. మా. రామకృష్ణ కవి-కుమార సంభవ పీఠిక - పుట 8.

బలపఱచిరి. ఈ వాదమును దేవులపల్లి కృష్ణారెడ్డిగారు చర్చించిరి. డా మారెమండ రామారావుగారు తమ 'గద్వాల'చరిత్రలో బీచుపల్లి క్షేత్రమును గూర్చి వ్రాయుచు 'ఆంజనేయాలయము వెలుపల నొక శాసనము గలదు. ఇందు చాళుక్య భూలోక మల్లుని రాజ్య కాలమున శా. శ. 887 సంవత్సరమున ఆ రాజు సామంతుడగు జిద్దం చోళ మహారాజు చేసిన ధర్మము వర్ణింపబడినది' అని వ్రాసినారు. శాసనములో 'బిద్ద చోళ' అని చెక్కబడియున్నది. దానిని రామకృష్ణ కవిగారు శాసనములో లేని విశ్వనాథ దేవుని పట్టుకొని వచ్చినారు. శాసనములో భువనైక మల్లుడని యుండగా 'భూలోక మల్లుడ'ని డా మారెమండ రామారావుగారు వ్రాసినారు. అసలు శాసనమిట్లున్నది.

## బీచుపల్లి శాసనము :

"స్వస్తి సమస్త భువనాశ్రమేత్యాది బిరుదాంకుడు చాళుక్యాభరణుడు శ్రీ మద్భువనైక మల్లుడు టంకాపురమున రాజ్య మేలుచుండగ మహా మండలేశ్వర కాశ్యప గోత్ర కావేరి వల్లభ సింహలాంఛన ఓరుయూరుపుర వరేశ్వర శ్రీ మల్లికార్జున దేవ పాదబ్జ భృంగ చిద్ద చోళమహారాజు కర్ణెనాడున కధిపతియై నాలుగు నాడులను వృత్తిగా పొంది ఉత్తర దిగ్విజయము సాధించి వచ్చుచు శక వర్షములు 996 (క్రీ శ. 1074) ఆనంద సంవత్సర పుష్య శుద్ధ నవమి ఆదిత్య వారమున ఉత్తరాయణ సంక్రాంతి నిమిత్తముగా శ్రీ మదేశ రామతీర్థము నడుమ ఉన్న లక్ష్మీశేశ్వర దేవర అంగ భోగాలకు నైవేద్యమునకు దీపమునకు మఠములోని పన్నెండుగురు తపోధనులకు వారి పరివారమునకు ఆశనాచ్ఛాదనమునకై అయిజ 300 సీమలోని పెద్దేరు (కృష్ణానది) దక్షిణపు దిక్కుగల పరియల (పర్యాల) గ్రామమును పరమేశ్వర ప్రీతిగా సర్వహక్కులతో ఆస్థానమున కధికారి యగు ఆచార్యుడు యమ నియమాది అష్టాంగ శీలుడు శిలుధ పయూష నదీ ప్రవాహకుడు పన్నగాభరణార విందుడు అయిన శ్రీమత్ 'సూర రాశి' పండితుని కాళ్ళుగడిగి ధారాపూర్వకముగా దానము చేసెను. ఈ ధర్మమును చెరిచినవారు మహా పాతకమును బొందెదరు[1] అని హళగన్నడ భాషలో చెక్కబడినది. కావున భూలోకమల్లుడు (త్రిభువన చక్రవర్తి కుమారుడు) క్రీ॥ శ॥ 11 వ శతాబ్ది ప్రాంతమున నుండినవాడు. వారు వ్రాసినటుల భూలోకమల్లుడుగాని అశక వర్షకములు గాని ఈ శాసనమునందు లేవు. ఆ కాలమున అయిజ మున్నూరు నేలుచుండినవాడు చిద్దళ చోళుడు. అతడు త్రైలోక్యమల్లుని కాలము

2. గొ. కృష్ణమూర్తి-శాసన వ్రాతప్రతి. పుట 38 (గద్వాల)

లోను అతని పెద్ద కుమారుడు భువనైక మల్లుని కాలములోను అయిజ, వెడకల్లు నెరవాడు, కన్నె అను నాలుగు నాడులకు ఏలికయై యుండెను. అతని శాసనములు అలంపూరులో కూడ నున్నవి.

## అగ్రహారములు :

శ్రీరామావధూతాగ్రహారము గద్వాలకు 2½ మైళ్ళ దూరమున కృష్ణానది ఒడ్డున గలదు రామావధూత యను నతడు కృష్ణానదిలోని ఎట్టిగుండుపై కూర్చొని యోగసమాధిలో నున్నటుల చిన్నసోమ భూపాలుడు తెలిసికొని శ్రీ అవధూతను దర్శించి అతని కోరికపై ఈ మఠమును నిర్మించెను. కావున అతని పేరిట అది అగ్రహారముగా వెలసినది.

ఇచట పెక్కు దేవాలయములు కృష్ణాతీరమున నిర్మించబడినవి. శుభాశుభకార్యములకు ప్రజలిచ్చటికి వచ్చుచుందురు. గద్వాల రాజులచటికి వచ్చిన వారికి భోజనాది సౌకర్యములు (సంస్థాన కాలమున) కలుగజేయుచుండిరి. ఈ భోజన సౌకర్యార్థ మీ సంస్థానమున 'ముష్టి పన్ను' అను ఒక పన్ను వసూలు చేయబడుచుండెడిది రైతు తాను పండించిన అన్నివిధములైన ధాన్యముల నుండి దోసెడు ధాన్యము ప్రక్కకు తీసిపెట్టవలెను. గ్రామకరణములు వాటిని సేకరించి ఈ మఠమునకు పంపుచుండెడివారు. ఇది అపరకర్మలు జరుపుకొనుటకనుకూలమైన ప్రశాంత ప్రదేశము.

గద్వాల రాచనగరులో శ్రీ చెన్నకేశవ దేవాలయము రామాలయము శ్రీదేవి, భూదేవి ఆలయములును గలవు. రామాలయమునందు గల స్తంభములపై విజయనగర రాజులకాలంనాటి శిల్పము కొంతవరకు కన్పించును.

## దాస సాహిత్యము :

గద్వాల పరిసరములలోనుండి ఆంధ్రభాషతోపాటు కన్నడ భాషలో కూడ తత్త్వబోధన గావించిన యోగి పుంగవులెందరో గలరు వారు సంస్థానమునకు కీర్తి తెచ్చుటయే గాక ఎన్నియో కీర్తనలు రచించి దాసులై కీర్తి గాంచిరి. అట్టి వారి సాహిత్యమే దాససాహిత్యము. కావున దానిని తెలిసికొనుట ముఖ్యము. అందు ముఖ్యులైన వారిలో శ్రీవ్యాస తత్త్వజ్ఞులొకరు.

## వ్యాసతత్త్వజ్ఞులు :

వీరు క్రీ. శ. 1704-1800 ప్రాంతమున నుండినవారు వీరి మొదటి పేరు వెంకట రామాచార్యులు. వీరు గద్వాలకు 18 మైళ్ళ దూరమున నున్న అయిజ గ్రామ నివాసులు. వీరి తండ్రిగారు శ్రీ వెంకటనర్సింహాచార్యులు. వీరు గొప్ప విద్వాంసులు. వీరిది పండితవంశము. ఇట్టి వంశమున బుట్టిన వెంకటనరసింహాచార్యులు వేదశాస్త్రపారంగతులై ఉత్తనూరు శ్రీ గోపాలదాసుల వారి యను గ్రహమున శ్రీ మధ్వాచార్యకృత గ్రంథములకు పాఠ ప్రవచనములను చేయు సామర్థ్యము గల్గియుండిరి.

ఈ వెంకట రామాచార్యుల వారసంఖ్యాకములగు శిష్యులకు వేదశాస్త్ర పాఠములను బోధించిరి. అట్టివారిలో అరణ్యకాచార్యులొకరు. వీరు సన్యసించి శ్రీ విష్ణు తీర్థులనుపేర ఎందరికో విద్యా వ్యాసంగమును గావించిరి.

వెంకట రామార్యులు సంస్కృతమున 'మానస స్మృతి' ఉపాసనాభాగము సుధాటిప్పణి విష్ణుతత్వ నిర్ణయ టిప్పణి శరదాగమ ప్రమాణాధికరణము మొదలగు గ్రంథములను రచించిరి.[1] తమ గురువులగు గోపాలదాసుల వారిచే 'వాసుదేవ విఠల' యను నామమును బడసి పదునాలుగు సుళాదులు (కన్న పద్యములు) అనేకములగు పదములు కన్నడ భాషలో రచించిరి.

శ్రీ ఆచార్యులు కొంతకాలము సంసార జీవితము ననుభవించి తనకు సమీపములోనున్న మంత్రాలయమునకు వెళ్ళి గుర్వాజ్ఞచే నచట శ్రీ భువనేంద్రవారిచే తురీయాశ్రమమును స్వీకరించిరి నాటినుండి వీరికి 'వ్యాసతత్త్వజ్ఞులని పేరేర్పడినది గద్వాల ప్రభువులు వీరి ననేక విధముల సత్కరించి వేణిసోంపురమను గ్రామమును జాగీరుగా సమర్పించిరి. ఈ గ్రామము తుంగభద్రా నదీతీరమున గలదు. నేటికి వీరి సంతతివారచటనే యుండి వారు ప్రతిష్ఠించిన శ్రీ లక్ష్మీ నరసింహస్వామికి, శ్రీ కృష్ణస్వామికి పూజలు సల్పుచు ఆచార్యుల వారి ఆరాధనలు గావించుచున్నారు. శ్రీ వ్యాసతత్త్వజ్ఞులు క్రీ శ. 1878 శ్రావణ బహుళ అష్టమినాడు పరమపదించిరి.

---

1. శ్రీ తిరుమల రావు M. A, గారు వ్యాసము-దానసాహిత్యము గద్వాల. (వ్రాతప్రతి నుండి గ్రహించబడినది.)

## శ్రీ గోపాలదాసులవారు :

క్రీ॥ శ॥ 1777 ప్రాంతమున శ్రీ గోపాలదాసులవారు రాయచూరు జిల్లా దేవదుర్గ తాలూకా ప్రాంతమందలి 'మొసరకల్లు' అను గ్రామమున జన్మించిరి. హారితస గోత్రము. తల్లిదండ్రులు వెంకమ్మ మురారి రాయలు గోపాల దాసు అను నామము గురువులచే 'దీక్ష' పొందిన తర్వాత వచ్చినది వీరి మొదటి పేరు భాగణ్ణ ఇతనికి చిన్నవయస్సునందే పితృవియోగము సంభవించెను. బంధువగు గుండప్ప ఇతనికుపనయనము గావించెను ఈ భాగణ్ణ ప్రతి దినము మూడు పూటలు గాయత్రీ మంత్రమును జపించెడివాడు దీని ప్రభావమున ఇతనికి వేదశాస్త్రాదివిద్యలతోబాటు కవిత్వ వక్తృత్వ కళాకౌశలములు నలవడి నవి. వీరనేక సభలలో వాదించి జయపత్రములను బడసి పరాజితులైన వారికి భగవద్భక్తి నుపదేశించుచుండిరి.

భాగణ్ణ పాండిత్య ప్రభావమును గద్వాల రాజారామ భూపాలుడు తెలిసి కొని వారిని దర్శించి కృతార్థుడయ్యెను. వారికి రాజాగారు ఉత్తనూరు గ్రామమున భూమినిచ్చి సత్కరించిరి. దినదినమునకును భాగణ్ణ గారి మంత్ర శక్తి వాక్సిద్ధి నలుమూలల వ్యాపించి ప్రజలనాకర్షింపసాగెను. రానురాను వీరిని దర్శించి తమ దుఃఖములను పోగొట్టుకొనిపోవు కోరికతో వచ్చు జన సమూహ మధికమయ్యెను.

ఉత్తనూరు గ్రామమున శ్రీ వేంకటేశ్వరస్వామి ఆలయమున్నది ప్రజలా స్వామిని దర్శించి భాగణ్ణగారు తెల్పు భూత భవిష్యద్వర్తమానములను విని తృప్తి జెంది వారికి కొంత ద్రవ్య సహాయము జేయసాగిరి. ఆ రాబడిచే భాగణ్ణ దేవబ్రాహ్మణ సంతర్పణలు గావించి తృప్తి జెందుచుండెను. వీరనేక కృతులను కీర్తనలను రచించిరి. అర్థ గాంభీర్యము-నాదసౌకుమార్యము వీరి రచనలో ముఖ్యముగా గన్పడును.[1]

సమాజమందలి మూఢ విశ్వాసములను, డంబాచారములను ఖండించి, అంతరంగశుద్ధికి ప్రాధాన్యమొసగిన వీరు మంత్ర రసవాదసిద్ధులను సాధించి భక్తిజ్ఞాన వైరాగ్య విషయములను గురించి ప్రజలకు బోధించుచు స్వగ్రామ

---

1. శ్రీ తిరుమలరావు M. A. గారు దాస సాహిత్యము-వ్యాసము, పుట 8.

మున (ఉత్తనూరు) నివాసమేర్పరచుకొని యుండిరి. వీరిని గణేశాంశ సంభూతులని ప్రాజ్ఞులు తెల్పుదురు. ప్రస్తుతము వీరి సంతతివారు గద్వాలలో నున్నారు.

## శ్రీ మొదలుకల్లు శేషదాసులవారు :

గద్వాలకు ఐదు మైళ్ళ దూరముననున్న దరూరు అను గ్రామమున శేషప్ప అను బాలుడు బ్రాహ్మణ కుటుంబమున జన్మించెను. ఇతడు గ్రామ కరణికుడు (పట్వారి). ఒకప్పుడు గద్వాల ప్రభువగు రాజా సోమభూపాలుడు వీరిని గ్రామ కరణికపు లెక్కలు సకాలమున చూపనందున అవమానపఱచెను శేషప్ప గారు వెంటనే యా పదవిని త్యజించి, కృష్ణాతీరమందలి చింతరేవుల అను గ్రామమునకు బోయి అచటనున్న హనుమదాలయమున తపమాచరించిరి. వారికి స్వప్నములో దాసులలో నొకరగు విజయదాసులవారు దర్శనమిచ్చి దాసదీక్ష గైకొన నుపదేశము గావించిరి.

శేషప్ప గారచట తపము చాలించి గుర్వాదేశానుసారము పీకలపరివి చిప్పగిరి చక్రతీర్థము (హంపి) మున్నగు ప్రదేశములలో నిష్ఠతో జపమాచరించి దాసానుగ్రహమును పొందిరి.

శ్రీ శేషప్ప యాత్ర నుండి తిరిగి వచ్చి దరూరు గ్రామమునందొక సంవత్సరము 'శివ మంత్రాక్షరీ' జపమాచరించి మహాదేవుని యనుగ్రహమునకు పాత్రులైరి. పిమ్మట వీరు తన గురువులను ధ్యానించుచు తన నాశ్రయించిన వారి దుఃఖములను పోగొట్టుచు అనేక పదములను సుళాదులను (పదునెనిమిది తాళముతో నొప్పు రచన) రచించిరి. కాని వీరి రచనలు లభించలేదని తిరుమల రావు, ఎం. ఏ గారు తెలిపిరి.

వీరు క్రీ. శ. 1885 వైశాఖ శుద్ధ అష్టమినాడు మొదలుకల్లు (ఆది శిలా క్షేత్రము) గ్రామమున వైకుంఠ వాసులైరి. ఈ గ్రామము గద్వాల నుండి అయిజకు పోవు మార్గమున గలదు వీరి దేహావసానసంస్కారమైన స్థలమున ఒక విశాలమైన వేదిక కట్టబడినది. భక్తులు నేటికిని ప్రతి సంవత్సరము వైశాఖశుద్ధ అష్టమినాడు వీరి పేర ఆరాధన జరుపుచున్నారు. భక్తులు శ్రీవారి వేదికకు ప్రదక్షిణ మాచరించి ఋష్టార్థసిద్ధి బడయుచుందురు.

## శ్రీ హయమేళ హయగ్రీవాచార్య-విఠలాచార్యులు :

శ్రీ హయగ్రీవాచార్యుల వారిది బీజాపురము జిల్లాలోని 'ఏతమేళి' అను గ్రామము. వీరు పండరిపురమున కృష్ణమాచార్యుల సన్నిధిలో న్యాయ వ్యాకరణ శాస్త్రములలో కూలంకషమగు పాండిత్యమును సంపాదించిరి. వ్యాకరణ శాస్త్రమున 'అపరపాణిని' అను పేర్వడసిరి. ఆచార్యులవారు తమ శిష్యులతో విద్వత్సభలకు బోవుచు 'జయపత్రము' లందుకొనుచు ధర్మమును గూర్చి జాగృతి గావించుచుండిరి.

గద్వాల సంస్థానమున జరుపబడుచున్న విద్వత్సభలలో వీరు పాల్గొని తమ వాద వైదుష్యమున నచటి పండితులను చకితుల గావించిరి గద్వాల ప్రభువు వీరికి గొప్ప సన్మానము గావించెను వీరి పాండిత్య ప్రకర్షకు ప్రభావితులై సురపుర నాయక ప్రభువు తన సంస్థానమున నుండుమని కోరగా వీరు తమ శిష్య కోటితో నచట నుండినను గద్వాల సభలకు మాత్రము తప్పక విచ్చేయుచుండిరి.

## విఠలాచార్యులు :

వీరు హయగ్రీవాచార్యులవారి కుమారులు. వీరు తండ్రిగారి వద్దనే వ్యాకరణ న్యాయ సాహిత్య వేదాంతాది శాస్త్రములను నేర్చుకొని ఆ శాస్త్రముల యందు విద్వాంసులై యొప్పిరి. తండ్రిగారివలె వీరు తెలంగాణ మందలి విద్యార్థులతోపాటు కన్నడ, మహారాష్ట్ర ప్రాంతముల వారికి విద్య నేర్పుచుండిరి. నేటికి వీరి శిష్య ప్రశిష్యులెందరో పండితులై గురువుగారి ప్రతిష్ఠలను నిల్పియున్నారు. శ్రీ విఠలాచార్యులు గద్వాల ఆస్థాన విద్వాంసులుగా గౌరవింపబడిరి. వీరు గద్వాలలో అన్నసత్రము పెట్టి విద్యార్థులకు పాఠములను బోధించుచుండిరి. వీరున్న వీధి 'సత్రము' అను పేర నేటికిని పిలువబడుచున్నది

ఈ వీధిలో త్రిమతస్థులగు బ్రాహ్మణులుందురు ఎదురుగా గోపాలస్వామి ఆలయమున్నది. ఈ తండ్రీ కొడుకులిరువురు క్రీ శ 19వ శతాబ్ది ఉత్తరార్థమునను 20వ శతాబ్ది మొదటి పాదము వఱకును జీవించి శిష్యకోటికి జ్ఞానభిక్షను ప్రసాదించిరి.

ఇటులే రంగంపేట వేంకటాచార్యులు తుప్పసక్రి నారాయణాచార్యులు ప్రస్తుతము గుర్మిట్కాల యను గ్రామములో నున్నారు. వీరు సుప్రసిద్ధ పౌరాణికులు. వీరు గద్వాల సభలకు విచ్చేసి ప్రభువులచే గౌరవింపబడిరి. తుప్పసక్రి నారాయణాచార్యులు గద్వాల అస్థాన విద్వాంసులుగా నుండిన హయగ్రీవాచార్యుల వారి కుమారులు.

ఇటులెందరో గద్వాల ప్రభువులచే సత్కరింపబడి ఆంధ్రభాషయందేగాక కన్నడ భాషలో సయితము అనేక రచనలు గావించి గద్వాల సంస్థాన గౌరవమును పెంపొందించిరి.[1]

మూడవ ప్రకరణము

# విద్వద్గద్వాల

'విద్వద్గద్వాల' యని ప్రసిద్ధి చెందిన దా నాటి గద్వాల సంస్థానము. ప్రభువులు గావించిన దాన ధర్మములు, కవి పండితులను సత్కరించిన విషయములు ఆ నాటి సభల కేతెంచిన కవుల పద్యములను బట్టి తెలియుచున్నది. నాటి కార్తిక మాఘ మాస సభలు సంగీత సాహిత్యములకు నాలవాలమై యుండిన వనుట కెన్నియో ఉదాహరణములు గలవు.

గద్వాలకు పూర్వము బోరవెల్లిసీమ కవులకు పండితులకు కాణాచి అయినది. ఆ సీమకు ప్రభువు మూలపురుషుడు నల్లారెడ్డిగారు. బోరవెల్లి ప్రభువుల కిలవేల్పు పోల్గంటి సోమేశ్వరుడు.

గద్వాల ప్రభువగు పెద్ద శోభనాద్రి కూతురు గిరియమ్మ (బోరవెల్లి) లయగ్రాహి గరుడాచల కవి నాదరించి అతనిచే 'కౌసలేయ చరిత్ర'మను గ్రంథమును వ్రాయించెను. ఆమె దత్తుకుమారుడగు వెంకటరెడ్డి చింతలపల్లి ఛాయాపతి నాదరించి 'రాఘవాభ్యుదయ'మను గ్రంథమును వ్రాయించెను.

గిరియమ్మగారి దానధర్మాధికములు కౌసలేయ చరిత్రమున విపులముగా వర్ణించబడినవి.[1]

క్రీ. శ. 1663-1713 మధ్య గద్దెపల్లి సమీపమున పెద శోభనాద్రి కోట నిర్మించి 'గద్వాల' యని పేరిడెను అతని కాలము నుండియె కవి పండిత సముదాయమును సన్మానించు సంప్రదాయము నెలకొల్పబడినది.[2]

అతని ఆస్థానమున కొటికలపూడి వీరరాఘవ కవి నృసింహ విలాసమును రచించిన కాణాదం లక్ష్మీనృసింహం (కాణాదం పెద్దన బావమరది) అచలాత్మజా

---

1. డా. బిరుదు రామరాజు-మరుగుపడిన మాణిక్యాలు. వ్యాసము లయగ్రాహి కౌసలేయ చరిత్రము. పుట 3-4

2. సంగ్రహాంధ్ర విజ్ఞానకోశము సం. 3 పుట 304, 305.

పరిణయ కర్తయగు బుచ్చి వెంకటాచార్యులు. ముకుంద విలాసమును రచించిన కాణాదం పెద్దన వంటి విద్వత్కవులుండిరి.

## చిన్న సోమభూపాలుడు :

పెదసోమనాద్రి లేక సోమభూపాలుని యనంతర మతని మనుమడు చిన సోమభూపాలుడు క్రీ. శ. 1789-1815 గద్వాల సంస్థానమును పాలించెను. ఈ చిన్న సోముడు సంస్కృతమున హరిహర భట్టు రచించిన 'రతిశాస్త్రము'న కాంధ్రానువాదము గావించినాడు. ఈ రాజకవి జయదేవ కృత 'గీత గోవిందము'న కాంధ్రానువాదము గావించెను 'ప్రియే! చారుశీలే!'యను ప్రశస్తి గీతమునకు సంస్కృతాంధ్ర భాషలలో ఛందో బద్ధముగా సంధానితమైన వ్యాఖ్యాన రూపమే ఈ నృపాలుని అష్టపది. ఈ అష్టపదులు ఒక్కొక్క చరణమున కొక శ్లోకము పద్యము దరువు చూర్ణిక యను నాల్గు రీతుల పెంపు గావింపబడినవి.

ఈ నృపాలుని మధుర సాహితీ నిర్మాణ కౌశల మీ శ్లోకము వలన వెల్లడి యగుచున్నది

శ్లో॥ గద్వాల సోమనరపాల మణిప్రదీపం
పద్మావతీంద్ర జయదేవ కవీంద్ర గీతం
రాధామది ప్రథిత మాధవ సూక్తిజాతం
మాధుర్యచాటు ఫణితం జయతు ప్రభాతమ్. 1

అతని ఆస్థానమున అల్లసాని పెద్దన వలె ప్రసిద్ధి చెందిన కాణాదం పెద్దన తన ముకుంద విలాసమున ప్రభువు నిట్లు వర్ణించెను.

అతడు చెలువొందు మాఘమాసాది ఘటిత
రామ కేశవ గోపాల రథ మహోత్స
వా రచిత హేమమణి తులాభార దాన
భరిత భువనాళి సోమభూపాలమౌళి. 2

---

1. చిన సోముని 'ఆంధ్రాష్టపది', ట్రినియల్ క్యాటలూగు ఆర్. నెం. 900. ఓరియంటల్ లైబ్రరీ - మద్రాసు మరియు మంజువాణి సాహిత్య పత్రిక 1929లో ముద్రితము.
2. కా. పెద్దన – ముకుంద విలాసము. పుట 3, 4.

కాణాదం పెద్దనగారి రచనా దక్షత ఈ క్రింది పద్యము వలన తెలియు చున్నది.

కం॥ కుంద విలాసము తావి ము
కుంద విలాసము సదా ముకుంద విలాసం
బిందు విలాసమును సుధా
బిందు విలాసము హసించు పేశల ఫణితిన్.

ఇతడు భద్రా పరిణయమను నామాంతరము గల 'ముకుంద విలాసము'ను మూడాశ్వాసముల గ్రంథమును రచించెను. చిన సోమభూపాలునికి 'నవభోజ రాజ'ని బిరుదము గలదు. అతని యాస్థానమున 'అష్టదిగ్గజముల'ను పేర ఎనమండుగురు కవులుండెడివారు. కాణాదం పెద్దన, కొత్తపల్లి రామాచార్యులు, కామసముద్రం అప్పళాచార్యులు, గార్గేయపురం సుబ్బాశాస్త్రి, బోరవెల్లి శేష కవి, సోమనాథ శాస్త్రి, ధర్మవరం రామకృష్ణ కవి మున్నగువారుండిరి కృష్ణ లీలా తరంగిణి గ్రంథ రచయిత, అష్టభాషా కవిత్వ పటుత్వోభయ వేదాంత ప్రవక్తులని ప్రసిద్ధి జెందిన కామసముద్రం అప్పళాచార్యులు చిన సోముని ఆస్థాన వైభవమును కన్నులారా గాంచి ఇట్లు వర్ణించెను.

సీ॥ ఒక దండ పండిత ప్రకరంబు శాస్త్రముల్
పటుతరోక్తులతో నుపన్యసింప
ఒక చెంత సంతతం బొదవ కవిశ్రేణి
కృతులర్థ రస చమత్కృతుల దెలుప
ఒక చాయ గాయక నికరము రక్తి రా
గముల వీణాది వాద్యముల బెనప
నొక వార వారబాలికలభినయ నాట్య
సంగీత రీతి నాశ్చర్య మూనప.

తే॥ ప్రమథమున వందిమాగధుల్ ప్రస్తుతింప
గరిమగను వేత్రధరులు హెచ్చరిక దెల్ప
హిత పురోహిత మంత్రి ప్రముఖులతోడ
నడరి గొలువుండె రత్న సింహాసనమున.[1]

---

1. శా అప్పళాచార్యులు - కృష్ణలీలా తరంగిణి. ప 12.

చిన సోమ డొకనాడు కాణాదం పెద్దనగారితో 'బంధ గీర్వాణ టీకా ప్రబంధాది పేశల వచో రచనార్య పెద్దనార్య' యని సంబోధించుటచే నితడు చతుర్విధ కవితలను (ఆశు గర్భ బంధ చిత్ర) చెప్పెడి వాడని తెలియుచున్నది [1]

ప్రభువు తన ఆస్థానమున నున్న కామసముద్రం అప్పళాచార్యులను గాంచి 'కృష్ణ దివ్య కథలష్టపదులివి యని దెలుగొనర్చి సంతసము గూర్చుమప్పళాచార్య సుకవి' అని సంబోధించినాడు. అతని కోరిక ననుసరించి కవి 'కృష్ణలీలా తరంగిణి' గ్రంధమును రచించెను. ఆచార్యులవారి అష్టపదులు మిక్కిలి రస వంతములు.

ఉ॥ సుందర గీత కౌశలము సూనృత కావ్యకళా విలాసముల్
నందకుమార చింతనము నవ్య రసానుభవమ్ము లన్నియున్
ఇందుముకుంద భక్తుడగు ఈ జయదేవ కవీంద్ర గీత గో
విందమునన్ బుధుల్ మిగుల వేడ్క భజింతురుగాక నిద్దరన్. [2]

ప్రభువు ఆస్థానమున నున్న బుచ్చి వేంకటాచార్యులు అచలాత్మజా పరిణయము (తెలుగు) (రెండర్థములు గలది), శృంగార రస మంజరీ భాణము, శృంగార సర్వస్వము, వేదాంత కారికావళి మున్నగు సంస్కృత గ్రంధములను రచించెను పెద సోముని కాలమున నుండిన వైష్ణవ పండితుడు కొటికలపూడి వీరరాఘవ కవి 'యథాశ్లోక తాత్పర్య భారత ముద్యోగ పర్వము నాంధ్రాను వాదమొనర్చెను 'నవీనం ద్రోణ పర్వం' అనునదీకవిగారి రచనయే యని డా. బి. రామరాజుగారు తెల్పిరి.[3] ఇది అముద్రితము ఈ తాళప్రతి హైదరాబాదు పురావస్తు పరిశోధనాలయమున నున్నది. ఆర్గురు రామాయణ కవులు యథాశ్లోక తాత్పర్య రామాయణమును చిన సోముని కాలమునాటి వఱకు పూర్తిగావించిరి

కొటికలపూడి వీరరాఘవయ్యకు 'అభినవ తిక్కన' యను బిరుదము గద్వాల ప్రభువులచే ప్రదానము గావింపబడినది. కవిగారి ఉద్యోగపర్వము

1. కా. పెద్దన - ముకుంద విలాపము. పుట 8.

2. కా అప్పళాచార్యులు - కృష్ణలీలా తరంగిణీ చివరి పద్యము.

3. డా. బి. రామరాజు - మరుగుపడిన మాణిక్యాలు. పుట 46.

ఎనిమిది ఆశ్వాసములు గలది. ఈ గ్రంథము ప్రభువుల నిలవేల్పగు శ్రీ చెన్న కేశవ స్వామికంకితము గావించబడినది [1]

పెదసోముని కాలమునందును అనంతర మతని మనుమడగు చిన సోమ భూపాలుని కాలమందును కార్తిక మాఘ మాసములలో విద్వత్కవి గాయక గోష్ఠులతోపాటు కవులు గ్రంథములను రచించి ప్రభువులను సంతోషపఱచిరి. యథాశ్లోక తాత్పర్య రామాయణమున చిన సోముని రాజ్య వైభవము దైవ భక్తి చక్కగా వివరింపబడినది [2]

అకలుషస్థితి మాఘ కార్తిక మహోత్స
వముల సత్కవి పండితావళుల కెల్ల
కొల్లలుగ నిచ్చె నే రాజకుల వతంసు
డతని సుకృతము వర్ణింప నలవియగునె [3]

కామసముద్రం అప్పళాచార్యులు తన 'కిష్కింధకాండ' అవతారికలో చిన సోమభూపాలునకు కేశవ స్వామిపై గల భక్తి ప్రపత్తులను చక్కగా చూపెట్టినాడు

ఆ॥ శంఖములు కాహళములు వంశములు బూది
భేరులు సమస్త వాద్యముల్ బోరుసలుప
నధిక భక్తి నొసంగ నెయ్యమున సోమ
భూవరుడు కేశవస్వామి సేవ జేయు [4]

పెద సోమభూపిభుని నాటినుండి కార్తిక మాఘ సభలు ప్రారంభమై చిన సోముని కాలమున విశేష వ్యాప్తి గావింపబడినవి

## రాజా రామభూపాలుడు :

చిన సోముని అనంతరము కొంత కాలము వరకు సాహిత్య పోషణము కుంటుపడినదని చెప్పవచ్చును. రాజా రామభూపాలుని రాజ్యకాలమున క్రీ. శ.

---

1. డా. రామరాజు - మరుగునపడిన మాణిక్యాలు. పుట 46
2. కా. వీరరాఘవయ్య - ఉద్యోగ పర్వము. (ముద్రితము) పుట 3, 4.
3. కా. పెద్దన - యథా శ్లో. తా. రామాయణము. పుట 4.
4. కా. అప్పళాచార్యులు - కిష్కింధ కాండ. అవ. పుట 9.

1887-1923 మరల వ్యాప్తి జెందెను. రామభూపాలుడు రాజకవి. ప్రభువు తనకు విద్యాగురువగు పురాణం దీక్షాచార్యులు సంస్కృతమున రచించిన 'ఛందో ముకుర'మను అలంకార శాస్త్రము నాంధ్రానువాదము గావించెను. పురాణం దీక్షాచార్యులు రామచంపువు ఛందోముకురము రామనృపకర్ణామృతము కేశవ సుప్రభాతము కావ్యోత్కర్ష మున్నగు గ్రంథములను రచించెను. ఈ ప్రభువు కాలముననే హోసదుర్గం కృష్ణమాచార్యులు 'కార్తికోత్సవ దీపిక' యను గ్రంథమును సంస్కృతమున రచించెను. ఇందు గద్వాలలో జరుగు కార్తిక మాఘ సభలు వర్ణితములు. చెట్లూరి నారాయణాచార్యులు (సంస్థాన పరీక్షాధికారి) ప్రతాప రుద్రీయ మను గ్రంథమును రచించెను. ఇది ఇముద్రితము.

రామభూపాలుని కాలమున స్థానిక పండితులేకాక ఇతర ప్రదేశములనుండి ఎందరో కవులు పండితులు గద్వాల విద్వత్సభలకు వచ్చెడివారు. అట్టివారిలో కాశీవారకు శివకుమార పండితులు, కస్తూరి రంగాచార్యులు (మైసూరు), కాశీ సుబ్రహ్మణ్యశాస్త్రి, కోనసీమ నుండి ధూళిపాటి సూర్యనారాయణ శాస్త్రి, జటప్రోలు అమింతల సింగరశాస్త్రి మున్నగువారు వచ్చి గౌరవ సత్కారముల నందుకొనెడివారు. 1

రామభూపాలుని కాలముననే ఆదిపూడి ప్రభాకరరావుగారు గద్వాలకు విచ్చేసిరి. సుప్రసిద్ధులగు తిరుపతి వేంకట కవులితని కాలముననే ప్రథమమున గద్వాలను దర్శించిరి. ప్రభాకరరావు తన జగదీశ శతకము (1928)లో తాను శ్రీ రామభూపాలుని యాస్థానమున జేసిన విషయమునిట్లు తెల్పెను 'ఎందరో భూపాలురు గలరంచు తిరుగుచు గనపడె గద్వాలలోన - ఘనదాన యశోధనుడగు శ్రీ రామాఖ్య - నృపాలుడు కల్పతరువుగా జగదీశ' యని వక్కాణించెను.

తిరుపతి వేంకట కవులీ ప్రభువును దర్శించి 'దళిద పండితలోప గద్వాల భూప'యను మకుటముతో ననేక పద్యములు చెప్పిరి. సభలో కొందరు బ్రాహ్మణులైన మీకు మీసములేల? యని అడుగగా నాశువుగా కవులీ పద్యము చెప్పిరి.

ఉ॥ దోస మటంచెరింగియును దుందుడు గొప్పగ బెంచినారమీ
మీసము రెండు భాసలకు మేమె కవీంద్రులమంచు దెల్పగా
రోసము గల్గినన్ కవివరుల్ మము గెల్వుడు గెల్తురేని యీ
మీసము దీసి మీ పద సమీపమునం దలలుంచి మ్రొక్కమే. 2

1. కేశవ పంతులవారి సంస్థానములు - సాహిత్య సేవ. పుట 29.
2. తిరుపతి వేంకటకవులు - నానారాజ సందర్శనము. 57.

అని చెప్పి సవాలు చేసినారు. ఆసమయమున సభాముఖమున తిరుపతి కవుల నెదుర్కొన్నవారిలో రాజ గురువులైన పురాణం దీక్షాచార్యులు ముఖ్యులు. కావుననే ఈ జంటకవులు 'శనిగ్రహం' అను గ్రంథమును గద్వాలలో రచించిరని కొందరు చెప్పుదురు. కాదని మరొక్కచోట ప్రభుదర్శనమిప్పించని మంత్రిపై రచించిరని కొందరందురు.[1]

ఆ సంవత్సరమీకవుల కవధానము గావింపకయే సత్కరించినందులకు మరు సంవత్సరముకూడ అవధానమున కవకాశము గల్పింపనందులకు తిరుపతి వేంకట కవులపైగల అభిమానమున శ్రీ ఆదిపూడివారు ప్రభువునకిట్లు విన్నవించుకొనిరి.

ఒక్కసభ జేసి తోచిన వక్కలాకు
లిచ్చి పంపించుమనుటకే యింతలాయె
నిలగవీశ్వరులనుట నవ్వులకె చేటు
కాక ఏమున్నదయ్యా యిక్కాలమందు[2]

అని మహారాజుతో తెల్పి అవధానము జేయించ నేర్పాటు గావించిరి. ఈ ఆదిపూడివారు రచించిన కంద రామాయణము ముద్రితము కాకపూర్వమే పలువురి ప్రశంసల నందుకొన్నది. ఇతడు తిరుపతి కవులచే 'అభినవతిక్కన' బిరుదమును సంపాదించెను

అవధానానంతరము ప్రభువుచే సత్కారము బొందినపుడీ కవులు పద్యమును చెప్పిరి.

ఉ॥ పెద్దనకిచ్చె మున్నుపృథివీపతిరత్నము కృష్ణరాయలం
చద్దయు గండపెండెరము, సత్కవులెల్లరు మెచ్చమీరులున్
తద్దయు మమ్మనుగ్రహవిధమ్మున జూచియొసంగినారుగా
ముద్దుగడానినిట్టి బిరుదమ్ముల్ భువినింతటి దాతలుందురే[3]

1. కేశవ పంతుల నరసింహశాస్త్రి సంస్థానములు - సాహిత్య సేవ. పుట 30.
2 & 3. తిరుపతి వేంకట కవులు - నానారాజ సందర్శనము. పుట 31, 40.

అని రామభూపాలుని పొగడిరి. అంతేకాదు ఈ జంటకవులు 'అటు గద్వాలిటు చెన్నపట్టణము మధ్యంగల్గు దేశమ్ములన్' అని తమ పద్యములలో వ్రాసి గద్వాల సంస్థాన ప్రశస్తి నినుమడింపజేసినారు. 'రామభూపాలరాయ భూస్వామి కవుల కెలమి నొనరించు వార్షికములకు తిరుగు లేదను' మాట నీ కవులు చాటి చెప్పినారు.[1] "భళి భళీయంచు నుతిజేయ పండితప్ర - కాండవచనంబులెల్ల దారాకాణమయ్యె/భావుకంబైన నీదానపటిమజూడ - పండితవిధేయ రామభూపాలరాయ" అని ఎన్నింటినో చెప్పి ఈకవులు ప్రభువు దానపటిమను పొగడినారు

ఆదిపూడివారు గద్వాల ప్రభువులకు కేశవస్వామిపైగల భక్తి ప్రపత్తులను గూర్చి అనేక చాటువులు చెప్పినారు.

'కవులు కామితములు బడయ గద్వాల ప్రభువుల నాశ్రయింతురట' ఆదిపూడివారు తన రచనలో 'కల్పకంబగునని నిన్ను కామితములు వడయకవులాశ్రయింత్రుగద్వాలభూప' అని వ్రాసెను.[2]

## అవధానములు - సమస్యలు :-

ప్రభువులు సభలకు విచ్చేసిన కవిపండితుల ధీశక్తిని కవితాశక్తిని గాంచుటకై అవధానములు చేయించి సమస్యలనిచ్చి ఆశుకవితలో పూరింపుమనెడివారు. వానిని కవులాశువుగా పద్యములలో పూరించి చెప్పుచుండగా విని ప్రభువులానందిచెడివారు. ప్రభువు విద్వత్పరీక్షలలోను, కల్పనా చమత్కృతులలోను ఆశు కవితా ప్రదర్శనములలోను కవుల శక్తి సామర్థ్యములను గమనించెడివాడు. రాజులు వారిని కొన్నాళ్ళపాటు తమ సంస్థానములందు నిల్పుకొని ఆశుకవితావధానవినోదములతో ఆనందించెడివారు.

గద్వాలలో తిరుపతి వేంకటకవులవధానములతోపాటు సమస్యాపూరాణముల నెన్నింటినో గావించినారు. అట్టి వానిలో నొక సమస్య - "అరవిరిపొన్నపూ జేరజనరావిటు రాయడనేను వచ్చెదన్" దీనిని జంటకవులు పూరించిన విధము.

---

1. తిరుపతి కవులు - నానారాజ సందర్శనము. పుట 19.
2. ఆదిపూడివారు - గద్వాల ప్రభాకరము. పుట 22.

చ॥ మరిదియు బావయున్ మగడు మామయు నత్తయు నింటిలోన జి
చ్చర పిడుగుల్, సుఖమ్ము కొనసాగదటంచు పానుపే
ర్పఱచితి తోటలో సగము రాతిరిపోయినమీద నీవు గ్ర
చ్చర విరిపాన్పు జేరజనరా విటరాయడ! నేను వచ్చెదన్ 1

అని పూరించి ప్రభువుల నానందపఱచిరి

## చిన్న సీతారామ భూపాలుని కాలము (1902-46) :-

వీరి పరిపాలన కాలమొక స్వర్ణయుగముగా భావించవచ్చును. వీరి కాలమున తిరుపతి వేంకటకవులతోపాటు భైరంపల్లి తిరుమలరాయకవి, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి (శతావధాని) మున్నగు వారెందరో కవులు, పండితులు గద్వాల సభలకు వచ్చెడివారు ఈ సీతారామభూపాలుని కాలముననే జంట కవులకు గజోత్సవాదులిచట జరిగినవి. ఈ సంస్థానము పండితుల, కవుల సన్మానములకొఱకు దాదాపు నలుబది లక్షల ఋణము గావించినది. గద్వాల సంస్థానపు సంవత్సర ఆదాయము పన్నెండు లక్షలు మాత్రమే గలదు. ఆదాయమునకు మించిన ఖర్చు చేయుటకీ సంస్థాన ప్రభువుల వితరణ గుణమే కారణము కావచ్చును త్యాగమునందీ ప్రభువుగారిది ఎముకలేని హస్తమని ప్రతీతి. ఈ ప్రభువు కాలముననే యుండిన భైరంపల్లి తిరుమలరాయకవి సంస్కృతాంధ్ర ములయందాశుకవితా చక్రవర్తియని ప్రసిద్ధి గాంచెను కడపజిల్లా పర్లపాడు కాపురస్థుడగు చెమికల చెన్నారెడ్డి కవి సంగీత హరిశ్చంద్ర, గద్వాల కేశవ శతకము, మదనమోహన శతకము మున్నగు గ్రంథములను రచించి ప్రభువుచే సత్కరింపబడెను. ఈ రెడ్డిగారి కవిత ద్రాక్షాపాక విలసితము.

ఈ భూపాలుని కాలముననే హోసదుర్గం వేదాంతాచార్యులు సంస్థానమున ధర్మాధికారులుగా నుండిరి. ఆచార్యులు 'శ్రీకృష్ణబ్రహ్మ తంత్రార్య వేదస్తవము' మొదలగు గ్రంథములను రచించెను కీ. శే. పుల్లగుమ్మి వేంకటాచార్యులు ఆస్థానమున వ్యాకరణపండితులుగా నుండి అనేక గ్రంథములను రచించిరి. వీరి ఆదిలక్ష్మి కర్ణపూరము (అలంకార గ్రంథము) అను గ్రంథము సీతా

1. తిరుపతి కవులు - నానారాజ సందర్శనము, పుట 54.

రామభూపాలుని భార్య రాణి ఆది లక్ష్మీదేవమ్మ పేర రచింపబడినది.[1] ఇది ముద్రితము. వీరి కుమారులు పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులు కూడ వ్యాకరణ పండితులై సంస్కృతమున "వేదపాదస్తవము" సంస్కృతభాషా బోధిని మున్నగు గ్రంధములను రచించిరి.

ఈ ప్రభువు కాలముననే పోకూరి కాశీపత్యవధాని యను పల్నాడు వాస్తవ్యుడు గద్వాల సంస్థానమున నుండి శుద్ధాంధ్రనిరోష్ఠ్య హరిశ్చంద్రోపాఖ్యానము, సారంగధరీయము మున్నగు గ్రంధములను రచించెను. ఇతడు చతుర్విధ కవిత లల్లెడివాడని అతని సారంగధరీయమను గ్రంధము వలన తెలియుచున్నది. ఇతడవధానములు గావించెడివాడు అవధానిగారు పై రెండు గ్రంధములను గద్వాల ప్రభువులకంకితము గావించి గౌరవ సత్కారములను పొందిరి.[2]

గాడేపల్లి వీరరాఘవశాస్త్రి (శతావధాని) గారు గద్వాల ప్రభువుల నాశ్రయించి కొంతకాలమాస్థాన పండితులుగాను అనంతరము ప్రభువుల ఉన్నత పాఠశాలలో నాంధ్రపండితులుగా చాలకాలము పని చేసిరి. శాస్త్రిగారనేక గ్రంధములను (40 పైగా) రచించినారు. వీరు కవితా ప్రక్రియలో వివిధ రచనలను గావించినారు.

క్రీ. శ. 1915 ఆనందనామ సం॥ర మాఘమాసములో గద్వాల మహారాజు కృష్ణాతీరమున నున్న అగ్రహారమున సభ చేయించెను. ఆ సభకు రాఘవ శాస్త్రిగారు శాలువ లేకుండ సాధారణమైన పంచె పైన వేసికొని వెళ్ళిరి. అపుడు మహారాజు శాలువ లేకుండ సభకు వచ్చితిరేల? యని అడుగగా 'తమ రిచ్చిన శాలువ వేసికొనవలెనని మా కవితాకన్యక కోరుచున్నదని ఆశువుగా నీ పద్యమును చెప్పిరి.

చ॥ అడిగిన యంతమాత్రమున నట్టిటు జూడక సత్కరింపగా
దొడగు నృపాలచంద్రుడు చతుర్జలరాశి పరీతమైన యీ
పుడమిని లేడు, రామనృపపుత్రుడొకండితడే లభించె నీ
యిడుములు గడ్డకెక్కె వరియించి సుఖించు కవిత్వకన్యకా[3]

---

1, సంగ్రహాంధ్ర విజ్ఞాన కోశము. సం, 3 పుట 310.

2. పోకూరి కాశీ పత్యవధానులు - సారంగధరీయము. పుట 3.

3. గాడెపల్లి వారి చమత్కార కవిత్వము - కృష్ణాగ్రహారము. పుట 47.

శ్రీ శాస్త్రిగారు తన వివాహ విషయమున కొంత సాయము జేయుమని రాజుగారిని కోరగా రెండునూర్ల పదహారిచ్చి పంపిరి. అటుల పంపుటను జూచి శాస్త్రిగా రాశువుగా- 'అన్యుల వేడుట సంభవించెగా, శివశివ యంచులోకులు వచింపగ జూడరటయ్య భూపతీ' అని పద్యమును చెప్పిరి. అది విని ఉదార స్వభావులైన శ్రీ సీతారామ భూపాలుడు వివాహమునకైన ఖర్చు తనపై భార ముంచుడని పల్కి శ్రీ శాస్త్రిగారిని సంతోష పెట్టెను. అట్టి త్యాగధనులీ గద్వాల ప్రభువులు.[1]

ఒకమారు గర్భవతిగా నున్న రాణిగారు కేశవస్వామి సన్నిధిలో నున్నప్పుడు కుమారుడు గల్గునట్లాశీర్వదించుడని రాజుగారు శాస్త్రిగారిని కోరిరి. అపుడు శాస్త్రి గారు ఆశువుగా కొన్ని పద్యములు చెప్పిరి. ఆ పద్యములు విని రాజుగారు పుత్రోత్సవ మొందినటులానందించిరి.

కొంత కాలమునకు రాజుగారికి కుమార్తె ఉదయించినది, శాస్త్రిగారు రాజాజ్ఞపై యాపర్ల (కృష్ణాతీరము) గ్రామమున జరుగుచున్న సామ్రాజ్య పట్టాభిషేకమునకు వెళ్ళినందున రాజగారి కుమార్తె నామ నామకరణమునకు రాజాలదయ్యెను. శాస్త్రిగారు గద్వాలకు వచ్చిన తర్వాత నొకనాడు రాజు గారు 'కవీశ్వరుల వాక్కులన్యథాయైనవిగదా' యనిని పల్కిరి. దానికి సమా ధానముగా గాదేపల్లి వారు మహారాజు సెలవైనట్లు చెప్పుటగదా కవుల విధి. యని సమయోచితముగా పల్కిరి. శాస్త్రిగారి యుక్తి చమత్కారములకు రాజుగారు సంతోషించిరి.

శ్రీ సీతరామ భూపాలుని కుమార్తె యగు వరలక్ష్మమ్మకు పురుష వేశము వేసి ప్రభువు తన తొడపై కూర్చుండ బెట్టుకొని కొలువు దీరుచుండెడివారు. ప్రభువు సభలో అటుల కూర్చున్నప్పుడు వెనుకటి మాట జ్ఞప్తికి వచ్చి శాస్త్రిగారు కవీశ్వరుల వాక్యము అన్యథా గాకుండ జేయుచున్నారు ప్రభువులు. అని చమ త్కారముగా బల్కిరి. అంత రాజుగారు ఔను నిజమే, మీ వాక్కులు చెల్లినట్లే యని సంతోషపడిరి ఆ సమయమున శాస్త్రిగారు చెప్పినదీ పద్యము,

---

1. మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి-గాదెపల్లి వారి కవితా విలాసము. పుట 52

చ॥ మొగమున భాగ్యలక్ష్మి భుజమూమునందున రాజ్యలక్ష్మితా
నగపడకుండ మీ హృదయమంతట బాయని రాజ్యలక్ష్మిరే
ల్వగలును నంకపీఠె వరలక్ష్మియు ముద్దులమూటగట్టి జి
ర్ణగవుగ రాజ్యమేలెదవె న్యాయ పథంబున భూతలేశ్వరా [1]

ఈ ప్రభువు కాలముననే చెమికల చెన్నారెడ్డి కవిగారు గద్వాలకు వచ్చుచుండెడివారు. ప్రభువు రెడ్డికులజులలో కూడ కవిత్వము తెలిసినవారుండి తన యాస్థానమునకు వచ్చినందులకు ముదమందెను. ప్రభువునకతనిపై యభిమాన మేర్పడెను. చెన్నారెడ్డి పొద్దుటూరు తాలూకా పర్లపాడు గ్రామనివాసి. ప్రభువుకు రెడ్డిగారిపై మిక్కుటమైన అభిమానము. శ్రీ రెడ్డిగారికి పండిత గౌరవముగా ప్రభువుచే శాలువ గ్రహించవలెనని సంకల్పము. కాని బ్రాహ్మణేతరులకు బహుమానముగా శాలువలు గాక వానికి బదులు ప్రభువులు తమ దుస్తుల నిచ్చుట యచటి యాచారము రెడ్డిగారు ఆస్థాన విద్వాంసులగు పుల్లగుమ్మి వెంకటాచార్యులవారిని కలిసికొని వారికి తన కోరికను తెల్పి వారిని ఒప్పించిరి. కాని ఆచార్యులవారు ఆస్థానపండితులుగా నున్న గాడేపల్లి వారిని (శాస్త్రిగారిని) కూడ ఒకమారు కలియుమని చెప్పిరి.

గా॥ వీరరాఘవ శాస్త్రిగారు చమత్కార ప్రియులు. అతని సంభాషణలో ఛలోక్తులుండును. పూర్వ పరిచయము, స్నేహమున్నందున రెడ్డిగారు శాస్త్రిగారితో తన కోరికను వెల్లడించిరి. నంత శాస్త్రిగారు ఛలోక్తిగా 'జీర్ణ వసన ప్రాప్తిరస్తు' అని రెడ్డిగారి నాశీర్వదించిరి ఆ మాటతో రెడ్డిగారికి కోపము వచ్చినది. అందుచే శ్రీ శాస్త్రిగారికి సభలో కొంతమనసు బాధ గలుగునట్లుగా ఆచార్యులవారిచే కొన్ని క్లిష్ట సమస్యలు సిద్ధముగావించబడెను ఆచార్యులు శతావధానులు చేతకాదన్నచో పూరించి చెప్పునటుల రెడ్డిగారి కోప సమస్యలను తెలియపఱచెను.

సాయంకాలము సభ ఆరంభమయ్యెను. ఆ సంవత్సరము (1914) శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రి నెమలూరి వెంకట శాస్త్రిగారును ఆ సభకు వచ్చి

---

1. గాడెపల్లి వారి - చమత్కార కవిత్వము. పుట 57

యుండిరి. ఆత్మకూరు సంస్థాన విద్వాంసులు బాలసరస్వతి బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు ఉపద్రష్ట సుబ్రమణ్య శాస్త్రిగారును ఆ సభకు విచ్చేసిరి.

అదే సంవత్సరము (1914) కొత్తగా పిశుపాటి చిదంబర శాస్త్రిగారు కూడ వచ్చియుండిరి. సభ ఆరంభమాయెన్యు ఆశ్రిత కవి కథయ ప్రధానము గావించిన శ్రీ పుల్లగుమ్మి వారు మెల్లగా ప్రకరణములోనికి దింపి రెడ్డిగారిని ప్రోత్సహించ దలచి రాజుగారితో- శ్రీ చెన్నారెడ్డిగారు శతావధానుల కంటెను గొప్పవారను ప్రశంసను దెచ్చి తాము సిద్ధము గావించిన ప్రశ్న పత్రమును రాజు గారికి జూపి వారి యనుమతి తీసికొని కవీశ్వరులతో- రాజుగారు కొన్ని ప్రశ్న లిచ్చుచున్నారు సమాధానము లీయవలెనని ప్రశ్నలను దెల్పిరి. అట్టివానిలో గల కొన్ని సమస్యలు

1. కేశాద్యగ్రాఙ్ఘులన గగిరి పాషండుల్,
2. పీఠ్వజును మగని యెనని వివేకికి తెలియదున్,
3. శార్ఙ్గ్యం త్రికునస్మరణ వలన సద్గతి గల్గున్,
4. గరుడుడు గణపతికి తండ్రి గానవలె సుమ్మీ,
5. పాపమ్మా! దానిమగడు పని సరిగాదా,

ఇందు చివరి సమస్య 'సరిగమ పదనిస' యను సప్త స్వరములతోడనే పద్యము పూర్తిగావింపవలెనని నియమము జేసిరి.[1]

ఈ సమస్యలను సమకూర్చినది శ్రీ ఉపద్రష్ట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు. సమస్యలను విన్న వెంటనే ప్రాసలు లేని అర్ధసామ రస్యము కుదరని యిట్టి సమ స్యల నిచ్చిన వారు సయితము పూరింపవలసి యుండునని సభలో వాదోపవాద ములు చెలరేగినవి చివరకు వాదములేల? శార్ఙ్గ్యం త్రికునస్మరణ వలన సద్గతి గల్గున్, అను సమస్యను పూర్తిచేయుదని శ్రీ పుల్లగుమ్మి వేంకటాచార్యులు తెల్పిరి. అయినను శాస్త్రి ప్రభృతులు దీనికి కూడ ప్రాసలు లేవు కావున దీనిని తీసివేయవలసినదని చెప్పిరి. కాదు వ్రాసి తీర వలసినదని పలుకగా కొందరు నొకే ప్రాసతో వ్రాసిరి. ఒకే ప్రాస కూడదని ఆక్షేపించగా, ప్రాసలేని దాని నాక్షే పించిన నేమగునని కవీశ్వరులు వాదులాడుచుండగా, ఇంతలో చెన్నారెడ్డిగారు

---

1. మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి-గారెపల్లి వారి కవితా విలాసము. పుట 61

కొంచెము వ్రాసినారని చెప్పిరి. ఏది? చదువుమని ఆచార్యులవారనగా శ్రీ రెడ్డి గారు తాను వ్రాసిన సమస్య పూరణము నిట్లు పద్యమున చెప్పిరి.

కం॥ భర్గ్యాభ కుచలకైనను
భర్గాధిక జటులకైన......
శర్గ్యాధిక....... ... ...
శార్గ్యాం ఘ్రిస్మరణ వలన సద్గతి గల్గున్. [1]

అది వినిన తర్వాత సభలో కొందరు భేష్ భేష్ అని చప్పట్లు కొట్టిరి. శతావధానులు గూడ వ్రాయలేని దానిని తాను వ్రాసితినని రెడ్డిగారా సంతోషమును పట్టజాలక ఆశువుగా నీ పద్యమును చెప్పిరి. శ్రీ గద్వాల పురాగతాఖిల కవి శ్రేష్ఠాళి జుట్లెల్లనే నూగం జేసితి, బట్టి యూచితినొహోహో, అని చదివిరి. ఆ మాట విని శ్రీ పిశుపాటి చిదంబర శాస్త్రిగారు లేచి కవుల జుట్టు పట్టి యూచితివా? ఈ యధికార మెవరిచ్చిరి? ఇది రాజసభయా? మఠమైనా? దేనితో నీవు పోటీ పడుదువో రా రమ్మని ప్రతిజ్ఞ జేసిరి. అపుడు రాజుగారు కలుగజేసికొని యిట్టి అధిక ప్రసంగము సభలో చేయరాదని రెడ్డిగారిని మందలించుటయు జరిగినది.

ఇటుల నాటి సభలలో కవులను, పండితులను యుక్తి ప్రయుక్తులతో తమ తమ శక్తి సామర్థ్యములను బాహాటముగా ప్రదర్శించుట- రాజులను మెప్పించి వారిచే సత్కారములు పొందుట, ఆసంస్థాన కాలములలో పరిపాటి. 'స్పర్థయా వర్థతే విద్యా' అనునట్లు రాయకాలము నాటి నుండియు ఇట్టివి సభలో జరుగు చుండెడి వనుట కానాటి చరిత్రలే నిదర్శనములు. కాని ఇట్టివి జరుగుచున్నప్పటి కిని కవులు పండితులు వారివారి దూషణ భూషణాత్మక ప్రతిభలను నిండు సభలలో వెల్లడించినను, ప్రభువులు వదాన్యులు, రసికులు, కావున వారు సభలోనే మన్ననుశాంతముతో స్వీకరించినట్లానాటి చరిత్ర నొకమారు చూచిన తేటతెల్ల మగును. దానిచే ప్రజలలో- సభికులలో ఆనందోత్సవలు వెల్లుబుకుచుండెడివి కవుల పండితుల విజృంభణములు సభల వరకే మఱల అందరును కలిసి మాట్లాడు కొనుట, పాండిత్య ప్రతిభలున్న వారి నాదరించుట ఆనాడేమి ఈనాడుమ పరిపాటియే.

---

1. గాడెపల్లి వారి - చమత్కార కవిత్వము. పుట 62

తిరుపతి వేంకటకవులు శ్రీరామభూపాలుని యనంతరము చిన్న సీతారామభూపాలుడు పట్టాభిషిక్తుడైనపుడుద్దేశించి 'కవులేతెంచిన గారవించుచు వారలిడు నాశీర్వాదముల్గొంచు నిత్యవిభూతిం ధరనేలుమయ్యా, నీ లీలన్ కవులెల్లజూచి' మున్నగు పద్యములు చెప్పిరి.[1]

ఈ సీతారామభూపాలుని కాలము గద్వాల చరిత్రలో నొక స్వర్ణయుగమని చెప్పవచ్చును. మహారాజు గావించిన పండిత సత్కార కవిపోషణ కళారాధనముల సాధారణములు. కవులీ ప్రభువును 'ఆంధ్రభోజుడ'ని వర్ణించినారు. గద్వాలకు 'విద్వద్గద్వాల' యని పేరు ఈ ప్రభువు కాలముననే సార్థకమైనది. వీరి కళాభిరుచి అపారము, త్యాగము నిరుపమానము. పూర్వకాలమునుండి వచ్చిన కవిపండిత విద్వత్సభలు వీరి కాలమున పతాకస్థాయి నందుకొన్నవి. ఈ గద్వాల విద్వత్సభలకును, ఈ పద్ధతి మీదనే జరుగుచుండిన ఆత్మకూరు, వనపర్తి విద్వత్సభలకు నొక విశిష్టత యాకాలమున నుండెడిది.

గద్వాలలో ప్రతి సంవత్సరము కార్తీకపూర్ణిమకు వేదశాస్త్ర పండిత విద్వత్సభలు మాఘ పూర్ణిమకు కవిగాయకుల సభలు జరుగుచుండుట ఆచారము ఈ సభలకు వచ్చి సత్కారములు పొందుటకు ఒక కొలతయనునదేమియును లేదు. పూర్ణ పండితులు మహా కవులు మాత్రమే రావలయునన్న నియమము లేదు. ఆయా విద్యలలో కొద్దిపాటి ప్రవేశమున్నవారు కూడ రావచ్చును. అయితే వారికి యథార్హముగా బహుమతులు లభించెడివి. ఇదియొక ప్రోత్సాహక పద్ధతి.

ఇట్టి ప్రోత్సాహముతో గొప్పవారికి వేయినూటపదార్లనుండి యిరువది రూపాయల వఱకు బహుమానములనిచ్చుట యాచారముగా నుండెడిది. అందువలన పిల్లకవి పండితులకు మహాకవి పండితుల ప్రతిభా విశేషములను గుర్తెఱుగుటతోపాటు తమ విలువ యెట్టిదో, తామింకెంత కృషి చేయవలయునోయను విషయమునుకూడ వారు తెలిసికొనుట కవకాశములుండెడివి.

గద్వాల కార్తీక సభలకు వేసమందు ఘనాపాఠీ లక్షణ పాఠీలతోపాటు కొద్దిపాటి వేదమంత్రములు నేర్చినవారను తర్క-వ్యాకరణ వేదాంతాది శాస్త్రములందు పరిపూర్ణులైన పండితులతోపాటు శాస్త్రములప్పుడప్పుడే యారంభించిన

---

1, తిరుపతి వెంకటకవులు - నానారాజ సందర్శనము, పుట 36

వారు సయితము సభలకు వెళ్ళుట కవకాశముండెడిది. ఏ కొద్దిపాటి చదివిన
వారికిని నచట యథోచిత సత్కారములు లభించెడివి.

ఆదేవిధముగా మాఘపౌర్ణిమకు జరుగు సభలకు మహాకవులు, గ్రంథ కర్తలు, శతావధానులు, అష్టావధానులతోపాటు ఒకటి రెండు పద్యములు మాత్రమల్లగల కవిమాత్రులును, మహా సంగీత విద్వాంసులతోపాటు భజన కీర్తనల వంటివి పాడగల్గినవారును, ఇతర కళలయందు ప్రజ్ఞ గలవారును కావ్యనాటకాదులను చదివినవారును వచ్చుటకవకాశముండెడిది. అందువల్ల కార్తిక పూర్ణిమకును, మాఘపూర్ణిమకును వేలసంఖ్యలో పండిత కవిగాయక బృందములు గద్వాలలో కనబడుచుండెడివి. వచ్చినవారందరికిని సాహిత్యము (బియ్యము, పప్పు. మొ॥ పదార్థములను) ఆ సంస్థానము వారిచ్చెడివారు. ఆ మహాజన మహావిద్వాంసుల కవిగాయక జనసందోహమును జూచుటయే నాటి గద్వాల ప్రజలు మహాభాగ్యముగా తలంచెడివారు. శ్రీ సీతారామభూపా లుడు అంతటిభక్తి ఉత్సాహములతో ఆ సభలను నడిపెడివాడు. పండితుల యిందును భక్త, కవి, గాయక బృందములయందు నాసక్తి ప్రభువునకధికముగా నుండుటయే దీనికిగల కారణము.

వీరి కాలమున కార్తీక సభలకు కావ్యకంఠ గణపతిశాస్త్రి, ధూళిపాళ సీతారామశాస్త్రి. కాశీ కృష్ణమాచార్యులు, గోపాలపేట రాఘవాచార్యులు, ఆచార్య రంగాచార్యులు, వెల్లాల సదాశివశాస్త్రి (తర్క-వ్యాకరణపండితులు), బులుసు అప్పన్నశాస్త్రి (తర్కపండితులు), సాహిత్య అకాడమి బహుమతి గ్రహీత వేమూరి రామబ్రహ్మశాస్త్రి, కాశీ వఝ్ఝల సత్యనారాయణశాస్త్రి, సుబ్రమణ్యశాస్త్రి, పిశుపాటి చిదంబరశాస్త్రి మున్నగు వారెందరో వచ్చి ప్రభువుల నాశీర్వదించి సత్కారములను పొందెడివారు.[1]

సీతారామభూపాలుని సభను కన్నులార గాంచిన శ్రీ తిరుపతి వేంకట కవులా నాటి సభను గూర్చి చెప్పినదీ పద్యము.

సీ॥ సామంతలాజన్య సంఘంబులొకవంక
నొకవంక రాజబంధూత్కరంబు

1, కేశవపంతుల నృసింహశాస్త్రి - సంస్థానముల సాహిత్య సేవ. పుట 33

తులలేని మంచి యుద్యోగస్థులొకవంక
నొకవంక దివ్యవైణిక గణంబు
శాస్త్రమర్యాదా విశారదులొకవంక
నొకవంక గాంధర్వ యువతిచయము

... ... ...

నిండు పేరోలగమ్మునుండి కొలువ, మేలుగా
నేలుకొనుము గద్వాల (భూప) పురము.[1]

శ్రీ సీతారామ భూపాలునకు కవులన్న ఎంతో ప్రేమ. ఈ పండిత మండలిని సత్కరించి మహాద్వారము నుండి పంపునపుడు వారి వారి పాదముద్రలు పడునట్లు తెల్లని వస్త్రములను పఱచియుంచి వానిపై బడిన ఆవిద్వత్పాదధూళి నొకచోట చేర్చి బాగుచేసి కుంకుమభరణివంటి వానిలో భద్రముగా నుంచి ఏడాది పొడుగున నీ రాజకుటుంబము స్నానము చేసి తిలకమును ధరించుటకు ముందు దానిని నొసట ధరించెడివారు.[2]

ఇట్టి భక్తి, సరస్వతీపూజ, విద్వజ్జన పోషణ మెచ్చటను లేదు. ఎచటను కన్పడదు జంటకవులు ప్రభువులభక్తి ప్రపత్తులను గాంచి చెప్పినదీపద్యము.

మ॥ కవులే తెంచిన గారవించుచు దదుద్గ్రంథమ్ములన్ గొంచు త
ద్వివిధార్థమ్ములు వించువారలతిప్రేమన్ గనుంగొంచు మం
చి వివేకంబలరార వారలిడు నాశీర్వాదముల్ గొంచు ని
త్య విభూతిన్ ధరనేలుమయ్యయిక సీతారామభూపాలకా.[3]

శ్రీ ఆదిపూడి ప్రభాకరరావుగారు అస్థానకవులై ప్రభువు వెంటనుండి విశేష గౌరవమును పొందిరి వీరు గద్వాల ప్రభువుల వితరణగుణమును గూర్చి వ్రాసిన పద్యము లసంఖ్యాకములు. సీతారామభూపాలుని వెంట పులి వేటకై వెళ్ళి కన్నులార గాంచిన యా వేటను ప్రభాకరరావు 'పౌండరీకము'

1. తిరుపతి కవులు - నానారాజ సందర్శనము. పుట 37
2. కే. నృసింహశాస్త్రి - సాహిత్య సేవ (వ్యాసము). పుట 33
3. తిరుపతి కవులు - నానారాజ సందర్శనము. పుట 36

అను పేర కావ్యమును రచించెను. ఇది ఒకే అశ్వాసముగలది. వీరి ఇతర గ్రంథములను గూర్చి ముందు ప్రకరణములలో వివరించబడినది.

## సమస్యలు - సమాధానములు (పూరణములు)

సభలలో నిచ్చు సమస్యలు కడు విచిత్రములు. సమాధానములుకూడా అటులే కన్పడును. అదియొక వింత. గద్వాలలో సీతారామభూపాలుని దివాను (మంత్రి) ఆదిపూడి ప్రభాకరరావుచే నిప్పించిన సమస్య పరిశీలించినచో నాటి సమస్యల వింత తీరు తెలియనగును

"తురకలు సంధ్యవార్తురట తోయములీయ వెతోయజేతణా"
దీనికి గాడేపల్లి వారి సమాధానము (పూరణములు).

చ॥ ఖరుడనవొప్పి తాపజనకంబగు వర్తనతోడ వార సుం
దరి గవఁ గూడి రాతిరి నితాంతము కాంతి విహీనుడై ప్రభా
కరుడరుదెంచెనింక జులకఁ బనిలేదని బోడిబోడి యీ
తురకలు సంధ్యవార్తురట తోయములీయవె తోయజేతణా॥ 1

ఇది యిచ్చినవారికే ఎదురుదెబ్బ తగిలిందని ఇక్కడ గమనింపవలసిన విషయము. ఇందలి రహస్యము శబ్దశక్తి మూలకము నాటి పరిస్థితియు నట్టిది. అది కనుగొనిన ప్రభువు దీనినే భగ్యంతరముగా జెప్పుడని కవులను గోరెను. అపుడు శాస్త్రిగారు చెప్పినదీ పద్యము.

చ॥ తిరుగుచునేగుదెంచిరి విదేశ్యులు విప్రులు వేదశాస్త్రముల్
లపరిచయమున్నవారు మన పంచను జేరిరి ప్రొద్దుగ్రుంకె నీ
పురమున నొండు తావునకు బోజన దిచ్చటివార లెల్లరు
న్తురకలు, సంధ్యవార్తురట తోయము లీయవె తోయజేతణా॥

శ్రీ పిశుపాటి చిదంబర శాస్త్రిగారు కీ॥ శ॥ 1920 లో గద్వాలకు వచ్చినపుడు వారిని పరీక్షించుటకై యిచ్చిన పదునాలు సమస్యలలో నొకటి ఇట్లున్నది.

1. గాడెపల్లి వారి - కవితా విలాసము. పుట 126

'పండితుడెందులకు బనికివచ్చునృపాలా!

దీనిని గుఱించిన గాధ కొంత యున్నది. 1920లో శ్రీ శాస్త్రిగారు గద్వాలకు వచ్చినపుడు వారిపైగల అసూయచేత కొందరు ఆయనను సగౌరవముగా పంపరాదని ఉపద్రష్ట సుబ్రమణ్యశాస్త్రిగారిచే ముందుగానే కొన్ని క్లిష్ట సమస్యలను పదునాఱింటిని సిద్ధము చేయించి సభ మధ్యాహ్నము ఒకటినుండి రాత్రి ఏడుగంటలవఱకని కాలనిర్ణయము జేసిరి సభలో అచటనున్నవారందరును పాల్గొనవచ్చునని చెప్పి ఈ సమస్యలనిచ్చిరి. శ్రీ పిశుపాటివారు పదునైదింటిని పూరించేవఱకు రాత్రి ఏడుగంటలు కావచ్చినది ఇక మిగిలినది 'క్రీష్టుడు సర్వపూజ్యుడని కిన్నరులే వచియించిరెంతయున్' అను సమస్య. దానిని కూడ పూర్తిగావించుడని అపుడు సభలోనున్న వేదం వేంకటరాయశాస్త్రి పరీక్షకులు పట్టుబట్టిరి. అంత చిదంబరశాస్త్రిగారు- 'శ్రేష్టులయందు, అని ఉపక్రమించిరి జిగీషా ప్రధానముగా నడుచుచున్న పరీక్ష గనుక ఆక్షేపించుటయే ప్రధానముగా వేదంవారు ఇక్కడ సప్తమి ఎందుకని ప్రశ్నించిరి. పద్యము ఎత్తుగడలోనే యాక్షేపణ జేయగా శ్రీ చిదంబరశాస్త్రి ఉడుకురక్తంతో 'కం విధానసప్తమీ? యని ఎదురుప్రశ్న వేసెను క్రమముగా అది వివాదముగా పెరిగిపోయెను. ఆ సమయమున గాదేపల్లి వారు శతావధానులకిచ్చిన సమస్యలలో నొకటియగు పై సమస్యనిట్లు పూరించిరి

కం॥ కొండొక సభలో విద్య
ద్ఖండనమున సప్తమీపిభక్తి యనిన నె
ట్లుండునో యెఱుగని యీ మీ
పండితుడెందులకు బనికివచ్చునృపాలా.

అని సమాధానముగా చెప్పెను. ఇటులాకవులూ ఆనాటి సభలలో నెన్నియో సమస్యలు- సమాధానములు చెప్పి ప్రభువుల నానందింపజేసెడివారు.

మరికొన్ని సమస్యలు—

'కుటిలాలక ఎడమకన్ను కుడికన్నాయెన్' పీర్వజునుమగనియెనని వివేకికి తెలియున్, సీతకు కృష్ణమూర్తిపయి జెందిన ప్రేమయెదెచ్చె దుఃఖముల్ మున్నగునవి గద్వాల సభలలో ఇచ్చినవి.

గాడేపల్లి వారు గద్వాలలోనుండి అవధానములు- ఎన్నియో సమస్యలు- పూరణములు ఆయా పండితుల ఎదుట గావించి చాలాకాలము ఆస్థాన కవిగా నుండిరి. క్రీ. శ. 1971లో ఒంగోలుజిల్లా దర్శి తాలూకా పోలేపల్లి అగ్రహార మునకు జెందిన మేడవరము సుబ్బరాయ యువకవి రాఘవశాస్త్రిపై తనకుగల భక్తిభావముతో గ్రామ్యజనులనుకొనెడిభాషలోనె పద్యమును చెప్పెను.

ఉ॥ రాఘవశాస్త్రులోలదుగొరా! అదెసూడి పెబంతమాసి, బా
లాఘవమంట కైతలో, సెలాకు పరీచ్చుట బుద్ధిమేదయే
మో! గడెకొక వొచ్చకము ఉన్నయెవుండి రచిస్తడంట
ఆ గదవాలకాడ పెదపెద్దపెసంగము సేస్తడంటరా.[1]

గద్వాల మాఘపూర్ణిమ సభలకు శ్రీ కేశవస్వామి బ్రహ్మోత్సవములు తోడై ఆ సంస్థానమున కెనలేని శోభను చేకూర్చుచుండెడివి. కవులు గాయకులు చిత్రకళా ప్రవీణులు, దేవదాసీ బృందములు, నాటక కళానిపుణులు మొదలైన వారందరును మాఘ పూర్ణిమకు వచ్చెడివారు. ప్రభువులు పూర్ణిమనుండి మూడు రోజులవఱకు వచ్చినవారి కవితలను, గానములను విని మాఘబహుళ చవితి పంచమి తిథులలో వారిని సత్కరించెడివారు.

పాతవారికి జాబితా (రిజిష్టరులో చిరునామతోసహా వారికి నిర్ణయించిన బహుమానము) లుండెడివి. వాని ప్రకారము ద్రవ్యము పంచుటయేగాని మఱల విద్యాప్రదర్శనము లుండెడివి కావు. క్రొత్తగా వచ్చిన వారికే ప్రదర్శనా వకాశము. అటుల వచ్చినవారిని 'నవీనుల'ని వ్యవహరించిరి.

శ్రీ సీతారామభూపాలుని కాలమున విశేష సత్కారములును, వేయి నూట పదార్లను పొందినవారిలో శతావధాని అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రి, వేదం వేంకటరాయశాస్త్రి, శతావధాని గాడేపల్లి వీరరాఘవశాస్త్రి, శతా వధాని నెమలూరి వేంకటశాస్త్రి, ఆదిపూడి ప్రభాకరరావు మొదలగువారుండిరి.

ఒక్కొక్క ప్రభువున కొక్కొక్క కార్యమందలి ఆసక్తిచే సంస్థాన గౌర వము పెంపుచేయుట జరుగును. అన్ని సుగుణములు నీ ఒక్కరియందే యున్నవని

1. మేడవరం సుబ్బరాయ కవి.

తెల్పుచు గద్వాల ప్రభువుపై ఆదిపూడివారినిధముగా పద్యమున 'విద్యయును బుద్ధియును సిరిపెంపుబలము నీ ప్రజాళికి దయజేసి నెగడుమయ్య' అని నుడివెను.

ఆంధ్రదేశ ఆస్థానకవిగానున్న కళాప్రపూర్ణ కాశీ కృష్ణమాచార్యులు ప్రభువును దర్శించి 'శబ్దము లస్మదీయములు ఖ్యాధవ యర్థములెల్లమీవి' అని శబ్దశ్లేషతో పద్యమును చెప్పి అతని నానందపఱచిరి, ఆచార్యులు- 'పాలన జేసివాడు సురభాషను మాత్రమే తొల్లి భోజభూపాలుడు...అశేషబుధప్రకరంబు దేశదేశాల నుతింపగా వినుచు చయ్యననిస్గన వచ్చినాడ' నని ప్రభువుతో పల్కెను. ప్రభువు సంతోషించి ఇస్నూటపదార్లచే, సంస్థాన మర్యాదలచే నాచార్యులవారిని తృప్తి గావించెను.

శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారి ఆశుకవితా ప్రదర్శనమునకు ప్రభువు ముగ్ధుడై మూడుమాసములు శాస్త్రిగారిని గద్వాలలో నుంచికొని మూడువేల రూపాయలతో సత్కరించి పంపించిరి. అట్టివదాన్యుడీ ప్రభువు.

ఈ మహారాజుగారు హైదరాబాదులో చండీయాగము చేయగా నీ శాస్త్రిగారు యాగనిర్వహణ సమయమున ఈ ప్రభువుల 'ముష్టిపల్లి' వంశము నిట్లు చమత్కరించిరి.

శ్లో॥ ముష్ట్యర్థ మాగతాన్విప్రాన్ దృష్ట్వాపల్లీర్దదుదుపురా
తదాది ముష్టిపల్లీతి ప్రథామేతిత్వదన్వయః॥

ఆంధ్ర పద్మపురాణ కర్తలు అష్టావధానులు శ్రీ పిసుపాటి చిదంబరశాస్త్రిగారు క్రీ. శ. 1920 లో ప్రప్రథమమున గద్వాలకు సీతారామ భూపాలుని కాలమున వచ్చిరి. వీరి జన్మస్థలము గుంటూరు మండలములోని కరుది గ్రామము. వాణీ కటాక్షమున వీరు గద్వాల కాశీ శృంగేరి మున్నగు చోట్ల తటస్థించిన వివాదములలోను, పరీక్షలలోను విజయములను చూరగొనిరి. ప్రథమ దర్శనమున గద్వాల ప్రభువున కాశువుగా కొన్ని పద్యములు విన్నవించుకొనిరి. అందులోనొక పద్యమిటులున్నది.

ఉ॥ ప్రాసము దప్పకుంట యతిభంగము వాటిలకుండ నర్థవి
న్యాసము నాగకుండగ మనమ్మగ గణమ్మగ తొలంకకుండ ను
ల్లాసముతోడ నాశు కృతులన్ రచియించుచునుండు పట్టులన్
వ్రాసెదనంచు బూనుకొనువానికి జేసెదశృంగ భంగమున్. [1]

ఆ మరునాడు గద్వాల సభలో శాస్త్రిగారికి కొన్ని కఠిన సమస్యలీయబడెను. శ్రీ శాస్త్రిగారు వానిని పూరించి ప్రభువును సంతోషపఱచిరి. ఒక మాఘ పూర్ణిమకు హైమవతియను వేశ్య గాన సభగావించి ప్రేక్షకులను ముగ్ధులగావించెను.

శాస్త్రిగారామె గానము ముగిసిన వెంటనే ఆశువుగా ఈ క్రింది పద్యమున నామె నభినందించెను

ఉ॥ కమ్మని తేనెలొల్కగను గానము జేసితివద్ది శ్రోత సా
ఖ్యమ్మన గూర్చి యున్నయది యైనను కొందరు మెచ్చరేమో ఏ
నిమ్మని యెట్టులుండినను నే నిజమాడెద నీ ముఖేందు బిం
బమ్మున కీయవచ్చు శత పద్యములైన కురంగలోచనా.

ఈ మాటపై పసుపురాటు భుజంగారెడ్డి యను కవి రాజ సన్నిధిలో వేశ్యను వర్ణించరాదని ఆక్షేపించెను దానికి శాస్త్రిగారు- ఈ వుభుజంగ నామము. అని ఆశువుగా పద్యమును జెప్పిరి. దానిపై రెడ్డికవి మఱికొన్ని ప్రసంగములు తెచ్చి ఆశువుగా పద్యములల్లుటయు దానికి శాస్త్రిగారు సమాధానమిచ్చుటయు జరిగినది. రెడ్డిగారాశు కవితలో సమాధానమిచ్చుటకు తడబడుచుండగా శాస్త్రి-

క॥ తడబడెద వేల యాశువు
నుడువుటకై పూనుకొని ఘనుల్ గల సభలో
గుడి ఎడమ లేదే? సింహము
కడనా! హరిణముల కుప్పింగంతులయాటల్. [2]

---

1 - 2. శ్రీ పిశుపాటి చిదంబరశాస్త్రి-ఆంధ్రపద్మ పురాణము. పీఠిక: పుట 3-4.

అని శాస్త్రిగారు-

కవులమను గర్వమున కన్నుగానకుండ
నిన్న మొన్నటిదాక ననేక గతుల
సంచరించితిరికమీద సాగబోవు
వచ్చియున్నాడు శ్రీ చిదంబరుడు నేడు.

అని ఆశువుగా పలికిరి. ఆయన వాగ్ధోరణి కాగజాలక శ్రీ భుజంగా రెడ్డి అతనిని క్షమింపుమని గోరెను. శాస్త్రిగారు ప్రసన్నులై - 'తరతమభావము దెలియక చరియించిన కతననింత జరుగగ వలసెన్' అని పలికిరి. ఇటులానాటి గద్వాల సభలు విజయములతో జయప్రదములగుచుండెడివి.

క్రీ. శ. 1924 లో ఆదిపూడివారు ఒకానొక కవిని దృష్టియందుకొని ప్రభువునకు విజ్ఞాపనము గావించుచు 'లోకమున కవులెందరో యుందురనియు వారి యాశీస్సులకు తన పద్యము రక్షగానుండునని తెల్పుచు-' తిక్కతిక్కగ కూయుకుత్సితపు కవులు నీకు దూరాన నుందురు గాక భూపయని తన యభిమానమును జూపెట్టెను.

శ్రీ పిశుపాటివారు రెండవమారు (1934లో) గద్వాలను సందర్శించి నపుడు సీతారామ భూపాలుడు- మీరు వచ్చుట మాపూర్వ సుకృత విశేషము, అని చిదంబర శాస్త్రిగారితో ననిరి. ఆ మాటచే శాస్త్రిగారాస్థాన విద్వాంసులను కించపరచునటుల మాట్లాడుటయు జరిగినది. దానికి ఆదిపూడివారు మనసు నొచ్చుకొనిరి.

ప్రభువు శ్రీ చిదంబరశాస్త్రిగారి ఆశుకవితామృతమును మొదట గ్రోలి నందున మరల వచ్చినపుడు కూడ శాస్త్రిగారిని గౌరవించెను. ఆ గౌరవము సంస్థానమున ఉన్నతోద్యోగిగా నున్న ఆదిపూడివారి కసూయంజకమైనది. కావున అతడు శాస్త్రిగారి కనకమానము ఘటింపనెంచి తేది 20-4-1924 పగలు 10 గంటలకు శతావధానము ప్రారంభమగునని ప్రకటించెను. కాని శాస్త్రిగారు రాజు నిద్రించియుండుటచే కాబోలు పగలు మూడు గంటలకు శతావధానమును ప్రారంభించిరి ఆనాటి అవధానము రాత్రి మూడు గంటలవరకు జరిగినది. ఎనుబదినాల్గు మంది పృచ్ఛకులచే ప్రశ్నలు ఇయ్యబడెను తన కవమానము జేయు విషయమును గుర్తించినను శాస్త్రిగారు ప్రశ్నలకు తగు సమాధానము

లిచ్చుచునే యుండిరి. శాస్త్రిగారివిషయమును రాజుగారికి తెల్పినను ప్రభువు ఆ పని అంతయు ప్రభాకరరావుపై నుంచి దానిని గూర్చి ఆలోచించెదనని తెల్పి సభ చాలించెను.

మఱునాడు సమాధానము రాక సభను చేయించనందున శ్రీ శాస్త్రిగారు కేశవస్వామి సన్నిధిలో పదునాల్గు పద్యములు వ్రాసి స్వామికర్పించిరి. రాజుగారి రిజిష్టరు లేఖలో శాస్త్రిగారు కొన్ని ఆశు పద్యములను వ్రాసి ప్రభుసన్నిధికి పంపిరి. అట్టివానిలోగల నొక పద్యము.

క॥ సుకవిని సన్మానించుట
సకలమునకు గౌరవంబు సలుపుట యెనుమీ
సుకవిని ననాదరించుట
సకలమున కనాదరంబు సలుపుటయె నృపా. 1

అటుల పద్యములు వ్రాసి పంపుటచే ప్రభువున కాగ్రహము వచ్చినదనియు నిచటనున్నచో గొప్ప చిక్కులు వచ్చుననియు రాజుగారి మేనమామ, విద్యత్పక్షపాతియగు సమరవాయి తిమ్మారెడ్డిగారు తెల్పగా శాస్త్రిగారు కేశవస్వామికి తన విన్నపము తెల్పికొని ఆదోనికి జయలుదేరి వెళ్ళిరి. శ్రీ శాస్త్రిగారి మనస్సు చాలాబాధావహమైనది. ప్రభువును గూర్చి శాస్త్రిగారు ప్రభువుకు వ్రాసిన లేఖకు ప్రత్యుత్తరముగా ఆదిపూడివారు ప్రతిలేఖ వ్రాసిరి 2

శ్రీ సీతారామభూపాలుడు నెల రోజులు జ్వరముతో బాధపడి 5-5-1924 హైదరాబాదులో స్వర్గస్థుడయ్యెను. ఆ వార్త విని శాస్త్రి (చిదంబరశాస్త్రి) గారి శ్లోకమును వ్రాసిరి.

శ్లో॥ ఆమోఘవాగ్ర్భహా మనః క్లేశసంజనితే నవా
దైవ శాపేననాకర్మ పరిపాకేన వావునమః!
సన్నిపాత జ్వరాక్రాంత స్తదారభ్య మహీపతిః
ఏకమాసాంతరే కాలే కాలధర్మము పాగతః!! 3

---

1. పిశుపాటి చిదంబరశాస్త్రి: ఆంధ్ర పద్మపురాణము. పుట 3.
2. ఆదిపూడివారి. గద్వాల ప్రభాకరము - ప్రతిలేఖ పుట 54.
3. పి. చిదంబరశాస్త్రి. దేశయాత్రా చరిత్రము (పద్మపురాణము). పుట 4.5.

దీని వెనుక నింత చరిత్ర యున్నది. నాటికిని నేటికిని కవులలోను, పండితులలోను, ఏలకో పరస్పరము మచ్చరము? కావుననే చేమకూరి వారు ప్రగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే గదా, యని వాపోయినారు. చెట్టు పెరిగినకొలది నీడనిచ్చుట సహజ ధర్మము. అట్లె విద్య పెరిగిన కొలది విశాలదృష్టి యవసరము. అది లేనిచో విద్య రాణించదు. రాణించినను మత్సరముండక తప్పదు.

## రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు: (1946-49)

శ్రీ చిన్న సీతారామభూపాలుని యనంతరమతని భార్య రాణి ఆదిలక్ష్మి దేవమ్మగారు భర్తగారి కీర్తికి భంగము కానీయక ధర్మకార్యములను, విద్వత్స లను కవిపండిత పోషణమును నిర్వర్తించిరి. ఆమె యథాపూర్వకముగా సాహిత్య సేవను కొనసాగించినది. సీతారామభూపాలుడు స్వర్గస్తుడు కాగా ఆదిపూడివారు అల్లసానిపెద్దన వలె వాపోయినారు ఒక్క నిముసంబు గానక యున్న వేయి సార్లు పిలిపించి పలికించు జనకుడేగ. నెట్లు బ్రిదుకుదు దిక్కు నాకెవ్వరింక, ప్రాణమా! ఏలపోవు నీ ప్రభుని వెంట, యని కన్నీరు కార్చినారు. 1

ఈ మహారాణి కాలమున బులుసు అప్పన్నశాస్త్రి పుల్లగుమ్మి వేంకటా చార్యులు మేడవరం రంగనాధ సిద్ధాంతి మున్నగు పండితులేగాక పోకూరి కాశీ పత్యవధానులు, గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధాని, సహస్రావధాని జంధ్యాల వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, చెమికల చెన్నారెడ్డి, పెద్దమందడి వేంకటకృష్ణకవి మున్నగు కవులు- పురాణం కనకయ్య మొదలుగాగల సంగీత విద్వాంసులు ఆస్థానకవులుగాను, పండితులుగాను వ్యవహరించినారు.

ఈమె కాలమున జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సహస్రావధానము సభాభవనమున జరుగుచుండెడిది గాడేపల్లివారికిచ్చిన సమస్యలు- 'తలకాయల పులుసుద్రాగి తనిసిరిబాపల్' 'చనుబాలిచ్చి సుఖంపజేసె రతిలో చంద్రాస్య పాళిశ్వరున్' మున్నగాగల సమస్యలెన్నియో గలవు. శాస్త్రిగారు వాటిని పూరించి అద్భుతమగు అశువును జెప్పి సీతారామభూపాలుని కాలమునందే గాక అతని భార్య రాణి ఆదిలక్ష్మి దేవమ్మ కాలమునందును సభాగౌరవమును పొంది

1. ఆదిపూడివారి- స్వర్గలేఖ (గద్వాల ప్రకారము). పుట 40.

ఆస్థానకవులై యుండిరి. శ్రీ జంధ్యాల, గాడేపల్లి వారిరువురును గద్వాల సంస్థానములో నీ రాణిగారి కాలమున పరీక్షకులై యుండిరి.

శ్రీ పోకూరి కాశీపత్యవధానులు ఆశుకవితాధురీణులు. ఇతడు సారంగధరీయము, హరిశ్చంద్రోపాఖ్యానము (అచ్చతెలుగు) మున్నగు గ్రంథములను రచించి రాణిగారి ధనసహాయమున అచ్చు వేయించి ప్రకటించెను. ఈ గ్రంథములు చిన్న సోమభూపాలుని పేర రాణిగారి కోరికపై అంకితము గావింపబడినవి. ఇతని సారంగధరీయము మూడర్థములు- (పార్వతీ కల్యాణము - తారాశశాంక పరిణయము - సారంగధర చరిత్ర) జోడించి రచించిన గ్రంథము. ఈ మహా రాణిగారి కాలమున శ్రీరామ నరసింహమూర్తి కవులు శ్రీమదాంధ్రభాగవతమును, కొప్పవరపుకవులు వేదం వేంకటరాయశాస్త్రి కాళీ కృష్ణమాచార్యులు కారంపూడి రాజమన్నారుకవి పిశుపాటి చిదంబరశాస్త్రి సన్నిధానం సూర్యనారాయణశాస్త్రి (తత్వవంచంద్రిక) వంటి అనేకులు కవులు - గ్రంథకర్తలు రాణీగారి ధనసహాయమున అచ్చువేయించి ప్రకటించుకొనిరి.

ధర్మవరం కృష్ణమాచార్యులు 1843, 1910, 1912 సంవత్సరములో గద్వాలకు విచ్చేసి ప్రభులచే ఆంధ్రనాటక పితామహ, యను బిరుదమును పొందెను, మహబూబ్‌నగర మండలములోని సింగపల్లి గ్రామనివాసులగు శ్రీ సీతారామ సిద్ధాంతి తాను రచించిన జ్యోతిష్య సిద్ధాంత తత్త్వ ప్రదీపిక, యను గ్రంథమును రాణిగారి ధనసహాయముచే అచ్చు వేయించి ప్రభువునకంకితము గావించెను. పుల్లగుమ్మి వేంకటాచార్యుల 'ఆదిలక్ష్మీకర్ణపూరము, సన్నిధానము వారి తత్సిమచ్చ చంద్రిక' మున్నగు గ్రంథములెన్నియో రాణిగారి ద్రవ్య సహాయమున అచ్చువేయించి ప్రకటించబడినవి.

ఈ మహా రాణి కాలమున గద్వాలను దర్శించి సత్కారములు పొందిన వారెందరో గలరు. అట్టివారిలో శ్రీయుతులు నెమలూరి వెంకటశాస్త్రి శతావధాని, సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రి మేడవరం రామబ్రహ్మశాస్త్రి [జగన్నాథ పండితరాయ విరచితభామినీ విలాసాంధ్రానువాదకర్త] అనుముల వేంకటశేషకవి శతావధాని విక్రాల నరసింహాచార్యులు, గౌరావజల రామకృష్ణశాస్త్రి శతావధాని శ్రీ రాముల సచ్చిదానందశాస్త్రి జానపాటి పట్టాభిరామశాస్త్రి గుడిమంచి సుబ్రహ్మణ్యశాస్త్రి [భావకల్పక శిరోమణి, బిరుదమును

గద్వాలలో పొందిరి.) తెల్కపల్లి రామచంద్రశాస్త్రి, (సంస్కృతకవి) మల్లాది అమృతరామశాస్త్రి, మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, మేడవరం సత్య నారాయణశాస్త్రి, అవధానం చంద్రశేఖరశాస్త్రి, భట్టుపల్లి రామరాజు శ్యామ రాజు మున్నగు వారెందరో గలరు. వీరుగాక పూర్వము రాజుగారుండిన కాల మున వచ్చినవారును వచ్చెడివారు. అందువలన ఈ మహారాణి కాలమున కవి పండితుల సంఖ్య వేలసంఖ్యలో నుండెడిది.[1] కావుననే దీనికి 'విద్వద్గద్వాల'యని పేరు సార్థకమైనది

నాల్గవ ప్రకరణము

# స్థానిక కవులు - రచనలు

## బోరవెల్లి సీమ:

### మల్లనమంత్రి- చంద్రభానుచరిత్ర:- క్రీ. శ. 1650 (పూర్వార్థము)

బోరవెల్లికవులది చక్కని పండిత వంశము. బోరవెల్లిసీమ గద్వాల సంస్థానములో విలీనముకాక పూర్వమీ వంశీయులు బోరవెల్లి ప్రభువుల పోషణలో నుండి ఎన్నియో గ్రంథములు రచించి ఆంధ్రభాషాసేవ గావించిరి. అట్టివారిలో మల్లనమంత్రిగారొకరు. ఇతడు 'చంద్రభానుచరిత్ర' యను నైదాశ్వాసముల ప్రబంధమును రచించెను. దీని తాళపత్రప్రతి హైదరాబాదునందు గలదు.[1]

## వంశము:

ఈ వంశీయులు ఆరువేల నియోగి కుటుంబమునకు చెందినవారు. వీరిది స్వతంత్ర కపిగోత్రము. ఈ వంశీయులకిలవేలుపు శ్రీ దత్తాత్రేయస్వామి. ఈ వంశీయులలోనున్న బోరవెల్లి నృసింహకవి కాణాదం పెద్దనగారికి బావమరది యగును. ఈనృసింహకవి క్రీ. శ. 1650 ప్రాంతమున 'నృసింహ విలాసము' అను కావ్యమును రచించినటుల తెలియుచున్నది.[2] ప్రస్తుత మీగ్రంథ మలభ్యము. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము హైదరాబాదునందు లభించిన తాళపత్ర 'చంద్రభానుచరిత్ర' ఐదవ ఆశ్వాసముచివర చాంద్రమానేన శార్వరీనామ సం॥ర కార్తీక శుద్ధ పాడ్యమీల వఱకు కుమ్మరి కోదండరాముని గూర్చి వేంకటపతి వ్రాసి యిచ్చినది బోరవెల్లి నృసింహంగారి అనతిప్రకారము 'ద్రౌపదీ కల్యాణము, చంద్రభాను చరిత్ర, పరిపూర్ణం' అని వ్రాసియుండుటచే నీ వేంకటపతి వ్రాయసకాడై యుండును. నృసింహంగారి ఆనతిప్రకారము అతని వంశీయుడగు మల్లనమంత్రిగారి 'చంద్రభాను చరిత్ర' మరియు అతని శిష్యుడు పానుగల్లు దుర్గాధిపతి యగు కుమార వేంకటరాయ ప్రణీతమైన 'ద్రౌపదీ కల్యాణము' ప్రతులను వ్రాసి యిమ్మనెనని వేంకటపతి పై తేదీ వఱకు వ్రాసియుండునని ఆశ్వాసాంతమందలి చివరిమాటవలన తెలియుచున్నది.

---

1. తాళప్రతి- చంద్రభానుచరిత్ర- ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము- హైద్రాబాదు- (Central Library Hyderabad.)
2. కుమార వేంకటరాయలు- ద్రౌపదీ కల్యాణము- ఆ. 1- ప. 49.

ఈ వంశీయులలో ముగ్గురు కవులు గ్రంథములను రచించినటుల తెలియుచున్నది.[1] బోరవెల్లి నృసింహాంగారి శిష్యుడు, పానుగల్లు దుర్గాధిపతియగు కుమార వేంకటరాయలు గురువుగారి ప్రోత్సాహమున 'ద్రౌపదీ కల్యాణ'మను ప్రబంధమును రచించెను.

ఈ రాజకవి తన గురువగు బోరవెల్లి నృసింహాంకవితో నిట్లనెను. మీ పెద తాతగారు 'దత్తన్న' [illegible] అతని కుమారుడు 'కృష్ణప్ప' యయాతి చరిత్రమును రచించెను. చిన్న తాతగారగు 'మల్లనమంత్రి చంద్రభాను చరిత్రను రచించెను. నీవును 'నృసింహ విలాసమును రచించితివి.[2] అని పల్కుటచే నీ వంశీయుల గ్రంథములు తెలియవచ్చుచున్నవి. ఈ బోరవెల్లి నృసింహాంగారి గ్రంథము లభించలేదు. దానికై వెదుకుచుండగా ధర్మయామాత్యుడు రచించిన నృసింహ పురాణము వ్రాతప్రతి యొకటి లభించినది.[3]

## ఇతివృత్తము-చంద్రభాను చరిత్ర:

సత్యాకృష్ణుల సంతానమగు చంద్రభానుడు కుండినపురమేలుచున్న రుక్మబాహు కూతురగు కుముదినిని వివాహమాడుట ఇందలి యితివృత్తము. నైదాశ్వాసములుగల చక్కని ప్రబంధము.

చంద్రభాను చరిత్రకర్తయగు మల్లనమంత్రి తన కులవేల్పగు శ్రీ దత్తాత్రేయస్వామిని మొదటి పద్యమున ప్రార్థించి గ్రంథమారంభించినాడు.

కం॥ శ్రీ[illegible]
[illegible]
[illegible]
[illegible] దత్తాత్రేయా.

అవధరింపుమానసము[illegible] చం- 1 అ. ప. 1.

ఈ గ్రంథ [illegible] పుటలు క్రిమిదష్టములైనవి. కావున ఈ వంశీయుల చరిత్ర పూర్తి [illegible] తెలిసికొనవ[illegible]ము లేదు. లభించిన

1-2. కుమార వేంకట[illegible]ముం- [illegible] 1- ప. 49.
3. రి. నెం. 555- వ్రాతప్రతి [illegible] హైదరాబాదు.

ద్రౌపదీ కల్యాణము నాధారముగ మల్లనమంత్రి వంశమును గూర్చి వివరించుట జరిగినది.[1] ఇదియును అముద్రితము.

ఈ చంద్రభాను చరిత్ర అతని జననముతో ప్రారంభమై చంద్రభాను కుముదినుల వివాహముతో పరిసమాప్తమగును.

## రచనా పద్ధతి.-

ఈ గ్రంథమందలి రచన రసవంతమై, లలిత పదాలంకార శోభితమై యొప్పును. ఇది అచ్చటచ్చట క్రిమద్రష్టమైనది. శైలినరయుటకై ఒకటిరెండు పద్యములనిట పొందుపఱతును.

చంద్రభానుని జనన సమయమున- చంద్రుడుదయించునప్పుడు పూర్వదిశ తెల్లబడినది. అటులే చంద్రభానుడుదయించువేళ యాసన్నమగుటచే సత్యాదేవి ముఖము తెల్లదనముచే నొప్పారెనని చక్కని దృష్టాంతమును కవి ఈ పద్యమున చూపెట్టినాడు.

గీ॥. చంద్రభానూదయ సమాసన్నమైన
ప్రాచిగనుపట్టు పాండువైభవమనంగ
చంద్రభానూదయ సమాసన్నమగుట
పడతి ముఖమున గనుపట్టె పాండురంబు. 1 ఆ.

ప్రథమాశ్వాసము చంద్రభానుని జననము మరియు బాల్యముతో పూర్తి యగును. ద్వితీయాశ్వాసమున చంద్రభానుడు తుంబురునివద్ద వీణ నభ్యసించుట తృతీయాశ్వాసము- కుముదిని బాల్యదశ, యౌవనమంకురించుట, వేటకై వచ్చిన చంద్రభానుని గాంచుట మున్నగునవి వర్ణితములు. ఇక చతుర్థ-పంచమా శ్వాసములలో శిశుపాలుడు తన కుమారునకు కుముదినినిచ్చి వివాహము గావింపు మని రుక్మబాహునొద్దకు దూతను పంపుట, రుక్మబాహుడు తన కుమార్తెను శిశుపాలుని కుమారునకిచ్చుట కిష్టపడుట, తోటలో జూచి వరించిన చంద్రభాను నొద్దకు కుముదిని హంసతో రాయబారము పంపుట, విరహవర్ణనము, దేవతా పూజకై కుముదిని వెళ్ళుట, శిశుపాలునకు శ్రీకృష్ణ బలరాములతో యుద్ధము

1. కుమార వేంకటరాయలు- ద్రౌపదీ కల్యాణం, తాళప్రతి. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - హైదరాబాదు.

## పూడూరు కృష్ణయామాత్యుడు:- (18వ శతాబ్ది)

బోరవెల్లి సీమ ప్రాంతమున వెలిసినవారిలో పూడూరు కృష్ణయామాత్యుడొకరు. ఇతడు 'భగవద్గీతార్థ దర్పణము' అను గ్రంథమును రచించెను. ఈకవి పదునెనిమిదవ శతాబ్దమున పూర్వార్థము నున్నవాడు. కౌసలేయచరిత్రమును రచించిన లయగ్రాహి గరుడాచలకవి కితడు సమకాలికుడు. కృష్ణయామాత్యుని గ్రంథము అముద్రితతాళప్రతిని గద్వాలవారు సాహిత్యఅకాడమి (హైద్రాబాదు) వారికి ఇచ్చినారు. ఈ అముద్రితప్రతి 17 అధ్యాయములు గలది. కవి ప్రథమాధ్యాయమును వదలి 'సాంఖ్యయోగము నుండి పదునేడు అధ్యాయముల నాంధ్రమున సరళసుందరముగా ననువాదము గావించెను మొత్తము గ్రంథము తాళపత్రప్రతి 62 కమ్మలతో వ్రాయబడియున్నది. అందు 'శ్రీ శాలివాహన శకము 1664 అగు దుందుభినామసంవత్సర భాద్రపదశుద్ధ దశిమీల వరకీగ్రంథము సమాప్తం' అని వ్రాయబడినది [1] దానినాధారముగా డా. బి రామరాజుగారు 'మరుగుపడిన మాణిక్యాలు' అను శీర్షికతో తమ వ్యాసమును ప్రకటించిరి. [2]

### పూడూరు:

ఈ గ్రామము గద్వాలకు సమీపమున నున్న ప్రసిద్ధమైన ప్రదేశము. మొదట ఈ ప్రదేశము జైనులకు, అనంతరము శైవవైష్ణవముల కాకరమైనట్టిది. ఇప్పటికి కొన్ని ఆ ప్రాంతములలో జైన శిల్పములా దిబ్బలందును గలవు.

### తల్లిదండ్రులు:

తండ్రిగారు కొండయామాత్యుడు, తల్లిగారి పేరు తన గద్యలో తెలుపలేదు. వీరిది కాండిన్యస గోత్రము. చివరి గద్యమిటులున్నది–"ఇది శ్రీమద్యోగానందగురువర కరుణాపాత్ర వాసుదేవ ద్వాదశాక్షరీ మంత్రరాజ విద్యాను ష్ఠాన పవిత్ర కాండిన్యసగోత్ర పూడూరి కొండయామాత్యపుత్ర కృష్ణనామధేయ ప్రణీతంబైన శ్రీమద్భగవద్గీతార్థ దర్పణమునందు పరమార్థనిర్ణయంబను అష్టమాధ్యాయము". దీనిని పఠించువారికి ఫలమొక పద్యమున చెప్పబడినది. కాని ఈ పద్యము చాల భాగము శిథిలమై యున్నది.

---

1. పూడూరు కృష్ణయామాత్యుడు-భగవద్గీతార్థదర్పణం, తాళప్రతి పురాతత్త్వ పుస్తక భాండాగారము - హైదరాబాదు.
2. పూ. కృష్ణయామాత్యుడు వ్యాసము- గోల్కొండ పత్రిక 26-1-1961.

ఈ కవి తన గురువు యోగానందుడని, తానతని శిష్యుడనని స్వయముగా తన గద్యలో చెప్పినాడు. అయోగ్రాహి గరుడాచలకవి గురువుగారుకూడ యోగానందుడే. వీరిరువురు నీ ప్రాంతము వారు కావున ఒకే గురువువద్ద విద్యాభ్యాసము గావించినారనుట కవకాశమున్నది. ఈ యోగానందావధూత క్రీ. శ. 16వశతాబ్ది ఉత్తరార్ధమున నుండినటుల కీ॥ శే॥ ఛాగంటి శేషయ్యగారు వ్రాసిరి.[1] కావున అతనివద్ద చదివిన ఈ కవి క్రీ. శ. 17వ శతాబ్దికి పూర్వార్ధమునందుండవలెను. ఈ కృష్ణయామాత్యుడు తెలంగాణ ప్రాంతమువాడు. ఇతని గురువు యోగానందావధూత రచించిన ద్విపద వేదాంతగ్రంధములు కొన్ని తెలంగాణ ప్రాంతమున లభించుటచే నీ యోగానందావధూతకూడ తెలంగాణ ప్రాంతమువాడనుట కవకాశమున్నది.[2]

సాధారణముగా కవులు తమ గ్రంధములకు పీఠికలు వ్రాయుదురు కాని ఈ కృష్ణయామాత్యు డొక పద్యమును, కొంత గద్యభాగమును మాత్రమే వ్రాసి ముగించినాడు.

శా॥ ... మహిమాన్ [illegible] మైనిష్ఠతో
భావం[illegible] ప్రేమము[illegible] బాష్పప్రవాహంబు నెం
తేని మోహమునం [illegible]ంచి గు[illegible]నింత క్త్రిం కృపార్ద్రుండనై
వాక్యముంగో[illegible] నరస్తుతిం దలచెదన్ సద్వాక్యార్థ సంసిద్ధికై ప. 1

ఈ పద్యానంతరము గద్యభాగమున 'అని యిష్టదేవతాభివందనంబు గావించి శ్రీమద్భగవద్గీతాశాస్త్రంబు మొదలుగా భగవంతుడు అర్జునునకు తత్త్వోపదేశంబొనరించె. కావున సాంఖ్యయోగంబు ప్రారంభింపబడియె నది యెట్లనిన' అని తెల్పుచు సాంఖ్యయోగమును వ్రాయ మొదలుపెట్టినాడు.

## అనువాద శైలి:

ఆంధ్రానువాద కావ్యమున కీ కవి సరళముగను, సుందరముగను గనపట్టు శైలిలో రచన గావించెను. సాంఖ్యయోగమందలి మొదటి శ్లోకము

---

1. ఛా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి సం. 10- పుట. 201.
2. డా. బి. రామరాజు - కృష్ణయామాత్యుని వ్యాసము- గోలకొండ పత్రిక 26-11-61

'తంతథా కృపయా విష్టమ్' సాంఖ్య - శ్లో॥ అనుదాని కాంధ్రానువాద మిటులున్నది.

కం॥ ఉదితాశ్రు పూర్ణ నేత్రుడు
సదయహృదయుడై కిరీటి సమ్మదమెదలో
వదలుచు శోకం బందగ
పదిలంబుగ శౌరిబల్కె భాసుర వణితిన్ - భగ - సాంఖ్య. ప1.

అనువాదవిషయమున నీకవి స్వేచ్ఛానువాదమునుగాక భగవద్గీత పోలికను బట్టియే గావించినాడనుటకు 'ధ్యాయతో విషయాన్పుంసః' అను సాంఖ్య యోగము 62, 63 శ్లోకములకనువాదమిటులున్నది.

కం॥ కామము తజ్జన్యంబగు
వేమారుం గ్రోధమందు వేలయున్ మోహం
బా మోహము స్మృతి విభ్రమ
మై మెలగున్బుద్ధి నాశమగుబోధానన్.

## సంస్కృత వృత్తములు:

ఇతడు కవిత్వములో నందెవేసిన చేయి. కావున తరువోజు మున్నగు వానిలో కూడ రచన గావించినాడు ఉపేంద్రవజ్రవృత్తమున నీకవి రచన గాంచునది.

'ఈ సాంఖ్యయోగంబున నింద్రసూనున్
ధీసంస్తుతీ బూన్చిన దేవదేవున్
శ్రీసక్త పాదాబ్జుని చిత్స్వరూపున్
నే సంస్తుతిన్ జేసెదన్నిర్మలాత్మున్'

ఇటుల కొన్ని సంస్కృతములలోకూడ రచన గన్పట్టను. పద్యములను వాదములేగాక టీకానదృశ ప్రాయమైన యనువాదమని డా. బి. రామరాజుగా రభిప్రాయపడిరి. 1

1. డా. బి. రామరాజు-కృష్ణయామాత్యుడు వ్యాసం-గోలకొండ పత్రిక 26-11-1961

## రేటూరి రంగరాజు:- (17వ శతాబ్ది ప్రథమార్థము)

బోరవెల్లి సీమలో రేటూరి రంగరాజొకరు. ఇతడు 'ఖానుమతీపరిణయము' అను నాల్గు ఆశ్వాసముల గ్రంథమును రచించెను. ఈకవి తన గ్రంథమును వెలగోటి రాయభూపాలున కంకితము గావించెను.[1] బోరవెల్లి గద్వాల సంస్థానమునకు పూర్వము మిక్కిలి ప్రసిద్ధి జెంది, అనంతరము క్రి. శ. 1763-83 గద్వాల సంస్థానములో విలీనమయ్యెను.

## వంశము:

ఈకవి ఆరువేల నియోగి బ్రాహ్మణుడు. అపస్తంబసూత్రుడు శ్రీవత్సస గోత్రుడు. చినగంగనామాత్యపుత్రుడని ఈ గ్రంథమందలి ఆశ్వాసాంత గద్యము వలన తెలియుచున్నది.

ఈకవి ఇంటిపేరు 'కేటూరి'వారని ముద్రితప్రతియందున్నది. కాని అది లేఖన ప్రమాదము. రేటూరను గ్రామము గుంటూరు మండలము బాపట్ల (తాలూకా)కు ఉత్తరమున ఎనిమిది మైళ్ళ దూరమున నున్నదని కీ॥ శే॥ చాగంటి శేషయ్యగారు తెల్పిరి.[2] కావున ఈ గ్రామమునుబట్టి వీరి యింటి నామమేర్పడినదని తలంచవలసియున్నది.

మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న తాళపత్రప్రతిలో వీరి యింటిపేరు 'రేటూరి' యనియే యున్నది[3] ఆరువేల నియోగులలో రేటూరివారును గలరు. కాని వారిది శ్రీవత్సస గోత్రము కాదు. రేటూరి భావనామాత్యుడను కవి 'కామేశ్వరి చరిత్రము'ను ద్విపదలో రచించెను. ఈ భావనామాత్యుడు మరియు రంగరాజుగారిది గోత్రమొకటియై యున్నందున ఇరువురి గురువు అద్దంకి రంగాచార్యులే గావున వీరిరువురు నన్నదమ్ముల కుమారులని తెల్పుటకు అవకాశమున్నదని చాగంటివారు తమ గ్రంథమున వ్రాసియున్నారు[4]

---

1. రేటూరి రంగరాజు ఖానుమతీ పరిణయము క్రీ. శ. 1872 నాటి ముద్రణము జీర్ణ ముద్రిత ప్రతి యొకటి గద్వాల [illegible] లో లభించినవి. (అసమగ్రము)
2. చా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి సం. పుట. 172
3. ఖానమతీ పరిణయము తాళప్రతి డి. నెం. 602 ఓరియంటల్ లైబ్రరీ మద్రాసు.
4. చా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి సం. 11 పుట. 172 - 178.

కం॥ వెలయింతు సంతతము ని
రర్మల కుహనా గోపబాల మంజీర ఝణం
ఝణ నినద వచన రచనల
నలమా యద్దంకి సింగరాచార్య విభున్. భాను.

అను మాటనుబట్టి అద్దంకి సింగరాచార్యులు వీరికి విద్యాగురువులు. కాని ఈ సింగరాచార్యులనుబట్టి కాలనిర్ణయము జేయుట కాధారము లేదని వారే (చాగంటి) తెల్పిరి. కారణమేమనగా రంగరాజుగారు తాను శ్రీరంగ దేశికుల శిష్యుడనని తెల్పెను.

గీ॥ అట్టి దేశికమణి భావనార్యతనయ
రత్నమై తేజరిల్లు శ్రీరంగ ధామ
హైమయజ్ఞోపవీత లీలావతార
ధరణికందాళ శ్రీరంగగురుదలంతు. భాను ఆ1-ప26

అని తెల్పుచు మరొక పద్యమున తన గురువునిట్లు పొగడినాడు.

గీ॥ నన్నయాచార్యవర్యు ప్రియాత్మజుండు
వసుధ నన్నేలు కందాళవంశజలని
ధాన శుభద సుధాధామ భాళధళ్య
సురుచిరయశుండు శ్రీరంగ గురువిభుండు[1]

అను మాటచే మొదటి పద్యమున 'భావనార్యతనయుడనియు' రెండవ పద్యమున 'నన్నయాచార్యప్రియాత్మజుండు' తన గురువుగారని తెల్పినాడు. వీరిరువురు నొకేకాలమునాటివారు కారని చాగంటివారు తెల్పిరి.

## ఇతివృత్తము:

భానుమతీ పరిణయము నాల్గాశ్వాసములు గల చక్కని ప్రబంధము. శ్రీకృష్ణుని పినతండ్రి భానుడనువాని కుమార్తె భానుమతి. ఈమెను పాండవులలో చివరివాడైన సహదేవునకిచ్చి వివాహము గావించుట ఇందలి యితివృత్తము. ఇతివృత్తమందంత విశేషము కానరాకున్నను గ్రంథము చక్కని

1. చా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి సం. 11 పుట. 169.

వర్ణనలతోఁగూడి యున్నది. ఇతని కవిత్వము సరళము. ప్రథమాశ్వాసము 158 పద్యములు, ద్వితీయ 139 పద్యములు, తృతీయ 141 పద్యములు, చతుర్థ 154 పద్యములు గల్గి మొత్తం 592 గద్యపద్యములు గల్గియుండును.

ఈ గ్రంథమందలి ఆరంభపద్యమిటులున్నది.

ఉ॥ శ్రీలతెలంగ సత్త్వగుణశీలత నిర్మలమూర్తినయ్యు మై
నీలరుచుల్వహించితివి నీమదిలోపల నీలకాంతు శ్రీ
లీల ప్రకాశమయ్యెను భళీయను శ్రీయలమేలుమంగ కాం
తాళి మరీచికామ్ముగను దాల్చిన వేంకటభర్త గొల్చెదన్.

భాను. అ1-ప1.

అని శ్రీ వేంకటేశ్వరస్వామిని ప్రార్థించినాడు. ఈ పద్యము తర్వాత కవి రెండు సీసపద్యములలో శ్రీరంగగురువులను స్తుతించెను.

కృతిపతియైన రాయశౌరి యాస్థానమున నన్నయాచార్యులుండినటుల కవి తన గ్రంథమున చెప్పబడియుండుటచే శ్రీరంగగురువునకు, నన్నయాచార్యులకు నడుమ తరములున్నమాట సత్యమని మనము తలపవలసి యున్నది [1]

కృతిపతియగు రాయశౌరి విప్రవంశజుడగుటయేగాక పండితుడును, భగవద్భక్తుడును అయినటుల కవి గ్రంథాది పద్యములు తెల్పుచున్నవి. కవి తన గ్రంథమును రాయశౌరి కంకితమిచ్చినటుల మొదటి ఆశ్వాసము 24వ పద్యమున తెల్పెను. ఇతడు తన గ్రంథము ప్రబంధమని 'భానుమతీ పరిణయము ప్రబంధము గాగ - అ1 - ప24' చెప్పినాడు.

## ప్రబంధము:

ఈ భానుమతీ పరిణయము ప్రబంధమగుటచే కవి అష్టాదశ వర్ణనలలో కొన్నింటిని తన గ్రంథమందు చూపెట్టెను. ఇతడు మొదటి ఆశ్వాసమున 18వ పద్యమున ప్రభువు గుణగణములు, 24వ పద్యమున కవి ప్రతిభా సామర్థ్యములు అనంతరము సుకవిస్తుతి - కుకవినింద మున్నగునవి గావించెను. ప్రథమా

1. చా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి సం. 11 పుట. 171.

శ్వాసము భానుమతి జననముతో పూర్తియగును. ఇతడు ద్వితీయాశ్వాసమున భానుమతి యౌవనము పుష్పావచయవర్ణన (ఆ2-74ప), ఆ2-126, 127వ పద్యములలో జలవిహార వర్ణనము, 126వ పద్యమున పురవర్ణనము, 3వ ఆశ్వాసమున 54 పద్యము నుండి మలయానిలవర్ణనము, 65 పద్యముల వరకు, 129వ పద్యము మన్మథోపాలంబనము మున్నగు వర్ణనలను గావించెను.

## రచనాపద్ధతి:

రేటూరి రంగరాజు రచనాపద్ధతి వరయుటకై ఒకటి రెండు పద్యములను పొందుపఱతును. ఈ గ్రంధమందొక పురవర్ణనము మొదటి ఆశ్వాసము 19వ పద్యము నుండి 143 పద్యములవరకు గలదు. ఇతని రచనలో అల్లసాని పెద్దన కవితాఛాయలు - ఎత్తుగడలు గన్పట్టును.

## పురవర్ణన:

ఉ॥ అన్నగరంబులో వరలుహార్మ్య సువర్ణసరోజజాలమ
త్యున్నత చంద్రకాంత వరణోపరిదీప్తినిగాగ నిర్ఝరంబన్న
మనంబుచే జలవిహారము సల్పి శిరంబులార్చు నా
కిన్నర కన్యలోయన వికీర్ణపయోధర సాలభంజికల్

భాను-ఆ1-ప126.

## భానుమతి విరహావర్ణన:

ఉ॥ ఎన్నడు వచ్చునోపతి రతీంద్రుకళాతి రహస్యకేళి ప్రో
ద్దెన్నడు వచ్చునో మెరసి పనుపచారము వేడ్కసేయగా
నెన్నడు వచ్చునో మిగులహెచ్చిన మన్మథ వేదనాభరం
బెన్నడు విచ్చునోయనుచు నింతినిరంతర చింతగుందుచున్

భాను - ఆ3-ప62

ఈ గ్రంధమందు ప్రగ్విణి మున్నగు (సంస్కృత) వృత్తములుకూడ గలవు

ఇది చకాని శృంగార ప్రబంధము.

**ఇతర కృతులు;**

రంగరాజుగారు 'దేవకీనందన శతకము' అను పేర కొన్ని వందల పద్యములు రచించినటుల అప్పకవీయము మూడవ ఆశ్వాసమందలి 28 పద్యము వలన తెలియుచున్నది. శతకము లభ్యము.

## భానుమతీ పరిణయగ్రంథముననుసరించి కృతిపతి వంశక్రమము

యాచయేంద్రుడు — వెలగోటి వంశము — పద్మనాయక రాజులు
| మొదటివాడు

రాయభూపతి
- సింగభూపతి
- తిమ్మభూపతి - పెనుగొండకు ప్రభువు
  అంకమాంబ (భార్య)
  - తిమ్మరాజు — వంశోద్భవుడు — రాయనృపతి
    - రాయమనుజేంద్రుడు (ఈ గ్రంథ కృతిపతి)
    - కుమార రంగరాజు

భానుమతీ పరిణయము
1అ-12వ పద్యము

(యాచయేంద్రుడు ప్రభువు)
మొదటివాడు

## లయగ్రాహి గరుడాచలకవి :- (క్రీ. శ. 18వ శతాబ్ది-పూర్వార్థము)

కోరవెల్లిసీమలో ప్రసిద్ధిచెందిన కవులలో లయగ్రాహి గరుడాచలకవి యొకడు. ఇతడు 'కాపలేయ చరిత్ర'మను గ్రంథమును రసవంతముగా నై దా

శ్వాసములలో రచించెను. ఇది అముద్రితము. దీని తాళప్రతి ననుసరించి డా. బి. రామరాజుగారు తమ వ్యాసమును 'మరుగునపడిన మాణిక్యాలు' శీర్షికతో ప్రకటించిరి.[1]

అంతకు పూర్వము తేది 14-11-1960 నాటినుండి గోలకొండ పత్రికవారు 'మరుగుపడిన మాణిక్యాలు' అను శీర్షికతో ప్రాచీన కవుల రచనలు ప్రకటించ నున్నటుల తెలియజేయగా డా. బి. రామరాజుగారెంతో శ్రమజెంది అదేశీర్షికతో 'విస్మృత కవుల' పదునాలు వ్యాసములను సిద్ధము గావించి ఆ పత్రికద్వారా ప్రకటించిరి.[2]

## తల్లిదండ్రులు.

ఇతని (కవి) తండ్రిగారు నృసింహకవి. తాత సీతాపతి వీరిది హారితస గోత్రము ఆపస్తంబసూత్రము. ఇతని గ్రంధమాశ్వాసాంత గద్యయిటులున్నది. ఇది శ్రీమదహోబిల నృసింహ కరుణాకటాక్ష లబ్ధోభయ నిరంకుశ లయగ్రాహి సీతాపతి పౌత్ర నృసింహకవి పుత్ర హారితసగోత్ర పవిత్ర గరుడాచలకవి ప్రణీతంబైన కౌసలేయ చరిత్రము పంచమాశ్వాసము - అని వ్రాయబడినది ఈ గ్రంధము మూలమునకు ప్రతియెగాని అసలు గ్రంధకర్త ప్రతి గాదని డా బి. రామరాజుగారభిప్రాయపడిరి.

బోరవెల్లి గిరియమ్మ (గద్వాల పెద్దశోభనాద్రి కూతురు) లయగ్రాహి గరుడాచలకవిచే నీ గ్రంధము వ్రాయించి సత్కరించుటనుబట్టి ఇతడు 18వ శతాబ్ది పూర్వార్థమున నున్నవాడని తెల్పుట కవకాశమున్నది. పిలయన ఈ కవి తన గ్రంధమున బోరవెల్లి - గద్వాల సంస్థానముల చరిత్ర - సీమలు, పాలకులొనరించిన ఘనకార్యములు, సప్తసంతాన ప్రతిష్ఠలు మున్నగునవి 33 పద్యముల నుండి 70 పద్యములవరకు అనగా 38 పద్యములలో విపులముగా వర్ణించినాడు. ఇతడు తన గ్రంధమున గిరియమ్మ కవిని సత్కరించిన విషయము, ఆమె తండ్రియగు పెద్దసోమభూపాలుని గుణగణములు, తల్లి లింగమాంబ యొనర్చిన పుణ్యకార్యములను విపులముగా తెల్పినాడు గద్వాల పెదశోభనాద్రి క్రి శ.

1. డా. బి. రామరాజు కౌసలేయ చరిత్రం - వ్యాసం గోలకొండ పత్రిక 8-2-1961
2. డా. బి. రామరాజు మరుగుపడిన మాణిక్యాలు - గ్రంధము.

1663-1712 ప్రాంతమున నున్నటుల చరిత్రకారులు నిర్ణయించిరి. ఈ కవి వీరి కాలమునకు తర్వాత 18వ శతాబ్ది పూర్వార్థమున నుండునని చెప్పవచ్చును.

## వంశ చరిత్ర:

ఈ కవి తన గ్రంథమున 11 నుండి 16 పద్యముల (ఆరు పద్యముల)లో తన వంశ చరిత్రను గూర్చి తెల్పినాడు అందు తన ఆరు తరముల వారి యొక్క ప్రతిభాసామర్థ్యములు. వారు కవిత్వ తత్త్వవేదులనియును వివరించెను. తన పూర్వులలో మొదటివాడు మాధవకవి యనియు, అతడు కృష్ణరాయలచే సత్కరింపబడినటుల ఈ పద్యమున తెల్పినాడు.

ఉ॥ మాధవభక్తియుక్తు సమాన కవిత్వగురుండు కృష్ణరా
యాధిపదత్త సద్గుణరాది మహాబహుమానశాలి గం
గాధరకీర్తి సాంద్రుడు జగత్కవిచంద్రుడు మత్కులేంద్రుడా
మాధవుడస్మదాదులకు మాన్యుడుగాదె తలంచి చూచినన్.

అను మాటచే నీ వంశీయులు అత్యంత గౌరవప్రతిష్ఠలు గలవారని రాజాశ్రియములలో సత్కరింపబడినవారలనియు తెలియుచున్నది. ఇతడు 17వ పద్యమున తన గురువునిటుల స్తుతించెను.

శా॥ శ్రీగంగాద్రవ శీలాత్మకుని కాశీసేతు మధ్యావనీ
భాగఖ్యాతి విరాజమానుని మహాభాష్యాది పట్శాస్త్ర వి
ద్యాగారున్ నరసింహ సత్కవికుమారాగ్రేసరున్ బోర్వెలీ
యోగానందకవీంద్రు మద్గురువరేణ్యుల్ భక్తి సేవించెదన్
కౌస-1ఆ. 17ప.

అనుటచే నరసింహకవికి కుమారాగ్రేసరుడగు యోగానంద కవీంద్రుడీ లయగ్రాహికి అన్న కావచ్చును ఈ లయగ్రాహి గరుడాచలకవి అన్నగారివద్దనే విద్యనభ్యసించినవాడనుట కవకాశము పై పద్యమువలన తెలియుచున్నది.

కాని ఈ క్రిందిపద్యముద్వారా నృసింహకవికి కుమారాగ్రేసరుడు యోగానందకవీంద్రుడు గరుడాచలకవికి అన్నయని యోచించుట కవకాశము లేదు.

మరియు వంశవృక్షమునకూడ నృసింహాకవికి యోగానందుడను కొడుకున్నటుల చూపెట్టబడలేదు.

కం॥ సీతాపతి తనయుల వి
ఖ్యాతులసంజీవి వేంకటాఖ్యులను కవి
వ్రాతస్తుత కవితాఘను
మాతంగ్రడి నృసింహాకవిని మాటికి దలతున్. కా-1ఆ13ప.

## సమకాలీనత:

ఇక ఈకవి పూడూరు కృష్ణయామాత్యుని సమకాలికుడనుటను గూర్చి విచారింతము. పూడూరు బోరవెల్లికి సమీపమున నున్నది. పూడూరు కృష్ణయామాత్యుడు 'భగవద్గీతార్థ దర్పణము'ను రచించెను.

అందలి చివరి గద్యమునందు- తాను శ్రీమద్యోగానంద గురువర కరుణాపాత్రుడనని, తెలియజేయుటచే నీ యోగానందుడే. గురుశిష్య సంవాదము ఆత్మైకబోధమువంటి ద్విపద వేదాంత గ్రంథములకు కర్తయగు యోగానందావధూతయై యుండునని డా. బి. రామరాజుగారూహించిరి.[1]

కాని పైపద్యము 'శ్రీగంధద్రవ' ద్వారా ఇరువురగు పూడూరు కృష్ణయామాత్యుని గురువగు యోగానందుడును లయగ్రాహి గరుడాచలపతికవి గురువగు యోగానందకవీంద్రుడొకరే యని స్పష్టముగా తెలియుచున్నది.

ఏలయన పూడూరు కృష్ణయామాత్యుడును, లయగ్రాహి గరుడాచలపతి కవియు నిరువురు సమకాలికులు మరియు ఒకే ప్రదేశమునకు చెందినవారు. కాని ఆత్మైక బోధము వంటి వేదాంత గ్రంథములను రచించి ఆసేతు సీతాచల పర్యంతము ఖ్యాతి గడించినట్టివాడు షట్శాస్త్రపారంగతుడగు యోగానందావధూత మరియు ఈ యిరువురి కవులకుగల గురువు ఒకరే యనుటకు కొంత సందేహము గలుగక మానదు.

---

1. డా. బి. రామరాజు - మరుగుపడిన మాణిక్యాలు పుట. 46.

కీ. శే. మానవల్లి రామకృష్ణ కవిగారు భైరవకవి రచించిన 'శ్రీరంగ మాహాత్మ్య'మందలి పీఠికలో తాళపత్ర గ్రంథములను చదువుటలో గల కష్ట నిష్ఠురములను గూర్చి వివరించిరి.[1]

## గ్రంథస్థ విషయము:

కవి గ్రంథారంభమున రాణి గిరియమ్మ కిలవేల్పగు శ్రీ కేశవస్వామిని మొదటి పద్యమున వర్ణించెను.

ఉ॥ శ్రీ విలసిల్లు శౌర్యనిపుణన్ వెలిదీవిని నిల్పువైఖరిన్
భావము రంజిలన్ నిలిచి భాసిలు కేశవదేవుడాత్మ వ
ద్గో విదితాలయంబునను కూర్మిని నిల్పినరీతి నిల్పుతన్
శ్రీవనితా శిరోమణిని శ్రీగిరియమ్మ గృహాంతరంబునన్
కౌ. 1ఆ. 1ప.

అని ప్రార్థించి 2వ పద్యమున లక్ష్మీదేవిని, 3వ పద్యమున పోల్గంటి సోమేశ్వరుని, 4వ పద్యమున పార్వతిని 5వ పద్యమున బ్రహ్మను, 6వ పద్యమున సరస్వతిని, 7వ పద్యమున విఘ్నేశ్వరుని, 8వ పద్యమున భారత రామాయణములు రచించిన మునిశ్రేష్ఠులను, 9వ పద్యమున గీర్వాణ భాషాకవులను, ఇందు సీసపద్యమున 'కవి సన్నుతేత జగన్నాటకోద్వృత్తి పేరెన్నవలరు మురారి దలతు' అని అనర్ఘరాఘవ కర్త యగు మురారిని కూడ స్తుతించెను 10వ పద్యమున తెలుగు కవులను, కవిత్రయమును, పోతన, భాస్కర, రంగనాథ, సూరన, పెద్దన, నంది తిమ్మనాచార్యులను స్తుతించినాడు.

బోరవెల్లి యాస్థానమున గిరియమ్మ కాలమున గరుడాచలకవి 'కౌసలేయ చరిత్రము'ను రచింపగా ఆమె దత్తపుత్రుడగు వేంకటపతి (రెడ్డి) కాలమున చింతలపల్లి ఛాయాపతి 'రాఘవాభ్యుదయము'ను ప్రబంధమును రచించెను. వీరిరు

1. తాళీదళ సంపుటకాంతారమున దిరిగి ప్రమాద కంటకములను దొలగించుకొనుచు నపూర్వపదార్థ వివేచనంబుసేయుచుండు వారి యవస్థ తత్తుల్యులకుగాని యన్యులెరుంగరాదు.

తెలంగాణమున పల్లెలు దిరిగి వందలకొలది తాళపత్ర గ్రంథములు, శాసనములు, నాణెములు, కైఫియతులు సేకరించి తెలంగాణమునకు కూడ ఉజ్జ్వల చరిత్రముండినటుల నిరూపించినారు పూజ్యులు శ్రీ ఆదిరాజు వీరభద్రరావు పంతులుగారు.

పురును ఆ ప్రభువుల పోషణముననుండి తమ గ్రంథములను శేషాచలస్వామి కంకితము గావించిరి.

ఒక పుణ్యదినమున గరుడాచలకవికి బోర్వోలి కేశవస్వామి స్వప్నమున సాక్షాత్కరించి ఇట్లనెను.

ఉ॥ బాలక నా గృహంబెపుడు బాయక విద్యలు నేర్చినావు భూ
పాల సభాంతరాళముల పండితులౌనన సత్కవిత్వము
ద్వేల వచో విజృంభణల వేగముగా రచియింప నేర్తువౌ
మేలు భళీ భవద్గుణము మెచ్చి వరంబొసగంగ వచ్చితిన్.

ఇతడు కౌసలేయచరిత్రమను గ్రంథమును తన కంకితము నొసంగుమని స్వామి యాదేశమిచ్చినటుల తెల్పినాడు.

పిలయన తనకు మందిరము గట్టించి గిరియమ్మ తనపై కృతిరచింప జేయ సంకల్పించినదని తెల్పుచు—

కం॥ గిరియమ్మ నాకు మెచ్చగ
శరణముగట్టించి, యొక్క సత్కృతి తనపై
విరచింప జేయవలెనని
కరమరుదుగ దలచినది జగద్ధితమిదియున్. కా. 1ఆ. 24ప.

అటులే—

ఉ॥ ఈ కృతియే మదంకితమహోనమతిన్ రచియింపజేయు మం
చా కమలాక్షియౌ గిరియమాంబకు నే కలలోవచించితిన్
జోకగ నీకభీష్టములు జొప్పడు శ్రీ నరసింహమూర్తినై
నీ కిలవేలుపై తగిన నీరజనాభుడ నేనె బాలకా. కా. 1ఆ.25ప.

యని ఆజ్ఞనియ్యగా తానీగ్రంథమును రచించినాడు. తన స్వప్న ప్రకారమె రాణి గిరియమ్మ కూడ మరునాడు తనను ఆస్థానమునకు పిలిపించి కృతినిర్మించి

భగవంతున కంకితమిడుమని కవిని సత్కరించినది. రాణి గిరియమ్మ ఆజ్ఞాను సారము వారి వంశమును గూర్చి 33 నుండి 70 పద్యములవరకుగల 38 పద్యములలో వర్ణించెను.

## గిరియమ్మ గావించిన పుణ్యకార్యములు:

సీ॥ కట్టించె కేశవాగారంబు భూమిపై
బరగు కుబేరపుష్పక మనంగ
సేవించె నారామ సేతు కాశీమధ్య
దివ్యస్థలంబులు తెగువమీఱ
వేయించె వనము లుర్వినిచైత్రరథ నంద
నోద్యానములరీతి హృద్యముగను
చదివించె విద్యార్థిజనుల కన్నముపెట్టి
వేదశాస్త్రపురాణ విద్యలెల్ల.

తే॥ జన్నములొనర్పజేసె నిర్జరగణంబు
గణుతి యొనరింప విప్రసంఘములచేత
ననుచు ప్రజలన్నవర్థిల్లె ననుదినంబు
పరమసద్గుణ నికురంబ గిరియమాంబ కొ. 1ఆ. 66ప.

ఇక గిరియమ్మ నెలకొల్పిన అన్నసత్రమును గూర్చి వర్ణించిన విధము-

ఉ॥ పుత్రక! యెందుబోయితివి? బోర్వెలిలో గిరియమ్మపెట్టు బ
ల్సత్రములో భుజించుటకు, సత్రవిశేషములేమి? చూడునా
గాత్రము! త్రావితోసుధ? జగజ్జనులందరు ద్రావద్రావుచే
చిత్రము సేసటంచును వచించును బ్రహ్మకు నారదుండటన్
1ఆ. 67ప.

కేశవస్వామిని గూర్చి షష్ఠ్యంతములలో వర్ణించిన తర్వాత - అంకితంబుగా నా యొనర్పంబూనిన కౌసలేయ చరిత్రంబను మహాప్రబంధంబునకు కథా ప్రారంభంబెట్టిదనిన-

## అయోధ్యాపుర వర్ణన.

ఉ॥ శ్రీనిలయాగ్రసుస్థితి ధరించి గురూన్నతరీతిచే సుధ
ర్మాసఘ భోగభాగ్యములహర్నిశ మీయగనోపి సౌధశో
భానిరవద్య నిర్జర శుభక్రియలూని యసాధ్యమై యయో
ధ్యానగరంబు పొల్చువసుధన్ వసుధామనియుక్తి స్వర్గమై.

అని అయోధ్యానగర వర్ణనముతో ప్రారంభించినాడు.

## బోరవెల్లి చరిత్ర.

ఈ గ్రంథమును వ్రాయుటకు ప్రోత్సహించిన బోరవెల్లి చరిత్రమును గూర్చి కొంత విచారింతము. కవి ఈ గ్రంథమందు 33 పద్యములు మొదలుకొని 70 పద్యములవఱకుగల పద్యములలో బోరవెల్లి చరిత్రను గూర్చి వివరించెను.

శ్రీమన్నారాయణుని పాదపద్మమున గంగ జనించెను. ఆ గంగకు పదజ వంశము గల్గెను. అట్టి ప్రసిద్ధ వంశమున నల్లభూవల్లభుడు జనించెను. ఇతడు కేశవస్వామి సేవాపరాయణుడు. ఆతడీవంశమునకు మూలపురుషుడు 1

ఈ గిరియమ్మతండ్రి గద్వాల పెదశోభనాద్రి (లేక పెదసోమభూపాలుడు). అతడు దరూరు, మైజ, కందనూలుపురము, బనగానిపల్లె, బండాత్మకూరు, అహోబిలము, ఛాగలమఱ్ఱి, శిరువళ్ళ, నందేల (నంద్యాల) మున్నగు సీమలను పాలించెను. కావున అట్టి పెదశోభనాద్రి గుణములుకూడ యిందు వర్ణితములు మరియు పెదశోభనాద్రి భార్య లింగాంబ (గిరియమ్మతల్లి) యొనర్చిన పుణ్యకార్యములు కూడా యిందు విపులముగా వర్ణించబడినవి.2

1. లయగ్రాహి కౌసలేయ చరిత్రము 30 నుండి 70 పద్యములు వంశచరిత్ర.
డా. బి. రామరాజు- [మరుగుపడిన మాణిక్యాలు-పుట. 47]

2. డా. బి. రామరాజు - మరుగుపడిన మాణిక్యాలు - పుట. 47.

బోరవెల్లి చరిత్ర - కౌసలేయ చరిత్ర ననుసరించి ప్రభువుల వంశక్రమము-

## వంశవృక్షము




గిరియమ్మ కౌసలేయచరిత్ర కర్త. లయగ్రాహి కవిని సత్కరించినది (బోరవెల్లి చిన్నసోమభూపాలుని భార్య గిరియమ్మ). గిరియమ్మ బావకుమారుడు, తనకు దత్తకుమారుడగు వేంకటపతిగారు చింతలపల్లి ఛాయాపతిని సత్కరించెను ఈ ఛాయాపతి రాఘవాభ్యుదయ కర్త.

## లయగ్రాహి కవులు:- బోరవెల్లి సంస్థానము

'కౌసలేయ చరిత్రము' ననుసరించి కృతికర్త (లయగ్రాహి కవుల)

### వంశక్రమము




1. ఈ లయగ్రాహి గరుడాచలకవిని గద్వాల పెదశోభనాద్రి కూతురు, బోరవెల్లి చిన్న సోమభూపాలుని భార్య గిరియమ్మ సత్కరించినది.

**చింతలపల్లి ఛాయాపతి 17వ శతాబ్ది చివర లేక 18వ పూర్వార్ధము:-**

శ్రీరవెల్లిసీమ కవులలో చింతలపల్లి ఛాయాపతిగారొకరు. ఇతడు 'రాఘవాభ్యుదయ'మను గ్రంథమును రచించెను. ఈ గ్రంథము క్రీ. శ. 1972లో ముద్రణము గావింపబడినది. ఈ కవి మహబూబ్‌నగర మండలమందలి గంగాపుర గ్రామ నివాసియని కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు తెల్పిరి.[1]

కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'ఆంధ్రకవుల చరిత్రము'ను బట్టియు రాఘవాభ్యుదయ గ్రంథమును బట్టి పోల్చిచూడగా మధురవాణి విలాసకర్తయగు వీరరాఘవకవియు ఈ ఛాయాపతియు అన్నదమ్ముల కుమారులని డా. బి. రామరాజుగారభిప్రాయపడిరి.[2] ఇక ఛాయాపతి తాతగారి పేరుకూడ వీరరాఘవ కవియె. ఇతడె మధురవాణి విలాసకర్తయని కందుకూరి వీరేశలింగం పంతులుగారూహించిరి.[3]

ఇక భాగంటి శేషయ్యగారు తన ఆంధ్రకవితరంగిణిలో చింతలపల్లి కవులను గూర్చి వ్రాసినారు. చింతలపల్లి గోపాలమంత్రి (ఆర్యాశతక కర్త) కుమారుడే ఈ ఛాయాపతిగారు. అంతేకాదు ఈ ఛాయాపతిగారు మధురవాణి విలాసకర్తయగు చినవీరరాఘవ కవియు మరియు చంద్రాంగదోపాఖ్యానకర్తయగు సంజీవకవి ఈ మువ్వురును అన్నదమ్ముల కుమారులనియు క్రీ శ. 1660 ప్రాంతముండినవారనియు భాగంటివారు నిర్ణయించిరి.[4]

చింతలపల్లి చినవీరరాఘవ కవిని గూర్చి పూజ్యులు ఆదిరాజు వీరభద్రరావుగారు 'తాళపత్ర గ్రంథములు' అను వ్యాసమున వ్రాసినారు.[5] 'రాఘవాభ్యుదయమను గ్రంథమిదివరకే ప్రకటితమైనట్లు కీ. శే. సురవరం ప్రతాపరెడ్డిగారు పద్యములు కొన్నింటిని వ్రాసి ఉదాహరించినారు కాని ఇంతవరకు ప్రకటింపబడలేదని డా. బి. రామరాజు గారభిప్రాయపడిరి.[6]

---

1. సురవరం ప్రతాపరెడ్డి - గోలకొండ కవుల సంచిక. పుట. 399.
2. డా. బి. రామరాజు - రాఘవాభ్యుదయ పీఠిక. పుట. 3.
3. క. వీ. పంతులు - కవుల చరిత్రము భాగము 3. పుట. 194–196.
4. దా. శేషయ్య - ఆంధ్రకవితరంగిణి. సం. 12, పుట. 199–212.
5. తెలంగాణము - మొదటిభాగము - దేశోద్ధారక గ్రంథమాల - సికింద్రాబాదు 1956 పుట. 28.
6. డా. బి. రామరాజు రాఘవాభ్యుదయ పీఠిక. పుట 2.

## కవి వంశము:

చింతలపల్లి వారిది గొప్ప పండిత కుటుంబము. ఛాయాపతిగారు తన గ్రంథమున తన వంశము - కవులు - పండితులు వారి ప్రతిభాసామర్థ్యములు మరియు బోరవెల్లి సంస్థానాధీశ్వరుల వంశానుక్రమమును గూర్చి విపులముగా తెల్పినాడు.[1]

కీ. శే. ఛాగంటి వారు చింతలపల్లి కవులను నియోగులన్నారు. కాని వారి కవిత్వమును మరియు ఛాయాపతి వంశవృత్తమును బట్టి చూడగా వారు వైదికులని తెలియుచున్నది. డా. బి. రామరాజుగారు కూడ వీరు వైదికులనియే తమ యభిప్రాయమును తెల్పిరి.[2]

ఛాయాపతిగారిది వశిష్ఠగోత్రము. ఆశ్వలాయనసూత్రము గద్యలో-ఇది శ్రీ మురళి గోపాలకృపాలబ్ధవర పరిస్ఫురదుభయ కవితా నిరంకుశసామ్రాజ్య శాశ్వతాశ్వలాయనసూత్ర పవిత్ర చిత్రకళా వినిశ్చింత చింతలపల్లి శ్రీ వీర రాఘవ పౌత్ర గోపాలభట్టు శిరోమణి వరపుత్ర సకల సుధీజన విధేయ ఛాయాపతి నామధేయ ప్రణీతంబైన రాఘవాభ్యుదయమను మహాప్రబంధంబునందు, అను మాటచే స్పష్టముగా దెలియుచున్నది.

ఛాయాపతి కవితావిషయమున తానీషద్జ్ఞుడనని తన వినయ విధేయ తలను తెల్పినాడు. 1ఆ. 33ప.

## కవి కాలము:

ఇతడు గద్వాల పెదశోభనాద్రి సమకాలికుడని క్రీ.శ. 17వ శతాబ్ది చివర నుండిన వాడని చెప్పవచ్చును. ఏలయన పెదశోభనాద్రి కాలము క్రీ శ. 1663-1712 అని చరిత్రకారులు నిర్ణయించిరి. గద్వాల పెదశోభనాద్రి కూతురు గిరియమ్మ లయగ్రాహి కవి నాదరించగా ఆమె పెంపుడు కొడుకు

1. చి. ఛాయాపతి - రాఘవాభ్యుదయము. పుట 1 నుండి 28.
2. డా. బి. రామరాజు రాఘవాభ్యుదయ పీఠిక. పుట 2.

వేంకటపతి ఈ ఛాయాపతి నాదరించి ఈ గ్రంథమును వ్రాయించెను. ఇరువురు కవులు బోరవెల్లి ప్రభువుల కిలవేల్పగు శ్రీ వేంకటేశ్వరునకు ప్రభువుల కోరికపై అంకితము గావించిరి. కావున ఛాయాపతి గద్వాల పెదశోభనాద్రికి తర్వాతి వాడని 17వ శతాబ్ది చివరలో నున్నవాడని భావించవచ్చును.

## బోరవెల్లి ప్రభువుల వంశచరిత్ర:

బోరవెల్లి ప్రభువగు నల్లారెడ్డి కిరువురు భార్యలు [మల్లాంబ-తిమ్మాంబ]. నల్లారెడ్డి తండ్రి నాద తమ్మారెడ్డి. ఇతడే ఈ సంస్థానమునకు మూలపురుషుడు. ఈ బోరవెల్లి కృష్ణా- తుంగభద్ర నదులమధ్యమున్న ప్రదేశము. ఈ ప్రభువులది మిడిమిళ్ళ గోత్రము. ఇంటిపేరు ముష్టిపల్లి వారు. నల్లారెడ్డి పెద్దభార్య మల్లాంబకు పెదసోముడు, తిమ్మాంబకు చిన్నసోముడు అను కుమారులు చెన్నకేశవ సోమేశ్వరుని వరప్రసాదమున గల్గిరి. పెద్దవాడు పెదసోముడు - చిన్నవాడు చినసోముడు. పెదసోముని భార్య లక్ష్మమ్మ కుమారుడగు వేంకటరెడ్డి [పతి]యే ఛాయాపతిని సత్కరించిన ప్రభువు.

బోరవెల్లి చినసోముని భార్య గిరియమ్మ ఈమె పెదశోభనాద్రి కూతురు. గద్వాల వారి ఆడపడుచు. ఈమెకు సంతానము లేనందున తన భావయగు పెదసోముని కుమారుడగు వేంకటరెడ్డిని పెంచి దత్తత గావించుకొనెను. గిరియమ్మ దానధర్మములను గూర్చి గరుడాచలకవి 'కౌసలేయ చరిత్ర'మును వ్రాసెను. ఈ గిరియమ్మ పెంచిన వేంకటరెడ్డి ఈ ఛాయాపతి నాదరించి అతనిచే 'రామవాభ్యుదయము'ను వ్రాయించి సత్కరించెను.[1]

## రాఘవాభ్యుదయము-మూలము:

ఛాయాపతి గారి రాఘవాభ్యుదయమునకు కాళిదాసు రచించిన కావ్యత్రియములో మొదటిదగు రఘువంశమందలి 4, 5, 6, 7 సర్గలు మూలాధారములు. రాఘవాభ్యుదయము మొత్తము ఆరాశ్వాసములుగల ప్రబంధము. మూలగ్రంథమందలి సర్గలను ఛాయాపతి విభజించి ఆరాశ్వాసములలో రచించిరి.

ప్రథమాశ్వాసమున రఘుమహారాజు పరిపాలనము ద్వితీయ-అతని దిగ్విజయము, తృతీయ-విశ్వజిద్యాగము. కౌత్సుని ఆగమనము, అతనికి గురుదక్షిణ యిచ్చుట- అజుని జననము- అభివృద్ధి- విద్యాభ్యాసము- యౌవనము- ఇందుమతీ

1. డా. బి. రామరాజు 'మరుగుపడిన మాణిక్యాలు' [చింతలపల్లి ఛాయాపతి] వ్యాసం, పు. 81.

స్వయంవరాహ్వానము- ప్రయాణము- సమ్మోహనాస్త్రలబ్ధి- విదర్భనగర ప్రవేశము- ఇందుమత్యజుల విరహము, చతుర్థాశ్వాసమున వసంతర్తువర్ణనము- సాయంవర్ణనము- ఇందుమతీ విరహము- వనవిహారము- శైత్యోపచారములు- మన్మథాద్యుపాలంబనము- సూర్యోదయము . కేళీవనవిహారము- నారికేళనము- మన్మథపూజ అజుని విరహము- అజుడు ప్రబోధితుడై స్వయంవరమంటపము చేరుట, పంచమాశ్వాసమున ఇందుమతీ స్వయంవర కథ పూర్తి, షష్ఠాశ్వాసమున ఇందుమతీ పరిణయము-ప్రయాణము పరరాజుల నెదిరించుట-అజుడు వారిని నిర్జించి పురప్రవేశము గావించుట ఉత్సవములు శోభనము మున్నగు వాటిని వర్ణించెను.

## రచనా విషయము-పోలికలు:

ఛాయాపతి తన గ్రంథమును 'ఉత్తరాయణ మహానఘ మాఘవ లక్ష్య పంచమిన్, గుదురుగ నాణిముత్తెములు గూర్చిన యట్లనమేలు రాఘవాభ్యుదయ మహాప్రబంధము' శుభోన్నతి జేసితి నేనెవ్రాసితిన్, అని చెప్పి గ్రంథమును పూర్తి జేసిన విషయమును తెల్పెను.[1]

కవి కావ్యారంభమున తన యిష్టదైవతమైన మురళీ గోపాలుని స్తుతించి తర్వాత ఇతర దేవతా స్తోత్రములను గావించెను. వాణీస్తవము రెండు పద్యములలో నున్నది. అందలి రెండవ పద్యమిటులున్నది.

చ॥ పొలుపుగ నంతరాళమున బూసిన పూవును, బూవులోన నొ
ప్పలవడుమ్రాను, మ్రాను జివురాకున బండినకాయ, కాయకా
గొలుకులపిండె, పిండెకగుకొమ్మయె మాకు వచఃప్రసూన ని
స్తుల కవితామధు ప్రమదసార ఫలంబులొసంగు గావుతన్.

రాఘవ. 1ఆ. 11ప.

ఈ పద్యము కందుకూరి రుద్రకవి మల్కిభరాముని ఆశీర్వదించిన పద్యమును బోలియున్నది.[2]

---

1. చి. ఛాయాపతి రాఘవాభ్యుదయము తాళప్రతి 6వ ఆశ్వాసము చివర కమ్మ 102-103. ఓరియంటల్ లైబ్రరీ-హైద్రాబాదు.
2. క. రుద్రకవి నిరంకుశోపాఖ్యానము. పుట 7.

పై పద్యభావమిటులున్నది—

అంతరాళమున బూసిన పూవు-చంద్రుడు, పూవులోన నొప్పలవడు మ్రాను వటవృక్షము, మాను జివరాకున బండినకాయ- వటపత్రశాయి యగు విష్ణువు, కాయకాగొలుకుల పిందె-బ్రహ్మ, పిందెకగు కొమ్మ-సరస్వతి అని తెల్పి అట్టి సరస్వతి మాకు కవితామధు ప్రమదసారఫలంబు లొసంగుగాత, యని స్తుతించుటచే నీకవి కవితలోగల ప్రజ్ఞాపాటవములు వెల్లడి యగుచున్నవి.

ఛాయాపతి తన గ్రంధమును ప్రబంధోచితశైలిలో రచించితినని 1ఆ.-45 పద్యమున తెల్పినాడు. ఇతడిగ్రింది పద్యమున అనాడు వదాన్యులుండినందున కవిత్వములోని చక్కని రచనాసంపదను ప్రబంధధోరణిలో చవి చూపించెడి కవులుండిరి. నేడును అట్టి వదాన్యులుండిన అట్టి రచన గావించెడి కవులున్నారిని తెల్పెను.

కం॥ కేవలసరస వదాన్యుం
డీ వసుమతిలేడు కలిగెనేని కవిత్వ
శ్రీ వెలయఁ జేసి కవులు ప్ర
భావంబులు నూపరే ప్రబంధక్రియలన్. రాఘవ. 1ఆ. 48ప.

ఛాయాపతి లోభులను జూచి ఏవగించుకొని ఇట్టి దురాత్ములకు సుకృతు (కావ్యము) లీయందగునే (1ఆ. 58ప.) యని ఈసడించి కృతిని దైవాంకితము గావించెను.

అటుల అంకితము గావించినచో శ్రీ వెలయును కవీశ్వరులను ప్రసిద్ధి గావించును. భావనులనుగా మార్చును. కైవల్యమును గల్గజేయునని కవి తెల్పెను.

ఇతడు 'కవి' శబ్దమును గూర్చి చెప్పుచు-శబ్దమునకు ధాత్వర్థవిషయము తెలియక, దానిని వివరింపజాలని కవి, కవి యనిపించుకొనజాలడని స్పష్టముగా నొక్కి చెప్పెను. కుకవులితరులను దూషించుచు తమను భూషించుకొందురు. అట్టివారికి 'సకల సభామనోహార వచః ప్రతిభారసభావమాధురీ, ప్రకటతర ప్రబంధ బహుబంధ నిబంధవచశ్చతురత్వ మబ్బునా? యని తెల్పి' కుకవులు పరులను దూషించుటే వారి సొమ్మని చెప్పినాడు.

## పోలికలు-మార్పులు:

ఈ గ్రంథమందెన్నియో పద్యములు ప్రబంధ కవుల పద్యముల పోకడలను (పోలికలను) గల్గియున్నది.

అల్లసానివారి ఆటజనిగాంచె 1ఆ.-కథారంభమందలి మొదటి పద్యపోలిక ఈ గ్రంథము 2ఆ. 46 పద్యమున గన్పించును.

అతడు శీతశైలమును వర్ణించగా నీకవి అదే మృదంగధ్వనులతో రఘు మహారాజు దిగ్విజయయాత్రసందర్భమున మహేంద్రగిరిని వర్ణించెను. (రాఘవ. 2ఆ. 46 ప.)

కొన్నిచోట్ల ఛాయాపతి స్వతంత్రభావములను వివరించెను. కౌత్సుడు ధనముగోరి రాగా రఘుమహారాజతనికి ధనమిత్తునని వాగ్దానమొనర్చును. వసిష్టుని యాజ్ఞానుసారము మహారాజు అలకాధిపునిపై దిగ్విజయయాత్రకు బయలు దేరెను. అట్టి సందర్భమున– ధనములేనివాడవమానపడును. తల్లియు దిట్టును. తండ్రి ఏమియు దెల్పడు. అన్నదమ్ములబద్ధమాడుదురు. భృత్యులు పని వినరు. ఆత్మజులు చెప్పినమాట గ్రహింపరు. కావున

క౦॥ ధనము నుపార్జించిన యా
మనుజుడె సుజ్ఞాని సుగుణి మాన్యుడధికుడున్
వినగన నేర్పరియుం గా
వున వస్తూపార్జనంబు పొసగుం జేయన్ (3ఆ. 88ప.)

ఇది కవిగారి స్వతంత్రభావన-మూలమందు లేదు. ఇతడు మూలాధారముగాక స్వతంత్రభావములనుకూడా తన గ్రంథమున చూపెట్టినాడు.

భర్తృహరి సుభాషితమందు 'అరంభించరు నీచమానవులు' అను పద్యమును బోలిక 3ఆ. 102ప. అల్లసానివారి 'తీర్థసంవాసులేతెంచినారను' పద్యమును బోలిక 6ఆ. 265ప. ముక్తపదగ్రస్తాలంకారములో నీకవి తన గ్రంథమున వర్ణించెను.

రఘువంశము 5వ సర్గ 36శ్లో. అజుడు బ్రహ్మ ముహూర్తమున జననమని కాళిదాసు వ్రాయగా నీకవిగారి అజుడు అభిజిన్ముహూర్తమున అని మార్పు చేసెను.

## వైదుష్యము:

ఛాయాపతి కవిత్వకళయందేగాక ఆయుర్వేదము, జ్యోతిషము, తర్కము, వ్యాకరణము మున్నగు శాస్త్రములలో ప్రవేశమున్నటుల ఇతని రాఘవాభ్యుదయము చదువువారికి దృగ్గోచరమగును. ఇతడు తాను మూలమున నున్నదున్నటుల చెప్పుటతోపాటు 'పురాణరాజఋషి సచ్చరితంబు మెరుంగదేరు మేల్కొందనమట, అట్టి దానిని మిశ్రకృతిగారి రచించెద బుద్ధి చాతురిన్' అని (1ఆ. 36వ) తాను మిశ్రకథగా రచింతునని స్వయముగా తెల్పినాడు.

## రచనావిధానము:

ఇతడు గ్రంథమందలి రచనాపద్ధతిని గూర్చి తెల్పుచు—

కం॥ "కొందరు కవితలు కఠినము
అందురు, కొందరికి మృదువులందురు కృతులన్"

... ... ...

అని తెల్పి తన రచనచే నందరికి సొంపొదవునగునటుల కఠినముగను, మృదువుగను కవిత చెప్పగలవాడనని తెల్పెను (1 ఆ. 39 వ.) అలంకారములలో నితడు అర్థాలంకారములతోపాటు శబ్దాలంకారములనుకూడ పద్యములలో చూపెట్టెను. శైలితో నీకవి కొన్ని చోట్ల ద్రాక్షాపాకమును, మరికొన్ని చోటుల నారికేళ పాకమున అఖండ సమాసములు, పద్యములయందు వాడి తనకు భాషపైగల అధికారమును ప్రదర్శించెను. రచనావిషయమున నీకవి చంపకాదివృత్త చతుష్టయములతోపాటు అనేకములగు నితర (సంస్కృత) వృత్తములను నయితం వాడెను.[1]

1. స్రగ్విణి 2ఆ. 25వ. మంజుభాషిణి 2ఆ. 255వ. పంచచామరము 2ఆ. 256వ. చంద్రహాసబంధము 2ఆ. 157వ. మున్నగునవి.

చింతలపల్లి పండితులు: D. No. 618.

## బోరవెల్లి సంస్థానము - వంశక్రమము

మూలపురుషుడు ఎల్లయ్యగారు క్రీ.శ. 1530-1542 మధ్య జీవించెను.

| వరుస | పేరు | పెద్దవీర రాఘవయ్య బాంధవ్యము | వివరములు |
|---|---|---|---|
| 1. | ఎల్లయ్య | పెద్దవీర రాఘవయ్య గారి తాతకు ముత్తాత | వంశానికి మూలపురుషుడు. అచ్యుత దేవరాయ కాలము నాటివాడు గ్రంథకర్త క్రీ.శ. 1530–42. |
| 2. | జోగయ్య | పెద్దవీర రాఘవయ్యకు తాత | వైయాకరణి. |
| 3. | వెంకటయ్య | పినతాత | వైయాయికుడు. |
| 4. | మూర్తికవి | తండ్రి | జ్యోతిష్కుడు |
| 5. | వీరరాఘవయ్య | ఇతడే పెద్దరాఘవయ్య | మట్ల అనంతరాజు చేత సత్కారములును పొందిన వాడు. క్రీ.శ. 1600 దళవాయి తనము చేసినవాడు. |
| 6. | గోపాల కవి | పెద్దవీర రాఘవయ్య పెద్ద కుమారుడు | ఆర్య శతకమును చెప్పినాడు 1625. |
| 7. | ఛాయాపతి | పెద్ద వీరరాఘవయ్య మనుమడు (గోపాలకవి కుమారుడు) | 1650. రాఘవాభ్యుదయము రచించెను. |
| 8 | చిన్న వీరరాఘవుడు | మనుమడు పెద్దవీరరాఘవయ్య నాల్గవ కొడుకు కుమారుడు | మధుర వాణీ విలాస కర్త 372 మద్రాసు-ఎం.ఎల్. (అముద్రితము) |

| | | |
|---|---|---|
| 9. సంజీవ కవి | మనుమడు పెద్ద రాఘవయ్య 5వ కుమారుడు | చంద్రాంగదోపాఖ్యానం వ్రాసినవాడు క్రిమిద్రష్టము. |

నోటు:- పై వంశ క్రమము ప్రకారం పెద్ద వీరరాఘవయ్యగారి కుటుంబములో నిరువురు కవుల విషయములు- గ్రంథములు మాత్రమే లభించును.

1, గోపాలకవి కుమారుడగు ఛాయాపతి.

2. మధురవాణీ విలాస కర్త్రయగు చింతలపల్లి చిన్న వీరరాఘవయ్య.[1]

## ముష్టిపల్లి వేంకటభూపాలుడు. ( 17 శతాబ్ది చివర )

ఈ వెంకట భూపాలుడు రాజకవి. ఇతని జన్మస్థలము రాజపోలు (రాజోలి) అను నగరము. ఇది గద్వాల సంస్థానమునందు గలదు. ఈ వెంకట భూపాలుడీ నగరమునకు ప్రభువై, దివ్యదేశ మాహాత్మ్య దీపిక, మున్నగు గ్రంథములను రచించెను. ఈ నగరము తుంగభద్రానదీ తీరమున గలదు. ఇచట తుంగభద్ర రెండు పాయలుగా చీలి ముందుకు ప్రవహించును. రెండుపాయల మధ్య నొక లంక ఏర్పడినది నేటికి ఈ రాజపోలు నగరమందు శిథిలములను కోటలు రాజ ప్రాసాదములు రాజపోలు పూర్వ వైభవమును వేనోళ్ళ చాటుచున్నవి. అచటి దుర్గ మధ్యమున వీరనారాయణ స్వామి ఆలయము గలదు. నగరమునకు రెండు మైళ్ళ దూరమున నది యొడ్డున రామేశ్వరాలయము గలదు. ఈ ఆలయమునకు ముందు భాగమున చాళుక్య భూలోక మల్లుని శాసనమున్నటుల శ్రీ మారమండ రామరావు గారు తెల్పిరి.[2]

ముష్టిపల్లి వెంకటభూపాలుని వంశీయులు గద్వాల ప్రభువులకు జ్ఞాతులు. వీరును పాకనాటి వారే. మిడిమిళ్ళ గోత్రజులు. ఈ ప్రభువులు ముష్టిపల్లి యింటి పేరు పేరుగలవారై రాజపోలును రాజధాని గావించుకొని ఈ ప్రాంతమును పాలించినారు. కాని ఈ ప్రాంతము గద్వాల సంస్థానములో నెటుల విలీనమైనదో కారణము తెలియదు. వంశమును బట్టి గద్వాలవారికి వీరు జ్ఞాతులని తెలియుచున్నది.

1. ఆరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం సం 11 – పుట. 203.
2. డా. మారమండ రామారావు – కాకతీయ సంచిక – పుట 271.

గ్రంథము.

ఈ రాజకవి రచించిన 'దివ్యదేశమాహాత్మ్య దీపిక' యను ద్విపద కావ్యము ఇరువది మూడు తాళ పత్రములపై గలదు.[1] ఇందు నూట ఎనిమిది దివ్య స్థలములు, వాటి మహాత్మ్యములను వర్ణితములు. ఇది అముద్రితము.

ఈ రాజకవి తన వంశ క్రమమును ఈ ద్విపదలో తెలియజేసెను.

"కులములు తప్పులు దీర్చుకొను పాకనాటి
కులములో మిడిమిళ్ళ గోత్రుడై నాడ
గౌడు దేశాయన గణుతికి నెక్కి
ప్రోడయై సకల భూముల కీర్తిగాంచె

ఆ ప్రభు కనుజన్ముడా చినరెడ్డి
దేవి లక్ష్మాంబ ప్రతిభ గుణాలంబ
ధరఁ వెలసె సకల ధర్మస్వరూప
గరిమచే నా సాధ్వి గనియే లక్ష్మకు

మారాను గుణరూప మహితు కుమారు
ధీరుచిన్న విభునుద్దీపితో దారు

నాఘనుండు వివాహమయ్యె ముదమున
శ్లాఘనీయ కృపాలంబను లింగ
మాంబ నా దంపతు లర్థినన్ గాంచి
రంబుజోదర పద ధ్యాన పారీణు

శ్రీ వెంకటేశ భూరి కటాక్ష లబ్ద
పాపన కవి తాను భావుని గాడ
నామ వెంకట దాసునయము దీపింప
ధీమంతులెల్ల నెంతే సంతసింప-

---

1. ము. వెంకట భూపాలుడు - దివ్య దేశమహాత్మ్య దీపిక - తాళపత్ర ప్రతి - ఓరియంటల్ లైబ్రరీ - హైదరాబాదు.

మున్ను నే జేసిన పుణ్యఫలమున
నెన్నని కిచ్చితి ద్విపద గావించి
దివ్య దేశమాహాత్మ్యన దీపికా కావ్య
మన్వయ సౌఖ్యదమై రాజ సభల

పూచిన సంపెంగ పోడిమి దాల్చి
యాచంద్ర తారార్కమై యొప్పుగాత"

అని వ్రాయుటచే వీరి వంశ క్రమమించుక తెలియుచున్నది. ఈ గ్రంథము నీ రాజకవి కుల యిలవేల్పగు కేశవస్వామి కంకితము గావించెను.

ఇందలి గ్రంథాంతమందిటుల చెల్పబడుచున్నది.

"అని చెప్పి శ్రీ వెంకటాధిపు పేర
వనజ నేత్రుని పేర వరదుని పేర
రాజించు తుంగభద్రా తీరమందు
నా నగరి రాజపూర్ణ్నగ రావతంస
రమణ వైకుంఠ నారాయణ పేర
మమతతో నన్నేలు మాధవు పేర
నయముగాను జనార్ధను స్వామి పేర
జయమిచ్చినట్టి కేశవు దేవ పేర
ప్రేమనంకిత మొనరించి ప్రోగ్గంటి
వరసుత కరుణా వనోదయా వాప్త
యోగ భాగ్యోదయుల్ ముష్టి పల్లెంశ
సాగర చంద్రులు సద్గుణ సాంద్రు
లుదయించి రందులో మర్త్యేశ మౌళి
విజయుడిమ్మడి యెల్ల జనపాలుడలరు"

అను మాటచే ఈ వంశకర్త ఇమ్మడి ఎల్లారెడ్డి యను విషయము తెలియు చున్నది.

## గ్రంథవిషయము.

ఈ దివ్య దేశికా మాహాత్మ్య దీపిక, యనునది నూటఎనిమిది దివ్య స్థలము లను, వాటి మహాత్మ్యములను దెలుపు ద్విపద గ్రంథము కీర్తనలు గల రెండు తాళపత్ర సంపుటములు గలవు.[1] ఇవి కూడ మిక్కిలి శిధిలావస్థలో నున్నవి. చాలా భాగము క్రిమిద్రష్టము.

## ఇతర గ్రంథములు:

ఈ రాజకవి రచించిన మరొక గ్రంథము రాజపోలు వెంకటేశ్వర శతకము అముద్రితము. రెండు తాళపత్ర సంపుటములలో మొదటి సంపుటములోనే వెంకటేశ్వర శతకము గలదు. ఈ శతకమందు 109 కందపద్యములున్నవి. మిక్కిలి శిథిలావస్థలో నున్నవి.

ఈ శతకము రాజవోలు వెంకటేశ్వర స్వామి కంకితమీయబడినది.

## వెంకటేశ్వర కీర్తనలు.

శతకము వ్రాసిన తర్వాత 1 నుండి 1552 సంఖ్య వఱకున్న కమ్మలో వెంకటేశ్వర కీర్తనలు గలవు. పత్ర సంఖ్య 63 తో నాగిపోయినది. ఇక రెండవ సంపుటమునువానిలో, నీ రాజవోలు వెంకటేశ్వర కీర్తనలు 1551 నుండి 3476 వఱకు అని వ్రాయబడి యుండుటచే మొత్తము మూడువేల నాల్గువందల డెబ్బది యారు కీర్తనలీ రాజకవి రచితమనియొనని డా. బి. రామరాజుగారభిప్రాయ పడిరి.[2] అయినను రచనను బట్టి చూడగా ఒకరి చేతిమీదుగా రచింపబడినటుల తెలియుచున్నది.

---

1. ముష్టిపల్లి వెంకటభూపాలుడు. రాజవోలు వేంకటేశ్వర శతకము - మొదటి సంపుటము - వెంకటేశ్వర కీర్తనలు - రెండవ సంపుటము. ఓరియంటల్ లైబ్రరి హైదరాబాదు. (తాళపత్ర ప్రతులు)

2. డా. బి. రామరాజు - రాజవోలు ముష్టిపల్లి వేంకటభూపాలుడు - వ్యాసం 1-3-1961 గోలకొండ పత్రిక.

### శతకము:

ఈ రాజకవి రచించిన వెంకటేశ్వర శతకము రెండవ గ్రంథము. ఇందు 109 కంద పద్యములు గలవు. రాజవోలు వెంకటేశ్వర స్వామి కంకితమీయబడినది.

కవిగారి రచన నరయుటకై ఒకటి రెండు పద్యములు:-

మొదటి పద్యము:-

కం॥ శ్రీ రమణీ ప్రాణేశ్వర
వారిజ లోచన మురారి..... నమ
స్కారమిదె రాజవోలి వి
హారుని వలె కరుణ వెంకటాచలరమణా.

ఇందలి చివరి పద్యము:-

కం॥ నరవర యెప్పుడు చాలా
నిరతము మది నమ్మినాడ నీ దాసుని గన్
మరువకుము రాజవోలి?
వా[illegible]లను కరుణ వెంకటాచల రమణా!

ఇది వెంకటాచల రమణా, యను మకుటముచే వ్రాయబడిన శతకము.

### విశిష్టత:

శతకములో గల మొత్తం 109 కంద పద్యములలో 56 (ఏబది యారు) పద్యములు 'ర' ప్రాసములో నున్నవి. 57 నుండి 66 గలవి 'న' ప్రాసములో నున్నవి. 67 నుండి 86 వరకు 'ల' ప్రాసము. 87 నుండి 106 వరకు గల పద్యములు బిందుపూర్వక 'ద' కార ప్రాసము మరల చివరి మూడు పద్యములు 'ర' ప్రాసములో గలవు. కవి పేరెచ్చటను వ్రాయలేదు.

### కీర్తనలు:

ఈ శతకము ముగిసిన తోడనే యదే తాళపత్ర ప్రతి 8వ, కమ్మనుండి రాజవోలు వెంకటేశ్వర కీర్తన లారంభమైనవి. పేరునకివి వెంకటేశ్వర కీర్తనలు

గాని వీనిలో వైష్ణవ మంతగా గన్పట్టదు. ఇందు కొన్ని శివ పరముగా కూడ వ్రాయబడియున్నవి. కావున మొదట ఈ రెడ్డు ప్రోల్గంటి సోమేశ్వరుని భక్తులు. కొంత కాలము తర్వాత వైష్ణవమును స్వీకరించినటుల తెలియును. 218 కీర్తనల తర్వాత ద్విపద పంక్తులు గానవచ్చును.

"శ్రీరామ చంద్ర యాశ్రిత సన్మునీంద్ర
కారుణ్య సాంద్ర భాస్కర వంశ చంద్ర" 1

10 మరియు 20 పంక్తుల ద్విపదకు కీర్తనల సంఖ్యను దృష్టియందు బెట్టుకొని సంఖ్యలు వేయబడినవి. 219, 220, 221, అను సంఖ్యలో నున్నట్టివి ద్విపదలే యని తెలియుచున్నవి. ఈ కవి 17 శతాబ్ది చివర లేక 18 శతాబ్ది పూర్వార్థ మతని కాలమని రచనలను బట్టి డా. బి. రామరాజుగారభిప్రాయపడిరి. 2 మొదటి కీర్తన యిటులున్నది.

కీర్తన:- మారువ రాగం - ఆదితాళం

కీర్తన- రామరామ మిము నమ్మిన దాసుల
రక్షించగ ఇక ఎవరున్నారు
స్వామి పరాకు............
పై నేమి నేరములు గల్గిన నైన. 1

పల్లవి- నే జేసిన పాపములన్నియును
... ... ...
ప్రేమ నిల్వగా సేయుము వేడుక
సామజ వరధ శ్రీనివాసహరి 2
రాజవోలు కేశవుడగు వెంకట
రాయగౌడ భూపాలుని
తేజము మీఱగ సేవ పరునిగా
పూజితముగ దయజేసి ఏలితివి 3

1. డా. బి. రామరాజు - మరుగుపడిన మాణిక్యాలు - పుట. 64.
2. డా. బి. రామరాజు - వ్యాసం. గోలకొండ పత్రిక - 1-8-1961.

రామరామ-

ఈ పద్ధతిలో నీ రాజకవి కీర్తనలు రచింపజడినవి. ఇక రాజునకు శత్రువు వలన నేమి యాపద సంభవించనదో ఈ కీర్తనల వలన రాజు స్వామిని వేడుట గనపట్టుచునది.

తోడిరాగం - అడతాళం

కీర్తన- భారంపు సంసార వల్లల దగిలి మిమ్ము
వేర నేర నైతిగా ఓరంగా!
ఏరీతి ననుజూచి రక్షించెదో
కారుణ్యము మీరగ ఓరంగా! 1

పల్లవి కాయము నిత్యము గాదని మీపాద
కమలాము లర్థితోను ఓరంగా!
... ... ...
రణజయమిచ్చి శాత్రవుల మర్ధించినన్
రక్షింపమని వేడితే ఓరంగా! 2

గణనోన్నత నాడగౌడ గౌడభూ
కాంతుని వెల్లప్పుడు ఓరంగా!
అనిమాదులొసగి వెంకట రాజ వోలిని
వీర శ్రీ చెన్నరాయ ఓరంగా!

అచటచట కీర్తనల మధ్య ద్విపదలు కూడ వ్రాయబయున్నవి. తాళపత్ర ప్రతి శిథిలావస్థలో నున్నది. [1]

## రాజవోలు ప్రభువుల వంశక్రమము.

దివ్యదేశ మాహాత్మ్య దీపిక ననుసరించి- ముష్టిపల్లి ఇమ్మడి ఎల్లారెడ్డి
సోదరుడు
చిన్న రెడ్డి (భార్య లక్ష్మాంబ)
చిన్న విభుడు (భార్య లింగాంబ)
రాజవోలు వెంకటభూపాలుడు
(దివ్యదేశ మాహాత్మ్యన దీపిక కృతి కర్త

1. ము. వెంకటభూపాలుడు - వెంకటేశ్వర కీర్తనలు - తాళపత్ర ప్రతి - ఓరియంటల్ లైబ్రరి - హైదరాబాదు.

## రాజవోలు సుబ్బరాయ కవి: (17 శతాబ్ది)

ఈ రాజవోలు సుబ్బరాయకవి 'జయవిజయాభ్యుదయమ'ను ఆరాశ్వాసములు గల ప్రబంధమును రచించెను.

## వంశము:

ఈ కవి ఆరువేలనియోగి బ్రాహ్మణుడు. అపస్తంబ సూత్రుడు. శ్రీవత్ససగోత్రుడు. ఇతడు సంస్కృతాంధ్ర భాషలందసమాన పాండిత్యము గలవాడని గ్రంథమందలి పద్యములను బట్టి తెలియుచున్నది. ఈ కవి తన గ్రంథమును రాజవోలు వెంకటేశ్వరునకంకితము గావించెను. ఈ కవి నివాసము కర్నూలు మండలములోని సిరివెళ్ల తాలూకా రాజోలు గ్రామమని చాగంటివారు వ్రాసిరి.[1] కాని రాజవోలు, రాజోలు, ఇపుడు రాజోలి, యను పేరుతో వ్యవహరింపబడు గ్రామము పూర్వము నాడగౌడ వెంకటభూపాలుడు కద్వాల సమీపమందలి రాజవోలును పాలించినాడు. రాజోలు పాలించిన ప్రభువులు కూడ గద్వాల రాజులవలె పాకనాటి వారు. వీరిది మిడిమిళ్ళ గోత్రము. ఇంటిపేరు కూడ ముష్టిపల్లి వారు. వీరికి 'నాడగౌడ' దేశాయి, అను బిరుదులుండినవి. గద్వాల రాజులకు వీరికి బంధుత్వము గలదు. ఈ ప్రదేశము కూడ గద్వాలలో చేరినది.

ఈ వెంకటభూపాలుడు రాజవోలు పరిపాలకులలో నొకడు. ఇతడు విష్ణుభక్తుడు. ఈ ప్రభువు 'దివ్యదేశమాహాత్మ్యన దీపిక, యను ద్విపద గ్రంథములో పావనంబగు తుంగభద్రా నదితీర భాసుర రాజవోల్పట్టణాఖ్యుడై , పొగడొందెనని తన వంశ క్రమమును గూర్చి వ్రాసినాడు ఈ సుబ్బరాయ కవియు ఈ క్రింది పద్యమున తన వంశీయుల గూర్చి-

సీ॥ శ్రీరమ్యమైన యార్వేల వంశాంబుధి
రాకాసుధాంశుడై రహి జెలంగి
పావనంబగు తుంగబద్రా నదీతీర
భాసుర రాజవోల్పట్టణాఖ్యు
డై పొగడొందెను హనుమంతయామాత్యు
డతని నందనలు ప్రఖ్యాత యశులు...

---

1. చా. శేషయ్య - ఆంధ్రకవి తరంగిణి సం॥ - పుట. 183.

అని తెల్పుటచే ప్రభువు మరియు సుబ్బరాయకవి యిరువురును తుంగభద్రా నదీతీర మందలి రాజవోలు నివాసులని ఇరువురు పేర్కొన్న పై పద్యములను బట్టి తెలియుచున్నది.

మరియొక యాధారమును బట్టి చూడగా నీ సుబ్బరాయ కవి తన గ్రంథమును రాజులకంకితము గావించుట కిష్టపడనివాడై వెంకటేశ్వరునకంకితము జేసితినని ఈ పద్యమున తెల్పినాడు.

చ॥ విమల మతిన్ మహాకృతులు వేడుకతో రచియించి మూఢభూ
రమణులకిచ్చి వారు సుకరంబుగ బ్రోవక యున్న గూటికై
శ్రమపడి చచ్చి దుర్గతి నజస్రమ బొందుటకన్న బత్తిరా
ఘ్ఘమునునకున్ సమర్పణముగా నొనరించిన గల్గుసౌఖ్యముల్ 1

అనుటచే నీకవి తన గ్రంథమును గ్రామ యిలవేల్పగు వెంకటేశ్వర స్వామికి అంకితము గావించుటను బట్టి ఈ కవి నివాసము గద్వాల సంస్థానమందలి రాజవోలు గ్రామమని చెప్పుట కవకాశమున్నది.

ఈ కవి వంశీయులలో హనుమంతరాయలు ముఖ్యులు. అదని కుమారులు తిమ్మప్రధానుడు, తిమ్మరుసయ్య, చెన్నప్ప అనుమువ్వురు గలరు, అందు తిమ్మరుసయ్యకు నలుగురు కుమారులు గలిగిరి. ఆ నలుగురిలో లచ్చన్న యను వానికి శేషాచలామాత్యుడను కుమారుడు గల్గెను. అనికి ఐదుగురు కుమారులు గల్గిరి. ఆ ఐదుగురిలో నేను సుబ్బరాయ నామధేయుడనని కవి తన వంశములను గూర్చి తెల్పెను. 2

## గ్రంథములు:

ఈ సుబ్బరా కవి చిత్రాంగదాపరిణయము, గరుడాంజనేయ సంవాదము, సుదంత పరిణయము, (ద్విపద) కృష్ణార్జున సంవాదము మున్నగు గ్రంథమును రచించినటుల సీసపద్యమున స్వయముగా తెల్పినాడు. 3

---

1. చా. శేషయ్య - ఆంధ్రకవి తరంగిణి 11 సం॥ పుట. 184.
2. సుబ్బరాయ కవి జయవిజయభ్యుదయము 1 ఆ. వంశ చరిత్ర.
3. చా. శేషయ్య ఆంధ్రకవి తరంగిణి 11 సం॥ పుట. 182-184.

ఈ కవి యితర గ్రంథములేవియు లభించలేదు. కవి కాల నిర్ణయమునకు తగిన యాధారములేవియు లేనందున పింగళి సూరనార్యుని గ్రంథము ననుకరించుటచే నీ కవి పదునేడవ శతాబ్ది (17 శతాబ్ది) యందుండ వచ్చును. కవి రాజోలు ప్రభువగు ముష్టిపల్లి వెంకట భూపాలునకు సమకాలికుడై యుండునని చెప్పవచ్చును. చాగంటివారును తమ గ్రంథమందు నీ కవి పదునేడవ శతాబ్దికి చెందినవాడనియె తెల్పినారు. [1]

ఈ కవి తనకు పరాశర వెంకటబట్టు గురువనియు 'వినుతి యొనర్తు మద్గురుని వెంకటబట్టురు దేశికేంద్రునిన్' అని ఒక పద్యమున తెల్పి మరియు రమణార్యుడను నతడు కూడ విద్యా గురు రమణార్యున్నభజింతు గురు వాక్ప్రౌడిన్, విద్యాగురువని యిరువురిని రెండు పద్యములలో స్తుతించెను.

## ఇతివృత్తము-శైలి:-

ఈ కవి తాను రచించిన ప్రబంధమొక కల్పనా కథ యనియు పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయమును బోలి యుండుననియు నా దృష్టితో తానీ గ్రంథమును రచించినాడనని స్వయముగా నీ పద్యమున తెలియజేసినాడు.

మ॥ ఘనుడా పింగళి సూరపాఖ్య కవి లోకశ్రేష్ఠుడెంతో రహిన్
మును జెప్పెన్విదితాంధ్రభాషను గళాపూర్ణోదయ గ్రంథమున్
వన వీధిన్ గజబృందముల్సనిన త్రోవం జీమలిచ్చారతిన్
జనునే తద్గతి నే నొర్తు కృతి శేషాద్రీశ! కారుణ్యతన్. [2]

అను మాటచే కావ్యేతివృత్తము కల్పనాకథ యని తెలియుచున్నది. కవితా చాతుర్యములో గాని ఇతివృత్త కల్పనము నందుగాని పింగళి సూరనార్యుని కళాపూర్ణోదయముతో నీ కావ్యము పోల్చుటకు వీలు కాజాలదు. అయినను రచనా విషయములో నితడు మృదుమధురశైలితో పాటు ప్రౌఢత్వము గూడ గలవాడని యతని గ్రంథము వలన వెల్లడి యగుచున్నది.

అనుకరణ విషయములో పింగళి సూరనార్యుని ననుకరించినాడని స్పష్టముగా తెలియుచున్నది. ఈ కవి కవితాశైలి నరయుటకై నిట రెండు పద్యములను పొందు పఱతును.

1-2 చా. శేషయ్య కవి ఆంధ్ర తరంగిణి 11 సం॥ పుట. 182-184.

ఉ॥ సంతతి లేని మానవుని జన్మము సార్థము గాదుగాననో
కాంత! వనాంత వీధికిని గారవ మొప్పగబోయి యయ్యుమా
కాంతుని మోక్షదాయకుని గాలగళున్మదిలోన నిల్పివి
శ్రాంతి మెయిం దపం బొనరసల్పి సుపుత్రుల గాంతు వేడుకన్ 1ఆ.

మ॥ మరుడన్గాటపు వేటకాడు కడు ప్రేమంగాంత వణ్యాసుం
దర కాసారమునం దనర్ఘమణి కీటకంబెన్న జేర్చుక్కనా
మురుతౌ సూత్రమున న్నమర్చి విడువన్మా మున్నుగా వచ్చునా?
శ్చర యుగ్మంబు బననొప్పె నేత్రములు నీ చంద్రాస్య కున్వింతగాన్

అర్థాలంకారములలో రూపకోత్ప్రేక్షలు మున్నగు నలంకారములతో ద్రాక్షా పాకమున నీకవి రచనసహాజత్వమును తెలియజేయుచున్నది.[1]

## కుమార వేంకటరాయలు.

ఈ రాజకవి 'ద్రౌపదీ కల్యాణము'ను అయిదాశ్వాసముల గ్రంథమును రచించెను. ఇతడు బోరవెల్లి నృసింహకవి శిష్యుడు పానుగల్లు దుర్గాధిపతి. ఈ గ్రంథముముద్రితము[2] దీనితోపాటు జారగడ్డుల ధర్మయ ప్రణీతమైన నృసింహ పురాణము. తాళప్రతియును గలదు ఈ తాళప్రతులన్నిని సంస్థానానంతరము గద్వాల వారు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము - హైదరాబాదు వారికి ఇచ్చినారు.

## తల్లిదండ్రులు.

ఈ రాజకవి తల్లిదండ్రులు రామాంబ వేంకటపతిరాయలు. బోయినిపల్లి వంశము. పెన్నాల గోత్రము. రామభూపాలుడీవంశమునకు మూలపురుషుడు. అతని భార్య సుబ్బమ్మగారని- ఈ రాజకవి తన గ్రంథమునందలి 37 పద్యమున వంశ క్రమమును గూర్చి తెలియజెప్పినాడు.

బోరవెల్లి నృసింహకవి సౌపర్ణోపాఖ్యానమను గ్రంథమును రచించెను. ఇతని తండ్రి కృష్ణప్ప యయాతి చరిత్రమును రచించెను. తాత మల్లన మంత్రి

1. తాళప్రతి - ఓరియంటల్ లైబ్రరి - హైదరాబాదు. మరియు ఆంధ్రకవి తరంగిణి 11 సం. పుట.
2. కుమార వెంకటరాయలు - ద్రౌపతీ కల్యాణము, తాళపత్రప్రతి ఆర్కేవ్స్- హైదరాబాదు.

చంద్రభాను చరిత్రమును వ్రాసెను. ఇట్టి పండిత వంశమునకు జెంది నృసింహ కవి పానుగల్లు దుర్గాధిపతి కుమార వేంకటరాయలకు గురువై యుండెను

ఒకనాడు రాజకవి యగు కుమార వేంకటరాయలు గురువగు బోరవెల్లి నృసింహకవికి తన స్వప్న వృత్తాంతమును వినిపించెను. నృసింహకవి రాజకవి నాశీర్వదించి 'ద్రౌపదీ కల్యాణమ'ను ప్రబంధమును రచించి వెంకటేశ్వరస్వామికి అంకితమొసగుమని సెలవిచ్చెను.

కం॥ నీ పద గుంభన లేర్పడ
గా పాకము రీతిశయ్య గారవ మొదవన్
ద్రౌపది కల్యాణం బన
గా పాండవ కథ రచింపగా దగినదయా 1ఆ. 56ప

అతని యానతి ప్రకారమీ రాజకవి గ్రంథమును వ్రాయుటయు నరిగెను.

## ఇతివృత్తము:

ద్రౌపదీ కల్యాణము పాండవేయుల కథ. ఈ గ్రంథమందలి కథ పాంచాల దేశమందలి రాజధాని యగు కాంపిల్యపుర వర్ణముతో ప్రారంభ మగును ఈ కవి తన ప్రబంధ రాజమును 1ఆ శ్వాసమున 520 పద్యములు ద్వితీయాశ్వాసము 603ప, తృతీయాశ్వాసము 948ప, చతుర్థాశ్వాసము 162ప, పంచమాశ్వాసము 339 పద్యములు మొత్తము 2912 గద్య పద్యములలో రచించెను. ఈ గ్రంథము తాళపత్రప్రతి అచ్చటచ్చట క్రిమిద్రష్టమైనది. ఈ రాజ కవి తన యిలవేల్పగు వెంకటేశ్వరస్వామిని మొదటి పద్యమున నిట్లు వర్ణించెను.

శా॥ శ్రీవత్సాంకము భూమి భామ యదుదృష్టిం జెట్టిలన్ తత్సమీ?
ఙాసృష్టిన్ దన దివ్య కౌస్తుభ మణిచ్ఛాయస్ని బంధించి శ్రీ
లావై ముఖ్యము దోపకుండ నలమేల్మంగ స్ఫురీరంభ సౌ
ఖ్యావిర్భూతి నలర్చు వెంకట నగాధ్యక్షుండు మమ్మేలుతన్ 1ఆ-1ప.

కవి తన గ్రంథము నవరసానుబంధంబై, అనుటచే నవరసములతో కూడిన వర్ణనలిందు గానవచ్చును.

సూర్యాస్తమయ వర్ణనము—

గీ॥ శశి నిశల బెండ్లి సేతకై సమయమును ము
హూర్త సంవేది గడియార మొదవ జేయు
ఘటము నీరెక్కి బంగారు గడియ కుడక
బోలె జరమాబ్ధి రవిబింబమును మునింగె    3ఆ—690ప.

## పోలికలు.

ఈ రాజకవి గ్రంథమున అల్లసాని చేమకూరి వారి పద్యముల పోలికలు గల పద్యములు గన్పించును. 1ఆ-129ప. 3ఆ 690 పద్యములు మున్నగునవి. చేమకూరి వారి పద్యపు పోలికగల పద్యమును పరికించునది.

కం॥ పరువపు మురువపు మొక్కల
పరిమళ ముం బోలె శుక్ల పక్షమున సుధా
కర రేఖకు సొంపునుం బలె
దిరమై నిండారె ద్రౌపదికి యౌవనమున్    3ఆ—755ప.

ఈ కవి రచనలో అలంకారములలో నర్థాలంకారములెక్కువగా నీ గ్రంథమున గన్పించును. అతిశయోక్తి 3ఆ-775ప, శృంగార వర్ణము 4ఆ-26ప. వేట వర్ణనము 1ఆ 391ప. సామెతలు-ఆడబోయిన తీర్థము 2ఆ 226ప. మున్నగున వెన్నియో యిందు గన్పట్టును. ఈ రాజకవి ప్రబంధమును శ్రీ వెంకటేశ్వర స్వామికి అంకితమొసగెను. [1]

## చింతలపల్లి చిన్న వీరరాఘవయ్య: (బోరవెల్లె సీమ)

చింతలపల్లి చిన్న వీరరాఘవయ్య 'మధురవాణీ విలాసము'ను గ్రంథమును రచించెను ఈ గ్రంథము రెండు తాళపత్రప్రతులు గలవు. [2] రెండవ ప్రతిలో ఐదు ఆశ్వాసములు గలవు. దీని నిటీవల శ్రీ వల్లభరెడ్డి బుచ్చారెడ్డి గారు పరిష్కరించి సిద్ధాంత వ్యాసమును వ్రాసిరి.

---

1. కుమార వెంకటరాయలు - ద్రౌపతీ కల్యాణము - తాళపత్రప్రతి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము- హైదరాబాదు. (క్రమిదృష్టము)
2. R 14. D. 372. చి. చిన్న వీరరాఘవయ్య - మధువాణీ విలాసము - తాళతులు ఓరియంటల్ లైబ్రరి యూనివర్సిటి - మద్రాసు.

## తల్లి దండ్రులు:

ఈ చిన్న వీరరాఘవయ్యా తలిదండ్రులు లక్ష్మాంబ- వేంకటపతిరాయలు తాతగారు పెద్ద వీరరాఘవయ్యా. ఇతడు క్రీ శ. 16వ. శతాబ్దిలో మట్ల అనంత రాజుచేత సత్కారములు పొంది దళవాయి తనము చేసినవాడు. ఇతని మనుమడే ఈ చిన్న వీరరాఘవయ్యా. ఇతడు మధురవాణీ విలాస ప్రబంధకర్త. వీరిది వశిష్ట గోత్రము. పండిత వంశము.

ఇతని వంశీయులలో ననేకులు గ్రంథకర్తలైనట్లు పేర్కొనబడిరి. కాని ఈ తాళప్రతి యందు కొందరి గ్రంథములు మాత్రమే పేర్కొనబడినవి.

1. గోపాలకవి:- పెద్ద వీరరాఘవయ్యాగారి పెద్ద కుమారుడు క్రీ. శ. 1625 ప్రాంతమున 'ఆర్యా శతకమును రచించెను.

2. ఛాయాపతి:- గోపాలకవి కుమారుడు- పెద్ద వీరరాఘయ్యా గారి మనుమడు. క్రీ శ. 1650 ప్రాంతమున బోరవెల్లి సీమలో నుండి 'రాఘవాభ్యుదయము'ను కావ్యమును రచించెను (ముద్రితము)

3. సంజీవకవి: ఇతడు పెద్ద వీరరాఘవయ్యా ఐదవ కొడుకు యొక్క కుమారుడు 'చంద్రాంగదోపాఖ్యానమును రచించెను

4. చిన్న వీరరాఘవయ్యా:- ఈ కృతి కర్త పెద్ద వీరరాఘవయ్యా గారి నాల్గవ కొడుకు యొక్క కుమారుడు. మధురవాణీ విలాసకర్త (అముద్రితము)

---

తాళపత్ర ప్రతి మధురవాణి విలాసము D 618 ఒరియంటల్ లైబ్రరీ, మద్రాసు.

పైగల విషయము :

1 గ్రంథ నామము-మధురవాణి విలాసము (5 ఆశ్వాసములు)
2 విషయము-ప్రబంధము
3 కవి నామము-చింతలపల్లి వీరరాఘవ కవి
4 పద్య కావ్యము-కాగితము తెలుగు లిపి 5 ఆశ్వాసములు గలది
5 పుటలు-121-పంక్తులు 24
6 సమగ్రము-శిథిలము అని వ్రాయబడియున్నది.

ఈ చిన వీర రాఘువయ్య రాయదుర్గమున జాములో శతకమును కూర్చి కంకణాదులు గొనెను. నాల్గశ్వములు నగలను పొందెను. [1]

## కవితా సామర్థ్యములు :

ఈ కవి సకల సంస్థాన భూపాలురను తన కవితా సామర్థ్యములచేత మెప్పించి వారిచే సత్కారములు పొందినాడనుటకీ పద్యము ప్రబల సాక్ష్యమగు చున్నది.

సీ॥ జాములో శతకంబు సంధించి కంకణా
దులు గొంటి వలరాయ దుర్గమునను
బహుళావధానముల్వరపి నాలుగు నగల్
త్రేలేదినందిణి మల్లధీరు వల్ల
వాగ్ధాటి సంప్రీన దిగ్ధరాధిప దత్త
వస్తువాహనముల వార్తగంటి
కూప వాపీ తటాకోపవనుల్సేసి
స్థిరకీర్తి జెందితి వురు తరముగ.

గీ॥ సకల భూపాల సంస్థాన శంసనీయ
నిజ చతుర్విధ కవితాభినేయపాండి
తీ సమాఘోక నాపూర్ణ దిక్ప్రదేశ
వీరరాఘువకవి (నీ) సరి విబుధులేరి?

అనిచెప్పుటచే నీకవి అవధానములతో పాటు చతుర్విద కవితల (ఆశుబంధ గర్భచిత్ర) నల్లగలవాడని తెలియుచున్నది.

## ఇతివృత్తము:

మధురవాణి పాంచాలరాజు కుమార్తె. ఈమెను కార్తవీర్యార్జునుడు వివాహమాడుట ఇందలి యితివృత్తము. 5 ఆశ్వాసములు గలది. ప్రథమాశ్వాసము 178 ప, ద్వితీయాశ్వాసము 172 ప, తృతీయాశ్వాసము 115 ప, చతుర్థాశ్వాసము 101 ప, పంచమాశ్వాసము 105 గద్య పద్యములతో కూడిన రసవత్ప్రబంధము.

---

1. ఆరుద్ర-సమగ్రాంధ్ర సాహిత్యం. సం. 11-చింతలపల్లి కవులు-పుట 213.

చిన వీరరాఘవయ్య తన యిలవేల్పగు శ్రీవేంకటేశ్వరుని మొదటి పద్యమున యిట్లు స్తుతించినాడు.

శా॥ శ్రీకల్యాణి సురత్నభూషలు తనుంజేర్పంతదాకారితా
నేక శ్రీల వరించు భ్రాంతికయిలన్నీ గోరు భావంబు దా
నాకాంక్షించి నిరంతరాయముగ దత్ప్రాణేశ వక్షస్థలిన్
జేకో నౌనల మేల్దార న్గొలిచెదన్ శ్రీవేంకటాద్రిప్రభున్ 1ఆ. 1ప

## వైదుష్యము - వర్ణనలు:

ఈ గ్రంథమున చిన్న వీరరాఘవయ్య గ్రంథమందలి 1ఆ. 78 పద్యమున తన వంశీయులు చక్కని పండితులని దెల్పెను. ఇతడు జ్యోతిష్యమందును దిట్ట యని 2ఆ 69, 125, 5ఆ. 19, 21 పద్యముల వలన దెలియుచున్నది.

వర్ణనల విషయములో నీ రాఘవయ్య 3 ఆ 173 ప. శృంగార రసవర్ణనము, 3 ఆ 33 ప జలకేళి వర్ణనము, 4 ఆ 49 ప వేగుచుక్క వర్ణన, 4 ఆ 65 ప. తారకల వర్ణన మున్నగు ప్రబంధ వర్ణనలను తన గ్రంథమున గావించెను.

ఈ కవి సంప్రదాయ సిద్ధమైన కల్పనా పాండిత్యము గలవాడు. అయితే తగిన ప్రభువు లేకపోవుటచే నితడు కవిత్వమును విడిచిపెట్టజూచెను. అపుడు పెద్ద లీ కవిని గూర్చి యిటులనిరి.

శా॥ ఓ విద్వన్మణి సంప్రదాయమున నీకుదోృధమై కల్పనా
ప్రావీణ్యంబు లభించె నందుతగు బోల్పన్ నాథుడున్ లేమిచిం
తావిర్భావమునం జిహాసగొననేలా! మేల్కవిత్వంబహో
'కావిద్యా కవితా వినా? యనెడి విఖ్యాతించెవిం జూర్పవే. 1ఆ 20ప

నిజమే! కావిద్యా కవితావినా? అయినను రసజ్ఞుడును, పోషకుడును లేనిదే ఏ కవిగారి మధుర వాణియు వినిపించదు గదా. ఆ విషయమును చిన వీరరాఘవయ్య తన కావ్యమున విశ్లేషించెను.

గీ॥ అలరసజ్ఞుని పొడగాంచునది మొదలుగ
మధుర వాణికి తెల్వియన్మరులు దోచె
అలరసజ్ఞునికి పొడగాంచునది మొదలుగ
మధుర వాణికి తెల్వి ధర్మంబుగాదె. D 372-3 ఆ 60 ప.

ఈ చినవీరరాఘవయ్యగారికే రసజ్ఞుడు లభించెనో తెలియవచ్చుట లేదు. బహుశా ఛాయాపతివలె నితడు కూడ బోరవెల్లి ప్రభువుల నాశ్రయించి యుండ వచ్చును. చింతలపల్లివారికే గాక ఇతర కవి వంశములకు కూడ బోరవెల్లిరాజు కుటుంబము ఆశ్రయమిచ్చినది. చింతలపల్లివారి మూలపురుషుని అచ్యుతదేవ రాయలు సత్కరించగా, లయగ్రాహి కవుల మూలపురుషుని కృష్ణదేవరాయ లేనుగుల నిచ్చి సన్మానించినారు [1] ఈ రెండు పండిత కుటుంబములను బోరవెల్లి ప్రభువులు సత్కరించి వారిచే గ్రంథములు వ్రాయించినారు.

## కొటికలపూడి వీరరాఘవ కవి: 17వ శతాబ్ది ప్రథమ

పంచమ వేదమని ప్రసిద్ధిగల మహాభారతము నందలి ఉద్యోగపర్వమును కొటికలపూడి వీరరాఘవకవి యాంధ్రానువాదము గావించెను.

## తల్లి దండ్రులు:

ఈ కవి తండ్రి రంగకవిగారు. తాత శ్రీరంగశాయిగారు. రంగశాయి తండ్రిపేరు సూరకవి వీరిది శాండిల్యస గోత్రము. యాజుష సాంప్రదాయము. వీరరాఘవయ్యకు 'అభినవ తిక్కన' అను బిరుదము గలదు.

మొదట వీరరాఘవయ్యగారి జన్మస్థలము వినుకొండ. అనంతరము కవి పెదసోమభూపాలుని (గద్వాల) కోరికపై గద్వాలకు వచ్చి స్థిరపడిపోయినాడు. గద్వాల పెదసోమభూపాలుడు క్రీ. శ. 1663-1712 మధ్య రాజ్యపాలనము గావించెను. అతని కాలమునాటి వాడకవి యగుటచే 17వ శతాబ్ది ఉత్తరార్థ మునకు చెందినవాడని చెప్పవచ్చును.

## భారతముద్యోగ పర్వము:

ఈ వీరరాఘవయ్య అనువాదము గావించిన భారతమందలి ఉద్యోగ పర్వము గద్వాల 'సాహిత్య ముకురమ'ను ముద్రాక్షరశాలయందు శా. శ. 1821 - క్రీ. శ. 1899లో ముద్రణము గావింపబడినది. పెదసోమభూపాలు డీకవిని గూర్చి 'భారతము తెనుంగు జేయుము ధరన్ ప్రచురంబును సాంగమై తగన్' అని కోరినాడు. ఈ ఉద్యోగపర్వము నాంధ్రానువాదము గావించక

---

1. ఆరుద్ర-సమగ్రాంధ్ర సాహిత్యము. సం. 11 పుట 214.

పూర్వమే రాజానతి భీష్మ పర్వమును కొంత పూర్వరచిత శేష గ్రంథమును ఈ రాఘవయ్య పూరించగా విని పెదసోముడు సంతోషపడినాడు.

ఈ రాఘవయ్య పూడూరు కేశవస్వామి తనకు స్వప్నమున కనిపించి 'ఉద్యోగపర్వ మొక్కటి అద్యతన మొనర్పుమీవు సాంగంబుగనీ విద్య ప్రకాశ మొనయగ' నని చెప్పగా తానీ ఉద్యోగపర్వమును రచించితినని గ్రంథమున తెల్పెను. అవతారికను బట్టి చూడగా వీరరాఘవయ్య భీష్మపర్వమున తిక్కన గారు వదలిన భాగమును మాత్రమే తెనిగించినటుల దెలియుచున్నది.

భీష్మ పర్వమున తిక్కనగారు తెనిగించక వదలిపెట్టినట్లుగా కనిపించు విషయము భగవద్గీత. తిక్కన భగవద్గీత యందలి అర్జున విషాదయోగము వంద శ్లోకములను కొన్నింటిని అనువదించి, కొన్నింటికి తాత్పర్యములు వ్రాసినాడు.

భగవద్గీత మొత్తం 708 శ్లోకములుగల గ్రంథము అందు తిక్కనగారు ప్రథమాధ్యాయము, ఏకాదశాధ్యాయముల నధికముగా ననువదించినాడు. ఇక ద్వితీయాధ్యాయమున పది, పదునైదు శ్లోకముల కర్థమును, 18వ అధ్యాయమున 7, 8 శ్లోకముల కర్థమును తిక్కనగారి భీష్మపర్వమున నున్నటుల కనిపించుచున్నది. అటుల తిక్కన వదలిన భీష్మ పర్వమునందలి భగవద్గీతను వీరరాఘవయ్య అనువదించి యుండవచ్చును అటులే తిక్కన వదలిన భాగములను కూడ పసిగట్టి వీరరాఘవయ్య అనువదించి యుండవచ్చును ఇది భీష్మపర్వ విషయము.

ఇక 'నవీనంద్రోణ పర్వం' అనునది కూడ ఈ కవి రచనయేయని, అతని శైలిని మరియు పూడూరు చెన్నకేశవున కంకితమును బట్టి తెలియుచున్నదని డా. బి. రామరాజు గారభిప్రాయబడిరి. 1

మొదట గద్వాల రాజుల కిలవేల్పగు కేశవస్వామి పూడూరులో నిలిచి గద్వాలకోట నిర్మాణానంతరమా మా స్వామి గద్వాలలో నిలిచెను.

ఎందులకుద్యోగ పర్వము రచింపవలెను? తద్రచనావశ్యకమేమి? అను ప్రశ్నలకు సమాధానముగా కేశవస్వామి కవికి స్వప్నములో సాక్షాత్కరించి

1. డా. బి. రామరాజు 'మరుగుపడిన మాణిక్యాలు' కొ. వీరరాఘవకవి వ్యాసం. పుట 14-15.

'ఉద్యోగపర్వ మొక్కటి అద్యాశన మైనదర్వము' అటుల జేయుట లోకోపకార మగును. అంతియేగాక నృపనీతి, ధర్మతత్త్వాదులిందే ప్రకటితములగునని తెల్పెను. పూర్వులు మూలమునకు సంగ్రహాంధ్రచిత మైనటుల మాత్రమే రచించిరి. నీవు యథాశ్లోకపూర్వపరిశీలన తెనిగింపుమని' స్వామి చెప్పిన కోరికను కవి స్వయముగా గ్రంథమున తెల్పినాడు.[1]

## ఉద్యోగపర్వ విషయము:

పెదసోముని ఆజ్ఞచే నీ రాఘవయ్య ఉద్యోగపర్వమును పూర్తి గావించి నాడు. ఇతడు పూడూరి కేశవస్వామి కల్పితముగా 'నుద్యోగపర్వంబువిస్తార శ్రీదెనిగింతు నందలి కథాప్రారంభణం బెట్లనన్, అని యారంభించెను.

పోశ్చని రాజవంశము నాశ్రయించుకొనియున్న కొటికలపూడి వంశమొక టున్నది.[2] కాని అతడీ రాఘవయ్య కాదు. ఆ వంశీయులది హారితస గోత్రము. ఈ రాఘవయ్యది శాండిల్య గోత్రము.

రాఘవయ్య లెక్క ప్రకారము సంస్కృత మూలమునకుద్యోగ పర్వము రెండువందల అధ్యాయములతో నున్నది. క్రీ.శ. 1929 వావిళ్ళ ప్రచురణ సంస్కృతభారతమున నూటతొంబది పడు అధ్యాయము లున్నవి. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి లెక్క ప్రకారము ఉద్యోగపర్వము నూటఎనుబదియారు అధ్యాయములున్నది. శ్రీ ఎస్ సి. ముఖోపాధ్యాయగారి సంపాదకత్వమున వెలువడిన ఆంగ్లానువాదమున 156 అధ్యాయములే యున్నవి. పూనా భండా ర్కరు పరిశోధన సంస్థ 197 అధ్యాయములను తెలుపుచున్నది నన్నయగార ధ్యాయముల సంఖ్యను చెప్పలేదు నాలుగైదు భారత ప్రతులను గాంచి పరి శీలించిన శ్రీ వెంకటాచలం అయ్యరుగారు శ్లోకములలో క్రమానుసారము కని పించుట లేదనిరి. ఇక ఉద్యోగపర్వమందలి 'సనత్సు జాతీయము' శ్రీమచ్ఛంకర భగవత్పాదల వ్యాఖ్యతోనున్నది.[3]

---

1. కొ. వీరరాఘవకవి-ఉద్యోగపర్వము-అవతారిక పుట 4-9.
2. కోట లక్ష్మీనారాయణగారి వ్యాసం-భారతి. మే 1954
3. కొ. వీరరాఘవయ్య-భారతోద్యోగ పర్వము-అవతారిక పుట 4-8.

## తారతమ్య పరిశీలనము:

వీరరాఘవయ్య తన గ్రంథమందలి గద్యలో—ఉద్యోగపర్వమును తెనిగింప నుద్యోగించితి నిమ్మహాభారతమును మున్ను నన్నయభట్టారకుడు మూడు పర్వములు తెనిగించె నారణ్యపర్వశేషమును కొంత ఎఱ్ఱనార్యుడు రచించెను. విరాటపర్వము మొదలుకొని 15 పర్వములు తిక్కన సోమయాజులు నిర్మించిరి. వారందరు వేదవ్యాస ప్రోక్తంబైన మూల శ్లోకములన్నియు తెనిగించిన బహుగ్రంథవిస్తరంబగు, లిఖింప పఠింప వినఁదరంబుగాకుండు, లేఖన పఠనాదులు మిగులగలగకుండగను తలంపున సపాద శతసహస్రశ్లోక సంఖ్యాతమైన భారత సంహితయందలి కథా సారాంశములు గ్రహించి కబ్బమును రచించిరి ఏనీ పర్వంబునంగల మూలశ్లోకములంగల యర్థంబంతయు నాకు తెలిసినంత తెలుగు కబ్బమున బ్రసంగింపగడంగితి, అను మాటచే నితడు యథాశ్లోకానువాదము గావించెననుట సత్యము.

తిక్కనగారు విదురనీతిని సంగ్రహించిరి. విదురుడు ధృతరాష్ట్రునకు జేసిన బోధలో నీతి వాక్యములుగా రెండుపాఖ్యానములున్నవి. సుధన్వోపాఖ్యానమొకటి సాధ్యాత్రేయ సంవాదమని మరియొకటి. తిక్కనగారు సుధన్వుని కథను మాత్రము గ్రహించి ఒక ఆటవెలది, తేటగీతి, నాలుగైదు పంక్తుల వచనము వ్రాసి సూచించి వదలిరిగాని సాధ్యాత్రేయ సంవాదమును స్పృశింప లేదు.

ఇక సనత్సు జాతీయము నాల్గు అయిదు అధ్యాయముల గ్రంథమా? అని ఒక సందేహమున్నది. కాని సనత్సు జాతీయము శ్రీమచ్ఛంకరుల వ్యాఖ్యతో నాల్గధ్యాయముల గ్రంథము గలదు. తిక్కనగారు సనత్సు జాతుడు వచ్చి ధృతరాష్ట్రునకు తత్త్వోపదేశము జేసిపోయెనని వ్రాసిరేగాని ఏమి తత్త్వముపదేశించెనో వ్రాయలేదు ఇటుల-తిక్కన తన భారతోద్యోగపర్వమును సంగ్రహపఱచినాడు.

ఈ వీరరాఘవయ్య విదురనీతినంతయు ననువాదము గావించెను. ఇతడు చేసినంతవరకు సక్రమముగా ననువాదము జేసెను. శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి గారును పూర్తి అనువాదము గావించలేదు.[1] అట్టిది వీరరాఘవయ్య సక్రమముగా ననువాదము గావించినాడు.

---

1. డా. కే. రామకోటిశాస్త్రి-కొ. వీరరాఘవకవి-వ్యాసము. భారతి-సెప్టెంబరు 1960

మూలము :

శ్లో॥ ఏకయా ద్వే వినిశ్చిత్య త్రీంశ్చతుర్భిర్వశేకురు
పంచజిత్వా విదిత్వాషట్ సప్తహిత్వా సుఖీభవ

ఇది విదురుడు బోధించిన నీతి వాక్యములలో నొకటి.

**తిక్కనగారి అనువాదము :** శ్లోకమునిట్లే అనువదించిరి.

గీ॥ ఒకటిగొని రెంటినిశ్చల యుక్తి జేర్చి
మూటి నాల్గింటగడు వశ్యములుగ జేసి
యేనిటిని గెల్చి యాఱింటి నెఱిగి యేడు
విడిచి వర్తించువాడు వివేకధనుడు.[1]

మూలమున నున్న 'సుఖీభవ' అను మాటకు 'వివేకధనుడ'ని మాత్రమే మార్చిరి. శ్రీపాద వారు కూడా తిక్కనగారివలెనే పద్యములు వ్రాసి అడుగు భాగమున అర్థమును వివరించిరి ఈ రాఘవయ్య పూర్తిగా తాత్పర్యము బోధ పడునటులీ పద్యమున వ్రాసినాడు.

సీ॥ బుద్ధియొక్కటిచేత బుడమి ధర్మాధర్మ
ములు రెండు నిశ్చయ స్ఫూర్తి దెలిసి
ఆ మిత్రశాత్రవోదాసీనులమువ్వు
రందుపాయములు నాల్గుం దలంచి
వారినందఱ నాత్మవశుల గావించిన
యట్లనే యైదింద్రియముల గెల్చి
ప్రఖ్యాతసంధి విగ్రహములు మొదలుగా
గలిగిన షడ్గుణంబుల నెఱింగి

గీ॥ వేటజూదంబు వెలదుల కూటమి మధు
పానమున యుక్తిదానంబు పరుషదండ
పరుష వచనములనెడి సప్తవ్యసన
ముల వేడలిసమధికసుఖమొందుమీవధీశ. ఉద్యోగ. 3 ఆ.

---

1. చూ- కే. రామకోటిశాస్త్రి-వ్యాసం. భారతి-డిసెంబరు 1960.

ఈ విధముగా విదురనీతినంతయు నీ వీరరాఘవయ్య అనువాదము గావించెను.

## సనత్సు జాతీయము :

వీరరాఘవయ్య సనత్సుజాతీయము క్రమముగా ననువాదము గావించ లేదు. మొదటిది ధృతరాష్ట్రుని ప్రశ్న-అందుకు సమాధానముగా సనత్సుజాతుడు చెప్పిన మొదటి నాల్గు శ్లోకములను మాత్రమే వీరరాఘవయ్య అనువదించెను. తర్వాత మూడునాల్గు శ్లోకములకు తాత్పర్యమును వచనమును జెప్పెను. అనంతరము గీతాశాస్త్రమునంతయు నుపదేశించి వైశంపాయనుడు జనమేజయు నకు వెండియు నిట్లనియె, నని యితడు ముగించినాడు. తాత్పర్యమునకు నను వాదము జేయ బూనిన వీరరాఘవయ్య దీనినిటులేల వదలెనో తెలియుట లేదు. మరియు రాఘవయ్య ముచికుంద సృంజయులకథలను పూర్తిగా ననువాదము గావించినాడు.

## రచనా పద్ధతి :

రాఘవయ్య ఉద్యోగపర్వమనువాదమును సులభశైలిలో గావించెను అనువాదము గావున వీరరాఘవయ్య బుద్ధివైభవమును గనిపెట్టుటకు వీలు లేదు. మరి యితడు 'అభినవ తిక్కన' యని బిరుదమును పొందినాడుగదా! అయినను కవిత్వము వ్రాయుట వేరు, కవితాశక్తి వేరు. ఇచట వీరరాఘవయ్య గావించిన పనియొకటి గనుపించును. అధికముగా తెలుగు పదములను వాడుట తిక్కనగారి మాటలనే వాడుచు పద్యములు వ్రాయుట జరిగినది. ఇతని సులభ శైలి నరయుటకై రెండు పద్యములు.

## వీరరాఘవయ్య పద్యములు :

అర్జునుడు శ్రీకృష్ణుని వద్దకు వచ్చుసందర్భమున.

1. కం॥ అనినన్ కృష్ణుడు నిక్కమె
మునువుగ నీరాకయేను మున్నుగ క్రీడిం
గనుగొంటీ రాకయుం ద
ర్శనమున నొకరికొకరికాది సంభవమయ్యెన్. అ1.

2. కం॥ దెలియదు మమ్ముంబరులఁ
దెలియదు నఖిలార్థసిద్ధి దెలియదు నీవే
దెలియుదువు తగిన యుక్తుల
బలుకును మనకు హితవైన పలుకులనచటఁ. 5ఆ.

## ఈ క్రింది పద్యములు తిక్కనగారివి :

1. కం॥ బలవంతుడు పైనెత్తిన
బలహీనుడు గోలుపడినయట్టి యతడు ము
చ్చిల వేచువాడు గామా
కులచిత్తుడు నిద్రలేక కుందుదురధిపా. 2ఆ. 21ప.

2 కం॥ మమ్మెరుగు దెదిటి నెరుగుదు
నెమ్మియెరుగు దరసిద్ధినెటి యెఱుగుదు వా
క్యమ్ముల పద్ధతి నెరుగుదు
పొమ్మెవ్వడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 3ఆ 34ప.

వీరరాఘవయ్య రచనలో తిక్కనగారివలె ధారాశుద్ధి గలదు. ఇచట నీ కవి గావించిన పనులు రెండు గలవు. స్వంతముగా జేసిన రచనకు సంబంధించినది. తిక్కన ననుసరించి చేసిన యూహకు సంబంధించినది.

తిక్కనగారు-అర్జునుడు చెప్పిన మాటలను సంజయునితో ధృతరాష్ట్రునకు గద్యమున చెప్పించగా వీరరాఘవయ్య అర్జునుడు చెప్పిన మాటలను గ్రహించి దండకమున రచించెను. అనగా దండకమున వ్రాసినచో చాలా బాగుండునని రాఘవయ్య యూహ గావచ్చును.

ఇక రెండవది ఈ కవి తిక్కన ననుసరించిన విషయము. సనత్సుజాతుడు తెల్లవాఱువరకు తత్త్వోపదేశము చేసిన తర్వాత తిక్కన ప్రాతఃకాలవర్ణనము నెనిమిది పద్యములలో గావించెను. ఇది సంస్కృత భారతమున లేదు. కాని తిక్కనగారి ననుసరించి వీరరాఘవయ్య తొమ్మిది పద్యములలో ప్రాతఃకాల వర్ణనము గావించినాడు. ఇచట రాఘవయ్య తిక్కనగారి యూహననుసరించి వ్రాయుట జరిగినదని చెప్పవచ్చును.

కవిత్రయము తర్వాత భారత రచన గావించినవారిలో అథర్వణుడు మొదటివాడు. అతనివి కొన్ని పద్యములు మాత్రమే లభించునుగాని గ్రంథము లభించలేదు. వీరరాఘవయ్య శ్లోకానువాదమును గావించినాడు. కవిత్రయము తర్వాత ఒకే చేతిమీదుగా భారతమును రచించిన గౌరవము శ్రీపాదవారికి దక్కినది.

## కథావస్తు సంవిధానము :

తిక్కన తన భారతోద్యోగపర్వమును నాల్గాశ్వాసములలో రచించెను. వీరరాఘవయ్య ఎనిమిది ఆశ్వాసములలో రచించెను. దీనికి కారణము తిక్కన వ్యాసభారతమునందలి ముఖ్యపట్టణములను మాత్రమే గ్రహించెను. అచట ఔచిత్యమును పాటించుట అనౌచిత్యమైన చోటున వాటిని పరిహరించుటయు జరిగినది. కాని రాఘవయ్య ధ్యేయము శ్లోకానుకారణమే ముఖ్యము కావున ఈ కవి ఉద్యోగపర్వమును అధ్యాయక్రమానుసారముగా ననువాదము గావించి నాడు.

తిక్కన తన రచనలో ప్రధానవస్తు సంవిధాన చాతుర్యము మెరయ పఠితులకు విసుగు జనింపకుండ భారతమును ప్రవచించెను. రాఘవయ్యది శ్లోకానువాదదృష్టి కావున ఇతనిది తిక్కనగారికంటె నాల్గాశ్వాసము లెక్కువైనవి.

వీరరాఘవయ్యగారి రచనలోగల సంజయుడు-'యుధిష్ఠురుని వద్దకు వెళ్ళి భక్తినతుండై' అను మాటచే అతని సంభాషణాచాతుర్యము వెల్లడియగుచున్నది. సంజయుడు మొదట పాండవులను మెచ్చుకొన్నాడు. తర్వాత కౌరవులను యుద్ధమందు గెలువఁ సాధ్యమా! వారి శక్తి సామార్థ్యముల నెంతో నైపుణ్యముతో ధర్మరాజు నెదుట దెల్పుటచే వారలను గెలుచుట సాధ్యము. యుద్ధము మానుకొనుటయే యుచితమనుమాట ద్యోతకమగునట్లుగా తన సంభాషణా నైపుణ్యమును ప్రదర్శించినాడు.

పద్య రచనలో వీరరాఘవయ్య సిద్ధహస్తులు. తిక్కన రచనలో భీముని బలమును గూర్చి తెల్పిన మాటకు వీరరాఘవయ్య తెల్పిన విషయమున కెంతో భేదము గన్పట్టును.

## తిక్కనగారి పద్యము:

గీ॥ అలఘుగదబూంచికొని భీము డతిరయమున
గురుకుమారులపై తీవ్రకోపమెసగ
గవియుటాత్మభావించిన గంపమడరు
నిక్కమెవ్వరు మార్కొని నిలుచువారు. తిక్కనఉ. 1ఆ.267ప.

## రాఘవయ్యగారి పద్యము:

మ॥ అమితంబైన గదావహంబునకు హస్త్యారోహణ క్రీడకున్
సముడాభీమున కెవ్వడర్జునకన్నం బెద్దయో సద్రథో
త్తమయానోన్నతి యందుభూరిభుజ సత్త్వస్ఫూర్తియుతోనాగా
పము దుర్దామునఖండచండి మధనుఃపాండిత్యుడత్యుగ్రుడున్
1ఆ. 259ప.

వీరరాఘవయ్య తిక్కన పాత్రలను దృష్టియందుంచుకొని నాటకోచిత శైలిలో రచన గావించునటులీ పద్యమున దెలియుచున్నది. తిక్కన ద్రౌపది 'ఇవి దుస్ససేను వ్రేళ్ళందవిలి' అను పద్యమునకు రాఘవయ్యగారి ద్రౌపదికూడా-

గీ॥ భూమిపై దెగిపడి యతిశ్యామమైన
దుస్ససేనుని బాహువు ధూళి గ్రుంగి
యుండజూడక శాంతినే నొందుదాన
నెదురుటాచి త పదియు మూడేండ్లు నిండ. వీర.ఉ. 5ఆ. పుట200

అను మాటచే అతని శైలి దెలియుచున్నది.

## కొ. రాఘవయ్యగారి యితర కృతులు :

గద్వాల సంస్థానాధీశులిచ్చిన తాళపత్ర గ్రంథములలో కొటికలపూడి వీరరాఘవకవి 'నవీనంద్రోణపర్వం' అనునది యతని రెండవ కృతి. ఇది అరువది యాఱు తాళపత్రములయందున్నది. ఇదియును కవి వ్రాసిన మూలమునకు ప్రతి 'ధర్మవరం కరణం రామయ్య వ్రాసినది' అని తాళపత్రప్రతియందున్నది.

ఈ గ్రంథము వీరరాఘవకవిదే యనుటకుగల కారణములు. 1. ఈ కవి రచించిన యథాశ్లోక భారతోద్యోగమను గ్రంథమును, యథాశ్లోక తాత్పర్య

రామాయణముతో పాటు గద్వాల సంస్థానాధీశులు క్రీ. శ. 1821లో తమ 'విద్యాముకురమ'ను ముద్రాక్షరశాలలో ముద్రింపించినారు. ఈ ప్రభువుల కిలవేల్పగు పూడూరి చెన్నకేశవస్వామికి గ్రంథమంకితము చేయబడినది. పెదసోమ భూపాలుడు తన కిలవేల్పగు పూడూరి చెన్నకేశవస్వామి కంకితమిచ్చుటకై కోరుట జరిగినది. 2. తిక్కన తన ప్రతి యాశ్వాస ప్రారంభమున హరిహరనాథుని సంబోధించి వ్రాసినటులే వీరరాఘవకవికూడ పూడూరి చెన్నకేశవస్వామిని సంబోధించినాడు. 3. ప్రస్తుతం లభించిన తాళపత్రప్రతి 'నవీనంద్రోణపర్వం'లో కూడ ఆశ్వాసాంత ప్రారంభమునకూడ పూడూరి చెన్నకేశవస్వామిని సంబోధించి వ్రాసినటులలిక్రింది పద్యమున తెలియవచ్చుచున్నది.

కం॥ శ్రీ వర కౌస్తుభ రత్న
శ్రీ వక్ష స్ఫురిత వక్ష శ్రితజన రక్షా
పావన వనమాలాంచ
త్శ్రీవా పూడూరి చెన్నకేశవదేవా! [1]

అని వ్రాసియుండుటనుబట్టి ఈ 'నవీనంద్రోణపర్వము'ను కూడ కో. వీర రాఘవయ్య వ్రాసియుండునటుల భావించవచ్చును. డా. బి. రామరాజు గారు కూడ ఈ యభిప్రాయమునే వెల్లడించిరి. [2]

ఈ తాళపత్రప్రతిలో ద్రోణపర్వము సంపూర్తిగా నున్నది. ఈకవికాల మును గూర్చి కీ శే సురవరం ప్రతాపరెడ్డిగారు 'గోలకొండ కవుల సంచిక' పుట. 409, 410లో వ్రాసిరి. రెడ్డిగారీకవి 150 సంవత్సరముల క్రిందటి వాడని వ్రాసిరి. కాని అది పొరపాటు. రెడ్డిగారు కవిగారి గ్రంథములను చూడలేదు. భారతోద్యోగపర్వమును వ్రాయుమని వీరరాఘవుని ప్రోత్సహించిన వాడు గద్వాల పెదసోమభూపాలుడు ఇతనికే శోభనాద్రి, లేక సోమనాద్రి యనియు పేర్లు గలవు. ఇతడే గద్వాల కోటను నిర్మించినవాడు. గద్వాల రాజ్య నిర్మాత. మహాశూరుడు. కర్నూలు నవాబుల నోడించినాడు. డా॥ మారెమండ రామారావుగారు తన కాకతీయ సంచికలో నీ శోభనాద్రి కాలము క్రీ. శ. 1663-1712 మధ్యనుండునని తెల్పినారు.

---

1. తాళపత్రప్రతి-కో. వీరరాఘవకవి-నవీనంద్రోణ పర్వం, కమ్మ 60 ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము-హైదారాబాదు.
2. డా. బి. రామరాజు 'మరుగుపడిన మాణిక్యాలు' పుట 14. (వ్యాసం 21-12-1960 గోలకొండ పత్రిక)

ఒక్కయాశ్వాసమైనను పూర్తిగా లేదు. ఆశ్వాసారంభ పద్యానంతరము రెండవ పద్యమిటులున్నది.

కం॥ శ్రీమత్పారాశర్య కృ
పామహిమ రచింతు ద్రోణపర్వముభయ భా
షాముష్మికహరిజన స్తో
మము లుప్పొంగ నాంధ్రసూర్తి నిపుణతన్.

<u>శివకృతి :-</u> తర్వాత వీరరాఘవయ్య ద్రోణపర్వ మారంభమైనది.

గీ॥ ఖావము జెలంగ సేనాధిపత్యమంది
బలము వ్యూహముగా బన్ని ప్రధన కాంక్ష
బలియుఁడై నట్టి నీ తనూభవులతోన
అమ్మహారధి యాచార్యుడపుడు వెడలె. [1]

సంజయుడు రణరంగవార్త వినిపించుటతో నీ పర్వమారంభ మగును. 68 పుటలు గల తాళపత్ర ప్రతిలోని ద్రోణపర్వములో గల కొన్ని పద్యములు.

<u>ద్రోణుని మరణవార్త విని ధృతరాష్ట్రుడు దుఃఖించి పలికిన మాటలివి.</u>

నిడుదవోలు సుందరేశ్వరరావు గారు గద్వాల చిన్న సోమభూపాల విరచిత 'రతిరహస్య' పీఠికలోకూడ నించుమించుగా ఇదేకాలమును సూచించెను. కావున తదాస్థాన కవియగు వీరరాఘవుడు క్రీ. శ. 17వ శతాబ్ది ఆరంభమున నుండిన వాడగును.

కం॥ వననిధి యింకిన తెరగున
కనకమహీధరము పాదుగదలిన రీతిన్
దినమణి వ్రాలిన కైవడి
ధనురాచార్యుండు వడుట తాళుదు నెటులన్.

---

1. వీరరాఘవకవి 'ద్రోణపర్వం' తాళపత్రప్రతి - కమ్మ 60 ఓరియంటల్ లైబ్రరీ-హైదరాబాదు.

ఆ. వె॥ మందభాగ్యులైన మనవారి విజయాశ
యే మహాత్ము నాశ్రయించి యుండె
బుద్ధిబలము చేత బుధగురు డాచార్యు
డతడు సమరనిహతు డౌట యెట్లు-

అని వ్రాయుటను బట్టి ఈ కవి సహజమైన తన రచనలో తిక్కన పోకడలను పుణికి పుచ్చుకొన్నవాడైనటుల దోచుచున్నది.

## తిరుమల బుక్కపట్టణం బుచ్చి వేంకటాచార్యులు: 18వ శతాబ్ది

వేంకటాచార్యులవారు 'అచలాత్మజా పరిణయము'ను రెండర్థముల ప్రబంధమును రచించెను. ఇది మూడాశ్వాసము గలది తాళప్రతి క్రిమిద్రష్టము కావున నెవరికంకింత మీయబడినదో తెలియదు.

### తల్లిదండ్రులు - వంశము :

ఈ వేంకటాచార్యులవారి తండ్రి అణ్ణయాచార్యులు పితృవ్యులు ఆత్మకూరు సంస్థానాధీశుల గురువులగు శ్రీ తిరుమల బుక్కపట్టణము శ్రీనివాసాచార్యులు గారు, వీరి వద్దనే ఈ కవి తర్కాలంకార శాస్త్రములను చదివినటుల 'అచలాత్మజా పరిణయ' ఆశ్వాసాంతగద్య వలన దెలియుచున్నది. వేంకటాచార్యులు శ్లేషయమకచక్రవర్తి. సర్వతంత్ర స్వతంత్ర సజల భాషావశేష కవితాధురంధర దినప్రబంధ పరమేశ్వర బిరుదాంచితుడు.

గద్యలో—ఇది సర్వతంత్ర స్వతంత్ర సకలభాషావిశేష ధురంధర ప్రతిదిన ప్రబంధ పరమేశ్వర శ్లేషయమక చక్రవర్తి బిరుదాంక తిరుమల బుక్కపట్టణ శ్రీనివాస తాతాచార్య తనయ శ్రీమదణ్ణయాచార్య దీక్షిత సుత పితృవ్య శ్రీనివాసాచార్య కృపాకటాక్ష సకల పాండిత్య తర్కాలంకార వాగీశ్వర బిరుదాంక వేంకటాచార్య ప్రణీతంబైన యచలాత్మజా పరిణయంబను శ్లేషప్రబంధంబునందు అని తెల్పుటచే నీకవిగారిది చక్కని పండిత వంశమని తెలియుచున్నది.[1]

1. ఈ కవి రచించిన 'అచలాత్మజా పరిణయము'ను మొదట క్రీ. శ. 1904లో 'మంజువాణి' సాహిత్య పత్రికలో పలూరివారిచే ప్రచురితమై వారిచేతనే క్రీ. శ. 1929లో పునర్ముద్రణము గావించబడినది.

వీరి తల్లిదండ్రులు మొదట శిరిపుర సంస్థానమున నుండినవారు. గద్వాల చినసోముని ఆస్థానమందలి అష్టదిగ్గజకవులలో నుండినటుల 'రతిరహస్య' పీఠికలో శ్రీ నిడుదవోలు సుందరేశ్వరరావుగారు వ్రాసిరి.[1]

## కవికాలము:

ఈ కవి చినసోమభూపాలుని అష్టదిగ్గజ కవులలో నుండినవాడు. చినసోమ భూపాలుడు క్రీ. శ. 1784-1816 మధ్య నున్నవాడు. క్రీ. శ 1784 శ్రావణ శుద్ధ దశమి రోజున రాజ్యాధికారమును పొంది క్రీ. శ. 1815 ఆనందనామ సంవత్సర చైత్ర శుద్ధ పంచమిలవఱకు రాజ్యతంత్రము ను నడిపెను. అతని యాస్థానమున నుండినవాడగుట నీకవి 18వ శతాబ్ది ప్రథమ పాదమున నున్నటుల తెలియుచున్నది.

## గ్రంథ విషయము:

ఈకవి తెనుగున 'అచలాత్మజా పరిణయమను శ్లేష కావ్యమును రచించెను. ఇతడు పార్వతీ కల్యాణకథను సీతాకల్యాణ కథను జోడించి శ్లేషకావ్య రచన గావించినాడు. కవి తెనుగున రచించిన కావ్యమిదొక్కటె గానవచ్చుచున్నది. ఈ కవి యితర గ్రంథములు సంస్కృత రచనలు గలవు.[2] ఈ అచలాత్మజా పరిణయము ద్వితీయాశ్వాసమునగల ప్రారంభపద్యమిటులున్నది.

కం॥ కాసార మహీసార వి
వాసాది మునీంద్రహృదయ వారిజ రచిత
శ్రీ సారస వాసా పరి
హాసాది విలాస వేంకటాచల వాసా!

అను మాటచే నీకవి తన యిలవేల్పగు వేంకటేశ్వరుని ప్రార్థించి కావ్యమును ప్రారంభించినటుల తెలియుచున్నది.

1. శ్రీ ఎన్. సుందరేశ్వర రావు - రతిరహస్యము పీఠిక-పుట 11.
2. సంస్కృత రచనలు:- అలంకార కౌస్తుభము. ఝుంఝూమారుతము. శృంగార లహరి, కల్యాణ పురంజనము మున్నగునవి గలవు.

ఇది చక్కని జటిల ప్రబంధము. శ్లేషకావ్యమై నారికేళ పాకమున నొప్పారును. కవిగారి శైలి కనుగొనుటకీ పద్యమిటులున్నది.

(1ఆ. చివరి పద్యము)

శా॥ లక్ష్మీపాద తలాంక కుంకుమ కృతాలంకారటంకారణా
ట్టక్ష్మాకంపన కృద్ధనుర్గుణలతా టంకారటంకారణా
లక్ష్మాపన్న శరారి యుద్యువతిఖేలజ్జాల లజ్జాలనో
త్పక్ష్మాక్షవ్రజ సుందరీ మదవచింతాపారతాపారతా.

అలంకారవిషయములో నీకవి అర్థాలంకారములకన్నను శబ్దాలంకారములనే విశేషముగా వ్రాసెను. ఈ క్రిందిపద్యము లాటాను ప్రాసముతో కూడియుండి పోతన భాగవతపద్య పోలికలను చూపెట్టేను. నారదుడు హిమవంతుని గృహమునకు రాగా అతనిని గౌరవించిన విషయమిందుద్యోతకమగును.

చం॥ నలలితతేజ మీకొనగు సత్కృతి-సత్కృతిమీకు శాద్యమై
చెలగిన జీవసంబదియ జీవనమాదర మోదరమ్య శ్రీ
తలభవదీయ దృష్ట్యమృతధారలయోగమె యోగమెన్నిటన్
దలపయి మీపదాబ్జముల ధారణధారణ సూరికోటికిన్. 1

## పోలికలు.

ఈ కవిగారి అచలాత్మజాపరిణయమున కొన్ని పద్యములు అల్లసానివారి మను చరిత్ర, భట్టుమూర్తి వసుచరిత్ర పద్యములను బోలియున్నవని ఈ పద్యము వలన దెలియుచున్నది.

---

1. హిమవంతుడను మాటలు:- ఓ నారద! మీకొనగునట్టి సత్కారమే సత్కారము. మీకొనగునట్టి ఉదకమె ఉదకము. ప్రేమచే మీ చూపులనెడి అమృత ధారలే మాకు సంబంధము. ఎటులైనను మీ పదాబ్జములను శిరస్సుపై దరించుటె మాకు శిరోధార్యము అని సామాన్యర్థము.

అంతరార్థము:- సూరికోటికిన్ (విద్వాంసుల) కిచ్చునట్టి సత్కృతి మంచికావ్యమే, సత్కృతి (మంచి కావ్యము), మీకిచ్చునట్టి ఉదకమే మా ప్రాణము. సంతోషముతో సుందరమగు చల్లనైన దృష్టియే మాకుచ్చదశ గల్గించును. మీ పాదపద్మములను ధరించుటె అష్టాంగయోగములలో నొకటని అంతరార్థము.

అల్లసాని పెద్దన—మనుచరిత్రము—'వానిదిభాగ్య వైభవము' (1ఆ.)

అచలాత్మజాపరిణయమున పోలికగల పద్యము:

కం॥ వానిది భాగ్యము యోగ్యత
వానిదివానిది సుజన్మ వైభవమిల నె
వ్వానికి మీపద పంకజ
పానీయము గ్రోలగల్గు భావజ్ఞ నిధీ. అచ. 1ఆ. 26ప.

అటులే 'మృగమద సౌరభవిభవ' మనుచరిత్రము. 1ఆ. పద్యము. పోలిక— అచలాత్మజాపరిణయమునందలి ఈ క్రింది పద్యమును గాంచునది.

జలకేళి వర్ణనము:-

కం॥ ప్రసుమర కుసుమర సరభస
భసలసముదయంబుదోలి ప్రవికసితబిస
ప్రసవ సహస్రము గైకొను
రసమున సరసికిని జనిరి రమణియనుజ్ఞన్.[1] 2ఆ. 32ప.

ఈ కవి రచన ఒక్కొక్కచోట ద్రాక్షాపాకమున సరళముగను, వేరొక చోట అఖండ పదసమాసములతో నారికేళపాకమున నీకవి పద్యరచన గన్పట్టును. వేంకటాచార్యులు సంస్కృతాంధ్రగ్రంథములను రచించినవాడు కావున ఈ శ్లేష కావ్యము (అచలాత్మజాపరిణయము)న మొదట పార్వతికథ, తర్వాత సీత కథకు సంబంధించిన కథలను జోడించి కడు సమర్థతతో నీగ్రంథమును రచించెను.

భట్టుమూర్తి వసుచరిత్ర పద్యమును బోలికగలదీ పద్యము. జలకేళీ వర్ణన సందర్భమున—

---

2. అర్థము- ప్రసుమర- వ్యాపించియున్న, కుసుమరస-రభస- వేగముగల- భసలసముదయము- తుమ్మెదలగుంపును, దోలి- వెడలగొట్టి, ప్రవికసిత- వికసించిన, బిసప్రసవ- పద్మము యొక్క, సహస్రమున్- అనేకమును, గైకొను రసమునన్- పుచ్చుకొను నాసక్తిచే, రమణ (పార్వతి-సీత) అనుజ్ఞచే చెలులు సరసికి జనిరని భావము.

సీ॥ గగన రంగస్థలి కలితనర్తన మురు
త్పదపతన్మరకతాంగద మనంగ
జవనవ ప్లవనవద్రవిళతాంగతురంగ
గళగళద్ధరి దళ్వఘుంటయనగ
బహుళగాంగ తరంగ బంధురోత్పతతరు
ష్యతుల సీతతుల సీతతియనంగ
సరభసామరవధూకర పతత్పురపుష్ప
పూర్ణహరిత్పత్ర పుటమనంగ

ఆ. వె॥ సమయమని తూరి జిగిమీరి సెమమదేరి
కరువరులదారి నెగబారి కడకు జేరి
తలిరులకటారి వలకారి ధాటిఘోటి
చిలుక చిలుకలకొలికి ముంగటను నిలచె 1 అచ 2ఆ.-ప.

ఈకవి తన కావ్యమును ప్రబంధరీతిని అష్టాదశ వర్ణనలతో శబ్దాలంకారములతో వర్ణనాత్మకముగా (శ్లేషకావ్యము) రచించి గద్వాల చినసోముని ఆస్థానము నందష్టదిగ్గజములవంటి కవులలో నొకడుగా వెలుగొందెను. 2

## అచలాత్మజాపరిణయము.

మంజువాణి పత్రిక పలూరు సంపాదకుని అభిప్రాయము-

చిరకాలమునుండి ప్రయత్నము జేసినను ఈ గ్రంథమునకు రెండవమాతృక లభించకపోవుటచే నీ గ్రంథముద్రణము మిక్కిలి ప్రయాసముగా నున్నది. ఇట్లుండగా శ్రీ ఆత్మకూరు సంస్థాన విద్వాంసులగు శ్రీమాన్ బుక్కపట్టణం రంగాచార్యులవారొకప్పుడీ గ్రంధము తమ పూర్వులు రచించినదనియు శిరిపురము జమీలోనే తత్కవికృత గ్రంథములనేకములు శిథిలములైనట్లే ఈ గ్రంథమును శిథిలమైనదనియు, తమకడ కొంతవరకొక ప్రతి గలదనియు తెలియబఱచియున్నారు. వారికడనున్న ప్రతియందుగూడ మాదగ్గరనున్న ప్రతిలో నెంత గ్రంథమున్నదో యంతియే గలదట. అయినను మా ప్రతికంటె నది పండితుల

1. మంజువాణి పత్రిక - అచలాత్మజాపరిణయము - 'మంజువాణి' పలూరివారికి - సాహిత్య పత్రిక - ఏప్రెల్ 1905 పుట. 145.
2. అచలాత్మజాపరిణయము - మంజువాణి సాహిత్య పత్రిక-మార్చి 1904 పుట. 61-68.

లిఖితమగుటచే సుష్టుగానుండి యుండనోపు. తప్పులుగల యొకటే మాతృకనుజూచి ఏకార్థక పద్యములకే టీక వ్రాయుట దుష్కరము అట్లుండ శ్లేషముగను, యమకములునుగల యీ గ్రంథమున కర్థము వ్రాయుట ఎంత కష్టమో మా పత్రికా పాఠకలూహించవలసిన విషయము. ప్రస్తుతమొక పద్యము సందియముగానుండుటచే ఆచార్యులవారి ప్రతి వచ్చిన పిమ్మట దానిని జూచి మరల 'అచలాత్మజా పరిణయము'ను సార్థకముగా కొంచెము కాలములో ముద్రింపించెదము.[1]

చినసోమభూపాలుడు రాజకవి. క్రీ. శ. 1784-1815:-

చినసోమభూపాలుడు హరిహరభట్టు సంస్కృతమున రచించిన 'శృంగార దీపిక' యను నామాంతరముగల 'రతిరహస్యము'న కాంధ్రానువాదమును గావించెను.[2]

తల్లిదండ్రులు :-

ఈ చినసోమభూపాలుడు రాజకవి ఇతని తల్లిదండ్రులు మంగళాంబిక తిరుమల రాయలు. చినసోముడు పెదశోభనాద్రి లేక పెదసోమభూపాలునకు మనుమడు. 'గద్వాల ప్రభువుల వంశచరిత్ర' కవుల గ్రంథములనుబట్టి వాల్యూము లను, రికార్డులనుబట్టి తెలియుచున్నది.[3] వీటన్నిటిని పరిశీలించి ప్రసిద్ధ చరిత్ర పరిశోధకులుగా మారేమండ రామారావుగారు 'గద్వాల సంస్థాన చరిత్రము' అను వ్యాసమును ప్రత్యేకముగా రచించిరి. ఇతడు గద్వాల సంస్థాన విషయమును 'కాకతీయ సంచిక'లోను మరియు 'జనరల్ ఆఫ్ ఆంధ్రహిస్టరీ అండ్ కల్చరల్' అను వ్యాసము నాంగ్లములోను వ్రాసి ప్రకటించినారు.[4]

---

1. మంజువాణి పత్రిక- 1904 మే సంచిక పుట. 2 (ఏలూరు).
2. చినసోముని ఆంధ్రానువాదమును కల్చరల్ బుక్ డిపో మద్రాసు-2 వారు ముద్రించిరి. ముద్రణ కాలము తెలియదు.
3. అ. బ్రౌన్‌దొరగారి లోకల్ రికార్డు 38 వాల్యూము
   ఆ. మెకంజి 15-4-1916, 15-4-1922 స్థానిక చరిత్ర సం 38 పుట 453, 497.
   ఇ. కాణాదం పెద్దన - ముకుందవిలాసము
   ఈ. అలంకార శిరోభూషణము.
   ఉ. కాణాదం పెద్దన-అధ్యాత్మ రామాయణము.
   ఊ. యథాశ్లోక తాత్పర్య రామాయణము [అద్గురు కవులు].
4. డా. మరెమండ రామారావు Vol. No. 3 & 4.

చినసోమభూపాలుడు 'రతిరహస్యము'న కనువాదమునేగాక జయదేవ కృతమగు 'గీతాగోవిందము'నకు 'ఆంధ్రాష్టపదుల'ను పేర అనువాదము గావించెను. ఈ రాజకవి సంగీత సాహిత్యాభినివేశములతోబాటు నాట్య కళాకౌశలత రాగతాళాభినయములందును పరిజ్ఞానమున మనీషియని పేరు పొందెను.

ఇతడు 'రతిరహస్య'మను గావించిన అశ్వాసాంత గద్యములో నిటు లున్నది- ఇది శ్రీమత్కేశవస్వామి కరుణా కటాక్ష వీక్షణాతిశయ సమాసాధితా ఖండ భువనమండల సామ్రాజ్య సారస్వత వైభవాభి నవభోజరాజ సకల సుకవి జనాభీష్ట ప్రదాన కల్పభూజరాజ శ్రీ మద్గద్వాల పెదసోమభూపాల పౌత్ర తిరుమల రాయమహీపాల మంగాంబికా పుత్ర బుధస్తోమ విధేయ రాజా చినసోమ భూపాలరాయ ప్రణీతంబైన రతిశాస్త్రంబను కళాశాస్త్రమునందు సర్వమును తృతీయాశ్వాసము-[1] అను మాటచే నీ రాజకవి గ్రంధానువాదము గావించెనను విషయము తెలియుచున్నది.

## హరిహరభట్టు:

ఇతడు సంస్కృతమున 'శృంగార దీపిక' యను నామాంతరము గల రతి రహస్యమను గ్రంథమును రచించెను. అశ్వాసాంతగద్య యిటులున్నది- ఇతిసర్వ విద్యానవద్య సహజ సారస్వతానవద్య చంద్రనామాంక విద్వన్మణికుమార చిన్న సోమభూపాలుడు క్రీ. శ. 1753 లో నైజామునకు షోలాపూరు రాజునకు జరిగిన యుద్ధములో నైజామునకు చేదోడు వాదోడై అతని వద్దనుండి ఎన్నియో పారితో షికములను పొందిన రాజ్య తంత్రజ్ఞుడు. ఇతడు గద్వాల సంస్థానమును పరి పాలించి తెలుగు వాఙ్మయ ప్రపంచమున సుస్థిర కీర్తినిబొంది 'నవభోజరాజని' బిరుదమును పొందిన ధీశాలి.

## గ్రంథపరిచయము:

ఈ రాజకవి ఆంధ్రీకరించిన 'రతిరహస్యము' మూడాశ్వాసము గలది. ప్రథమ, ద్వితీయ. తృతీయాశ్వాసములలో క్రమముగా 66, 157, 52 పద్య ములు గలవు. చినసోముడు తన గ్రంథమును గద్వాల కేశవస్వామి కంకితము గావించినాడు. ఇతని ఆస్థానమున ఎనమండుగురు కవులష్టదిగ్గజములను పేర నుండిరని తెలియుచున్నది.

1. చినసోమభూపాలుడు - రతిరహస్యము, తెలుగు పుస్తకము నెం. 6 ట్రినియల్ క్యాటలాగు R. నెం. 900 ఒ. ఎల్. యూనివర్సిటి-మద్రాసు.

హరిహరనామ కవి విరచితాయాం శృంగార దీపికాయాం రతిరహస్యే ప్రథమ పరిచ్ఛేదః, అని వ్రాయబడియున్నది. ఈ గ్రంథందు ప్రథమ పరిచ్ఛేదము 67శ్లోకములు, ద్వితీయ పరిచ్ఛేదము 90 శ్లోకములు, తృతీయ పరిచ్ఛేదము-చివర అసమగ్రమనియు, చతుర్థ పచ్ఛేదము- కొంత భాగమువరకున్నది, అని వ్రాయ బడి యున్నది. హరిహర కవి రచించిన సారంగధరోపాఖ్యానము, రత్నావళీ పరిణయము, రతిరహస్యము, అను నీ మూడు గ్రంథము లముద్రిత ప్రతు లొక్కచో గలవు.[1]

రతిరహస్య పీఠిక శ్లోకమిటులున్నది-

శ్లో॥ వాణీం ప్రణమ్య శిరసాబాలానాం జ్ఞానసిద్ధయే
స్త్రీ పున్నపుంసకం స్వల్పం వక్షేశాస్త్ర వినిశ్చితం॥ అని వ్రాయబడినది.

ఒకనాడీ భూపాలుడు నొక కావ్యమును కళావిలాస శృంగారాను భావ్య ముగా రచింపదలచి నిద్రించి యుండ కేశవుడు (స్వామి) కన్నులకు గనబడి యిట్లనెను.

ఉ॥ శ్రీ రుచిరోత్సవాదులను జేసితనేకము, గోపురాళినే
హారచనం బొనర్చితివి యార్యుల చేతకృతుల్మదంకిత
శ్రీ రచియింప గూర్చితి వశేష హితమ్ముగనిం కనొక్కశృం
గారరస ప్రధానమగు కావ్యమొనర్పుము నాకు నేర్పునన్. రతి అవ.14ప.

అని చెప్పగా నీ కవి హరిహరా నామ కవి రచిత 'శృంగార దీపిక' నెన్నుకొని రసిక జనమనోహరముగా నాంధ్రీకరించి రతిరహస్యమని పేరిడితినని తన స్వప్న వృత్తాంతమును దెల్పెను.

## రతిరహస్యము - అనువాదము :

ఈ రాజకవి రతిరహస్యమను వాదమును మూడాశ్వాసములలో రచిం చెను. ఇతడు ప్రథమాశ్వాసములో తన యిలవేల్పగు కేశవస్వామిని సంపదలనిచ్చు వనజ నళినాక్షునివిఘ్నములను దొలగించు కరిముఖుని, బుద్ధివైభవమును జేకూర్చు వనజ

1. డి. నం 665 ఆ ముద్రితప్రతి ప్రతి- (హరిహరుని గ్రంథములు) ప్రాచ్య లిఖిత. పుస్తక భాండాగారము యూన్వర్‌సిటి - మద్రాసు. పుట 104 వరకు మాత్రమే యున్నది.

భవుని(బ్రహ్మ) ప్రార్థించెను. తర్వాత ఈక్రింది పద్యమున వాణిని ప్రార్థించెను.

కం॥ వాణిని పికవాణిని శుక
పాణిని నలివేణి నధిక భాసుర పులిన
శ్రోణిని విద్యా మౌక్తిక
ఘోణిని గుపదనఘ నామఘోణిన్ దలతున్. రతి 1అ. 5ప.

అని యిష్ట దేవతాస్తుతిని గావించెను ఈ రాజ కవి రసిక సుకవి జనవినుతిని విరసతర కుకవినిరసము జేసి, అనంతరము తన వంశ ప్రభావమును దెల్పెను.

---

సంస్కృతమున రతిరహస్యమును రచించిన హరిహర కవి తెలుగువారికి కందుకూరి వీరేశలింగం పంతులుగారి 'కవుల చరిత్ర'ము వలన చిరపరిచితుడయ్యెను. ఆనాటికి అనగా క్రీ శ 1898 లో లభించిన ఆధారమును బట్టి పంతులుగారు హరిహరబట్టును క్రీ॥ శ॥ 17వ. శతాబ్ది కవిగా నిర్ణయించిరి. కాని ఆంధ్ర సారస్వతపరిషత్తువారు హరిహరభట్టును రచించిన ఉత్తర నారసింహ పురాణమునకు పీఠికాపురాస్థాన విద్వాంసులు కీ శే. ఓలేటి వెంకటరామ శాస్త్రి గారిచే క్రి. శ. 1926 లో పీఠిక వ్రాయించి ప్రకటించిరి.

దాని మూలమున ఇతని కాలము క్రీ. శ. 1550-60 ప్రాంతమని వెల్లడియైనది. అనంతరమున సుప్రసిద్ధ చరిత్రకారులు డా॥ నేలటూరి వేంకట రమనయ్యగారు హరిహర భట్టు కాలమును మరికొన్ని యుప పత్తులలో సమర్థించిరి.[1] పర్వాత శ్రీ విద్వత్కవి నిడుదవోలు వెంకట్రావుగారు హరిహరభట్టు అష్టదిగ్గజ కవులలోనివాడు కాకపోయినను కృష్ణరాయుల కాలములో విలసిల్లిన విద్వత్కవి యని శాసనాధారమును బట్టి భారతిలో ప్రకటించిరి.[2]

---

ఈ భూపాలుడు ప్రథమాశ్వాసము 65 పద్యములలో ముగ్ధా మధ్య ప్రౌఢ స్వీయ పరకీయ శామాన్య, లక్షణములు, ఏకాదశ శృంగారావస్థలు, వేశ్యా లక్షణములు. కామతంత్రములు మున్నగు వానిని దెల్పెను. ఇతడు ద్వితీయా

---

1. భారతి విక్రమ - పుష్య పుట 17-24.
2. భారతి విరోధి - ఆషాఢము. పుట 21. Ref/A copy of Ramsamudra-grant of king Krishnadeva Raya of ViJayanagar Dated Saka 1435 with the Same Seshahari in Kolar Town A.R. M.A.D. 1927.

శ్వాసము 157 పద్యములలో స్త్రీపురుష జాతులు, రతి లక్షణములు, దృష్టి భేదములు, 84 బంధ లక్షణములను వివరించెను. ఇక తృతీయాశ్వాసములో నీరాజకవి స్త్రీలను వశపరచుకొను యంత్ర మంత్రౌషధులు, తిలక లేపనాదులు నీతివిధులు, రమ్య శృంగార మర్మజ్ఞ పారంగతులు, మున్నగునవి బుధవర్యులు మేలనునటుల ననువాదము గావించెను.

## అనువాద రీతి.

ఈ ప్రభువు గ్రంథానువాదము సరళము మూలమునకు ప్రతి రూపము. ఈ అనువాద గ్రంథమందలి మొదటి పద్య మిటులున్నది.

ఉ॥ శ్రీ నెప జేర్చి సత్యరతి జేకొని జాంబవ తింగవుంగిటన్
బూనిచి గారవించి రవి పుత్రుని ముద్దిడి మిత్రవిందకుం
దోన సుదంత గేలి దమితోగని భద్రను లక్షణాంబుజా
క్షీని రతాప్తుడౌ విభుని కేశవ దేవుని నాశ్రయించెదన్.

చినసోముడు తన అనువాద పద్ధతిని గూర్చి స్వయముగా నిట్లు చెప్పెను.

మ॥ చిరశృంగార రసప్రపూర్ణ రసిక శ్రేష్ఠస్తుతంబుల్ కవీ
శ్వర పూర్వోచిత కావ్యముల్ గలవు తేవంబొప్పగా వానిలో
సరళంబున్ సుకళా విలాసమును నౌ సారంబు సాధించియేఁ
సరస ప్రీతి రచింతునే రతికళాశాస్త్రంబు నిచ్ఛారతిన్ ర.ర. 1అ. 4ప.

ఈ రాజకవి అనువాదము నరయుటకై నిటకొన్ని పద్యములు వ్రాయుదును.

## సతీ లక్షణము - మూలము:

శ్లో॥ చంద్రాననా చంపక పుష్పనాసా
ఘనస్తన శ్రోణి విరాజ మానా
విశాల కేశాగత రోమ గుహ్యా
కటాంగ చేష్టా కుశలాసతీ స్యాత్-హరిహరకవి. రతి.

అనువాదము.

గీ॥ అబ్జముఖి హేమ సుమనాసంయమిత జఘన
కచవిరాజిత యాపాద కచయు విగత
లోమ భుజమాల మన్మథ ధామసురత
చతురయై యొప్పుసుదతియె సతి యునగును. ర. రహ. 1అ. 8ప.

ముగ్ధా లక్షణము:

శ్లో॥ ఏకాంతే ప్రియ సంగృహీతవసనా యస్యాస్తనుః కంపతే
మూకీభావముపై తికుప్యతి ముహుః సంభాషితారోదిత
సంభోగాయనతి తల్పమధవా సంప్రాప్తతల్పాప్యధో
వక్త్రం నిపతి స్థితాసు వదన యాసైవ ముగ్ధాభవేత్॥

శ్లో॥ హస్త విధూనన పూర్వం ముఖమవ హృత్యైవ మీలతీ నేత్రే
భయకంపితాంగ యష్టి ముగ్ధా కాంతాకరో త్యేవమ్॥

అనువాదము.

సీ॥ వరుని చేవల్వ గ్రహించబడినదై
మిక్కిలి తనువు గంపింప జేయు
బలుకదు మూకత్వ మలవడ మాటికి
గోపంబుచే నేడ్చు, గుసుమశరుని
కదనంబునకు శయ్యగదియ దొక్కొకవేళ
కదిసె నేనియు జాలవదన సరసి
జము వాంచి యుండు హస్తము నివ్వదులిపించి
కొనుట కన్నను మున్నగనే మొగంబు

గీ॥ నవల ద్రిప్పుచు వేగగన్గవ మొగడ్చు
గడుభయ స్వాంతయై గడగడ వణంకు
వెడలజాలంగ జనునట్టి విధముగల్గు
పడతియే ముగ్ధయని యెన్నబడును సభల 1అ. 11ప.

స్త్రీల విషయములో తమకు గుర్తున్నవారైనను ఆయా స్థలములందు వారితో సంభాషింపరాదని చిన సోముడీ పద్యమునందు తెల్పెను.

చ॥ వనజనులందు దీర్ఘజన వారములందును రచ్చత్రోవలన్
వనితల ముందరన్ నిశినివైరి వధూచయ మధ్యసీమలం
దును బ్రియురాలిసైన యొరు తొయ్యల గూర్చి యుభాషితంబులా
డనుదగదెట్టివారికి నొడంబడియంచు వచింతురార్యులన్. రతి ర. 3ఆ 10ప.

ఇటుల హరిహర కవి రచించిన శృంగార దీపికయను నామాంతరము గల రతిరహస్య మను కళా గ్రంథమును తెనుగున ననువదించి తెలుగు వాఙ్మయ ప్రపంచమున కీర్తి నొందెను. ఇతడు రాజకవి కృతికర్త- కృతిభర్త. ఇతని రాజ్యకాలమును స్వర్ణయుగమని చెప్పవచ్చును.

## ఇతర కృతులు: 'ఆంధ్రాష్టపదులు'

ఈ రాజకవి జయదేవ విరచిత గీతగోవిందము నాంధ్రాను వాదము గావించెను. ముద్రణ విషయము తెలియదు [1] జయదేవుడు వంగదేశీయుడు. రమాదేవి భోజ దేవుడితని తల్లిదండ్రులు.

శ్లో॥ శ్రీ భోజదేవ ప్రభవస్య రమాదేవి సుత శ్రీ జయదేవకస్య
పరాశరాది ప్రియ వర్ధకం తే శ్రీ గీతగోవింద కవిత్వమస్తు
అను మాటచే జయ దేవుడు శ్రీకృష్ణుని శృంగార మూర్తిగా
నుపాసించి యతని దివ్యలీలామృతము నభివర్ణించెను.

జయదేవుడు ప్రాపంచిక సుఖములను వొందుచు వైష్ణవ మార్గమున శృంగార రసవాహినిగా గీతగోవిందమును రచించెను. ఇందు భావోన్మాదము లేహముప్పొంగించునట్టి రచనగలదు. [2]

జయదేవకృత గీతగోవిందమునందు ఇరువది నాలుగు తరంగములు, డెబ్బది ఎనిమిది శ్లోకములు గలవు. ఇతని భార్య పద్మావతీ దేవి. జయదేవుడు ఒరిస్సా రాష్ట్రమందలి పూరిజగన్నాథ క్షేత్రమున నుండి ఈ కావ్యమును రచించెను.

## అనువాద రీతి.

చినసోమ భూపాలుడు తన అనువాదమున శ్లోకమునకు చరణము పద్యము దరువు- చూర్ణిక- యను చతుర్విధ ప్రక్రియలతో సొంపుసెంపులతో రసమయ

---

1. ఆర్. నం. 900. టి. నం 6. ఒ. ఎల్. యూనివర్సిటి మద్రాసు.
2. మానవల్లి రామకృష్ణ కవి. గీతగోవిందము (మూలము) పీఠిక 4 5 పుటలు.

ముగా ననువాదము గావించెను. చినసోముని అనువాద పద్ధతి నరయుటకై నతని రచనలఁ బరికింతము.

చరణము:-

త్వమసి మమజీవనం త్వమసి మమ భూషణం
త్వమసి మమ జలధి రత్నం
భవతు భవతీహ మయి సతత మనురోదితి
తత్రమమ హృదయ మతిరత్నం' ప్రియేచారుశీలే!

శ్లో॥ మదీయాలంకారం త్వమసి సుఖమే జీవనమపి
త్వమస్నేహయత్నం త్వమసి భవజలధి రత్నం త్వమసిచ
భవత్యాత్మన్యేవం సతతమనురోది న్యపి భవ
త్వహే తత్రే తస్మై హృదయ మతియత్నం ప్రియసఖి॥

## చినసోముని అనువాదము:

ఉ॥ నీవె మదీయ జీవనము నీవె మదీయ విభూషితంబునై
నీవె భవాబ్ధి రత్నమిట నీవె సదా యనుకూల నౌదుగా
కీవిధినాదెసన్ సరిసి జేతుఁణ నామది సత్ప్రయత్నమౌ
రావదె చారుశీల! ప్రియురాలవదే చలమేల జేసెదే.

ఇందనురాగ శృంగార మూర్తియైన రాధారమణి మృదుమధుర భాషణము లుడిగి అలుక వహించిన సమయమున రసికలోక శిఖామణి జగన్మోహనుడైన కృష్ణుడు తన మనోవేదనను హృదయ నివేదనము గావించెను.

## ఎరుకుల కాంభోజిరాగం:

అనువాదము-చరణము:-

నీవె నా జీవనము నీవె నాభూషణము
నీవె సంసార జలనిధి రత్నమూ!
నీవె యనుకూలవతి నెరయనౌదును గాక
యేవేళ నా హృదయ మిటయత్నమైనది.

ఓ చారుశీల యింత జాలమేల
సారెకును నాపైన చలమేలబాల............చారుశీల.

నీవె నాదు జీవనము నీవెనాదు భూషణము
నీవె భవ జలధి రత్నము - ఓ చారుశీలా!
నీవె నాపాలి దైవము చాలనీ నీవేళ
ననుకూలురాల నౌదు గాక
వేళచాలా నాదు హృదయము- ఓ ఓ ప్రియురాల
అధిక యత్నమై. ఓ చారుశీల

చూర్ణికః-

అయిరాధికే చారుశీలే!
ప్రియేత్వమసి మదీయ జీవితత్వ మసిచాత్మీయని భూషణం
త్వమసి పారావార రత్నం - భవత్విహ భవతి మయిసంతత
మనురోదినీ తత్రైవమమ హృదయ మతియత్నం ప్రియసఖీ॥

## అనువాదము:

చ॥ మదన మహానలంబు పలుమారు దహింపగజేసె నామదిన్
వదనసరోజ దివ్య మధుపాన మొసంగు మకారణంబుగా
పదరిన కోపమున్ విడిచి బాగుగ మత్ప్రియురాలివైనయో
మదవతి చారుశీల నను మన్ననసేయవె రాధికామణీ.[1]

ఈ అష్టపదుల యందలి చివర గద్యమిటులున్నది

శ్రీ మద్గద్వాల చెన్న కేశవ ప్రసాద సమాసాదిత... గర్భ నిర్భేదన ప్రతాపేన విరచిత బహుళాగ్రహార భాసుర భూసురాశీర్వచన ప్రభావ సంప్రాప్త విరవధిక సామ్రాజ్య వైభవేన ప్రభుశిఖామణినా శ్రీ సోమభూపాల రాయేన...

చటుల రసాను భూతం మురారే రాధికా రుచిరవదన
పద్మావతీ రమణ జయదేవకవి భారతీక వేర్జయతు జాతం.[2]

అని వ్రాసి యుండుటచే నీరాజకవి అష్టపదుల ననువాదము గావించి కవులకు కల్పవృక్షమై జన్మసార్థకము గావించుకొనెను. కావుననే చినసోమ భూపాలుడు కవులచే 'నవభోజరాజ' బిరుదమును పొందెను.

1. చినసోముని 'ఆంధ్రాష్టపదులు, R. No. 900 T. No. 6 O.L. మద్రాసు.
2. Bulletin MSS Vol No. VIII No. 2 Page 50-51.

## రతిరహస్యము ననుసరించి గ్రంథకర్త వంశవృక్షము :

ముష్టిపల్లి పెద్దన (పెద్దా రెడ్డి) మూలపురుషుడు
భార్య లక్కమాంబ
పెదసోమభూపాలు (పెద శోభనాద్రి) రాజ్య నిర్మాత
భార్యలు : అంబాంబ లింగాంబ రామాంబ
తిరుమలరాయలు పెదరామరాయలు
భార్యలు : లక్ష్మమ్మ మంగాంబ
చినసోమభూపాలుడు కృతికర్త

చినసోమభూపాలుడు 1 రతిరహస్య గ్రంథకర్త 2 అష్టపదులు
చిన్నరామరాయలు

## కాణాదం పెద్దనగారు.

ఈ కవిగారు భద్రాపరిణయమను నామాంతరము గల 'ముకుంద విలాసమ'ను గ్రంథమును మూడాశ్వాసములలో రచించిరి. ఈ గ్రంథము క్రీ. శ. 1886లో గద్వాల సాహిత్య విద్యా ముకురమను ముద్రాక్షర శాలలో ముద్రితమైనది.

## వంశము - తల్లి దండ్రులు.

పెద్దనగారిది కాణాదంవంశము నందవరీక బ్రాహ్మణులు ఆత్రేయ సగోత్రము. పెద్దన పినతండ్రిగారు తిమ్మనార్యుడు. విద్యాగురువుగారు మల్లేశ్వర దీక్షితులని ముకుంద విలాసమందలి అవతారికలోని పదునైదవ పద్యమును బట్టి తెలియుచున్నది. ఇతని గురువుగారగు మల్లేశ్వర దీక్షితులు భోజుని చంపూ రామాయణమునకు వ్యాఖ్యానము వ్రాసినారు.[1]

మొదట కాణాదం పెద్దనగారు సురపుర సంస్థాన పండితులుగా నుండి ఆంధ్రమత్స్య పురాణమును రచించి చినసోమ భూపాలుని పినతండ్రిగారగు రామ

1. కా- పెద్దన- ముకుంద విలాసము- అవ. ప. 15.

రాయల కాలమున గద్వాలకు విచ్చేసిరి. ఈ కవి గద్వాలలో ప్రభువుల ఆస్థానమున పండితులుగా నుండి వారి కోరికపై భద్రాపరిణయము (ముకుందవిలాసము) యథాశ్లోక తాత్పర్య రామాయణము (బాలకాండము), ఆధ్యాత్మ రామాయణము, శేషశైలేశలీల మున్నగు గ్రంథములను రచించెను.

కా. పెద్దనగారి గ్రంథములలో- ముకుంద విలాసము, యథా శ్లోక తాత్పర్య రామాయణము (బాల కాండము) ఆధ్యాత్మ రామాయములు గద్వాలలో 1886 లో ముద్రితములు. ఈ కవి గారి యితర గ్రంథములు లభించలేదు.

కాణాదం పెద్దన క్రీ.శ. 1768-83 రామరాయల రాజ్య కాలమున గద్వాలకు విచ్చేసి చినసోమభూపాలుని యాస్థానమున (1784-1815) ఎనమండు గురష్టదిగ్గజ కవులలో ప్రథముడుగా ప్రసిద్ధి గాంచెను. ఇతడు చతుర్విధ కవితా విశారదుడు.

## గ్రంథనామౌచిత్యము:

ఒకనాడు చిన్నసోమభూపాలుడు నిండుపేరోలగంబున నుండి పెద్దనగారితో 'బంధగీర్వాణ టీకానిబంధనాది పేశలవచో రచనార్య పెద్దనార్య'యని సంభోధించి శ్రీకృష్ణుని అష్టభార్యలలోగల భద్రాదేవి పరిణయము నెవ్వరు రచించినటుల వినలేదు, కావున తెలుగు కోవిదులౌనటుల రచించి కేశవస్వామి కంకితము గావింపగోరెను. పెద్దన ప్రభువు కోరికపై భద్రాపరిణయమును రచించెను.

కం॥ కుంద విలాసము తావి ము
కుంద విలాసము సదాముకుంద విలాసం
బిందువిలాసమును సుధా
బిందు విలాసము హసించు పేశల ఫణితిన్

అని పల్కుటచే ముకుందు (శ్రీకృష్ణుడు) ని విలాసమును గూర్చి వర్ణించి వ్రాయుటచే నీ కావ్యమునకు ముకుందవిలాస మని నామాంతర మేర్పడినది.

## ఇతివృత్తము:

ఈ గ్రంథమందలి యితివృత్తము భాగవత గాధ. శ్రీకృష్ణుడు అష్ట భార్యలలో గల భద్రాదేవిని పరిణయమాడుట యిందలి యితివృత్తము కావున దీనికి భద్రాపరిణయమని కూడ పేరుగలదు.

## కవి ప్రతిభ - రచనా పద్ధతి :

కా. పెద్దనగారు తన గ్రంథమందలి కవితను గూర్చి - వినుత ప్రబంధ రీతుల నొనరింపుచు, మరియు గీతయోగ్య స్ఫూర్తిని గల్గించునట్టి రచన గావించి నాడనని తెల్పెను. అట్టిదేమిటో యించుక వివరింతును.

ఈ కవి ఒక చోట పనొక్క పబ్రింధంబు రమారమణ పరిణయ ప్రసంగ సంగత శృంగార చమత్కార రసాను బంధంబుగా నొనరింప బూనుదునని తెల్పినాడు [1]

ఎందరో కవులు కవిత గావింతురు కాని అట్టివారిలో కొందరు మాత్రమే గానయోగ్య స్ఫూర్తిని గల్గింతురు. అట్టిది రామరాజభూషణుని వసుచరిత్ర యందు గన్పించును. కాణాదం పెద్దనగారును పఠితులకు గానయోగ్య స్ఫూర్తిని గల్గించునట్టి కవిత నీ గ్రంథమున గావించినాడు. ఈ పద్యము ముకుంద విలాసమునందు మధుమానోదయమును వర్ణించి చెప్పినది.

సీ॥ సురసాలసమశీల సురసాల తనుజాల
సరసాల వాసాల పరిసరంబు
మలయాగ తట భాగనిలయాగ మాభోగ
దలయాగత సదాగతిలసితంబు
వనితాజన సమాజ జనితా జరమనోజ
జనతాజయ విరాజ దనునయంబు
సురతాంత వనితాంత పరితాంత సమదంత
భరితాంత రసకాంత వరచయంబు

1. కా. పెద్దన - ముకుంద విలాసము. 1ఆ. పుట 4.

దీ॥ గిహాన సమాచార సహచరావిహిత మహిత
వికచ రుచికిల విచికల సకల వకుళ
విసర మధురస మధురస దసమ కుసుమ
సముదయుము బొ్ౘ మధుమాస సముదయంబు. [1]

పెద్దనగారి కవితా సంపదకీ పద్యము నిదర్శనము.

## విమర్శ వ్యాస పద్ధతి :

వ్యాసము వ్రాయుపద్ధతిని రెండు విధములుగా విభజించవచ్చును. 1. ప్రాచీన కవుల కవితా శిల్పము భావసంపద పాకము రచన శయ్యాసౌష్ఠవము, కవిశబ్ద చమత్కృతి. యిట్టి విషయములపై మనసును కేంద్రీకరించి కవి రచనా పాటవమును వినిపించుట 2. 'కవి కాలము ఆనాటి సాంఘికాభిరుచి వాటికనుగుణముగా కవి రచనా చమత్కృతి నాటి సంఘములో కవి రచన యెంతవరకు రసానుభూతిని గల్గించినది ప్రజలలో గ్రంధముయొక్క విలువ గాన రసస్ఫూర్తి ఎంతవరకాకవి రచనలో గానుపించును' అనునది పరిశీలనాదృష్టితో గ్రహించుట రెండవ పద్ధతి.

చినసోమభూపాలుడు కృతికర్త కృతిభర్త కావున ఆనాటి కవుల ప్రభువుల యభిరుచుల ననుసరించి రచనలు గావించుట జరిగినది. కాని ఒక్కటి మాత్రము గమనించదగినది. కవితా శిల్ప విషయములో మాత్రము చక్కని ప్రయత్నము జరిగినదను మాట వాస్తవము. నాటి రచన రాజులకు, పండితులకు వర్తించినదైనచో నేటి రచన జనసామాన్యమునకు రసానుభూతిని గల్గించునట్టిదై వెలుగొందుచున్నది. కావుననే కా పెద్దనార్యుడు సాహిత్య సంపదను గూర్చి యిటుల తెల్పెను.

మ॥ సరసాలంకృతిబోధసేకురు కళాచాతుర్యముందోచు వా
క్య రసజ్ఞత్వము గల్గు భావగతి నాహ్లాదంబిడుం చిత్తవై
ఖరి కావ్యంబులొనర్ప నేర్పుగలుగుం, గల్పించు రాజప్రియం
బిరవై దుర్వ్యసనంబడండు భువిసాహిత్యంబు సామాన్యమే [2]

---

1. కాణాదం పెద్దన- ముకుంద విలాసము- 1ఆ. 227ప..
2. కా. పెద్దన - ముకుంద విలాసము. 2ఆ. 233ప.

ఈ పద్యము తర్వాతనే పెద్దనార్యుడు కవుల సాహిత్య సంపదకు ప్రభువుల యాదరణ లభించినచో రచనలు వెలుగొందునని ఈ క్రింది పద్యమున దెల్పినాడు.

చ॥ పలుకులరీతి యర్థముల భంగి రసంబుల పెంపు భావపుం
జెలువము లాశ్రయంపు రుచిశీతల వైఖరి ప్రౌఢ మార్గముల్
లలిత చమత్కృతుల్ దగునలం కృతులుంగని సత్కవీంద్రులన్
మెలకువ గాంచి భూవరులు మెచ్చిన విద్యలు విద్యలా గదా.

## పెద్దన - చతుర్విధ కవితా విశారదుడు :

ఆశుబంధ గర్భచిత్ర కవిత్వములను చతుర్విధ కవితలందురు. కావున పెద్దన తన ముకుంద విలాసమున చతుర్విధ కవితల నెటుల చూపెట్టెనో వివరింతును.

ప్రభువగు చినసోమభూపాలుడు 'బంధగీర్వాణటీకాని బంధనాది పేశల వచో రచనార్యుడని' పెద్దనార్యుని పొగడినాడు పెద్దనార్యుడు ప్రభువు కోరిక ననుసరించి తన ముకుందవిలాసమున చతుర్విధ కవితలతో గ్రంధమును రచించెను.

పెద్దనార్యుని చిత్ర కవితా దక్షుని క్రింది పద్యమున గాంచునది.

వృత్త కంద గర్భిత సీసము (అనగా ఒక సీస పద్యమున వృత్తము, కంద పద్యము గర్భితమై యుండు నటుల రచన గావించుట). భద్రాదేవి స్వయంవరమునకు శ్రీకృష్ణుడు వచ్చును. స్వయంవరానంతర మితర రాజులు శ్రీకృష్ణునిపై దండెత్తి రాగా కృష్ణుడు వారిని బరిమార్చును. శ్రీకృష్ణుని సామర్థ్యమును గూర్చి తెల్పునట్టిదీ పద్యము.

సీ॥ సమద భాస్వద్దను జన్మ భేదన రణా
జ్మా భామినీపాల నాథ వాప్త
వరద ముఖ్యామర పారి కాంక్ష వినుతి
ప్రావీణ్య సౌఖ్య ప్రదావ ధాన
ఘన దయాపాంగ యుగాయ గాహిత హితా
జ్ఞాతాఖిలామ్నాయ నీతివేది.
శరద నీ కాశ నీల రుచిగా
త్రా కేరవాశ్రి వరా మురారి

గీ॥ యమిత విభవానుభావిత శమవిలసిత
ధీరవర్తి సలలిత కీర్తి ప్రవహిత
సకలభువనచయ విమల పవిత్రహృదయ
విహారి విశ్వమయూరి పవిత్రమూర్తి. (ముకుంద విలాసము)

అను సీసపద్యమున మొదటి అక్షరమును తొలగించి చదివినచో 'మత్తేభ విక్రీడితవృత్త' మేర్పడును. అటులే గీత పద్యమున 'మయూరి' అను మాట వరకు కందపద్యము గలదు. ఇట్టి చిత్ర కవితలీ గ్రంథమున నెక్కువగా గానుపించును. అటులే పాదభ్రమకము, నిరోష్ఠ్య ద్విపద, సోష్ఠ్య కందము, నిరోష్ఠ్య సోష్ఠ్యకందము, అపంచవర్గీయము, శుద్ధపంచవర్గీయ కందము, అచలజిహ్వా కందము, అక్షరద్వయ కందము మున్నగు చిత్రకవితలీ గ్రంథమున గనుపించును.

నన్నెచోడుడు తన కుమార సంభవమున 'పొన్నులు పూచె పొన్నలొగి పూయకముందర బూచె గోగుల'ను వసంతర్తువు వర్ణనబోలిన పద్యమీ పెద్దనార్యుని రచనలో గన్పించును.

బలరామకృష్ణులు స్వయంవరమునకు రాగా వారిని చూచిన చెలులు భద్రాదేవి ఎదుట వారిని పొగడుచుండగా ఆమె చూపులను కవి వర్ణించిన విధమును గాంచునది.

కం॥ మును కోర్కికన్న చూడ్కులు
కను చూడ్కులకన్న హృద్వికాసము హృదయం
బున కన్న మున్ను భావము
జని శౌరిన్ గలయ దివురు సతికవ్వేళన్. 3 ఆ. 192 ప,

## పోలికలు :

పెద్దనార్యుడు విష్ణుచిత్తీయమునకు తుల్యమౌనటుల రచన జేసితినని తెల్పినాడు. కావున ముకుంద విలాసమంతయు ప్రబంధ రచనగా వర్ణనాత్మకమై యొప్పును. పెద్దనార్యుడు తన గ్రంథమున అర్థాలంకారముల కన్నను శబ్ద చమత్కృతిని ఎక్కువగా చూపెట్టినాడు. అతని శబ్దాధికార భావశబలతకీ గ్రంథము ప్రబల నిదర్శనము.

విష్ణుచిత్తీయమున పుష్పలావికుల వర్ణనము గలదు. ఈ గ్రంథము ప్రథమాశ్వాసము 125 పద్యమున పుష్పలావికుల వర్ణనము గలదు. మనుచరిత్ర గ్రంథమందలి పద్య పోలికలు 'అచటి విప్రులు' అను సీస పద్యమును బోలిన పద్యమీ గ్రంథమందు 1 ఆ. 114 పద్యమున గలదు. ఈ గ్రంథమందలి 1 ఆ. 231 పద్యము 'కలరవంబుల రకంబుల పికంబులు గేరే అను సీసపద్యము 'శిశిర ఋతు వర్ణనము' వినసొంపుగా నుండును.

## పద్యముల ఛాయలు :

1. పెద్దన-మనుచరిత్ర ఛాయలు:- 1 ఆ. 141 ప. వసంతరుతు వర్ణనము.
   1 ఆ. 227 ప. రైవతకాద్రి వర్ణనము.

2. వసుచరిత్ర ఛాయలు:- ఈ గ్రంథమందు- 2 ఆ 258. 265, 263 పద్యములు

3. భాగవతము ఛాయలు:- 'మందారమకరంద (ప్రహ్లాద చరిత్ర) పద్యపోలిక ఈ గ్రంథమందు 2 ఆ. 145 పద్యము.

4. సుభాషితము:- 'సంగీత మపిసాహిత్యం' అను శ్లోకము యొక్క ఛాయ. ఈ గ్రంథమందు 2 ఆ. 228 పద్యము.

5. హితోపదేశము:- 'శిశుర్వేత్తి పశుర్వేత్తి' అనుశ్లోకము ఛాయ. ఈ గ్రంథమందు 2 ఆ. 229 పద్యములు గలవు.

## లోకోక్తులు - జాతీయములు :

కాణాదం పెద్దనార్యుడు తన ముకుంద విలాసమున జాతీయములను - లోకోక్తులను కూడా పద్యముల యందుపయోగించినాడు. 'తాడిద న్నెడివానిం దల దన్ను వారులేరే' 'వలదీగర్వంబులెంత వారికినైనన్ ఘనలోభము గల్గుచోట కరుణయులేదే (3 ఆ. 77 ప.) - 'అరయసత్పురుష కులముల్టిదిగాదే (1 ఆ. 230 ప.) మున్నగునవి యెన్నియో గన్పట్టును.

పెద్దనార్యుడు గ్రంథాంతమునందు చిన్నసోమభూపాలుని కోరికపై ప్రభువునకిలవేల్పగు కేశవస్వామి కంకితము గావించితినని ఈ పద్యమున దెల్పెను.

కం॥ వర కేశవ దేవాంకిత
సరణిన్ గద్వాల సోమ జనపతి భద్రా
పరిణయకృతి జేయించెను
స్థిర పెద్దన సుకవిచేత శ్రీశ్రీ జేయన్.

## 2వ కృతి - ఆధ్యాత్మిక రామాయణము :

కాణాదం పెద్దనగారి రెండవకృతి 'ఆధ్యాత్మ రామాయణము. ఈ గ్రంధము క్రీ. శ. 1872 లో గద్వాల సాహిత్య ముకుర ముద్రాక్షరశాలలో ముద్రితమైనది.

ఆధ్యాత్మ రామాయణమును కోటమరాజు నాగయామాత్యుడను కవి రచించినటుల తెలియుచున్నది.

## మూల గ్రంధము :

రామాయణము రచన గావించిన కవులెందరో గలరు. పెద్దనార్యుడు రచించిన ఆధ్యాత్మ రామాయణమునకు మూల గ్రంథము అగస్త్యుడు రచించిన ఆధ్యాత్మ రామాయణము. అగస్త్యుడు వ్యాసకవి కృత బ్రహ్మాండ పురాణము నుత్తర ఖండమున గల సప్త ఖండాలతో కూడియున్న రాముని అధ్యాత్మ బోధ నితివృత్తముగా గ్రహించి సంస్కృతమున నీ గ్రంథమును రచించెను. అట్టి అగస్త్య కవి కృత గ్రంథము నాధారముగా పెద్దనార్యుడీ గ్రంథమును రచించెను. ఈ గ్రంథము కవిగారి రెండవకృతి యనుటకు కారణము?- పెద్దనార్యుడు స్వయముగా 'చినసోమభూపాలుడు తన కాజ్ఞ యిచ్చినటుల నీ గ్రంథము వ్రాయుటకు ప్రోత్సహించినాడని' ఈ పద్యమున తెల్పెను.

కం॥ మునుపుం భద్రాపరిణయ
మునుకృతి జేసితిని కేశవాంకితముగ మా
యనుమతి మరియు ననేకము
లొనరించి రాంధ్ర సంస్కృతోక్తుల కృతులన్

1. కో. నాగయామాత్యుడు-ఆధ్యాత్మ రామాయణము. డి. నెం. 528
ఓ. ఎల్. యూనివర్సిటి - మద్రాసు.

గీ॥ వేదశాస్త్ర పురాణ వేదియైన సుకవి
కాణాదకుల కృష్ణసోమయాజి
పౌత్రమణి దగునీకిట్టి ప్రౌఢి యరుదె సుగుణ
విభ్రాజిత పెద్దన సోమయాజి[1]

---

ఉదా:- కొన్ని రామాయణములు - వచన రామాయణము, విచిత్ర రామాయణము, భారత గర్భ రామాయణము, రామకథా సుధాకర్ణవము యథా వాల్మీకము, శుద్ధాంధ్ర రామాయణము, అచ్చతెలుగు రామాయణము మున్నగునవి. Ref. అరుద్ర సమగ్రాంధ్ర సాహిత్యం స 11 పుట 115

---

అని పలుకుటచే నీ పెద్దనార్యుడు 'అధ్యాత్మ రామాయణము'నకు పూర్వమే 'భద్రా పరిణయము'ను ముకుంద విలాసమును రచించినటుల, స్పష్టముగా తెలియు చున్నది. మరియు పెద్దన యథాశ్లోక తాత్పర్య రామాయణమును (బాలకాండ) రచించినాడు గదా! కాని రామాయణమునందాధ్యాత్మ రామాయణ ప్రసక్తి లేదు. యథాశ్లోక తాత్పర్య రామాయణమున 'అలకణాదం పెద్దనాధ్వరి దనరించు' పటు చమత్కృతులతో బాలకాండ, యని మాత్రమే చెప్పబడియున్నది.

కావున కణాదము పెద్దనార్యుడు మొదట భద్రా పరిణయమును రచించి ప్రభువు కోరికకై అధ్యాత్మ రామాయణమును పూర్తి గావించి పిదప యథాశ్లోక- రామాయణమందలి 'బాలకాండ' ననువాదము గావించినాడని తెలియు చున్నది,

కా. పెద్దనార్యుని రచనా సంపదను గూర్చి వెన్నెలకంటి వెంకటపతి యివ్విధముగా పద్యమును చెప్పినాడు

ఉ॥ ఇద్దరు జోడు నన్నకవి ఎఱ్ఱన తిక్కన సోమయాజి దా
నుద్దెగు వారికిన్ ముగ్గురి కొక్కఁడె దీటగు నల్లసాని మా
పెద్దన వారితోడుతను పేరు వహించిన శ్రీ కణాదమున్
పెద్దన సోమయాజి నిను పెద్దన బోల్చు కవిత్వ సంపదన్.[2]

---

1. కా. పెద్దన - అధ్యాత్మ రామాయణము. పుట 4.
2. అరుద్ర - సమగ్రాంధ్ర సాహిత్యం. సం. 11. పుట 15,

పెద్దనార్యుడు తన అధ్యాత్మ రామాయణమున ప్రభువుల యిలవేల్పగు కేశవునితోపాటు వినాయక గరుడస్తుతి విశ్వక్సేనస్తుతి వాల్మీకి వ్యాస కాళిదాస దండి మొదలగు సంస్కృత కవులను స్తుతించెను. అనంతర మీకవి ఆంధ్ర కవులైన నన్నయ తిక్కన పోతన భాస్కర సోమనాథ ఆంధ్రకవితా పితామహుడైన పెద్దనాది కవులను స్తుతించి ఆంధ్ర గీర్వాణ భాషలందసమాన పాండిత్యము నా పాఠింపజేసిన తన బావగారగు నాగనార్యుని స్తుతించినాడు.

పెద్దనార్యుడీ గ్రంథమున 'పూర్వము నన్నయ తిక్కనాదులు తెనిగించుట లేమింజేసి మదీయ పూర్వపుణ్య వశంబున తానీ గ్రంథము నాంధ్రీకరించుట తన భాగ్యమ'ని తెల్పినాడు.[1] అటులే ఈ కవి తన అధ్యాత్మ రామాయణమును గద్వాల ప్రభువుల కిలవేల్పగు కేశవస్వామి కంకితము గావించినటుల తెల్పెను.

పెద్దనార్యుడీ గ్రంథమున పెద్దశోభనాద్రి నిటుల వర్ణించెను.

సీ॥ ప్రతిభ కృష్ణా తుంగభంద్రాంతర క్షమా
మండలి బ్రోచె సామ్రాజ్య మహిమ
కందనూల్ముఖ్య దుర్గముల దేశము లెల్ల
దేశముఖ్యైక ప్రతిష్ఠనేలె
గురు భూసురాదుల కురుభూమి రాజ్యాదు
లొసగెను బ్రీతిఁ విధ్యుక్త రీతి
యవన ముఖ్య మహీశ నివహంబుల జయించి
కప్పముల్గొనియె విక్రమ నిరూఢి
గీ॥ నాత్మ రాజ్యంబు కేశవాయత్తముగను
జేసి హరి గృహమార్జన సేచనాది
నిఖిల కైంకర్యములను తానే ఘటించె
నౌర పెదసోమవిభుడు ప్రఖ్యాతవిభుడు.[1]

మరియు

---

1. కా. పెద్దన - అధ్యాత్మ రామాయణము. పుట 3-4.

కం॥ ఆఖ్యాత యథా శ్లోక స
మాఖ్యగ నుద్యోగ పర్వమట భద్రజయో
పాఖ్యాన కృతియు పెద సో
మాఖ్య నృపుడొనర్ప జేసె హరికర్పణగాన్. 1

అని చెప్పుటచే ఈ పెద్దనార్యుడు కొటికలపూడి వీరరాఘవకవి ఉద్యోగ పర్వముతోబాటు, తన భద్రా పరిణయమను గ్రంథమును కూడా రచించుటకు పెద్దశోభనాద్రి సంకల్పమని తెల్పినాడు. కావున పెద్దనార్యుడు పెదసోముని కాలమునాటికి చిన్నవాడై యుండగా తన వంశీయులు గద్వాలకు విచ్చేయుటయు తాను భద్రా పరిణయమును రచించి కేశవస్వామికి యంకితము గావించుట జరిగి నదని అధ్యాత్మ రామాయణమందలి పై పద్యమున తెల్పినాడు.

పెద్దశోభనాద్రి మనుమడగు చినసోమభూపాలుని కాలము (1784-1815) నాటికి పెదశోభనాద్రి కోరికపై కవులు యథాశ్లోక తాత్పర్య రామాయణ మును ప్రారంభించి ఐదు కాండలను పూర్తి గావించిరి. మిగిలిన కిష్కింధ కాండను మీరు పూర్తి గావింపుడని చినసోముడు అప్పళాచార్యునితో చెప్పినాడు. అప్పళాచార్యులు చిన సోమభూపాలుని కోరికను తన రామాయణ భాగము (కిష్కింధ కాండ)న యిట్లు వివరించెను.

గీ॥ అతని సంకల్ప మీడేర్ప నర్హమగుట
ప్రేమ నీ కాండలన్ని జెప్పింతుగాన
కొదువ కాండ యమీరింపు గూర్పవలయు
నమర కేశవ దివ్య నామాంకితముగ. 2

అని తెలుపుటచే చిన సోముని కాలము నాటికే రామాయణమున ఐదు కాండలను కవులు అనువాదము గావించిరని తెలియుచున్నది.

## అధ్యాత్మ రామాయణము - మూలగ్రంథము.

సంస్కృతమున అశస్త్యకృతమగు ఈ గ్రంథము నాధారముగా పెద్దనా ర్యుడు తెనుగున 'అధ్యాత్మ రామాయణము'ను రచించెను.

1. కా. పెద్దన - అధ్యాత్మ రామాయణము - పుట 3-4.
2. కామసముద్రం - అప్పళాచార్యులు యథా. శ్లోక తాత్పర్య రామాయణము - అవతారిక. పుట 3-4.

నారదుడు బ్రహ్మ సమీపమునకు వెళ్ళి 'స్వామి! కలియుగ మాసన్న మైనచో జనులనేక కష్టములపాలై దురాచార సంపన్నులగుదురు. అట్టివారలను సరియగు మార్గమున నుంచ నేదేని యుపాయము చెప్పుమని' కోరెను.

అంత బ్రహ్మ నారదున కిట్లని వివరించెను.

మూలము :

శ్లో॥ ఇత్సంప్రశ్నే వాక్యమాకర్ణ్య ప్రత్యువాచాంబుజాననః
సాధు పృష్టం త్వయాసాధో వక్ష్యేతచ్ఛృణు సాదరం
పురాత్రి పురహన్తారం పార్వతీ భక్తవత్సలా
శ్రీరామతత్త్వం జిజ్ఞాసుః ప్రప్రచ్ఛ వినయాన్వితా
ప్రియాయై గిరిశస్తస్యై గూఢం వ్యాఖ్యాతవాన్ స్వయమ్
పురాణోత్తమ మధ్యాత్మ రామాయణమితి స్మృతమ్. 1

అని చెప్పబడినది. ఈ గ్రంథమందు శ్రీరామతత్త్వము నుపదేశించు రామగీత యనునది ఉత్తరకాండము అయిదవ సర్గలో రామలక్ష్మణుల సంవాద రూపమున నున్నది. ఇది 'భగవద్గీత' వలె ఉపనిషత్సారమై ప్రసిద్ధి జెందినది.

శ్లో॥ శ్రీరామగీత మాహాత్మ్యం కృత్స్నం జానాతి శంకరః
తదర్థం గిరిజావేత్తి తదర్థం వేద్మ్యహమ్మునే!
తత్తేకించిత్ప్రవక్ష్యామి కృత్స్నం వక్తుంనశక్యతే
యజ్ఞాత్వా త్వతుణాల్లోక చిత్తశుద్ధి మివాప్నుయాత్ 2

అని చెప్పి అట్టి రామతత్త్వము నీకు దెల్పెదననుటతో నీ కథ ప్రారంభ మగును.

అధ్యాత్మ రామాయణమందలి పెద్దనార్యుని ప్రారంభ పద్యమిటులున్నది.

---

1. అగస్త్యకృతమధ్యాత్మ రామాయణము - సం. పుట. 3.
2. అగస్త్యకృతమధ్యాత్మ మూలము - రామగీత - పుట. 5. తత్త్వము

శా॥ శ్రీకాంతామణి జానకీ స్ఫురణచే చెల్వంబుగా తాను రా
మాకారంబున లోకబృందమున కాత్మానంద మౌన ద్వితీ
యైకబ్రహ్మము కేళవుండు కరుణాయత్తస్థితిం నిర్మల
శ్లోకుణ తిర్వలరాయ సోమనృపతిణ సుశ్రీయుతున్ జేయుతన్ 1

## రామాయణ పఠన ఫలము:

పెద్దనార్యుడు అధ్యాత్మ రామాయణమును పఠించుట వలన గల్గు ఫలము నిటుల వివరించినాడు.

"అధ్యాత్మ రామాయణ మధ్యయనము గావించిన మనుజుడు జీవన్ముక్తుడగును. నిత్యపారాయణము గావించువారి కశ్వమేధ ఫలంబులబ్బును. వేదాధ్యయన పరులును అఖిల వ్యాఖ్యాతలును అనంత పుణ్యఫలములందుదురు ఏకాదశినాడు పారాయణము గావించిన శ్రీరామ నవమినాడు జాగరణము గావించి నుపవసించి ప్రేమతో శ్రీరాముని ధ్యానాత్మ తత్వమును మననము గావించిన నరునకు కురుక్షేత్రాది సమస్త తీర్థ ఫలములభించును" అని తెల్పెను.

రామహృదయ రహస్యమును గూర్చి తెల్పుచు నిట్లనెను.

కం॥ ప్రకృతి పరము నసాధ్యం
బకలంక బమృత మచల మానందంబై
యొకటి వెలుంగు బ్రహ్మము
ప్రకటంబుగ వెలయురామ పదవాచ్యంబై 2

ఈ గ్రంథమితర రామాయణాదులవలె గాక సీతారామ హనుమత్సంవాద రూపమైన రామ హృదయమును పరమశివుడు పార్వతికి దెల్పుట యిందలి విశేషము.

ఈ గ్రంథమందలి ముఖ్యమైనది రామగీత పద్యము. కవిరాముని హృదయము నీ గీతములో నెరిగినవాడు బ్రహ్మహంత యైనను పూతుండగునని తెల్పెను.

---

1. కా. పెద్దన - అధ్యాత్మ రామాయణము - ఆరంభ పద్యము - పుట. 6.
2. " " " అవతారిక - పుట 5.

## శబ్ద చమత్కృతి:

పెదనార్యుడీ అధ్యాత్మ రామాయణమున శబ్దాధికార దక్షతతో చూపెట్టిన శబ్దాలంకారములను కడు రమ్యముగా పద్యములయందు తెల్పినాడు. ఈ క్రింది పద్యమున రామచంద్రుని చరితము సుందరము అతి విచిత్రమట. అట్టి సచ్చరిత మెంతవినినను తనివి తీరదనును.

కం॥ చిత్రంబులు భవ్యవమీ
చైత్రంబులు భవమహోఘ జైత్రంబు చి
త్తూస్తత్రింబులు కృత విబుధ
స్తోత్రంబులు రామచంద్రు సుచరిత్రంబుల్
(అధ్యాత్మ రామాయణము బాలకాండ)

అందువలననే కాబోలు పెదనార్యుని వెన్నె వెంకటపతికవి అల్లసాని పెద్దనతో పోల్చినాడు.

## అయోధ్యా పురవర్ణనము: (శబ్ద చమత్కారము)

ఉ॥ పూతము పుణ్యసంపదను భూతము పూర్ణ సమస్తవస్తు సం
జాతము దేవభూత మనుజాతము కేతన వాతధూత జీ
మూతము సద్యశోగుణ సమూతము సాధుపరీత మొప్పు సా
కేతము రత్న సుందర నికేతము రాజరమా సమేతమై. (బాలకాండ)

ఇతడు జ్యోతిష భాగమందును దిట్టయనుటకీ పద్యమును గమనించునది. రాముని జననము తెలియజేయు సందర్భమున—

మ॥ రవియుజ్ఞ శుక్రబృహస్పతుల్ కుజశనుల్ రమ్యాంశనుచ్చస్థులై
సవరింపన్ శుభముల్ పునర్వసు పునశ్చైత్రాశ్రిద్యపక్షోజ్జ్వల
న్నవమిం చంద్రసమేత కర్కటకలగ్నంబందు భవ్యాప్తి ను
ద్భవిలెన్ టానె సనాతనంబగు పరబ్రహ్మంబు కౌసల్యకున్. [1]

## అధ్యాత్మ తత్త్వము:

ఈ గ్రంథమందు సీతా రామలక్ష్మణులు అరణ్యములో ఆశ్రమాలను దర్శించుచు సుతీక్ష్ణాశ్రమము ను ప్రవేశింతురు. అచట వారు ఆశ్రమవాసుల యాధిత్యమును స్వీకరించి వారి యనుమతితో నగస్త్యాశ్రమమును ప్రవేశింతురు.

1. కా. పెద్దన - అధ్యాత్మరామాయణము - రామజననము.

రాముడు అగస్త్యునితో కొంత వేదాంతవిషయమును గూర్చి ముచ్చటించుచు సంసార వృక్షమునకు ప్రకృతి మూలము. పాంచభౌతికము స్కంధము ఇంద్రియములు శాఖలు. దీనికి బుద్ధ్యహంకార తృష్ణలు చుట్టబడియుండును. బంధువులాదిగాగలవారు ఆకులు. రాగలోభములు పూవులు దారా పుత్రాదులు చిగుళ్ళు. సుఖదుఃఖములే ఫలములు. జీవాత్మయనునది పక్షిగణము. ఇట్టి సంసార వృక్షము నజ్ఞుడు తెలిసికొనజాలడు. ఆత్మజ్ఞుడు మాత్రమే గ్రహింపజాలును.

మాయతో నిబిడీకృతమైన సంసార వృక్షము నధిరోహించియు ఆత్మను గూర్చి పర్యాలోకనము గావించువారికి సంసార దుఃఖములంటజాలవని ఆధ్యాత్మతత్త్వము నెరింగించును.

'ఆత్మతత్త్వమును తెలిసికొని అజ్ఞానముచే కప్పబడియున్న నాత్మను విజ్ఞానముచే నెరింగి తనలో నెవడానందము ననుభవించునో అట్టివాడు ప్రాజ్ఞుడనబడును ఆత్మను తెలిసికొనుటయే విజ్ఞానమనబడునని తెల్పెను.

మోక్షమననేమి? అను విషయమును గూర్చి దెల్పుచు 'ఈ విశ్వమే నా స్వరూపము. అదియే మోక్షరూపమై భక్తిజ్ఞాన వైరాగ్యములయందాసక్తి జెంది ఆత్మవిజ్ఞాన మరయు వారలకిది సులభసాధ్యమగును. నాపై భక్తి లేనివారికిది దుర్లభమని' తెలియజెప్పుట కడు రమణీయముగా గన్పట్టును. ఇట్టి వనేక విషయముల నీ గ్రంథమందు రాముడు సౌమిత్రికి తెలియజేయును.

## తారతమ్యములు :

వాల్మీకి రామాయణమునందు లేనివి కొన్ని విషయములీ గ్రంథమందు వివరింపబడినవి.

రావణుడు సీతనపహరించుటకై పర్ణశాలకు రాకపూర్వమే రాముడు సీతతో- 'నిన్ను గ్రహించుటకు రావణుడు వచ్చును. నీ యాకారముగల నీ ఛాయనిటనుంచి వత్సరాంతము వరకగ్నియందు వసింపుమని' ఆజ్ఞయిచ్చుట ఆధ్యాత్మరామాయణమున తెల్పబడినది.[1]

1. కా. పెద్దన - ఆధ్యాత్మరామాయణము - అరణ్యకాండ - పుట 19.

రాముడు సీతకు ముందు జరుగబోవు విషయమును గూర్చి తెల్పుట, ఆమె మాయసీతను పర్ణశాలలో నిల్పి తానగ్నిలో నంతర్హితురాలగుట నీ గ్రంథమున తెలియజెప్పుట విశేషము.

రావణుడు సీత (మాయసీత)ను గొనిపోయి లంకలో దనుజకాంతారమున నుంచును. ఇట రాముడు మారీచుని సంహరించి ఆశ్రమమునకు వచ్చి దుఃఖించుచున్న లక్ష్మణుని గాంచును. అతనిని జూచి రాముడిట్లు తనలో తలంచును.

'నా యొక్క రహస్యమిత డెరుగడు. నిజసీతనగ్నియందు వసింపుమనియు ఛాయయగు సీతను పర్ణశాలలో నుంచుట కేర్పాటు గావించిన విషయము. ఒకవేళ నేను దైన్యవృత్తి నవలంభించినచో రావణ వధ జరుగదు. తానవతరించినది దుష్టశిక్షణ శిష్టరక్షణయే గదా' యని తలంచి దైన్యభావమున రాముడు లక్ష్మణుని గాంచును. రాముడు సీతావియోగమును గూర్చి అతనితో మాటలాడును. ఈ విషయము వాల్మీకిరామాయణమున చెప్పబడలేదు.[1] ఈ గ్రంథమిట్టి ఆధ్యాత్మికతతో కూడియున్నది. కావుననే పార్వతి రామతత్త్వమును శంకరుడు చెప్పగా శ్రద్ధతో వినుట జరిగినది.

అగ్నియందు దాచబడిన సీత (నిజమైన సీత) రావణవధానంతరము మాయసీత అగ్నిప్రవేశమగుట, నిజమైన సీత వెలుపలికి వచ్చుటయు, రాముడు లోకాపవాదము తొలగించుకొనుటకు గల కారణములు.

రాముడు మొదట సీతను అగ్నియందు వసింపుమని చెప్పుటచే నిజమగు సీత లంకలో నుండలేదు. రావణుడు గ్రహించినది కేవలం మాయసీతయని ఆధ్యాత్మ రామాయాణము వలన స్పష్టమగుచున్నది, ఇట్టి రహస్యము లెన్నియో ఈ గ్రంథమందు గలవు. అడుగడుగున రాముడు సౌమిత్రికి - ఋషులకు ఆధ్యాత్మికతత్త్వమునుపదేశించుటచే నీ గ్రంథమునకధ్యాత్మరామాయణమని పేరిడుట సమంజసమే.

అధ్యాత్మ రామాయణోత్తర కాండలోనున్న విషయమత్యంతాద్భుతము. రాముడు లక్ష్మణునితో ఆధ్యాత్మిక విషయములనుగూర్చి తెలియజేయును. అట్టిదానిని 'రామగీత' యని అందురు.

1. వాల్మీకి - రామాయణము - అరణ్యకాండ.

ఈ ఉత్తరకాండమందు మరొక విశేషమున్నది. ఒకనాడు రాముడొంటరిగా కూర్చున్న సమయమున సీత అచటికి వచ్చును. సీత రామునితో 'దేవతల్లెల్లరు తనను వైకుంఠమునకు రమ్మని కోరుచున్నారు. చాలకాలమునుండి వైకుంఠమున మునులు దేవతలు తమ రాకకై వేచియున్నారని' చెప్పును. రాముడామె పలుకులు విని యిట్లనును.

మ॥ ఇట వాల్మీకిమునీంద్రునాశ్రమమునం దీవుండి నీకైన యి
ప్పటి గర్భంబునజేసి పుత్రయుగముం బ్రాపించి నాయొద్దక
ప్పటికేతెంచి జగంబులం బ్రతినదోషంబుభూమి మార్గంబుచే
నటవైకుంఠము జేరనీవు జనుమాయామీదనే వచ్చెదన్.[1]

ఇచట రాముడు జనాపవాదము రాకపూర్వమే 'సీతనడవికి పంపుదును. లవకుశులను కవలపిల్లలనుగని నాకిచ్చిన యనంతరము వైకుంఠమునకు బోవలసినదని' సీతతో చెప్పును. ఇట్టిది వాల్మీకి రామాయణమున లేదు. జనాపవాదము–సీతనడవికి పంపుదునని చారుని వార్త తెలియకపూర్వమే సీతతో రాముడు పై విషయమును చెప్పుట ఈ గ్రంథమందలి విశేషము. వాల్మీకి రామాయణమున జనాపవాదభీతి చారుని వలన విని రాముడు సీతనడవికి బంపుట వర్ణితము.

## రామగీత:

ఈ గ్రంథమందు రాముడు సౌమిత్రికి అధ్యాత్మతత్త్వము (రామగీత) పరివేశము గావించును. పార్వతి పరమేశ్వరునితో రామగీతయననెట్టిది? అని ప్రశ్నించినపుడు ఈశ్వరుడామెతో నీవిధముగా రామగీతను బోధించును.

ఇది అజ్ఞాన తమమును హరించునట్టిది. వేదవిహితమైనట్టిది. జ్ఞానమును గూర్చి తెలియజేయునట్టిదని తెల్పుచు– 'కర్మవిషయమున, జన్మరాహిత్యవిషయమున, జ్ఞానవిషయమున ననేక ధర్మసూక్ష్మములు గలవు. కర్మశరీర సంబంధి అది ప్రియాను ప్రియమని అతని మనస్సునుబట్టి చరించును. అటులే ధర్మాధర్మములతని బట్టియే చరించును. ఆ ధర్మమే భవబంధమును తొలగించుకొనుటకు కారణభూతమగుచున్నది.

1. కా. పెద్దన - అధ్యాత్మరామాయణము - ఉత్తరకాండ పుట, 17.

మనము జేయు కర్మననుసరించియే జన్మయందాసక్తి జనించును. ఇటుల యొకదానితోనొకటి (కర్మ-జన్మ) కులాల (కుమ్మరి) చక్రమురీతి భవకర్మములు మనవెంట సంచరించుచుండును.

జన్మ మరణపురల నుద్భవమగుటకు కారణ మజ్ఞానమే. కావున అట్టి అజ్ఞానమును తొలగించుకొనినపుడే జ్ఞానోదయ మేర్పడును. జ్ఞానము వలన ప్రజ్ఞ, ప్రజ్ఞ వలన మంచిచెడు విచారమేర్పడును. దానివలన ఫలితమజ్ఞానము పటాపంచలగును.

కర్మ యనునది వేదముఖమున చెప్పబడినది. అటుల చెప్పబడిన కర్మ జ్ఞానము నలవరింపజేసి మోక్షమునకు సాధన భూతమగును. అంతేకాదు కార కాదులు (పంచేంద్రియములు) నెల్లెడల ప్రకాశించి మోక్షసాధనములగు కార్య ములు జేయుటకు మానవుని కార్యోన్ముఖునిగా జేయును. దానిచే నతనికి సిద్ధి యేర్పడి జ్ఞానతృష్ణచే నతడు కార్యములను జేయబూనుకొనును.

'అహమ్' అను మాటను జ్ఞానసిద్ధి పొందినవాడు తలంచడు. జడుడే తలంచును. మానవుడు దేహేంద్రియాదులాత్మగాదని యెరిగి జ్ఞానామృతమనుభ వింపగల్గినపుడు హంసక్షీరమును గ్రహించి జలమును త్యజించినరీతి జగన్మూలక మగు వృత్తిజాలములను (సంసారవృత్తి) త్యజించును. అవి అతనినంటవు. ఏలయన ఆత్మకు జనన మరణ క్షీణ వర్ధనాదులు లేవు. ఆత్మకు సర్వాతిశయము స్వయంప్రకాశము సర్వగతమును జ్ఞానమయమై గన్పడి సుఖస్వరూపమగు పుట్టుక (భవము) విరోధమురీతి దోచును.

అయినను అభ్యాస వశమున ప్రపంచమతనికి జ్ఞానోదయమగు లీలగా దోచును అతడు జగత్తున తాను గావించు సత్కార్యములన్నియు భగవదర్పిత ములనియే యని తలంచి జేయుచు బోవును. అటుల మానవుడు జేయు సత్కా ర్యములన్నియు నా కర్పితములై, నా లీలగా దోచునతని యాత్మ నాయందే లగ్నమై జీవితమును చరితార్థము గావించుకొనును. అని రాముడు సౌమిత్రికి నాధ్యాత్మికతత్త్వమును ప్రవేశ మొనరించెను.[1]

ఈ విషయమును శంకరుడు పార్వతికి తెలియజేయును.

---

1, కా. పెద్దన-అధ్యాత్మరామాయణము - ఉత్తరకాండ- రామగీత పుట. 22

## ఆర్గురు రామాయణ కవులు:

గద్వాల సంస్థానమున వాల్మీకి రామాయణమును ఆర్గురు కవులు ఒక్కొక్క కాండ చొప్పున 'యథాశ్లోక తాత్పర్య రామాయణము'ను పేర అనువాదము గావించిరి.

ఈ యథాశ్లోకతాత్పర్య రామాయణము రెండు సంపుటములుగా గద్వాల శ్రీ చెన్నకేశవ ముద్రణాలయమున క్రీ.శ. 1821లో ముద్రితమైనది. ఈ క్రింది పద్యమున ఎవరే కాండను వ్రాసినారో తెలియజేయబడినది.

సీ॥ అలకాణాదను పెద్దనాధ్వరి దనరించు
పటుచమత్కృతులతో బాలకాండ
మలకొత్తపల్లి రామాచార్యులొనరించు
మరి నయోధ్యకాండ సరస రచన
మలగార్గ్య పురవాసుడగు సుబ్బశాస్త్రి య
రణ్యకాండంబును రమణ గూర్చు
నల తిరుమల కృష్ణమాచార్యులతి వేగ
గావించు సుందరకాండ మరియు

గీ॥ బోరవల్లి శేషకవి ప్రేమబూని యుద్ధ
కాండమును జేయు తెల్గునీకరణి మీరు
కొదుప కిష్కింధకాండయగూర్చి రాము
నరుని పట్టాభిషేక మొనర్చవలయు.[1]

అని చెప్పుటచే నార్గురు కవురు వాల్మీకి రామాయణమను శ్లోకానువాదము గావించినారని స్పష్టముగా దెలియుచున్నది.

ప్రతికాండ యొక్క ఆరంభ పద్యమిటులున్నది. పూడూరు చెన్నకేశవ స్వామిని ప్రార్థించుచు కాణాదం పెద్దన గారు కా. రామచంద్రాచార్యులు బాల, అయోధ్యకాండల ప్రారంభమున ఇంచు మించుగా ఒకే విధమగు పద్యమును వ్రాసినారు.

---

1. కా. పెద్దన యథా. శ్లోక. తా. రామాయణము- బాలకాండ అవతారిక పుట 3-4.

## కాణాదం పెద్దన—బాలకాండ:

ఆరంభమున :-

కం॥ శ్రీమజ్జలధి సుతాలల
నామణి మణివలయ ఝుణఝుణత్కారికరా
బ్జామృదిత పదద్వితయ కృ
పామయ పూఁడూరి కేశవ మహాభ్యుదయా!

అనుటచే కా. పెద్దనగారు మరియు కొత్తపల్లి రామచంద్రాచార్యులు వీరిరువురు తమ అనువాదములను ప్రారంభించు నపుడు గద్వాల ప్రభువులు మొదట పూఁడూరిలో నుండినందున ఆ స్వామిని ప్రార్థించినట్టుల వారి ఆరంభ పద్యముల వలన తెలియుచున్నది.

మిగిలిన కవులు వ్రాయు సమయమున ప్రభువులు తమ నివాసమును గద్వాలకు మార్చినారు. కావున గద్వాల నివాసమగు కేశవస్వామిని స్తుతించి రచన ప్రారంభించుట జరిగినదని తెలియనున్నది. వారు వ్రాసిన ప్రారంభ పద్యమిటులున్నది.

కం॥ శ్రీలక్ష్మీ మృదుకుచకల
శాలిప్త మృగీమదద్ర వాంకిత వక్షా!
పాలిత సోమ నృపశ్రీ
ఖేలన గద్వాలనగర కేశవశౌరీ![1]

కా. పెద్దన గారు యథాశ్లోక తాత్పర్య రామాయణమున బాలకాండను మూడాశ్వాసములలో ననువాదము గావించినారు.

ఆశ్వాసాంతగద్య యిటులున్నది. "శ్రీ మదుభయ కవితా నిస్సహాయ సాహిణీ విహార కాణాదాన్వయ తిమ్మనార్య కుమార వినయవిభ్రాజి పెద్దన సోమయాజి ప్రణీతంబైన శ్రీమదాంధ్రరామాయణంబను మహా ప్రబంధంబునందు యథాశ్లోక తాత్పర్యంబధితంబగు బాలకాండమునందు" అని వ్రాసి యుండుటచే తాత్పర్యమును దృష్టియందుంచుకొని శ్లోకానువాదము గావించెనని స్పష్టముగా తెలియుచున్నది.

---

1. గార్గేయపురం సుబ్బాశాస్త్రి - అరణ్యకాండ. ఆరంభ పద్యము,

పెద్దనార్యుడు తన బాలకాండను పూడూరి చెన్న కేశవస్వామి కంకితము గావించెను. ప్రభువునకు తన యిలవేల్పనినను మరియు రామాయణ పారాయణ మనినను ఎంత శ్రద్ధయో పెద్దనగారి క్రింది పద్యమున తెల్పినారు.

కం॥ శ్రీ మద్రామాయణ కథ
యేమరకను ధాటి నూట ఎనిమిది మారుల్
నేమమునను పారాయణ
మీమహీపతి జేసెనంచు నెంతురు విబుధుల్ 1

అని చెప్పుటచే చిన సోమభూపాలుడు అంతటి భాషాభిమాని యనియు కవులన్న అతనికెంతో యిష్టమనియు తెలియుచున్నది. ఈ రామాయణ మాంధ్రీ కరణమున ప్రతిసర్గ చివర అసర్గయందుగల కథను ఈ ఆర్గురు కవులు 'యథా శ్లోకతాత్పర్య రామాయణము'న వివరించినారు.

## బాలకాండ అనువాదము:-

కాణాదం పెద్దనగారు 'బాలకాండ' ను మాత్రమే అనువాదము గావించిరి. ఇందు పెద్దనార్యుడు ప్రాచీన కవులను, కేశవస్వామి దశావతారములను వర్ణించెను ఈ కవి వైష్ణవ సంప్రదాయానుగుణ్యంగా తమ మత గురువులైన భాష్య గ్రంధకారుని వేదాంత దేశికులను శఠకోపయతిని రామానుజులాదిగల వారందరని ప్రార్థించినాడు. గద్వాల ప్రభువులు వైష్ణవమత సంప్రదాయానుయాయులు. కేశవస్వామి భక్తులు.

తర్వాత పెద్దనార్యుడు సుకవిస్తుతి కుకవినింద గావించి రామాయణమునకు మూలకందమై లోకోత్తర చరిత్రను సృష్టించిన సీతాదేవిని 'సరసరాముని కల్యాణ సటనసీమ, తేజరిల్లిన సీతాసతీ లలామ, యని సీతను స్తుతించినాడు.

పెద్దనార్యుడు తన అనువాదమునిట్లు ప్రారంభించెను.

నారదుడు రామకథను వాల్మీకుల కుపదేశించి వారిచే పూజితుడై దివి కరుగెను. అనంతరము వాల్మీకి భరద్వాజుడు వెంటరాగా స్నానార్థమై తమసా నదికి బయలుదేరును.

1. కా. పెద్దన యథా. శ్లో. రామాణము బాలకాండ అవతారికలోని పద్యము.

మార్గ మధ్యమున నొకచో క్రౌంచ మిధునమును వాల్మీకి చూచుచుండగా శబరుడొకడాజంటనున్న పురుష ఖగమును వధించెను. అది మహీతల పతితమై రక్తసిక్తాంగకమైయుండ దానినాపక్షి భార్య చూచి దీనారావమున నాక్రందించెను. ఆ ఆక్రందనమును విన్న వాల్మీకి తన మానసమున దయారసము పెల్లుబికి నిషాదునితో నిట్లనెను-

మూలము:- శ్లో॥ మానిషాద ప్రతిష్ఠాంత్వమగ మశ్శాశ్వతస్సమాః
యత్క్రౌంచమిధునాదేక మవధీః కామమోహితమ్॥

అనినాడు. దానికి జానాదం పెద్దనార్యుని అనువాదం.

గీ॥ క్రౌంచ మిధునంబునందొక్క కామమోహి
తమును క్రౌంచంబు ద్రుంచితీవమర దాన
గనుక నుండు మనేక హాయనము లుండ
బూను సంగతులను వినుమా నిషాద.

అని అనువదించెను. అనువాద పద్ధతిని పరికించి చూడగా రచన సహజమై సరళమై ద్రాక్షాపాకమున నున్నటుల దెలియును. అయిన నీకవి తన రచనలో నర్థాలంకారములతో బాటు శబ్దాలంకారములను వాడుట యితని రచనలో గల ప్రత్యేకత.

బ్రహ్మ వాల్మీకి మహర్షికి ప్రత్యక్షమై రామాయణమును రచింపుమని తెల్పిన పద్యానువాదము.

కం॥ నాయాజ్ఞ వలన నీకీ
స్వాయత్తంబైన వాణి వర్తిపెగానన్
శ్రీయుతము రామ చరితం
బీ యెడ సర్వము నొనర్చు ఋషివరన్ (ద్వి. స. బాలకాండ.)

## వచనము :

కాణాదం పెద్దనార్యుని వచనానువాదమును గాంచిన నన్నయగారివలె పురాణశైలి యితని రచనలో గన్పించును, "కావున నిందు (రామాయణము నందు) నీ సూక్తులు సూనృతములగును. గాన పుణ్యంబునగు రామకథ నొనర్పుము. శ్లోకపదబంధురంబును సుందరంబు గానని తెలుపఁ వాల్మీకి నానం

దంబున మధుర పాకంబులగు శ్లోకములచే భవ్యంబగు రామాయణ మహాకావ్యంబు సర్వంబును కవితావిలాసంబునం జేసెదనని నిశ్చయించెను. బ్రహ్మ వాల్మీకి నాశీర్వదించి తన లోకమునకు వెడలెను.[1]

కాణాదం పెద్దనార్యుని కందపద్యము వినసొంపుగా నుండును-

కం॥ గంగను గలతద్వారిత
గంగను మజ్జన మొనర్చి కలుషములు తొల
గంగను నానందముతొల
గంగను లోకంబు వెలయగత శోకంబై. (బాల. ఆ. 2.)

పెద్దనార్యుని గంగావతరణమును వర్ణించినతీరును పరికించిన అతని రచనా శైలి తెలియును.

శా॥ అంతన్గంగ సమస్తలోకనుత నీహారాద్రి సంభూత య
త్యంతాకారముబూని దుస్సహసముద్యద్వేగ సన్నాహ దు
ర్ధాంతంబై దివినుండియుంబడియె బభ్రంబౌమహాదేవు మూ
ర్ధాంతర్వీధికయందు దుర్భరతర వ్యాపార దుర్వారయై

ఇటుల కాణాదం పెద్దనార్యుడు తన మూడవకృతియగు 'యథాశ్లోక తాత్పర్య రామాయణము'న బాలకాండకు శ్లోకముల కాంధ్రానువాదము గావించి చరితార్థుడయ్యెను.

## కొత్తపల్లి రామచంద్రాచార్యులు:

కొత్తపల్లి రామచంద్రాచార్యులు 'యథాశ్లోకతాత్పర్య రామాయణ మున అయోధ్యకాండను ఐదాశ్వాసములలో ననువాదము గావించినాడు.

**తల్లిదండ్రులు :-** ఇతని తల్లిదండ్రులు లక్ష్మాంబా నరసింహాచార్యులు గారు ఇంటి పేరు కొత్తపల్లి వారు. తాతగారు ఔబళాచార్యులు. వీరిది ఆత్రేయస గోత్రము. ఆపస్తంబ సూత్రము. వీరిది పండిత వంశము.[2] చినసోమ భూపాలుని ఆస్థాన విద్వాంసులుగా వీరుండుటచే నీకవి కాలము 18వ శతాబ్ది ప్రథమ పాదము యని చెప్పవచ్చును.

---

1. కా. పెద్దన - బాలకాండ వచనానువాదము పుట. 12-14.
2. కొ. రామచంద్రాచార్యులు అయోధ్యకాండ. ఆశ్వాసాంతగద్య. పుట 54.

పెద్దనార్యుని బాలకాండ కథ 'రామలక్ష్మణ భరత శత్రుఘ్నులతో క్రమముగా సీత ఊర్మిళ మాళవి శ్రుతకీర్తులకు వివాహము జరిగి నిజపురమునకు తిరిగి వచ్చుట. మార్గమధ్యమున భార్గవరాముని ధనురాకర్షణము- తదీయ గర్వనిర్వాపణము జరిగి వారు అయోధ్యాపుర ప్రవేశము గావింతురు. భరతుడు మేనమామ గారింటికికరుగుటతో పరిసమాప్తమగును.

దశరథుడు రాముని యువరాజ పట్టాభిషేక మొనరించ మంత్రులతో సభ వారితో తన కోరికను వెల్లడించుటతో నయోధ్యకాండ ప్రారంభమగును.

## అయోధ్యకాండ – అనువాద పద్ధతి

కొ. రామచంద్రాచార్యుల 'అయోధ్య కాండ' అనువాద పద్ధతిని పరికింతము.

శ్లో॥ వృద్ధికామోహిలోకస్య సర్వభూతాను కంపనః
మత్తః ప్రియతరోలోకే పర్జన్యయివవృష్టిమాన్ 1

అనువాదరీతి:-

గీ॥ జగములకు వృద్ధిగోరెడు సద్గుణాఢ్యు
డఖిల భూతదయాపరుడైన రామ
చంద్రుడిమ్మహి వర్షించు జలధరంబు
కరణి ప్రజలకు నాకన్న కడు ప్రియుండు.

అని ఆచారుల్యవారు తన అనువాదమున 'పర్జన్యయివ' అను దానికి 'జలధరంబుకరణి' అచట అలంకారము 'ఉపమ' అనువాదమందును ఉపమాలంకారమును మాపెట్టుచు ననువదించినారు.

మూలము:

శ్లో॥ ప్రాప్యవర్ష సహస్రాణి బహూన్యాయూం షి జీవతః
జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాంతిమభిరోచతే (అయోధ్య 1 స 24శ్లో)

1. వాల్మీకి- రామాయణము- అయోధ్యకాండ 1 స. 37 శ్లో.

అనువాదమున-

గీ॥ అవని నరువదివేల యేండ్లధిగమించి
పెక్కు పురుసాయువని వెస జరాభ
రంబునొందిన నాశరీరమున కిప్పు
డూరట మనంబులో గోరుచున్న వాడ [1]

ఇచ్చట ప్రాప్యవర్ష సహస్రాణి, అని మూలమున నున్నది. దానికి ఆచార్యులవారు – అవని అరువదివేల యేండ్లధిగమించి, అని అనువాదము గావించినారు. ఈ సంఖ్య దేనినాధారమునుబట్టి వ్రాసినారో తెలియవచ్చుటలేదు. మిగిలిన అనువాదము సహజముగను సరళముగను గావింపబడినది. అనువాద విషయమున ఈ రామాయణకవులు మిక్కిలి శ్రద్ధతో తాత్పర్యము ననుసరించి రచన గావించినారు.

అటులే అలంకారముల విషయములలో కూడ తగు శ్రద్ధను గనపరచినారని చెప్పవచ్చును ఈ క్రింది శ్లోకమును పరికించునది.

శ్లో॥ అతిబ్రువంతం ముదితాః ప్రత్యానందన్నృపాన్నృపమ్!
వృష్టిమంతం మహామేఘుం నర్త్ంతయిన బర్హిణః [2]

అనువాదము-

కం॥ ఇమ్మెయి భూపతిబల్కగ
సమ్మతమిది మాకటంచు జనపతులెల్లన్
సమ్మోదించిరి వర్షా
భ్రమ్మగని మ్రోయుబర్హివర్గము మాడ్కిన్.

కవుల అనువాద విషయమున వ్యర్థపదము లిసుమంతైనను జేర్చక అలంకారములను కూడ మూలమును దృష్టియందుంచుకొని తెనుగున అనువాదము గావించుటలో తగుశ్రద్ధ గనపరచినారని తెలియుచున్నది.

రామునికి శుభములు చేకూరవలెనని అయోధ్యావాసులెల్లరు దేవతలకు మ్రొక్కుదురట. వాల్మీకి తన రామాయణమున రామునిగూర్చి–

---

1. కొ. రామచంద్రాచార్యులు. అయోధ్యకాండ ఆంధ్రానువాదము పుట 98.
2. వాల్మీకి రామాయణము అయోధ్యకాండ - 112 స. శ్లో. 16.

శ్లో॥ స్త్రియోవృద్ధా స్తరుణాశ్చసాయం ప్రాతస్సమాహితాః!
సర్వాన్దేవాన్నమస్యన్తి రామస్యార్థే యశస్వినః[1] శ్లో॥ 42

దానికి ఆచార్యులవారి అనువాదము-

కం॥ పురముల పల్లెనుండెడు
పరిచారకులితర జనులు పడతులు వృద్ధుల్
తరుణులు సంజమప్రొద్దున
సురులకు మ్రొక్కుదురతండు శుభమొందుటకై.

ఇచ్చట 41 శ్లోకము ఉత్తరార్ధమున 'పౌరజానపదోజనః' అనుదాని నన్వయించుకొని 42 శ్లోకములోని తాత్పర్యమును దృష్టియందుంచుకొని పై పద్యమనువదింపబడినది. అనగా మూలమందలి ప్రతి పదమునుగాని భావమునుగాని బాగుగా ఆలోచించి ఈ కవులు రామాయణమాంధ్రానువాదము గావించినారనుటలో సందేహము లేదు.

## వ్యర్థపదరాహిత్యము :

ఈ రామాయణ కవులు అనువాదవిషయమున వ్యర్థపదములిసుమంతైనను రానీయక సహజము గన్పించునటుల శ్లోకములకు తాత్పర్యానువాదము గావించినారు. ఆచార్యులవారి రచనలో ప్రాసాదగుణము గన్పడును.

శ్లో॥ సత్యేనలోకాన్జయతి దీనాన్ దానేచ రాఘవః।
గురూన్ శుశ్రూషయావీరో ధనుషాయుధి శాత్రవాన్॥
సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్।
విద్యాచగురుశుశ్రూషా ధ్రువాణ్యేతాని రాఘవే॥[2]

అను దానికి ఆచార్యులవారు-

కం॥ వినయము విద్యయు సత్యం
బును దపమార్జనము మైత్రిబుధసేవయు పా
వనతయు సముచిత దానం
బును రామునియందు నిక్కముగ గలవబలా

1. వాల్మీకి-రామాయణము అయోధ్యకాండ స 2. శ్లో. 41-42.
2. వాల్మీకి - రామాయణము - అయోధ్యకాండ. స. 12. శ్లో. 28-29.

యని దశరథుడు కైకేయితో రాముని గుణగణములను గూర్చి తెలియజేయును. పై కందపద్యమున వ్యర్థపదమొకటియైనను గన్పడదు. దశరథుడు చివరకు– 'కరములు మోడ్చెద తావక చరణంబులు ముట్టెద'ననును. కాని కైకమాత్రము తన పట్టుదల విడువక 'విసము మ్రింగి యిపుడె విడిచెద ప్రాణము అతనిమేలు నేసహింపజాల'నని యనును. ఇచట అతనిమేలు నేసహింపజాల యనునది మూలమున లేదు. 'రామోయద్యభిషిచ్యతే' అని గలదు.

ఇచట కవులు భావానువాదముపైన దృష్టిని కేంద్రీకరించి తెనుగున అనువాదం చేసినారు కావున భావమును చక్కగా తెనుగు పద్యమున పొందుపఱచుట జరిగినది.

మూలమిటులున్నది–

శ్లో॥ అహం హివిషమద్యైవపీత్వాబహుళవాగ్రతః।
పశ్యతస్తె మరిష్యామి రామోయద్యభిషిచ్యతే॥

ఇట్లు భావమును వదలక కొన్నిచోట్ల ఈ కవులు రసవంతమగు పదజాలమును తమ యనువాదమున పొందుపఱచి గ్రంథమునకు మరింత వన్నె చేకూర్చినవారైరి.

రాముడు కైకేయి యింటికి వెళ్ళుటతో ప్రథమాశ్వాసము పరిసమాప్తమగును. కైకేయి దశరథుని కోరికపై సీతారామలక్ష్మణులను వల్కలధారణము గావించి పౌరులు వీడ్కొల్పగా వారిని శృంగభేరిపుర ప్రయాణము గావించును, గుహుని సమాగమ ప్రార్థనము మొదలగువానితో (విషయము) ద్వితీయాశ్వాసము పరిసమాప్తమగును.

తృతీయాశ్వాసమున రాముడు గంగా పరిత్తరణము, చిత్రకూటాద్రి చేరుట, ఆ వార్తను తురలివచ్చిన సుమతుండు రాజునకు దెల్పగా దశరథుడు దుఃఖించి తనకుగల శాపమును దెల్పి దివమునకరుగుట, భరతుని ఆగమనము ఆ విషాదవార్త విని భరతుడు దుఃఖించి రాముని దోడ్కొని వచ్చుటకు బయల్వెడలుట మున్నగు వృత్తాంతములతో నీ తృతీయాశ్వాసము ముగియును.

భరతుడరణ్యమునకు వెళ్ళుట, రాముడు భరద్వాజాశ్రమమును ప్రవేశించుట తర్వాత చిత్రకూటమును జేరుట, భరతుడచటికి వెళ్ళి వారితో తండ్రి మరణవార్త వినిపించుట, రాముడు పాదుకలనిచ్చుట, భరతుడు పాదుకలను పూజించి రాజ్యమును ధవతీనము గావించి మునివృత్తిని స్వీకరించి నందిగ్రామమునకు జనుటతో చతుర్థాశ్వాసము ముగియును.

పంచమాశ్వాసము సీతారామలక్ష్మణులు అత్రియాశ్రమమునకరుగుట, అచ్చట అనసూయ సీతకు పతివ్రతాధర్మములుపదేశించుట, మున్నగువానితో సమాప్తమగును ఆచార్యులవారి అయోధ్యకాండ నైదాశ్వాసములలో నను వాదము గావించి పూడూరి చెన్న కేశవస్వామి కంకితము గావించిరి.

## గార్గేయపురం సుబ్బాశాస్త్రి :

శ్రీ సుబ్బాశాస్త్రిగారు యథాశ్లోకతాత్పర్యరామాయణమునందలి అరణ్య కాండను మూడాశ్వాసములలో ననువాదము గావించినాడు.

అరణ్యకాండమనువాదము ప్రారంభము నుండి 'శ్రీ ఖేలన గద్వాలనగర కేశవశౌరి' అని- కవులు ప్రారంభపద్యమును వ్రాసినారు. కారణము ప్రభువులు పూడూరు నుండి తమ యిలవేల్పును గద్వాలలో ప్రతిష్ఠ గావించి తమ నివాసమును కూడ గద్వాలకు మార్చికొనినారని చెప్పవచ్చును. శాస్త్రిగారు శ్రీమదుభయ కవితా నిస్సహాయ సాహితీధురీణులని ఆశ్వాసాంతగద్యవలన తెలియుచున్నది. చినసోముని ఆస్థానమందలి అష్టదిగ్గజములను నెనమండుగురు కవులలో వీరొకరు.

సుబ్బాశాస్త్రి తన ప్రభువగు చినసోమభూపాలునికి కేశవస్వామిపైగల భక్తి మరియు ప్రతివర్ష ముత్సవము గావించు సంకల్పము నీ పద్యమున చూపెట్టినాడు.

మ॥ ప్రతి సంవత్సర సోమభూమి రమణా ప్రత్యగ్రి సంకల్పితా
పరితిమప్రాప్త రథోత్సవాంచితమనః ప్రహ్లాదతస్తద్దిశా
గతభూయిష్టదిశావలోకన ముహుః కౌతూహలాశ్చర్య కల్
ద్విదిత ప్రౌఢవదివ్యభూషణ మణీవి భ్రాజితోరస్థలా [1]

---

1. గా. సుబ్బాశాస్త్రి-యథా.శ్లో. తా. రామాయణము అరణ్యకాండ 2ఆ. ప. 1

శాస్త్రిగారు తన అరణ్యకాండఅనువాదమున ఆశ్రమవర్ణనను సహజముగా సరళముగా ననువదించినారు.

అనువాదరీతి :-

శ్రీ సుబ్బాశాస్త్రి అనువాదరీతిలో సహజత్వము గన్పించును. విరాధుడను రాక్షసుడు రాముని బాణముచే రాక్షసరూపమును వీడి గంధర్వరూపము దాల్చి తనకు గల్గిన శాపకారణమును విన్నవించి రామునితో నిట్లనును.

కం॥ తెలియబడితి నాచే గో
సల జాతనయుడవు రామచంద్రుడవీవు
జ్జ్వల కీర్తియు సౌమిత్రియు
నలయమహాధన్వ జనక కన్యమహాత్మా.

రాముడు మహాత్ముడని గుర్తించినాడు. శ్రీ శాస్త్రిగారు రచనావిషయమున అలతి పదములను వాడి ద్రాక్షాపాకమున కొన్నిచోట్ల అనువాదము గావించినను నారికేళపాకమున రచన గావించి తన కవితాశక్తిని నిరూపించినాడు.

గోదావరిని వర్ణించినతీరిక్రింది పద్యమున తెల్పినాడు.

రామలక్ష్మణులు అగస్త్యుని ఆజ్ఞగైకొని సీతతో పంచవటికి బయలుదేరుదురు. మార్గమధ్యమున గోదావరినదిని వారు గాంచిన తీరును శాస్త్రి ఇందు చూపెట్టెను.

మ॥ పరిశుద్ధాత్మ ఘటోద్భవర్షి మఘవత్ప్రఖ్యాత వాగ్గీతికా
నరికారండవ హంసదీప్త పరిఫుల్లానోకహా కీర్ణమై
యరయంగా బడుచుండు చెంగటనుగాకత్వంత దూరంబుగా
కిరవైనట్టి మృగాళిపీడితము నీవృద్ధాపగా రత్నమున్

అట్టి నదిని జూచి సీతారాములు సంతోషపడినారని తెల్పెను.

ధార్మిక దృష్టి :-

శాస్త్రిగారు నిశితపరిశీలనమువలన రామునికిగల ధార్మికదృష్టి నీ కాండలో చూపెట్టినాడు.

రాముడు పంచవటిలో నుండగా భరతుడచటికి వచ్చును. రాముడు భరతునొంటరిగా పిలిచి అతనితో నిట్లనును

కం॥ మనుజులు పితృస్వభావము
నెనయరు మాతృస్వభావమె నయుదురని యె
న్నను దగు భరతునిచే నీ
జనవాదము వేరుగాగ జలుపంబడియెన్.

ఈ మాటకు లక్ష్మణుడు భరతుని తల్లి దుష్టురాలు ఆమె కుమారుడగు నితడు ప్రశంసించుటకెట్లు పాత్రుడగును? అని పలుకును.

అంత రాముడు - తల్లియగు కైకేయి మధ్యమురాలు గావున ఇక్ష్వాకు నాయకుడైన భరతునికి జనాపవాదము గల్గెనని యందునుగాని తల్లిని నిందించ తగనయ్యా అని లక్ష్మణునితో ననును.

ఇచట రాముని ధార్మికదృష్టిని శాస్త్రిగారు తన యనువాదమున కడు జాగ్రత్తగా ప్రదర్శించినారు.

పురాణశైలి :-

శ్రీ శాస్త్రిగారి అనువాదము పురాణశైలిలో నుండును. శూర్పణఖ పంచవటిప్రాంతమున దిరుగుచు రాముని జూచెను. ఆమె అతని రూపలావణ్యము గాంచి మన్మథవశవర్తినియై రాముని సమీపించి నేనధిక సౌందర్యసంపన్నురాలిని స్వేచ్ఛగా సంచరించుదానను. నాకు విభుడవగుము. ఈ క్షితికుమారితో నీవేమి సుఖపడగలవు ?

కం॥ ఈనీయనురూపమునకు
నేనుత్తమయగు కుటుంబినిని యోగ్యంబౌ
దానను నాతోడ జన
స్థానముల జరింపగలవు సకలసుఖముగాన్.

అనునీ పద్యమునమూలమందున్న 'కుటుంబిని' 'జనస్థానము' అనునీ పదములనే తన యనువాదమున వాడినాడు. ఇట్టి వనేక పదములితని యను

వాదమున గనుపించును. పై మాటలకు లక్ష్మణుడు నవ్వి ఆమెతో—తన్వీ నేనన్న గారి యధీనుడను అంబుజతనయనా! ఇట్టి దాసునకు భార్యవై దాసురాలివగుదువా? యని అనును. ఇచట హాస్యముతో పాటు సహజ శృంగార రసము జూపెట్టుట శాస్త్రిగారి యనువాదరీతి గమనార్హమైయున్నది. భాస్కరాదులు వాల్మీకి రామాయణము ననుసరించి వ్రాసి భాషాసేవ గావించగా యథాశ్లోకతాత్పర్య రామాయణ కవులు పూర్తిగా శ్లోకానువాదము గావించి ఆంధ్రభారతినారాధించి ధన్యులైనారు.

సీత 'లక్ష్మణా! యను' ధ్వనిని విని, అన్నగారికి ఆపద గల్గినది వెళ్ళి కాపాడుమని లక్ష్మణునితో నను. అతడు అన్నగారి యాజ్ఞ లేదు. అతనికేమియు భయము లేదని చెప్పగా సీత పరుషముగా లక్ష్మణునితో 'లక్ష్మణా నేను నీ ముంగలం ద్యజింతు జీవముల, నని పలుకును.

అపుడు లక్ష్మణుడనిన మాటలు— 'స్త్రీలు చంచల స్వభావులై తమ ధర్మమును బోవిడుతురు. పరుషము మాట్లాడుట స్త్రీల సహజస్వభావమేమో చెడు వాక్యములు పలుకుటుచితమా? అని పలుకును. అనువాదమున చూపించిన తీరు పాత్ర చిత్రణ విషయమున చూపించిన శ్రద్ధ శాస్త్రిగారి నిశిత పరిశీలనాదృష్టికి నిదర్శనమని చెప్పవచ్చును. ఈ అనువాద పద్యమును గాంచునది.

ఉ॥ దేవత వీవు మాకు సుదతీ వచనంబున నుత్సహింపనౌ
వావిరి వింతగాదు చెడువాక్యము నింతులకీ స్వభావమున్
స్త్రీవివరంబులందు సముదీక్షితమయ్యెడు స్త్రీలు ధర్మముల్
బోవిడువారు చంచలత బూనుచు రుద్ధత భేదకారులై [1]

ఇటుల శాస్త్రిగారు యథాశ్లోక తాత్పర్య రామాయణమున సర్గానువాద రూపమైన అరణ్యకాండను మూడాశ్వాసములలో పూర్తి గావించినాడు.

## కామసముద్రం అప్పళాచార్యులు:

కాణాదం అప్పళాచార్యులు యథాశ్లోక తాత్పర్య రామాయణమందలి కిష్కింధకాండను మూడాశ్వాసములలో ననువాదము గావించెను. ఇతడు క్రీ.శ. 1763-1793 ప్రాంతమున నున్నవాడు.

1. గా. సుబ్బశాస్త్రి - అరణ్యపర్వము - 2ఆ. 21ప.

తల్లిదండ్రులు :-

ఇతని తల్లిదండ్రులు శ్రీనివాసాంబ కృష్ణమాచార్యులు. అప్పళాచార్యులు విద్వత్కవిబిరుదాంచితుడు. కౌండిన్యసగోత్రుడు. ఆశ్వాసాంతగద్యలో 'ఇతి శ్రీమదల్లీపుర ప్రసన్న వేంకటేశ్వర కరుణాకలిత చతుర్విధ కవితాసివాజి హాక శ్రీ మదహోబిల శ్రీనివాస మునివర కృపా కటాక్షలబ్ధ విద్వత్కవికుంజర బిరుదాంచిత శ్రీమద్గద్వాల సోమభూమీ పాలకాస్థాన భూషణాయమాన శ్రీమత్కామ సముద్రవంశపయః పారావార రాకా శశాంక శ్రీమత్కౌండిన్యస గోత్రోద్భవ శ్రీనివాసాంబగర్భశుక్తి మౌక్తికాయమాన కృష్ణమాచార్య పుత్ర అప్పళాచార్య ప్రణీతంబైన శ్రీమదాంధ్ర రామాయణ మహాకావ్యంబునందు యథాశ్లోకతాత్పర్యంబుగా తెనింగించిన కిష్కింధకాండ తృతీయాశ్వాసము. అని వ్రాసియుండుటనుబట్టి ఆచార్యులవారు చినసోమభూపాలుని రాజ్యకాలమున 18వ శతాబ్ది చివర నున్నటుల స్పష్టముగా దెలియుచున్నది.

చినసోమభూపాలుడు ఆచార్యులనుగూర్చి-

గీ॥ విశ్రుతముగనాంధ్రభాషా ప్రబంధములు కొన్ని
రచనజేసి సమస్త సద్రాజసభల
నెలమికీర్తి వహించితి విప్పుడాది
కావ్యమిది దివ్యమాంధ్రంబుగా నొనర్చి

శౌరికర్పింపుము...అని పల్కుటచే నీకవి

ఇదివరలో కొన్ని రచనలు గావించినటుల దెలియుచున్నది. కాని 'కృష్ణలీలా తరంగిణి' గ్రంథము మాత్రమే లభ్యమైనది.

చినసోముడు 'ఆదికావ్యమిది' అని చెప్పినాడుగదా! ఆచార్యులవారి యథాశ్లోకతాత్పర్య రామాయణమున కిష్కింధకాండ మా ఆదికావ్యము కాగలదు. అనగా కవి కిష్కింధకాండ అనువాదానంతరమే కృష్ణలీలా తరంగిణి అను అష్టపదులను రచించినాడని తెలియుచున్నది. మరియు కవిగారు కిష్కింధకాండలో కృష్ణలీలా తరంగిణిని పేర్కొనలేదు. అప్పళాచార్యులు రచించిన ఈ రెండు గ్రంథములు గద్వాలలో 1921లో ముద్రితములైనవి.

చినసోమభూపాలుడు ఆచార్యులవారితో-

గీ॥ అతని సంకల్ప మీడేర్పన ర్హమగుట
ప్రేమనీకాండలిన్ని జెప్పింతుగాన
కొదువకాండయు మీరింపు గూర్పవలయు
నమర కేశవ దివ్య నామాంకితముగ.

అని పల్కుటచే నిదివర కే 'వృద్ధసోమనృపతి (పెద్దశోభనాద్రి) మును కవిగ్రామణులచేత నాంధ్రముగమహినిర్మింబూనె' అనుమాటచే రామాయణమును శ్లోకానువాదము గావించ నిర్ణయించనైనదని స్పష్టముగా దెలియచెప్పినాడు.

గద్వాల ప్రభువులు తమ యిలవేల్పగు కేశవస్వామిపైగల అమితమైన భక్తితో నీయార్గురు కవులచే యథాశ్లోక తాత్పర్యరామాయణమును వ్రాయించి కేశవాంకితము గావించి చరితార్థులైనారు. చినసోముని రాజ్య వైభవమును గూర్చి కవులు చెప్పిన పద్యములెన్నియో ఈ రామాయణమున లభ్యమగును.

## అనువాద పద్ధతి :

ఇంచుమించుగా నీయార్గురుకవులు వాల్మీకి రామాయణమును శ్లోకానువాదరూపమున ఆంధ్రీకరించినారని చెప్పవచ్చును. ముఖ్యముగా వాల్మీకి రామాయణమును తెనిగించుటే ఈ ప్రభువుల ఉద్దేశ్యము అటుల నిర్దేశించుటచే నీ కవులు యథాతథముగా చక్కని భావసంపదతో రామాయణమునాంధ్రీకరించినారు.

అనువాదపద్ధతిలో సర్గానుసారముగా వారనువాదము గావించినారనుటకు సర్గాంతమున వారనుసరించిన తీరుటుల చెప్పబడియున్నది.

'ఇవ్విధంబుగ సుగ్రీవుండు రాఘవునిచెంత కేతెంచి నిలచియుండెన్నది పంచవింశతిసర్గ' అను మాటనుబట్టి ఆర్గురు కవులిటులే సర్గక్రమముననువాదము గావించినారని స్పష్టమగుచున్నది.

ఈ కవులు శ్లోకభావమును జీర్ణించుకొని తమ ప్రతిభను పద్యరచన గావించుటలో చూపెట్టినారు. కావున అనువాదము సరళముగను, సులభతరముగను అర్థాలంకారముతోబాటు శబ్దాలంకారములయందును, రచన - పాకము - శయ్య మున్నగువానిలో వీరి ప్రతిభ వ్యక్తమగుచున్నది.

అనువాద దృష్టియే కవులధ్యేయము. ప్రభువుల ఆదేశముకూడా అదియే. రామాయణమందలి ప్రతివిషయము అందరికి తెలియపరచుటయే వారి కోరిక. ప్రభువుల కోరికకనుగుణముగా పఠితలకు విసుగుకలుగకుండునటుల తమ ప్రతిభతో రామాయణము నాంధ్రీకరించినారనుటకు పంపాసరోవరవర్ణమునగల పద్యమును గాంచిన విశదమగును.

ఉ॥ చల్లని మారుతంబు వెదజల్లగ తీర మహీరుహాంత రో
త్ఫుల్ల సమంబులన్ బొదలి పూరితశీత శుభోదకంబులన్
సల్లలదబ్జపుంజముల సాంద్రతంబయి జూడ్కి వేడ్కలన్
గొల్లలుగా నొనర్చుసిదిగో గనులక్ష్మణపంప సొంపుగన్ [1]

కా. అప్పళాచార్యులు తన అనువాద విషయమున రామరాజభూషణుని అనుకరించినాడనుటకీ క్రింది పద్యమును గాంచునది.

పంపాసరోవర వర్ణనము :—

సీ॥ విమలామృతలోల కమలాళికల్హార
కైరవేందీవర గంధిలంబు
తృష్ణాసమాసక్తి నిష్టాత నిస్తోక
మాతంగ మృగయూధ మండితంబు
చంద్రాంగ సారస చక్రవాక బలాక
కారండ వసు వీచికావృతంబు
నానా విధానేక సూనాకలిత దివ్య
భూమి జాతావనీ భూషితంబు

గీ॥ భ్రమర భంజిత కేసరభర విభాత
భానుమద్భాప్వ దరుణాబ్జ బంధురంబు
కందళిత మరు దూర్మికా వికలిత
పంకరుహ భాస్వరంబు పంపాసరంబు [2]

1. కా. అప్పళాచార్యులు. యథా. శ్లోక తా. రామాయణము కి. కాండ పుట 351
2 కా. అప్పళాచార్యులు. యథా. శ్లోక తా. రామాయణము కి. కాండ పుట 352

గీతపద్య రచనలో నీకవి అందెవేసినచెయ్యి. ఋతువర్ణనము గావించుటలో రచన ఎంత సహజముగా సాగినదో ఈ పద్యమువలన దెలియును.

గీ॥ కొన్ని తరువులు సంజాత కుసుమతతులు
కొన్ని మధువాసనా ఘుమం ఘుమితములును
కొన్ని మొగ్గలు నిగ్గులు కొమరు మించి
దనరు శ్యామల వర్ణముల్దాల్చినటుల.

అప్పళాచార్యులు కిష్కింధ కాండలో రాముడు సీతకై విలపించగా సుగ్రీవుడోదార్చిన తీరును రసవంతముగా చూపించినాడు. అతడు (సుగ్రీవుడు) రామునితో- 'ధృతి విడనాడ దగునే' అనుమాటలో సుగ్రీవుని వినయ విధేయతలు గానుపించును 'దైవాంశ సంభూతుడవైన నీవేయిట్లు కన్నీరు గార్చినచో మావంటి వారి గతి యేమగును. సాత్త్విక సంపదగల వారలకుచితమైనది ధైర్యమే. నీవు మానవ మాత్రుడవు గావు. దుష్టశిక్షణ శిష్టపాలనకై అవతరించినాడవు'. అనుటలో హితవుతోపాటు రామునిలో దైవత్వమున్నటుల కూడ సుగ్రీవునికి గోచరించునటుల ఆచార్యుల యనువాదరీతిలో మనకు గన్పించును.

ఆచార్యులు మూలముననున్న అర్థాలంకారములతోపాటు శబ్దాలంకారములను కూడ తన యనువాదమందు చూపెట్టుచు కిష్కింధ కాండను రసమయము గావించి ధన్యుడైనాడు.

## తిరుమల కృష్ణమాచార్యులు :

తిరుమల కృష్ణమాచార్యులు యథాశ్లోక తాత్పర్య రామాయణమున సుందర కాండను మూడాశ్వాసములలో ననువాదము గావించినాడు. ఆచార్యులు తన తల్లిదండ్రుల విషయమును గద్యలో తెల్పలేదు. కాని ఆంధ్రీకరణ విషయమునీకది. శ్రీ గోవిందరాజ విరచిత శృంగారతిలక వ్యాఖ్యానముగల వాల్మీకి రామాయణము ననువాదము గావించినటుల సుందరకాండ వ్యాఖ్య యందలి గద్యమువలన దెలియుచున్నది.

ఆశ్వాసాంత గద్యయిటులున్నది శ్రీ శ్రీనివాస చరణ నళిన యుగళ విగళదమల మధురతమ మకరంద ద్వాపస్వానంద తుదిలేందింది రామాయణ మాన

నుండు అష్టభాషాకవితా సమాన వైభవ దురంధరుడు శ్రీ తిరుమల కృష్ణమాచార్యులీ కాండలోని అష్టషష్టతమ (68) సర్గలను అనువదించెనని పై పద్యము వలన దెలియుచున్నది.

వీరి సుందరకాండ యందలి ఆరంభపద్యము–

కం॥ శ్రీలక్ష్మీ పృథు కుచకల
శాలిప్త మృగీమదద్ర వాంకిత పక్షా!
పాలిత సోమనృప శ్రీ
ఖేలన గద్వాల నగర కేశవశౌరి! 1

కథాగమనము:-

పై ఆరంభపద్యమును గద్వాల కేశవస్వామిని రామాయణములోని నల్గురు కవులు స్తుతించి కథనారంభించినారు. మొదటి ఇరువురు కవులు కా. పెద్దన (బాలకాండ) కొత్తపల్లి రామచంద్రాచార్యులు (అయోధ్యకాండ) వీరిరువురు పూడూరు చెన్న కేశవస్వామిని ప్రార్థించి రచన యారంభించినారు.

కృష్ణమాచార్యులు తన సుందరకాండ కథాగమనవిషయములో రచన సహజముగను, సలక్షణముగను నుండునటుల ననువాదము గావించినాడు. హనుమంతుడాకాశమార్గమున బోవుచుండ మెడలో నున్న పుష్పమాలికలతని వేగమునకు చెదరి రాలి సముద్రములో బడినవి. పుష్పమాలలతో కూడిన వాయుసుతుడంబరవీధిలో పయనించుచుండ మెరుపు తీగలతో కూడిన మేఘము వలె ననుపించెనని ఉపమాలంకారమున అనువాదము కావించినాడు.

ఆచార్యులు మూలశ్లోకమందలి అలంకారములనే తన ఆంధ్రీకరణమున తెల్పినాడు. మార్గమధ్యమున సింహికయను అసురాంగన హనుమంతుని అడ్డగించగా నతనిచే చంపబడెను. అట్టి సమయమున– 'ఎవ్వనిలో బుద్ధి ధైర్య స్థైర్యములు సూక్ష్మదృష్టి దక్షత అను నీనాలుగు గుణములుండునో అట్టివాడెంతటి సాహసకృత్యమైనను సాధించునను హితోక్తి ఇచట చూపెట్టబడినది.

చంద్రోదయ వర్ణనము:-

ఆచార్యులు చంద్రోదయ వర్ణనమునీ పద్యమున చూపెట్టినాడు.

---

1. తిరుమల కృష్ణమాచార్యులు యథా. తా. రామాణము సుందరకాండ ఆరంభ పద్య.

## అనువాద పద్ధతి:

అనువాద విషయమున అర్గురు కవులు మూలశ్లోకముల భావములనతిక్రమించక అలంకారములనుకూడా మూలమందున్న వానినే అనువాదమున పొందు పరచినారు.

చంద్రోదయ వర్ణనము:-

మూలముననుసరించియే ఆచార్యులీపద్యమున చంద్రోదయ వర్ణనము గావించినాడు.

చం॥ వెలగి శిలాతలంబునను జెంది వెలుంగునెటున్మృగేంద్రుడున్
జెలగి మహారణంబునను జెంది వెలంగు నెటుం గజేంద్రుడున్
జెలగుచు రాజ్యవైభవము జెంది వెలుంగునెటు న్నరేంద్రుడున్
జెలగుచున్నట్లు సంబరము జెంది ప్రకాశమొసంగె చంద్రుడున్

ఆచార్యులు తన సుందరకాండ యనువాదమున మిక్కిలి శ్రద్ధవహించి రచన గావించినాడనుటకీ అనువాదిత పద్యమును గాంచునది.

మూలము:-

శ్లో॥ త్వాంసమాసాద్య వైదేహి! రూపయౌవనశాలినీమ్।
కః పుమానతివర్తేత సాక్షాదపి పితామహః॥

అనువాదము:-

పై శ్లోకమునకాచార్యులవారి ఆంధ్రానువాదము—

గీ॥ జనకజా తనూజరూప యౌవన సమేత
వైన నిన్నులప్రాపించియే నరుండు
నైన మిక్కిలి విడువగా నర్హుడౌనె
పూని సాక్షాకపితామహుండైన గాని.[1]

అని అనువదించినాడు. మూలమున 'అతి' అనుదానికి 'మిక్కిలి' అని వాడినాడు.

1. కృష్ణమాచార్యులు-యధా. తా. రామాయణము సుందరకాండ- 1ఆ. పుట. 30.

ఇట్టి అవ్యయములను కూడ విడువక కడుజాగ్రత్తగా శైలి - పాకము చెడకుండగ కవులు తమ ప్రతిభతో రచన గావించినారు. ఈ కవులు రామాయణ మందలి శ్లోకతాత్పర్యమున కెక్కువ ప్రాధాన్యమిచ్చి గ్రంథమనువదించినారు. కావుననే 'యథాశ్లోక తాత్పర్యరామాయణము'ని పేరిడిరి.

రావణుడు సీతతో నిట్లనును-

శ్లో॥ యద్యత్పశ్యామి తేగాత్రం సీతాంశు సదృశాననే
తస్మిన్తస్మిన్ పృథుశ్రోణి చక్షుర్మమనిబధ్యతే- మూలము.

ఆచార్యులవారి అనువాదము-

కం॥ ఏయేది నేనుగాంతును
నీ యంగంబును సితాంశు నీకాశముఖీ!
యాయతని తంబ! నిలుచును
వాయా యంగంబులందు నస్మద్దృష్టుల్ 1

ఆచార్యుల యనువాదము సులభముగను, సహజముగను నున్నటులీ క్రింది అనువాదరీతిని గాంచిన తేటతెల్లముగా గన్పట్టును.

రావణుడు లంకలో సీతతో నిట్లనును-

మూలము :-

"భవమైథిలి! భార్యామే మోహమేనం విపర్జయ
బహ్వీనాముత్తమస్త్రీణామాహృతానామితస్తతః
సర్వాసామేవ భద్రంతే మమాగ్రమహిషీ భవ
చారుస్మితే! చారుదతిచారునేత్రే! విలాసినీ!
మనోహరసిమే భీరుసుపర్ణః పన్నగంయథా॥" అనుదానికి

ఆచార్యులవారి యనువాదము-

కం॥ ఈ మోహంబును విడువుము
భామిని జనకసుతనాకు భార్యవుగమ్మా
నాముఖ్యులైన బహురా
మామణులందీవునగ్రమహిషివిగమ్మా.

1. తి కృష్ణమాచార్యులు యథా శ్లో. తా. రామా. సుందరకాండ 2ఆ. పుట 80.

కం॥ చారుస్మేర విలాసిని
చారుదశన చారునయనసార మదీయో
దారమనంబు హరించెదు
ఖీరుసుపర్ణుండు ఫణిని భేదించుక్రియన్ [1]

పై యనువాదమును బట్టిచూడగా నాచార్యులు మూలమందలి పదములనే తన అనువాదమున నెక్కువగా వాడినటుల గన్పడును

అలంకారముల విషయమునకూడా మూలానుసరణమె గన్పట్టును.

శ్లో॥ తతఃకుముదశండాభో నిర్మలోనిర్మలస్వయమ్।
ప్రజగామనభశ్చంద్రోహంసోనీలమివోదకమ్॥

అనుదానికి ఆచార్యులు స్వచ్ఛమై మాలిన్యరహితమైన చంద్రుడు స్వచ్ఛమైన నీటిలో హంసవలె వినీలాకాశమున గన్పట్టెను అని ఉపమాలంకారమునే తన యనువాదమున ఉపయోగించినాడు. [2]

ఆచార్యులు లోకోత్తరములై నీతిదాయకములైన పద్యములను సుందర కాండలో ననువాదము గావించి కృతకృత్యుడైనాడు.

'జేయదగు కార్యమెవ్వాడు జేయబూను
నతడు సాధింపదగును కార్యములు పెక్కు'

'స్వల్పమో కార్యమునకైన సాధకంబు
నైన హేతువునొకటిగాయె యనగరాదు'

'ఎవ్వడర్థంబెరుంగు ననేకగతుల
నర్థసాధనమునకు సమర్థుడతడు' [3]

ఇటుల ఆచార్యులవారు 'యథాశ్లోక తాత్పర్య రామాయణమునందుగల సుందరకాండను గోవిందరాజ విరచిత శృంగారతిలకవ్యాఖ్యతో కూడిన వాల్మీకి రామాయణము నాంధ్రీకరించి భాషాసేవ గావించిరి.

---

1. తి. కృష్ణమాచార్యులు యథా. శ్లో॥ తా. రామాయణము సుందరకాండ 2ఆ. పుట. 32.
2. ,, ,, ,, పుట. 28.
3. ,, ,, ,, పుట. 29.

## బోరవల్లి శేషయామాత్యుడు :-

శేషయామాత్యుడు 'యథాశ్లోకతాత్పర్య రామాయణమున' యుద్ధ కాండ 'పూర్వోత్తర భాగములను ఎనిమిది' ఆశ్వాసములలో నాంధ్రానువాదము గావించెను. ఈ కవి ఉభయకవితానిస్సహాయ సాహితీ ధురీణుడు. శేషయామాత్యుని తండ్రి బోరవల్లి సింగనామాత్యుడు. ఇంటిపేరు బోరవల్లివారు కావున వీరివంశీయులు బోరవల్లి సీమలో నుండినారనుట కవకాశము గన్పడును.

కథాగమనము :-

శేషయామాత్యుడు యుద్ధకాండమున కథను సులభశైలిలో ననువాదము గావించినాడు.

వానరులు సేతుబంధనము గావింపగా శ్రీరాముడు సేనాసమేతుడై సముద్రమునుదాటి అవతలి తీరమగు సువేలాద్రియను పర్వతప్రాంతమున విడిది గావించుటతో పూర్వభాగము ప్రథమాశ్వాసము పూర్తియగును.

రాముడు సేనను విభజించుట- ఆ విషయము తెలిసి రావణుడు విద్యుజ్జిహ్వునితో రాముని శిరమువంటిదానిని నిర్మించి తెమ్మనుట- దానిని సీత పురోభాగమున నుంచుట- అది గాంచి సీత బాధనొందుట- విభీషణుడు రాముని బలమును గూర్చి రావణునితో తెల్పుట- సుగ్రీవుడు శైలాగ్రభాగమునుండి లంఘించి రావణునితో ద్వంద్వయుద్ధము గావించుట- రామసుగ్రీవుల పునఃస్సమాగమము- అంగదు రాయబారము మున్నగునవి ద్వితీయాశ్వాసమున గన్పడును.

ఇంద్రజిత్తు ప్రథమ యుద్ధమున రామలక్ష్మణులను నాగపాశమున బంధించుట- అది విని సీత శోకించుట- నారదుడు వచ్చి శ్రీరామమహాత్మ్యమును వినిపించుట- వైనతేయుడు నాగపాశవిమోచనము గావింపc రామలక్ష్మణులను జూచి వానరులు సంతోషించుట- అంగదుచేత వజ్రదంష్ట్రుండు నిహతుడగుట- తర్వాత అంగదుచేత మహాకాయుడు మడియుట ప్రహస్తుని యుద్ధము రావణునికి మండోదరి బుద్ధిచెప్పుట- ఆమె ఉపదేశమును వినక రావణుడు రౌద్రావేశమున యుద్ధము గావించుటకుద్యుక్తుడగుటతో తృతీయాశ్వాసము సమాప్తమగును.

ఇక చతుర్థాశ్వాసమున రావణుడు సుగ్రీవాంగద హనుమదాదులతో యుద్ధమొనర్చి లక్ష్మణుని మూర్ఛగావించుట- రాముడు కోపోద్రిక్తుడై రావణుని

వక్షస్థలము భేదింపనతడు భయవిహ్వలుడై లంకకు పలాయితుడగుట- అదిజూచి దేవతలు సంతోషించుట- కుంభకర్ణుని మేల్కొల్పుట- కుంభకర్ణ రఘునందనల యుద్ధము- కుంభకర్ణుని వధతో నీయాశ్వాసము పూర్తియగును.

అటులే ఉత్తరభాగము రామపట్టాభిషేకముతో నాల్గాశ్వాసములలో పరిసమాప్తమగును.

## అనువాద పద్ధతి :-

యథాశ్లోక తాత్పర్యరామాయణ కవులు అనువాద విషయమున మిక్కిలి శ్రద్ధ జూపించి అనువాదము గావించినారనుటకు మూలానుసరణములగు వారి పద్యములే ప్రబల సాక్ష్యములిచ్చుచున్నవి.

శేషయామాత్యుని అనువాదమును గూర్చి పరిశీలించినచో నతడు సరళమైన భాషనే ఉపయోగించెను. రాముని రణోత్సాహము గల్గింప సుగ్రీవుడతనితో చెప్పినవిషయమనువాదమును గాంచిన ఈ కవి రచన విశదముగా తెలియగలదు.

మూలము :-

శ్లో॥ కింత్వసంతప్యసేవీర యథాన్యః ప్రాకృతస్తథా।
మైవంభూస్త్వ్యజ సంతాపంకృతఘ్న ఇవసౌహృదమ్॥

సంతాపస్యచ తేస్థానం నహిపశ్యామి రాఘవ।
ప్రవృత్తావుపలబ్ధాయాంజ్ఞాతేచనిలయే౽రిపోః ॥

మతిమాన్‌శాస్త్రవిత్ప్రాజ్ఞః పండితశ్చాపి రాఘవ।
త్యజేమాంపాపికాంబుద్ధిం కృత్వాత్మే నార్థదూషిణీమ్॥

అను మూలశ్లోకములకు శేషయామాత్యుని ఆంధ్రానువాదమిటులున్నది.

కం॥ ఓ వీర! పరితపించెద
వీవేటికి ప్రకృతిపురుషుడితరుడు వలెనే
డావిధినుండకు తాపము
పో విడువుము మిత్రభావముకృతఘ్నగతిన్.

కం॥ అరినిలయ మెరుకపడియును
విరివిగ కావ్యంబులెల్ల విదితములయ్యెన్
మరినీకు దాపసమయం
బరయంగాదనుచుజూడ నయ్యెద రామా!.

కం॥ మతిమంతుడవును శాస్త్ర
ప్రతిభుడవును బండితుడవు ప్రాజ్ఞుడవగుటన్
ధృతినిడుమీ పాపపుమతి
సతతావృతవిషయమతిని జ్ఞానిన్ బోలెన్.

శేషయాచార్యుడు ఇచట కృతఘ్నుయివ, అను పదమునకు 'కృతఘ్న గతిన్' అను మూలమందలి పదములనే వాడుట జరిగినది. మరొక చోట 'సర్వార్థావ్యవసీదంతే' అను మాటకు 'అయిన వానికి మిగుల సర్వార్థము నశించు వ్యసనంబు చేకూరు సిద్ధముగను' అను మాటలో మూలముననున్న పదములనే వాడినాడు.

కావున ఆర్గురు కవులును మూలమందలి శ్లోక భావమును బాగుగా గ్రహించి తాత్పర్యానువాదరీతిలో సరళమగు భాషలో తెనిగించి గద్వాల ప్రభువుల కోరికపై 'యథాశ్లోకతాత్పర్య రామాయణమును పూర్తి జేసి భాషాసేవ గావించి ధన్యులైనారు.

## శైలి :-

శేషయామాత్యుని రచన యుద్ధవర్ణనలయందైనను కదళీపాకమున ధారాళముగా తడబడుటలేక సహజముగా సాగిపోవును అతని కవితనరయుటకై యుద్ధ కాండ తృతీయాశ్వాసమున అంగజవజ్రదంష్ట్రుల ద్వంద్వయుద్ధమును వర్ణించిన పద్యమును గాంచునది.

మ॥ ఉరుతన్వుండగు వాలిసంభవుడు రక్తోపేతసర్వాంగుడై
ధరణీజంబును భీమశౌర్యుడగుచు న్దైత్యేంద్రుపై వేయగా
త్వరగావచ్చెడు నాకుజంబుగని సంభ్రాంతుండునై యానిశా
చరుడున్ భిన్నము సేయభూమిపడె నానాలంబనేకంబుగన్.

ఇక శేషయార్యుని శైలి గూర్చి తెలిసికొందము. ఈ కవి నన్నయవలె 'కథాకథనశైలి'లో వచనానువాదము గావించినాడు. "ఇంద్రజిత్తుని బ్రహ్మాస్త్రము చే కపిల బలములు రామలక్ష్మణులు మూర్ఛితులగుట విని విభీషణుడు" అని వచనము చెప్పి పద్యమును ముందుకు వ్రాయుచు బోవుటచే నితని శైలి దెలియుచున్నది.

మండోదరి తన భర్త గావించు యజ్ఞమును హనుమంతుడు విధ్వంసమొన ర్చగా నావార్త విని భర్తకు శ్రీరాముని మహిమను గూర్చి వివరించును. రావణ వధానంతరము రాముడు సీతను నిరాకరించు సందర్భమున శేషయార్యుని అనువాగరచన కరుణ రసార్ద్రమైనదిగా గన్పించును. రామాయణ కవులు మూలమును త్యజించక సర్గానుసారాముగా రామాయణము ననువాదము గావించిరి. శేషయార్యుడు తన యుద్ధ కాండ నీరీతిగా పూర్వోత్తర భాగములను పూర్తి గావించెను.

## కామసముద్రం అప్పళాచార్యులు

క్రీ. శ. 1816-28 (19వ శతాబ్ది) అర్ధభాగము.

కామసముద్రం అప్పళాచార్యులు యథాశ్లోక తాత్పర్యరామాయణ మందలి కిష్కింధ కాండ అనువాదానంతరము 'కృష్ణలీలాతరంగిణి' యను గ్రంథ మనువాదము గావించెను.

ఈ గ్రంథముద్రణము శాలివాహనశకవర్షములు 1797 క్రీ. శ. 1875 భావనామ సంవత్సర శ్రావణశుద్ధ పంచమి ఇందువాసరము శ్రీమద్గద్వాల రామభూపాలరాయలచే స్థాపింపబడినవారి స్వకీయమైన సాహిత్య విద్యాముకురమందు ముద్రితము అని గ్రంథమున పేర్కొనబడినది.

మూలగ్రంథమగు 'కృష్ణలీలాతరంగిణి' యను దానిని ద్రావిడదేశీయుడగు నారాయణతీర్థులవారు సంస్కృతమున రచించిరని మానవల్లి రామకృష్ణకవిగారు తెలిపిరి.[1] చినసోమభూపాలుడు జయదేవకృతగీతగోవిందము నాంధ్రానువాదము గావించగా నతని యాస్థానకవియగు కామసముద్రం అప్పళాచార్యులు 'కృష్ణ లీలాతరంగిణి' నాంధ్రానువాదము గావించెను.

---

1. మానవల్లి రామకృష్ణకవి - గీతాగోవిందము అభిప్రాయము పుట. 4-8.

జయదేవుడు తన గీత గోవిందమున కృష్ణుని సర్వశృంగార రసమూర్తిగా నుపాసించి యాతని దివ్యలీలామృతము నభివర్ణించెను. జయదేవకృతగీత గోవిందమున 24 తరంగములు, 78 శ్లోకములు గలవు.

ఈ రెండు గ్రంథముల (గీతగోవిందము, కృష్ణలీలాతరంగిణి) తారతమ్య పరిశీలనమున జయదేవుడు ప్రాపంచిక సుఖములను పొందుచు వైష్ణవమార్గమున శృంగార రసవాహినిగా తన గీతగోవిందమును రచించెను. ఇందుభావోన్మాదము, దేహమునుపొంగించునట్టి రచన గన్పట్టును. ఇక నారాయణతీర్థులవారు శృంగార రససముద్రతరంగాలవలె తన 'కృష్ణలీలాతరంగిణి' ని రచించెను. ఇందు శాస్త్ర జ్ఞానము మేధస్సును తృప్తిపఱచగల్గునటుల గన్పట్టును.[1]

నారాయణతీర్థకృత మీగ్రంథమని శ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు తెల్పిరి కాని ఇందు (గ్రంథమందు) జయదేవకృత కృష్ణలీలాతరంగిణి, ఆంధ్రాష్ట పదులని వ్రాయబడుటచే సామ్యమర్థమగుట లేదు ఇంతకు కృష్ణలీలాతరంగిణి యను గ్రందమును కామసముద్రం అప్పళాచార్యులు ఇరువదినాల్గు అష్టపదుల కాంధ్రానువాదము గావించినటుల గ్రంథమందలి గద్యమున దెలియుచున్నది.

గద్యలో—"కౌండిన్యస గోత్రోద్భవ శ్రీ కృష్ణమాచార్యపుత్ర అప్పళా చార్య ప్రణీతంబైన శ్రీ కృష్ణలీలాతరంగిణి యనెడి ఆంధ్రాష్టపదీ మహాప్రబంధం బునందు సర్వంబునేకతరంగము" అని వ్రాయబడినది. కావున అప్పళాచార్యులు ఏకతరంగమందలి 24 అష్టపదులను మాత్రమే అనువాదమొనర్చినటుల దెలియు చున్నది.

రచనా కాలము:-

అప్పళాచార్యులు చినసోమభూపాలుని కాలమున (1815) 'యథార్థశ్లోక తాత్పర్యరామాయణమందలి' 'కిష్కింధకాండ' ము ననువాదము గావించిన పిమ్మట ఈ గ్రంథము ననువాదము గావించెను.

ఏలయన అప్పళాచార్యులవారి రచనలో ఇంతింతయనరాని శాంతభావమే గాని, వెదకి జూచినను కోపవిధము లేదు. 'కలరెయిటువంటి నృపతి లోకముం యందు వసుధఖాళ్ళరే రామభూవల్లభుండు' అని పల్కుటచే స్పష్టమగుచున్నది

1. మానవల్లి రామకృష్ణకవి - అభిప్రాయము గీతాగోవిందము పుట. 5-9.

రామభూపాలుడు చినసోముని తమ్ముడు అన్నగారి యనంతరము గద్వాల సంస్థానమును 1816 నుండి 28 వరకు రాజ్యపాలనము గావించినాడు.

కృష్ణలీలాతరంగిణి గ్రంథమందు కవి 'లక్ష్మీరాజన్యుడు శౌరి సోమనృపతిన్ శ్రీమంతునిన్ బ్రోచుతన్' అని చినసోముని గూర్చి మంగళాశీస్సులను వ్రాసినాడు. కావున అప్పళాచార్యులు చినసోమభూపాలుని అనంతరము అతని తమ్ముడగు రామభూపాలుని కాలమందును ఆస్థానవిద్వాంసుడుగానుండి కృష్ణలీలాతరంగిణి నాంధ్రానువాదము గావించినాడని చెప్పవచ్చును.

కేశవాష్టకము :-

అప్పళాచార్యకృతమగు కృష్ణలీలాతరంగిణి ఆంధ్రాష్టపదులను గ్రంథ ప్రారంభమున ప్రభువగు రామభూపాలునిచే రచింపబడిన 'కేశవాష్టకము' అను పదకొండు శ్లోకములు ముద్రణము గావించబడినవి. ఇందు 'ఇతిగద్వాల రామభూపాలరచితం శ్రీ కేశవమంగళాష్టకం సంపూర్ణం, అని వ్రాయబడినది.[1]

ఆ శ్లోకములిటులున్నవి—

శ్లో॥ సీతారామ నృపాలేన తాతేనాభ్యర్చితా।
కేతకీ ప్రముఖైః పుష్పైః కేశవేంద్రాయ మంగళమ్॥

గద్వాల రామభూపాల విద్వత్కవిజనప్రియః।
సరసైర్మంగళశ్లోకైః స్తౌతి శ్రీ చెన్న కేశవమ్॥

సాహిత్యవిద్యోపాధ్యాయః పురాణందీక్షితాహ్వాయః।
సత్కవీంద్రమయానవ్యాంకృత మేతామచీకరన్॥

అను పదకొండు శ్లోకములు వ్రాయబడినవి.

చినసోముని యనంతరము రామభూపాలు కాలమునుండి కృష్ణలీలా తరంగిణిని అనువదించినటుల పై కారణములను బట్టి చెప్పవచ్చును

అప్పళాచార్యులు 'కృష్ణలీలాతరంగిణి' ఆంధ్రాష్టపదులను గ్రంథమును చినసోమభూపాలునికే అంకితము గావించినటుల షష్ఠ్యంత పద్యములవలన దెలియుచున్నది.

1. కా. అప్పళాచార్యులు - కృష్ణలీలాతరంగిణి పుట 9.

కం॥ ధీరునకు సకల విద్యా
ధారునకు సమస్త బంధుతానుత వంశో
ద్ధారునకు సర్వసంప
త్పూరితగద్వాల సోమభూపాలునకున్ 1

అని తెల్పి- అంకితంబుగా నా యొనర్పంబూనియున్న శ్రీకృష్ణలీలా తరంగిణి, అని వ్రాయుటచే తెలియుచున్నది.

## అనువాద పద్ధతి :

అప్పళాచార్యులు తన గ్రంథమందు రచనాపద్ధతిని గూర్చి– 'రత్నఖచిత పరిశస్తినిస్తుల తులాకోటి కోటిఘటిత ఝణం ఝణరణన ఫణితిధోరణి రచిత, రసరీతిపాక వృత్త్యలంకార శయ్యాగుణధ్వని భావబంధురంబుగా ప్రబంధంబు నిబంధింపబూనితి' నని తెల్పినాడు.

అనువాదవిషయమున నీ కవి రాగములతోకూడిన తరంగములకు మరియు శ్లోకములకు ఆంధ్రానువాదము గావించినాడు. అనువాదమును బట్టిచూడగా జయదేవకృతమగు గ్రంథమునను వాదము గావించినాడని తెలియుచున్నది. అప్పళాచార్యులు తన అష్టపదుల ప్రారంభమున నిటుల తెల్పినాడు.

### సౌరాష్ట్ర రాగము (తరంగము)

"ధరణి శ్రీజయదేవకవి మృదు
తర వచనముల బల్కగా
హరిచరితమిది యమృతసారం
బసదృశ్యంబని యెన్నగా
బరగి శ్రీగద్వాల సోమ నృ
పాలుడతి ముదమందగా
సరసవైభవములను కేశవ
స్వామి యనదగు నిన్ను నే" సన్నుతించెద-

నని గద్వాల ప్రభువులకిలవేల్పగు కేశవస్వామిని పొగిడినటుల వ్రాసినాడు.

---

1. కా. అప్పళాచార్యులు – కృష్ణలీలాతరంగిణి షష్ఠ్యంత పద్యము పుట-

చినసోమభూపాలుడు అప్పళాచార్యులను గూర్చి— 'జయదేవుడు శ్రీనిధి వల్లభాచరిత చిత్రితచిత్తగృహానువర్తియట' పద్మావతీ నాట్యసంగతి విధాన పదాంచిత చక్రవర్తియట అట్టి జయదేవుడు రమాపతి లీలావిలసత్కథావిలాసముతో కూడిన కావ్యమును రచించెను, అని వక్కాణించి అతని కావ్యము నాంధ్రాష్టపదులుగా వినిర్మింప ఆనతిచ్చెనని, కవి తెల్పినాడు

<u>మూలము</u> 'హరి రిహముగ్ధవధూనికరే
విలాసిని విలసతి కేళిపరే' అనుతరంగమునకు

బేగడరాగములోనీకవి అనువాదరీతి యిటులున్నది.

<u>ఆంధ్రానువాదము:-</u> బేగడరాగము పల్లవి: హరి విహరింపుచున్నాడిచ్చట
మనోహరమగు మరుకేళి
కరమలరుచు శృం
గార విరచన
దొరకొను ముగ్ధవధూనికరములో— హరి.

యని చెలిరాధికతో బృందావనిలో శ్రీకృష్ణుని రాసకేళిని పై రాగములో వర్ణించును. దానికి రాధిక—

చం॥ హరి తనయందు ప్రేమయిసుమంత గొరంతగనన్యకామినీ
సరసరతోత్సవంబులను సంతసమందగనీర్ష చే స్థలాం
తరమునకేగి రాగ కలితభ్రమరస్వనమైన కుంజమం
దిరమున దీనయై మృదుగతిన్ సఖినిట్లని బల్కెకూర్మితోన్.

రాధిక తన సఖితో శ్రీకృష్ణుడు గావించిన కృత్యములను గాంచి నీర్ష్యతో పొదరిల్లు జేరి దీనమానసయై పల్కిన తీరును విప్రలంబ శృంగారమున అప్పళాచార్యులు తన పద్యమున చూపెట్టినాడు.

చం॥ హరియెడబాసి దన్నలవిహారిణులన్ రతికేళిదేల్చినం
తరుణి! మదీయమానసము తత్సుగుణంబుల నెంచుచున్నదే
మరియొరులందలంచదు భ్రమంగొనియైన వహించుసంతసం
బిరువుగనిట్లు వక్రతవహించె విరుద్ధమికేమిసేతునే. ప1. పుట20.

హరి యితర కామినులతో కూడియున్నను తనమనసు హరినే తలంచుననని రాధిక చెలితో చెప్పిన మాటలు కృష్ణునిపై రాధికకుగల భక్తిని కవి రసవంతముగా వర్ణించినాడు.

రాధ కృష్ణుని యెడబాటును సహించలేకపోయినది. శ్రీకృష్ణుడు పరకాంతలతో లతానికుంజములో నుండుటను గాంచి భరించలేకపోయినది. స్మరతాపమునకు తాళజాలక తన చెలియాలితో శ్రీహరిని గూర్చి ఏమేమో తెల్పి వాపోయినది. అయినను శ్రీహరి రాడాయెను. ఇక రాధిక స్మరతాపమును భరించలేక చెలితో — చెలియా! ఏమని తెల్పుదును.

చం॥ అలరుచు నెన్నవినిన్ దలచినంత సఖీపరసోక్తి శత్రువై
యలమ॥యానిలుండు శిఖియై యమృతాంశుండు కాలకూటమై
బలిసెనో యట్టి నిర్దయునిపై మరి నామది జెందుచున్నది
య్యలరులవిల్తుడెంత కుటిలాత్ముడసగ్గళుడాయెనే చెలీ!

అని వాపోయినది. ఇచట రాధిక తెల్పు విప్రలంభశృంగారమును అప్పళాచార్యులు తన అనువాదమున హృదయంగమముగ రచన గావించినాడు.

అప్పళాచార్యులు తన గ్రంథమందు శృంగారరసమునకుగల అష్టవిధనాయికలను రసోచితముగా తీర్చిదిద్దినాడు.

"స్వాధీనపతికాచైవ తథావాసవసజ్జికా।
విరహోత్కంఠితా చైవ విప్రలబ్ధాచఖండితా
కలహాంతరితాచైవ తథాప్రోషితభర్తృకా
తథాభిసారికాచేతిక్రమాల్లిణముచ్యతే"॥ 1

అని అలంకారశాస్త్రానుసారముగా నీకవి అష్టవిధానాయికలగూర్చి యాంధ్రానువాదము గావించెను.

కవి శృంగారనాయికలలోగల ఖండితనాయికవర్ణనము పదునేడవ అష్టపది 'యామిమాధవ' అను దానిని భైరవిరాగములో అనువాదము గావించి, చివర 'శ్రీజయదేవుని కృతియైయెలగుఖండిత సతీవర్ణనము అతిమధురం' అని తెల్పినాడు.

1. ప్రతాపరుద్రీయము - అష్టవిధనాయికల లక్షణము.

అటులే అప్పళాచార్యులు కృష్ణుడు రాధిక యెడబాటును సహించలేక వెతజెందుచుండ పూపొదరింటికి తనను జేరవచ్చుచున్న రాధికజూచి 'రావేరాధిక యికేల జాగును– రాగరసము సొంపలరారా' యను పల్లవి గల (అష్ఠపదిని) సురటరాగములో ననువాదము గావించినాడు. ఈ రచన జయదేవుని కృతమగు 'కుణమధునా, యను అష్ఠపది కనువాదము. మరియు నీకవి ఇరువది మూడవ అష్టపదిలో చివర సరసవచన రచనలదేలు జయదేవుని రచనను విప్రలంభమున అతి మనోహరముగా ననువాదము గావించినాడు.[1]

అప్పళాచార్యులు రచించిన అష్టపదులను గాంచగా అందు ఇరువది నాలుగవ అష్టపది మూలమందలి 'నిజగాదసాయదుసందనే' అను దాని యనువాదమునుబట్టి చూడగా జయదేవకృతమగు అష్టపదు లిరువది నాల్గింటికి ఆంధ్రానువాదము గావించెనని తెలియగలదు.

కా. అప్పళాచార్యులు రచించిన కృష్ణలీలాతరంగిణి, యందలి చివరి పద్యమిటులున్నది.

ఉ॥ సుందరగీత కౌశలము సూన్బృత కావ్యకళా విలాసముల్
నందకుమార చింతనము నవ్య రసానుభవమ్ములన్నియున్
ఇందు ముకుంద భక్తుడగు నీజయదేవ కవీంద్రగీత గో
విందమునన్ హరిన్ బుధులు వేడ్కభజింతురుగాత మిద్ధరన్[2]

అని అనువాదము గావించి ధన్యుడై నాడు.

1. కా. అప్పళాచార్యులు - కృష్ణ లీలాతరంగిణి - అష్టపది 23.
2. కా అప్పళాచార్యులు-కృష్ణలీలాతరంగిణి ఆంధ్రానువాదము పుట 45 చివరిపద్యం.

ఐదవ ప్రకరణము

# ఆశ్రితకవులు - రచనలు

## శ్రీ ఆదిపూడి ప్రభాకరరావుగారు :- క్రీ.శ. 1892-24

శ్రీ ఆదిపూడి ప్రభాకరామాత్యులు గద్వాల సంస్థానమున రాజారామ భూపాలుని కాలమందును, అతని యనంతరము శ్రీ సీతారామభూపాలుని కాలమందును ప్రభువుల గౌరవమును పొంది రచనలు గావించినారు.

జన్మస్థలము - తల్లిదండ్రులు ;-

వీరి జన్మస్థలము గుంటూరుజిల్లా బాపట్ల తాలూకాలోని 'ఆదిపూడి' యను గ్రామము. ఇతని తల్లిదండ్రులు రామలక్ష్మాంబ, బుచ్చి వెంకయ్యగారు. ఆదిపూడి వారు ఆరువేలనియోగి బ్రాహ్మణశాఖకు జెందినవారు. ఇతని అర్ధాంగి కామేశ్వరమ్మ వీరిది శాండిల్య గోత్రము.

తండ్రిగారు మరణించునప్పటికితని వయస్సు పదునారు సంవత్సరములు. ఇతని తండ్రి బుచ్చి వెంకయ్యగారు కొంతకాలము బెంగుళూరువందును, అనంతరము 1890-97 వరకు మాగడి తాలూకాలోను తహసిల్దారుగా పనిచేసి దివంగతులైరి.

ఆదిపూడి ప్రభాకరరావు తన 1890లో ప్రవేశపరీక్షలో వుత్తీర్ణుడై ప్రభుత్వ విద్యాశాఖలో ఉద్యోగమునందు జేరెను. ఇతడు కొంతకాలము విద్యాశాఖపర్యవేక్షణాధికారిగా పనిచేసి విరమించుకొని క్రీ.శ. 1892లో గద్వాల శ్రీరామ భూపాలుని ఆస్థానమున ప్రవేశించెను. ఇతడు గద్వాల ప్రభువులవద్ద అంతరంగిక కార్యదర్శిగాను, ఆస్థానకవిగాను పనిచేసెను. నాటినుండి ఈ కవిగారికి గద్వాలతో సంబధమేర్పడెను.[1]

---

1. ఆదిపూడి ప్రభాకరరావు - గద్వాల ప్రభాకరము - పుట 3.5.

### గ్రంథములు :-

వీరి మొత్తం రచనలు నాల్గు సంపుటములుగా ముద్రణము గావించ బడినది.[1] 1. ఆంధ్రభారతము, 2. ఆంధ్రపరాశరస్మృతి, 3. గద్వాల ప్రభాకరము 4. ఖండకావ్యములు. ఇటుల నాలుగు సంపుటములుగా వెలువడినవి.

## ఆంధ్రభారతము :

ఆదిపూడివారి మొదటి సంపుటము ఆంధ్రభారతము. కవిగారీదృశ్య కావ్యమును రచించి గద్వాలప్రభువగు సీతారామభూపాలునకంకితము గావించిరి. 'రమణీయంబగు భారతంబు చవిమీరన్ మాకుదృశ్య ప్రబంధముగా జేయుము' అని మహారాజు తెల్పినటుల కవి గ్రంథమున వ్రాసెను.

### ఇతివృత్తము - మార్పులు :-

ఆదిపూడివారీనాటకమునందు భారతకథ ఇతివృత్తముగా గ్రహించి ధర్మరాజు రాజసూయయాగము-ద్యూతము రాయబారము యుద్ధము ధర్మరాజు పట్టాభిషేకము అను ఘట్టములు తీసికొని నాటకముగా రచించిరి. ఈ ఆంధ్ర భారతమను నాటకము ఏడంకములుగలది. కవిగారీనాటకమున కొన్ని మార్పులు గావించినాడు.

భారతమునందు ద్యూతానంతరము ధృతరాష్ట్రుడు ద్రౌపదికి వరములిచ్చుట యను నెపమున పాండవులకు రాజ్యమునిచ్చివేసెనని భారతము తెల్పగా నిందు వరముల ప్రసక్తియే కానరాదు. ధృతరాష్ట్రుడు విధురునుపదేశముననుసరించి అధికారికముగా పాండవులకు రాజ్యమునిచ్చినటులీ నాటకమున చూపెట్టబడినది. అరణ్యాజ్ఞాతవాసకథ యిందు పూర్తిగా వదిలిపెట్టబడినది.

కవి ఈ నాటకమందలి తృతీయాంకమున మార్కండేయుడు ధర్మరాజునకు రామాయణగాథను వివరించుటయును ప్రసంగమును తెచ్చి రామాయణభారత కథాంశమందలి సదృశఘట్టములను అరణ్యవాసమందలి కొన్ని ముఖ్యాంశము లను మాత్రమే తెల్పినారు.

---

1. లలితా ప్రెస్, హైద్రాబాదు - ముద్రణకాలము - 1971.

సప్తమాంకమున అశ్వత్థామ పరాభవము, ధర్మరాజు పట్టాభిషేకము వర్ణితము.

ఈ నాటకమునందు కవిగారు ధృతరాష్ట్రుడు స్వయముగా ధర్మరాజునకు కిరీటమును సమర్పించినటుల చూపెట్టినాడు. ధృతరాష్ట్రుడు భారతమునకన్న కవిగారి నాటకమునందు స్వతంత్రుడుగను, అధర్మభీతుడుగను చిత్రించబడినాడు. ఈ నాటకమునందు వీరము ప్రధాన రసము. దీనికి స్థాయి ఉత్సాహము.

ఇందు ధర్మరాజు జూదమాడుట, రాయబారమునకుముందు శ్రీకృష్ణుడు పస్తావ్యమునందు జరిగిన సంభాషణములు, పంచమాంకమున సేనానాయక నిర్ణయము మున్నగుచోట్ల వీరరసము పోషింపబడినది. షష్ఠాంకమున రౌద్రభీభత్సములు, సప్తమాంకమున కరుణరసము పోషింపబడినది.[1]

## ఆంధ్రపరాశరస్మృతి:

ఆదిపూడివారి ముద్రిత గ్రంథములలో 'ఆంధ్రపరాశరస్మృతి' యనునది రెండవ సంపుటముగా ప్రచురితమైనది ఇందు కవిరాజసందర్శనము- ఏలూరు అనునది ఒక భాగము, ఆంధ్రపరాశరస్మృతి యనునది రెండవ భాగముగా ఆంధ్ర పరాశరస్మృతి యను పేరిట ముద్రణము గావింపబడినది.

మొదటిభాగమగు 'కవిరాజసందర్శనము'న ఆదిపూడివారు కీ. శే. ఏలూరు మంత్రి ప్రగడ భుజంగరావుకు తనకుగల మైత్రికి చిహ్నముగా 27 పద్యములు రచించి కవిరాజసందర్శనము' అనుపేర ప్రకటించిరి. ఇందు భుజంగరావు ఆదిపూడి వారిని సన్మానించుట-మైత్రికి చిహ్నముగా 'ఆంధ్రపరాశరస్మృతి' యను గ్రంథమును కవిగారు రచించి భుజంగరావుకు కృతినంకితము గావించుట మున్నగునవి వర్ణితములు.

## గద్వాల ప్రభాకరము:

ఆదిపూడివారి మూడవ గ్రంథము 'గద్వాల ప్రభాకరము' అనునది. ఈ గ్రంథమందు ఆదిపూడివారు గద్వాలలో పనిచేయుచుండిన కాలమున వారు రచించిన కావ్యములు, సమస్యాపూరణములు, చాటువులు, ప్రాసంగిక పద్యములు మున్నగునవి గలవు. కవిగారి గద్వాల ప్రభాకరమను గ్రంథమందు

1. ఆదిపూడి ప్రభాకరరావు - ఆంధ్రభారతము - పుట 125, 135, 159.

'కందరామాయణ' మనుపేర 256 కందపద్యములలో 1892-96 మధ్య రచించి శ్రీరామభూపాలున కంకితము గావించినారు. ఆదిపూడివారి రామాయణమున దశరథుని పుత్రకామేష్టి, శ్రీరామ సోదరుల బాల్యము, విద్యాభ్యాసములు, రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట అడవికి జనుట, తాటకవధ, యాగసంరక్షణము అహల్యా శాపవిమోచనము, రామలక్ష్మణులు మిథిలకు పోవుట మున్నగు వానిని వర్ణించినారు. తర్వాత శ్రీరామ కథాష్టకమనదగిన ఎనిమిది పద్యములలో నీకవిగారు ప్రభువుల జన్మదినోత్సవములు, రాజదర్బారు పండితసభలు ప్రభువుల సన్నిహితులు మున్నగు వానిని గూర్చి వర్ణించిరి.

పౌండరీకము (పులివేట) :-

ఆదిపూడివారు సీతారామభూపాలునివెంట పులివేటకువెళ్ళి అచటి వృత్తాంతమును ఒక ఆశ్వాసములో 'పౌండరీకము' అను గ్రంథము కవిగారి నిశితపరిశీలనాశక్తికి చక్కని ఉదాహరణము. కవిగారు ప్రభువుల మనస్తత్త్వమునిందు చూపెట్టినారు. ఇందు రాజులెంత రాజ్యసంపదగలవారైనను ప్రజారక్షకులు గావున వారికి మనశ్శాంతి యుండదు. లోకులు వారిని పలువిధములుగా దలంతురు. ప్రజలను మెప్పించ బ్రహ్మకైనను తరముగాదనును. 'అవనిలోన ప్రజాప్రభుత్వైకబుద్ధి కలిగెగోర్చుట్టుపైన రోకంటిపోటు అని ప్రభుత్వ కార్యనిర్వహణమును గూర్చి వివరించినాడు.

ఆదిపూడివారు తన గ్రంథమున తుపాకి దెబ్బతో పులి చనిపోయినపుడు తుపాకిచప్పుడు విని ఆ ప్రాంతమున దిరుగాడుచున్న పులిపిల్ల రాజుగారున్నవైపునకు రాగా దానిని కూడా నతడు తుపాకి దెబ్బతో కాల్చెను. 'జనయితరుణంబు దీరెనేడనుచు దీర్ఘనిద్ర నిద్రించె పులిపిల్ల రౌద్రమిగి,[1] అని వర్ణించినాడు.

ఆదిపూడివారు పులివేటకు రాజుగారు బయలుదేరునపుడు ప్రభువులకుగల వాహనములనన్నింటిని వర్ణించినాడు.

పరిశీలనాశక్తి :-

ఆదిపూడివారి రచనలో నతని నిశ్చిత పరిశీలనాశక్తి గోచరించును. తన పౌండరీకమున ప్రభువులు ఇతరులను గూర్చి తెలిసికొని, నిజమైనవారిపై నింద

1. ఆదిపూడి ప్రభాకరరామాత్యులు - పౌండరీకము పుట 13.

మోపవచ్చునుగాని నిష్కారణముగా నొకరిపై నింద మోపుట సహజముగాదు. తప్పు చేయనివాడు ప్రభువుల యెదుట వాదించుట సహజమే. అట్టితరి ఉదారులైన ప్రభువులు పదిమంది పెద్దలనరసి యతని వ్యక్తిత్వము నిరూపించుట ప్రభువుల కర్తవ్యమను ధ్వనినీపద్యమున చూపెట్టినాడు.

చంద్రోదయ వర్ణనము :-

మ॥ ననుదోషాకరుజేసి పాంథజనమన్యాయంబుగా దూరుచె
మినిమిత్తంబు ప్రదోషహేతువదియేమీ యీగురున్ శుక్రసౌ
మ్యనిమందుంగుజరాహుకేతువుల వాఙ్మాలంబుతోడం విమ
ర్శంచేయండని నిల్చెగట్టెదుట దారాభర్త భూభర్తకున్.[1]

ఆదిపూడివారి గ్రంథమును శబ్దార్థాలంకార విలసితముగా విరచించిరి. కవి ఈ గ్రంథమును రచించి శ్రీ సీతారామభూపాలున కంకితము గావించితినని తన గద్యలో తెల్పినాడు.

## ఖండకావ్యములు-ఉపన్యాసములు-చాటువులు:

ఆదిపూడివారి నాల్గవ సంపుటము 'ఖండకావ్యములు' ఇందు కవి ప్రకృతి మండలము, ఆంధ్రభాషోదంతము, దైవం దిన్నెతిరునాళ్ళు, మాతృభాష, ఉప్పు సత్యాగ్రహము, ఉపన్యాసపదములు, శుకోపదేశము (1927), శ్రీహరిశతకము, జగదీశశతకము (1928), భాగ్యనగరము-వకీళ్ళు (1928) ఇతర చాటువులు మున్నగు వానిని రచించివాడు.

కవి ప్రకృతిమండలము శీర్షికలో ప్రకృతి వైచిత్రిని తత్కర్తయగు భగవంతుని వర్ణించెను. ఆంధ్రభాషోదంతము (శీర్షిక)లో తెనుగు భాషయొక్క తీరుతెన్నులు, భాషయందలి తియ్యదనము-రాజరాజనరేంద్రుడు. కృష్ణరాయలు మున్నగువారు గావించిన భాషాసేవ, మున్నగునవి 46 పద్యములలో నీకవి వర్ణించినాడు.

'దైవందిన్నెతిరునాళ్ళు' (శీర్షిక) కవిగారి రచనలో నర్మగర్భితమైన హాస్యము గన్పట్టును. 'ఆంధ్రభాష' అనుదానిలో రసికతలేని కవులను వారి కవిత్వమును గూర్చి నొచ్చుకొనుచు రచన గావించినారు.

---

1. ఆదిపూడివారి పౌండరీకము పుట 20.

కవి 'శుకోపదేశము' రచనలో చిలుక తన భార్యతో - మనుజులతో స్నేహము వలదు. వారికి తృప్తియుండదట, అని చెప్పినాడు.

ఉ॥ తిండియుతీర్థముండవలె దీరదుమర్త్యుడు దీనతృప్తి బొం
దుండు విలక్షణంబైన దాహముతుత్తుగలందు లోకమం
దుండు సమస్తవస్తువులు నిండిననింకను గోరుచుండు న
ట్లుండెడి వారికెట్లు సుఖముండును నాప్రియురాల చెప్పుమా.[1]

అని వ్యథ చెందును.

**శ్రీహరి శతకము :-**

ఆదిపూడివారీ శతకములో తాను గద్వాలలో కొంతకాలము దివానుగా పనిచేసిన తర్వాత ఇతరులమాటలు నమ్మి రాజు తనకు గావించిన అవమానమును దృష్టియందుంచుకొని వాపోవుచు తనకు గల భంగపాటును భగవంతునితో విన్న వించుకొనుచున్నటుల రచించినారు. శతకమందలి 58 పద్యములు మాత్రమే లభించినవి. ఇతరములు లభించలేదు.

**జగదీశ శతకము :-**

ఇందు కవిగారు (1928) గద్వాల శ్రీరామభూపాలుని కాలమున ఐదు సంవత్సరములలో తనకు జరిగిన సత్కారములు వివాహము శ్రీరామభూపాలుని యనంతరము తన ఉద్యోగాన్వేషణము, మున్నగునవి వివరించినాడు. ఈ శత కము 'జగదీశ' యను మకుటముతో వ్రాయబడినది.

**చాటువులు :-**

కవిగారు కొన్ని చాటువులు రచించినారు. కవి స్త్రీలకు వేణి (జడ) వెనుక భాగము నుండుటకు కారణము, మరణము, తుమ్మెద, మనఃకపి, మున్నగువానిని రచించెను.

మనస్సనునది కపివంటిదట అట్టి మనసు మోహకాననమున దిరుగుచు దారి తెలియకున్నది. దానిని తనవైపు మరల్చుకొనుమని కవి ఈశ్వరును కోరు కొనును.

---

1. ఆదిపూడి ప్రభాకరరావు ఖండకావ్యసంపుటి - శుకోపదేశము - ప. 20.

చ॥ అనయము మోహకాననమునందు జరించుచు భామినీమణి
స్తనఘనదుర్గసానువుల సంతతమావలశాఖలెక్కి వి
న్ననువుగనూగు మామకమనఃకపి భిక్షుక! దీని బట్టియొ
య్యన దగఁగట్టి నీ వశమునందిడు కొమ్మ కపాలి ఈశ్వరా![1]

ఉమాపత్యభ్యుదయము :-

ఆదిపూడివారు పై గ్రంథములనేగాక దోమకొండ సంస్థాన ప్రభువులగు రాజా ఉమాపతిరావుగారి కోరికపై ఈ (ఉమాపత్యభ్యుదయము) గ్రంథమును రచించి ఆ ప్రభువునకంకితము గావించిరి. శైలినరయుటకీ క్రిందిపద్యము గాంచ దగును.

చ॥ సరసకవిత్వ వైభవవిశారదులై నుతికెక్కినట్టి యా
తిరుపతి వేంకటేశ్వరుల దీనికి మున్నితామింప వారునున్
మరిమరి జెప్పిరిందులకు మాకునుమీకును మిత్రుడౌ ప్రభా
కరకవియే సమర్థుడని, కావున మీకిదితప్పదెప్పుడున్.[2]

అని తెల్పిరి.

తిరుపతి వేంకటకవులు :-

ఆంధ్రదేశమున తమ ప్రతిభా పాండిత్యములచేత ప్రభువులను మెప్పించి అఖండసన్మానములను పొందినవారు శ్రీ తిరుపతి వేంకటకవులు. ఆంధ్రావనిలో వీరు సందర్శించని రాజాస్థానము లేదు అభినవాంధ్రకవులలో వీరిని గురువులుగా భావించినవారసంఖ్యాకముగా గలరు. ఈ జంటకవులే మహారాజును లెక్క సేయలేదు. 'ఏనుగునెక్కినాము ధరణీంద్రుడు మొక్కగ నిక్కినాము'[3] 'అనుభ వించితిమి దివ్యభోగముల'ని ప్రతి పట్టణము ప్రతి దాతను సందర్శించి సన్మాన ములను బడసిరి.

---

1. ఆదిపూడివారి-ఖండకావ్యసంపుటి - మనఃకపి శీర్షిక.
2. ఆదిపూడి ప్రభాకరామాత్యులు - ఉమాపత్యభుదయము - చివరి పద్యము. సుజనరంజని ముద్రణాలయము - కాకినాడ 1909లో ముద్రితము.
3. తిరుపతి వేంకటకవులు- నానారాజ సందర్శనము- ఆత్మకూరు 49.

ఈ జంటకవులు గద్వాల ప్రభువగు శ్రీరామభూపాలుని దర్శించి 'లలిత కవితావిలాసిని వలపుసాని, దర్శనీయులు మీవంటి ధరణిపతుల'ని తెలియజెప్పిరి. వ్యర్థమగు వాదములొనర్చువారి డంబమణగించుట తమకు ఆపోశనమువంటిదనిరి.

కవులు తమ కవితావిలాసమును గూర్చి శ్రీరామభూపాలునితో తెల్పుచు ముద్దుముద్దుగ జెప్పబూనితిమా వన్నెలాడి తీయని మోవిలంచమిచ్చుననియు, ఆంధ్రగీర్వాణ భాషలలోను ఆశుధారకవిత్వమందును సాటిలేరనిపించుకొనిరి. కవులు ప్రభువుతో - ఒకచరణంబతండు మరొకటి నేను కవనమల్లువారమని ఆశు కవితలో పద్యములు వ్రాసి తమ యవధానమునకవకాశము గల్గింపగోరిరి. ఆ మొదటి వత్సరమవధానము గావింపకయే ప్రభువు కవుల కుచిత సత్కారము గావించిరి. అట్టి సమయమున రామభూపాలుని కొలువులో ఆదిపూడి వార మాత్యపదవిలో నుండిరి.

ఆకాలమున ఉద్దండపండితులు, కవులు గాయకబృందము విద్వద్గద్వాలకు విచ్చేసి విద్వత్పరీక్షలలో పాల్గొని రాజాదరణ పొందుట నొక ఖ్యాతిగా తలంచు చుండెడివారు. ఏలయన గద్వాలాస్థాన విద్వాంసులు - కవులుద్దండపండితులు వారి మన్ననల పొందవలెననిన శాస్త్రార్థ విషయములలో కూలంకషమైన ప్రజ్ఞ యుండియే తీరవలెను. అట్టి శాస్త్రవిచారములు, వాదోపవాదములు ఆ సభలో జరుగుచుండుట పరిపాటి కావుననే తమ శాస్త్రార్థ విచారములను తఱచి తమ ప్రజ్ఞాసంపదను పెంపొందించుకొనవలెనని పండితులు-కవులు గద్వాల సభలకు విచ్చేయుటకువ్విళ్ళూరుచుండెడివారు.

ఆ సభలలోనొకవైపు శాస్త్రచర్చలు, మరొకవైపు వేదాంతవిషయములు, విద్వత్పరీక్షలు జరుగుచు సభలు శాస్త్రవిద్వత్కవిగాయక బృందములతో కిటకిట లాడుచుండెడివి శ్రీపురాణం దీక్షాచార్యులు శ్రీరామభూపాలుని విద్యాగురువులు.[1] శ్రీ పురాణం నరసింహాచార్యులుగారీ రామభూపాలుని సభలో ధర్మాధికారులుగా నుండిరి.[2]

---

1. రామంచంపువు ఛందోముకురము మున్నగు గ్రంథములను రచించిరి.
2. విజయోద్యోతము (సంస్కృతము) సుభద్రాకల్యాణము (నాటకము) మున్నగు గ్రంథములను రచించిరి ఈ నాటకమలభ్యము.

ఈ జంటకవులు రెండవమారు గద్వాలకు వచ్చినపుడు రాజారామభూపాలునితో పద్యరూపమున నివ్విధముగా నర్జీ పెట్టుకొనిరి. పండితులను పరీక్ష గావించుటకు సహృదయులైన పండితులే యుండవలెను ఉండిరనా పండితులు పరుల కీర్తిని సహించి యుండవలెను. ఆ పండితుల మాటను రాజు మన్నించి దివానులకు తెల్పవలెను. ఆ దివానులుకూడ రాజుమాటను, పండితాదరణము జేయునట్టి భావనను గల్గియుండవలెను. ఇన్నియునుండుట కష్టము. నీవు రసజ్ఞుడవని పండిత సముదాయముతో సత్కాలక్షేపము జేయవచ్చినారమని తెల్పిరి.[1]

పోయినవత్సరమేవచ్చి అవధానము జేయుదుమని తెల్పగా నవధానశక్తి మరొకమారు జూచెదమంటిరని కవులు పద్యరూపమున తమ కోర్కెను తెలియజేసిరి.

మరునాడు సభయారంభమయ్యెను. కవులు అవధానమునందాలస్యముగా సమాధానములిచ్చుట జరిగినది. అటులిచ్చుటచే 'గంటకు పదిపైన బట్టునే' యని సభలోని వారనుటయు నీ జంటకవులు గంట రెండుగంటలలో హుటాహుటిగా వచింతురాయనియు పలికిరి. జంటకవులు తమయింట దాగికొని పల్కుట కష్టము గాదనియు, అవధానము జేయువారి మొగమెన్నడైనను జూచితిరాయని పల్కగా దానిచే ధర్మాధికారులగు పురాణం నరసింహ్మాచార్యులకీ జంటకవులకు శాస్త్రవాదోపవాదములు జరుగుట తటస్థించినది.[2] ఆనాటిసభలో నవధానము విఘ్నము కాగా తత్క్షణమే ఈ జంటకవులు కేశవస్వామిని గూర్చి యిటుల విన్నపము గావించుకొనిరి.

గీ॥ అట్టి మేమిట్టి గద్వాల కరుగుదెంచి
కుటిల ధర్మాధికారి వాక్కులను వినిన
రాజుచే మన్ననలు పొందరాక యూరి
కేగు చుంటిమి మాశక్తి యీ నృపాలు
చెవిని వేయు మీపైన కేశవ! మహాత్మ

1. తిరుపతి వేంకటకవులు - నానారాజ సందర్శనము పుట 9-10.
2. కే. నరసింహ్మశాస్త్రి, సంస్థానములు - సాహిత్యసేవ పుట 15.

అని తెల్పిరి.[1] శ్రీరామ భూపాలుని యాస్థానముననున్న ఆదిపూడి వారికి విషయమును 'ఇలకవీశ్వరులనుట నవ్వులకు చేటు' అని జంటకవులు తెల్పగా ఆదిపూడి వారి విషయమును రాజుగారి కర్జీ పెట్టుటయు, రసజ్ఞుడైన శ్రీరామభూపాలుడు సావధానముగా నీకవులను పరీక్షించి రసహృదయమును గ్రహించి వారిని గౌరవించుటకాజ్ఞ యిచ్చిరి.

జంటకవులవధానము గావించి సభను మెప్పించి రాజుచే సన్మానమును బడసిరి. అట్టి సమయమున జంటకవులు కృతజ్ఞతతో నీపద్యమును జెప్పిరి.

గీ॥ ఎట్టి వారికైన నిలలోన వెలజెప్ప
వచ్చుగాని కవుల పద్యములకు
ప్రభు కటాక్షమునకు బరికింప బనిలేదు
గాన రామభూప దానమిమ్ము.[2]

అని కోరగా గద్వాల ప్రభువగు రామభూపాలుడీ జంటకవులను సత్కరించుట జరిగెను. జంటకవులు 'శని గ్రహ'మను గ్రంధము నిట్టిసమయమున వ్రాసిరని యందురు.[3]

ఈ జంటకవులు రామాభూపాలుని కాలమందును, అనంతరమతని ధర్మపత్ని రాణి లక్ష్మీదేవమ్మ కాలమునను, అనంతరమామె దత్తత కుమారుడగు శ్రీ సీతారామభూపాలుని రాజ్యపాలనమందును గద్వాలకు విచ్చేసి ప్రభువుల గౌరవమును పొందిరి.

జంటకవులు చిన్నదొరగారగు సీతారామభూపాలుని రాజ్య పట్టాభిషేకమునకు గద్వాలకు విచ్చేసి నాటి సంస్థానమందలి కళావైభవమును కన్నులార గాంచి యువరాజునాశీర్వదించుచు ఎన్నియో పద్యములను చెప్పిరి. 'కవులే తెచింన గారవించుచు' మున్నగునవి 'నానా రాజ సందర్శనము'న గలవు.[4]

శ్రీ సీతారామభూపాలుడు చాల ఉదార స్వభావుడు. ఈ భూపాలుడెల్లపుడును విద్వద్గోష్ఠులతో శాస్త్రచర్చలతో కావ్యశాస్త్ర వినోదములతో కాలము గడుపుచు రాజ్యపాలనము గావించెను.

---

1, 2. తిరుపతికవులు- నానారాజ సందర్శనము. గద్వాల. పుట 10.
3 కే. నరసింహ్మశాస్త్రి- సంస్థానముల సాహిత్యసేవ- పుట 16.
4 తిరుపతికవులు- నానారాజ సందర్శనము- గద్వాల. 10-15.

తిరుపతి వేంకటకవులీ ప్రభువు సభను కన్నులారగాంచి చెప్పినట్టిదీ పద్యము

సీ॥ సామంతరాజన్య సంఘంబు లొకవంక
నొకవంక రాజ బంధూత్కరంబు
తులలేని మంచి యుద్యోగస్థు లొకవంక
నొకవంక దివ్యవైణిక గణంబు
సకల భాషా కవిత్వ కలాపు లొకవంక
నొకవంక ప్రథిత వైణిక గణంబు
శాస్త్ర మర్యాదా విశారదు లొకవంక
నొకవంక గాంధర్వ యువతి చయము.

గీ॥ నిండు పేరోలగమ్మున నుండికొలువ
మేలుగా నేలుకొనుచు గద్వాల పురము
పట్టినదియెల్ల బంగారు ముట్టినయది
ముత్యముగ రామభూపాల ముద్దుతనయ [1]

ఈ జంటకవులు గద్వాలను సందర్శించు కాలముననే రామభూపాలునికి బావమరిది, సీతారామభూపాలునికి మేనమామయగు తాటికొండ రామారెడ్డి గారి కోరికపై లక్షణా పరిణయమను గ్రంథమును రచించిరి.

తాటికొండ ప్రభువులకు గద్వాల రామభూపాలునకు సంబంధ బాంధవ్యమున్నది. రామభూపాలుని రెండవ ధర్మపత్ని రాణి లక్ష్మీదేవమ్మగారు తాటికొండ ప్రభువుల ఆడపడుచు. రామారెడ్డిగారికి అక్కగారు. రామారెడ్డి గారు శాంతమూర్తులు. కవులన్నను పండితులన్నను రెడ్డిగారికి అపారమైన ప్రేమ. వారి కోరికపై రచించింపబడినదీ గ్రంథము.

లక్షణాపరిణయము :-

జంటకవులు 'లక్షణాపరిణయమ'ను గ్రంథమును మూడాశ్వాసములలో రచించిరి. క్రీ॥శ॥ 1920 - 24 లో నీగ్రంథము ముద్రించి ప్రకటింపబడినది. ఈ గ్రంథమందలి ఆశ్వాసాంతగద్యయిటులున్నది.

1 తిరుపతికవులు- నానారాజ సందర్శనము- గద్వాల పుట 11.

'శ్రీ కింకవీంద్ర ఘటా పంచానన విద్వత్కవి బాలకళానిధి బాల సరస్వతి శతావధాని తిరుపతి వేంకటీయంబను మహా ప్రబంధమ్మునందు, అని వ్రాసి యున్నది.

<u>ఇతివృత్తము :-</u>

మద్రపురమును పాలించిన బృహత్సేనుని కూతురు 'లక్ష్మణ'ను శ్రీకృష్ణుడు వివాహమాడుట యిందలి యితివృత్తము.

జంటకవులు రచించిన లక్షణాపరిణయమందు మొదటి పద్యమిటులున్నది.

శా॥ శ్రీరామమణి జానకీరమణియై సేవింపదమ్ముల్సదా
గారాబమ్మున గొల్వ నెల్లయెడలన్ గల్యాణముల్మీర సు
శ్రీరంజిల్ల నయోధ్యనేలికొను నా శ్రీరాము డెల్లప్పుడున్
శ్రీరామాధిపునాత్మనామ ధరు రక్షించున్ కృపాశాలియై [1]

జంటకవులీ పద్యానంతరము ప్రాచీన సంప్రదాయమునను సరించి గ్రంథ మందు నాల్గవ పద్యమున సరస్వతిని వరుసగా వేంకటేశ్వరుని, పార్వతిని, ఈశ్వరుని, భారతిని, గణపతిని, కాళిదాస మయూర నన్నయ మున్నగు ప్రాచీన కవులను, తమకు గురువులగు బ్రహ్మయ్యగారిని స్తుతించిరి.

'కొందరు గ్రంథచోరులితరుల పద్యములను వ్రాసికొని తమపేర ప్రకటించుకొందురు అట్టివి మావద్ద వీలుపడదు' అని ఈ జంటకవులు 'మాదు కైత కొక్క మారువేషము వైచి మార్చుకొందమన్న మారబోదని' తమ కవితా పద్ధతిని గూర్చి తెలియజెప్పిరి. జంటకవులు సరసత్వమున్న చోటనే రసికత యుండును అట్టి రసికత లేనివారు పద్యమందలి లోతుల నెరుగజాలరని పదొమ్మిదవ పద్యమున జెప్పినార.

తిరుపతి వెంకటకవులీ లక్షణా పరిణయమును రచింపుమని రెడ్డిగారు కోరి నటులీ- "స్వామీ మీ కవితా ప్రవాహము జగచ్ఛ్లాఘ్యము' అను 22వ పద్యమున లక్షణను కృష్ణుడు పెండ్లియాడు కథను నాపైగల కూర్మితోచెప్పి కృతి గావింపుడని కోరుటచే తామీ గ్రంథమును రచించితిమని తెల్పినారు.

1. తిరుపతికవులు- లక్షణాపరిణయము- మొదటి పద్యము.

కృతిపతి ప్రశంస :-

జంటకవులీగ్రంథమున నలుబది పద్యములు మొదలుకొని అరువది ఎనిమిది పద్యముల వరకు (28 ప.) కృతిపతి (రామారెడ్డి) వంశ చరిత్రను వ్రాసినారు. కృతిపతి గుణగణములను గూర్చి కవులు- ఇంత శాంతి దాంతి గుణంతయనుద్ధతి, యింత యోగ్యత మరెందులే'దనిరి, అంత శాంత స్వభావులు రామారెడ్డిగారు.

ప్రబంధ లక్షణములు - వర్ణనలు :-

జంటకవులుీగ్రంథమున ననేక వర్ణనలు గావించి ప్రబంధరీతిని కవిత గావించినారు. (సాయంవర్ణన 2 ఆ. 34 ప. చంద్రోదయ వర్ణన 2 ఆ. 10-11 ప.)- సూర్యోదయ వర్ణన, ద్వారకాపుర వర్ణన, చిలుక రాయబారము 2 ఆ. 54 ప., జలక్రీడ 2 ఆ. 112 ప. మున్నగు వర్ణనలు గలవు.

శైలి - అలంకారములు :-

ఈ కవులీగ్రంథమున అర్థాలంకారమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చిరి. కవులు 'లలితపద ప్రబంధముల కర్థాలంకారములు వాడినచో పెరుగు వడ్లను కలిపిన ముచ్చటగా నుండునా? యని ప్రశ్నించిరి.

శాస్త్రార్థ విషయములతో అర్థరహితమైన వాదోపవాదములతో బుర్రె బద్దలుగావించుకొను పండితులనేవగించుకొనుచు కవులీపద్యము చెప్పిరి.

చ॥ మతిగల వారికేనియు బ్రమోజ మెలర్పగబోదు పుష్ప స
మ్మిశ్రిత కవితాలతాంగిని రమింపుడు కేవల శాస్త్రిలారా! మీ
మతులకు వచ్చినట్లు రసమాధురి గ్రోలుడుగాని వ్యర్థ పుం
జతురిమ జూపి దాని స్తనశల్య పరీక్ష యొనర్ప బోకుడీ 1

జంటకవులీగ్రంథమందర్థాంతరముల నెన్నియో చూపెట్టిరి. 'మతులెవరికైన కర్మానుగతులు గావే' ఒకడు చెడిపోవుపైనగాని మరొకడు బాగుపడుట నిజము, అర్థకాముకులకు దూతలొక్కతరి మేటివిరమ్ముగ లొసంగు దైవముల్,

1. తిరుపతికవులు - లక్షణాపరిణయము ప. 22.

మున్నగునవి. ఇందు కవులు ప్రథమాశ్వాసమున 40 ప., ద్వితీయ. 122 ప., తృతీయ 116 పద్యములు మొత్తము 291 పద్యములలో నీగ్రంథమును పూర్తి గావించిరి.

పోలికలు:-

జంటకవులు చేమకూర వెంకటకవి విజయవిలాసము, పోతన భాగవతము తిమ్మన పారిజాతాపహరణము మున్నగు ప్రబంధ రచనల పోలికలుగల పద్యములను తమ గ్రంథమున వ్రాసిరి. ఏమనెశౌరి నీవు మరి ఏగతి నేగితి (లక్షణా. 2 ఆ. 83 ప) ఘమడా భూసురుడేగెనో (భాగ. రుక్మిణీ కల్యాణము). రమ్మని గౌరవించెనో (లక్షణా. 2-83) మున్నగునవి ఇందుగలవు.

సాయంసమయ వర్ణనమున :-

సూర్యుడు సాయం సమయమున అరుణకిరణుడగుట సహజము. అట్టి అరుణత్వమాపాదించుటకు పశ్చిమాంబుధి తనలోనున్న మణులను అతనికి కానుకగా నిచ్చుటచే నా కాంతి ప్రసరించి సూర్యుడరుణకిరణుడైనాడని జంటకవులు తమ యపూర్వ భావనాబలమునీపద్యము జూపెట్టిరి.

క॥ హరిదశ్వుడు తన గృహమున
కరుదెంచెనటంచు పశ్చిమాంబుది మణులన్
గరమున కానుకొసంగ ద
దరుణచ్ఛవి బొల్చెననగ నరుణుండెసగెన్ 2ఆ. - 4 ప.

జంటకవులు ప్రతివత్సరము మాఘమాస సభలకు విచ్చేసి గద్వాల రాజ వైభవములను కన్నులారగాంచి చెప్పిన పద్యములెన్నియో గలవు. అందలిదొక పద్యము-

మ॥ ప్రతి సంవత్సర మాఘమాసమున గద్వాల ప్రభుండిచ్చు ను
న్నత సత్కారపు వార్షికమ్ముగని గొన్నాళ్ళిచ్చటటన్ రాజ బం
ధుతతుల్ సత్కవితాదురల్ మిగుల సంతోషమ్ముతో గోవ్వను
న్నతరిన్ దన్నృపసాళ్వలకుండు కదుసన్మాన్యుండు స్నేహార్థియై?

గ్రంథమును వ్రాయుమనగా లక్షణాపరిణయమును రచించి రెడ్డిగారి కంకితము గావించి సన్మానములనందితిమని కవులు తెల్పిరి.[1]

పోకూరి కాశీపత్యవధానులు :-

ఆంధ్ర వాఙ్మయములో నాశు, బంధ, చిత్ర, గర్భ కవిత్వాది చతుర్విధ పద్ధతులనవలంభించి రచన గావించువారరుదుగా గన్పింతురు. అట్టి రచన గావించి చూపెట్టినవారు పోకూరి కాశీపత్యవధానులు.

జన్మస్థలము :-

వీరి జన్మస్థలము గుంటూరుజిల్లా పల్నాడు తాలూకాలోని 'బోదిలవీడు' గ్రామము. వీరు విశ్వకర్మ కులములో బుట్టినవారు. తల్లిదండ్రులు లక్ష్మాంబ సుబ్బరాయాచార్యులు. ఆ పుణ్యదంపతులకు శ్రీ కాశీపతిగారు తృతీయ పుత్రులు. వీరు మాచర్లలో నివాసము గావించుకొని ఇటీవల దివంగతులైరి. వీరు సహజ పాండితీ ధురీణులు. తన రచనలను గూర్చి కావ్యాంతగద్యలో- 'శ్రీపరమేశ్వర వర ప్రసాదలబ్ధ చతుర్విధ కవితా విచిత్ర' యని చెప్పియున్నారు. వీరు అరువదికి పైగా కావ్యములు రచనలుగావించిరి.

క్రీ॥శ॥ 1935-46 గద్వాల ప్రభువగు శ్రీ సీతారామభూపాలుని కాలమున గద్వాలకు విచ్చేసి తమ కవితానైపుణ్యమును ప్రదర్శించి ప్రభువు కోరికపై ఆస్థాన కవీశ్వరులైరి.

వీరనేక సంస్థానములకు వెళ్ళి తన కవన చాతుర్యాన్ని, అవధానములను ప్రదర్శించి బిరుదములనందినారు.

గద్వాల ప్రభువులవధానిని గౌరవించి 'కవిసింహ' బిరుదము-సన్మానములతో సత్కరించిరి జటప్రోలు సంస్థానము వీరికి కవిజటిలాఖ్య, యని గోపాలపేట సంస్థానము కవి శిరోమణి, ఉయ్యూరు రాజాగారు కవితాప్రవీణ తాటికొండ రాజాగారు ఆశుకవి పుంగవ అద్దంకి మంత్రిగారు కవిశిఖామణి శ్రీ బెల్లంకంటి రామరాయుల బంధువొకరు ఆశుకవికోకిల చెన్నపురి ఆంధ్రమహాసభవారు

1. తిరుపతికవులు- లక్షణాపరిణయము- 1 ఆ. 22 ప.

అవధానప్రవీణ, విజయవాడ శిల్పకళాపరిషత్తువారు చిత్రకవితా పంచానన, కడపజిల్లా శ్రీ వీరబ్రహ్మ మఠాధిపతులు కళాప్రపూర్ణ భారతజాతీయ కాంగ్రేసు (అధ్యక్షులు) వారు మహాకవి శేఖర, బిరుదములిచ్చి సత్కరించినారు. 1950 ప్రొద్దుటూరిలో కవిగారికి గండపెండెరము వేసి ఏనుగుపై ఊరేగించి సత్కరించినారు.

క్రీ.శ. 1960 రాయచూరు ఆదోని పట్టణాలలో ప్రజలు సువర్ణకంకణాలు తొడగి కవిగారిని సన్మానించినారు.

ఇటులనేక సంస్థానములలోను తదితర సభలలోను అవధానిగారు 45 బంగారు పదకములతో సత్కరింపబడిరి. కవిగారిని కర్నూలుజిల్లా 'హాలహార్వి' అనే ప్రాంతమున ప్రజలు కనకాభిషేకము గావించినారు. క్రీ.శ. 1968 సిద్దిపేటలో అవధానిగారిని రథముపై నెక్కించి మంగళవాద్యములతో నూరేగించి సన్మానించినారు.

క్రీ.శ. 1962 ఆనాటి భారతరాష్ట్రపతిగా నుండిన సర్వేపల్లి రాధాకృష్ణ పండితులు కవిగారికి ద్రవ్యరూపములో సహాయము గావించిరి.

భారత జాతీయ కాంగ్రేసు అధ్యక్షులైన శ్రీ డి. సంజీవయ్యగారి అధ్యక్షతలో సభ గావించబడి కవిగారు 'మహాకవి శేఖర' బిరుదముతో సత్కరింపబడిరి.

గ్రంథములు :-

అవధానిగారి కావ్యములలో నెన్నదగిన కావ్యములు హరిశ్చంద్రోపాఖ్యానము - సారంగధరీయము - శ్రీ శౌరిశైశవలీల, సిద్ధయోగి చరిత్రము - త్రింశద్ధపద్యరత్నము - నరసింహప్రభుశతకమును నీతిశతకము నరసింహనిరసన స్తుతి, హనుమత్ప్రభుశతకము, కలికాంబాశతకము, కేశవేంద్ర శతకము ముఖ్యములు.

ఇవిగాక అనేక చాటువులు కావ్యములు అముద్రితములుగానే యున్నవి. వీరాశుకవితలో నవధానము గావించుటలో మిక్కిలి చతురులు.

హరిశ్చంద్రోపాఖ్యానము :-

కవిగారి హరిశ్చంద్రోపాఖ్యానము క్రీ.శ. 1921 ప్రాంతములో రచింపబడి 1930 లక్ష్మి ముద్రాక్షరశాల - గద్వాలలో ముద్రణము గావింపబడినది. కవి గారీగ్రంథమును నిరోష్ఠ్యరచన గావించి శుద్ధాంధ్రనిరోష్ఠ్యనిర్వచన హరిశ్చంద్రో పాఖ్యానమని పేరిడిరి. కవిగారు క్రీ.శ. 1921 గద్వాల సభకు విచ్చేసి రాజు గారి మన్ననకు పాత్రులై 'కవిసింహ' బిరుదమునేగాక యోగ్యతాపత్రమును బొంది శ్రీ సీతారామభూపాలుని ఆస్థానమున ఎనిమిది సంవత్సరములాస్థాన కవీ శ్వరులుగా పనిచేసిరి.

కందుకూరి వీరేశలింగం పంతులుగారింతకు పూర్వమే నిరోష్ఠ్యపద్ధతిలో 'నలచరిత్రము'ను వ్రాసినారు. అది గమనించి అవధానులు షట్చక్రవర్తులలో మొదటివాడగు హరిశ్చంద్రునికథ సితివృత్తముగా గ్రహించి నీగ్రంథమును వ్రాసిరి.

గ్రంథారంభమున కూచిమంచి తిమ్మకవి తన 'నీలాసుందరి పరిణయ మున' 'శ్రీలకు పావలంబగుచు' అని వ్రాసినాడు.[1] కావున శ్రీ యనుత త్సమశబ్దము మంగళప్రదమైనదని కవిగారు అట్టి తత్సమ పదముననే తన గ్రంథా రంభమున వాడితినని తెల్పినారు. కవిగారు నామములలో హరిశ్చంద్రుడు, సత్యకీర్తి మున్నగు వానిని మాత్రమే తత్సమశబ్దములను వాడి మిగతా గ్రంథ మంతయు నచ్చతెనుగుననే రచన గావించినారు. కవి తన గ్రంథమునకు మాతృ కగా శంకరకవి కృతమగు 'హరిశ్చంద్రోపాఖ్యానము'ను గ్రహించెను.

కవితా వైదుష్యము - చిత్రకవితలు:-

కవిగారీగ్రంథమునందనేక చిత్రకవితరచన గావించి తన కవితా వైదుష్య మును ప్రకటించినారు.

ఏకాక్షరి (2ఆ 109ప) గుడులు 2-135ప. కేవలము తలకట్లు 2-169ప. కేవలము కొమ్ములు 2-71ప. ఏకపాదులు 2-59ప. ద్విపాదులు 1-67ప. మున్న గునవి కవి గ్రంథమున చెప్పినాడు.

1. కూచిమంచి తిమ్మకవి - నీలాసుందరి పరిణయము - మొదటి పద్యము.

అవధానులీ గ్రంథమందు కేవలము లఘ్వక్షరముంతో కూడిన సర్వలఘు గీతము 1-6వప. సీసపద్యములో యతివేసిన సర్వవడి సీసము 3-11ప. అన్ని చోటుల ప్రాసవేసిన సర్వతః ప్రాససీసము 1-80ప. మున్నగు చిత్రప్రక్రియల నిందు రచించి తన ప్రతిభాసామర్థ్యములను వెల్లడించినారు.

ఈ గ్రంథమందు అవధానిగారి చిత్రరచనకు వన్నెచేకూర్చిన పద్యములు మూడింటిని ఇచట తెలుపుదును.

విశ్వామిత్రుడు తాను సృజించిన మాతాంగకన్యల నవమానపరచినాడను కోపమున హరిశ్చంద్రుని సమీపించగా రాజు ఋషికి నమస్కరించెను. అట్టితరి మహారాజును పాదముతో త్రోసెను. మహర్షి పాదము నొప్పిగల్గినదేమోయని మహారాజు తన చేతులతో నతని పాదములొత్తుచు చెప్పినట్టిదీ పద్యము.

కం॥ నేనన్నైననను నీన
న్నానానేనాననూననా నన్ననౌ
నా నిన్ను నెన్ననన్నా
నా నేనున్నాన నానినానన్నన్నా [1]

ఇది ఏకాక్షరి. ఒకే అక్షరముతో నడిచినదీ పద్యము. పద్యభావమిటు లున్నది- నేనెన్నియైనను ఈయనంటినా? నేను వానిఁ (లజ్జ) అనినాను అన్నన్నా అని విడదీసి చదివినచో పద్యభావము సులభముగా నర్థమగును. ఇట్టి చిత్రరచన లీ గ్రంథమందెన్నియో గలవు.

పూర్వకవులలో 'నేకాక్షరి'ని వ్రాసినవారున్నారు కాని యింత సులభముగా నర్థమిచ్చునట్టి రచన గావించినవారరుదుగా గానవత్తురు

హరిశ్చంద్రునిచేత నబద్ధము జెప్పించవలెనని విశ్వామిత్రుడు జేసిన ప్రయత్నములన్నియు విఫలములగును. అపుడు విశ్వామిత్రుడు తనలోతాను విచారిస్తున్న తీరుగలదీ చిత్రకవితలోనున్న పద్యము.

1. కాశీపత్యవధానులు- హరిచంద్రోపాఖ్యానము- 2ఆ. 76ప.

కం॥ కినిసిసిరిఁ దీసి నీలిగి
తిని సిగ్గడి కింగిరికిని దిగితిరితిఁ గి
త్తిని జీరి నించి చిక్కడి
తిని జియ్యాయింతి కీరితిని నిల్చిరి సీ॥ హరి-ఆ. 2-135ప.

ఈ పద్యమున అక్షరములన్నియు గుడులే. పద్యభావ మిటులున్నది-అయ్యో! అతని ఐశ్వర్యమంతయు బోవునట్లు జేసితిని. సిగ్గులేక నీచకార్య (కింకిరికిని) మునకు దిగితిని. అగ్ని (గిత్తి) వంటి హరిశ్చంద్రుని పిలిపించి నిందించి చిక్కులు పెట్టితిని. అయిన రాజురాణి (జియ్యాయింతి) కీర్తిని నిలుప్పు కొన్నారు అని కవిగారిరచనను 'ఇస్సీ'అని బాధనొందునటుల గావించుట సందర్భోచితముగా నున్నది అన్ని అక్షరములు గుడులతో నీసందర్భమున వ్రాయుట ఔచిత్యముగా గన్పట్టును.

మూడవ పద్యమున హరిచంద్రుని సత్యసంధతనుగూర్చి కవిగారి భావము-సంధ్యాసమయమున సూర్యుడస్తమించిన తర్వాత చీకటి ఆకాశము నావరించుట సహజము. అట్టిదానిని కవి సంధ్యాసమయమునుత్ప్రేక్షలో కడు రమ్యముగా వర్ణించి తన భావుకతను వెల్లడించినాడు. సూర్యుడు తనకు శత్రువుగా దలచి నీటిచానను (సముద్రమును) గవయనిచ్చగించిపోయినాడని నింగిచాన సిగ్గుచే నల్లబడినదట. అట్టిదాని నుత్ప్రేక్షగా ఆకాశమనెడి స్త్రీసిగ్గుచే నల్లబడినదని చెప్పినాడు. 1ఆ, 53ప.

కం॥ తొగరాయతేజు చెడినన్
దగలగ రానగ్గిగాక తగ్గిన కడలిం
కగనైనగాని సత్తుహో
గలడు హరిశ్చంద్రుడెట్టులన్ గానైనన్. 1ఆ. 54ప.

ఇటుల కవిగారు హరిశ్చంద్రోపాఖ్యానమును రచించి ప్రభువునకంకితము గావించిరి.

## సారంగధరీయము :

ప్రఖ్యాతి కావ్యమగు 'సారంగధరీయము' అవధానగారి రచనలలోనుత్తమోత్తమమమైనదని చెప్పవచ్చును ఈ గ్రంథము సీతారామభూపాలుని ధర్మపత్ని

రాణి లక్ష్మీదేవమ్మగారి ఆర్థికసహాయమున ముద్రణము గావింపబడి ఆమెభర్త సీతారామభూపాలుని పేర అంకితము గావింపబడినది.[1]

ఆంధ్రవాఙ్మయములో ప్రాచీన కాలమున ద్వర్థి, త్ర్యర్థి కావ్యము లెన్నియో రచింపబడినవి. కాని ఇటీవలికాలమున నిట్టి రచన లెవ్వరు చేయుట లేదని చెప్పవచ్చును. అట్టి సమయమున త్ర్యర్థి కావ్యరచన గావించుటమేగాక అందు గర్భబంధ చిత్రకవిత్వరచన గావించుట అంత తేలికైన పని కాదు.

ఇతివృత్తము :

ఈ గ్రంథమందు సారంగధరుడైన ఈశ్వరునికథ (పార్వతీకల్యాణము), మృగాంకుడైన చంద్రునికథ (తారాశశాంకము) రాజరాజ నరేంద్రుని కుమారుడైన సారంగధరుని చరిత్రము జోడించి రచింపబడినది. అవధానిగారి గ్రంథమును ప్రబంధముగా రచించిరి.

నామౌచిత్యము :-

ప్రాచీనకవులు తమ ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములకు రాఘవ పాండవీయమని, యాదవ రాఘవ పాండవీయమని పేర్లు పెట్టుకొన్నారు. కావ్యమంతయు రెండు మూడర్థములతో వ్రాసినా గ్రంథనామము మాత్రము ఆయా అర్థములు స్ఫురించునటుల ఒకేపేరు తమ గ్రంథమునకు పెట్టినటుల కవులు తెల్పలేదు. ఈ కవిగారు ప్రతి పద్యములోను మూడర్థములు వచ్చునటుల వ్రాయగల నేర్పున్నప్పుడు ఆ నేర్పును కావ్యమునకు పేరు పెట్టుటలో మాత్ర మెందుకు ప్రదర్శింపరాదనెడి భావముతో పైన చెప్పినటుల 'శివచంద్రసారంగధరుల' పేర్లు మూడు కలిసి వచ్చునటుల 'సారంగధరీయము'ని కావ్యమునకు పేరుపెట్టి తన చాతుర్యమును ప్రకటించినారు.

ఈ గ్రంథము మొత్తము నాల్గాశ్వాసములు గలది. కథాభాగముమాత్రము ప్రథమ-చతుర్థాశ్వాసములలోనే గనుపించును. ద్వితీయ-తృతీయాశ్వాసములను కావ్యపద్ధతిలో కవిగారు వర్ణనలు పెంచి చమత్కృతి నడిపినారు. కవి తన గ్రంథము 37 పద్యమున తానే తెల్పినాడు.

1. పోకూరి కాశీపతి- సారంగధరీయము- చెన్నకేశవముద్రాక్షరశాల- గద్వాల క్రీ శ. 1933లో ముద్రితము.

తన కావ్యమును గూర్చి కాశీపతిగారు అవతారికలో నిట్లు తెల్పిరి

గీ॥ తెలుగుకావ్యంబె రచియింప బలుప్రయాస
మగును రెండర్థముల కావ్యమంతకన్న
భారమగునిక త్ర్యర్థి కావ్యము రచింప
నెంతకష్టమొ రసికులే యెఱుగగలరు.[1]

అని వ్రాసిరి నిజమునకు రెండర్థములుగల కావ్యము వ్రాయుటయే కష్టమనిన మూడర్థముల కావ్యము వ్రాయుట సర్వసామాన్యము కాదుగద! అయినను అవధానిగారు- "అతిచిత్రంబుల కాటపట్టిన మహాత్ర్యర్థి ప్రబంధంబనన్ ప్రతి పద్యంబు రసాస్పదంబగుననన్ భాసిల్లుచున్నట్టి మత్కృత సారంగధరీయ' మని (4ఆ. 128ప.) చెప్పినారు. కవి తాను చెప్పినట్లుగా ప్రతి పద్యమును రస బంధురముగా రచించెను.

రచనావిశిష్టత:

ఈ కావ్యములో కాశీపతిగారు చూపించిన చిత్రబంధకవితా చాతుర్యము తెల్పనలవి గానిది. మణిపూసగానున్న ఈ పద్యమును గాంచిన తెలియనగును. నాయికవర్ణన సందర్భమున గలదీ పద్యము.

కం॥ కుధరసమాకృతిలాభ
మ్మధికముగాగొనెగుచద్వయంబొండొండా
కుధముఖులిపులు సనినఁ గ
ట్యధర దృగంగోక్తి నాసికాస్యనఖములా.[2]

ఇందు ఆమె కుచద్వయము పర్వతమునకు సమానమైన ఆకృతిని పొందిన దనియు 'కుధరసమాకృతిలాభము' అను దానిని గుఱించి ఒక్కొక్క అక్షరము తీసివేస్తుపోతె అవి వరుసగా కటి, అధరము, దృక్కులు, శరీరము, ఉక్తి (చమత్కారము) నాసిక, ఆస్యము, నఖములు అనెడి వానితో పోల్చుటకు సరిపోవునని ఈ పద్యమందలి భావము.

---

1. కాశీపత్యవధానులు- సారంగధరీయము- 37ప.
2. ,, ,, 2ఆ. 41ప.

పోలికలు:-

కుధరసమాకృతి లాభము- పర్వతమునకు సమానమైన ఆకృతి (కుచములు) 2. ధరసమాకృతిలాభము - భూమికి సమానమైన ఆకృతి (పిరుదులు) 3. రసమాకృతిలాభము - అమృతసంపదవంటి రూపప్రాప్తిని (అధరము) 4. సమాకృతిలాభము- ఎగుడుదిగుడుగాని రూపప్రాప్తి (దృక్కులు) 5. మాకృతిలాభము- లక్ష్మీదేవివంటి ఆకారప్రాప్తి (అంగము) 6. కృతిలాభము- కావ్యరచనారూపమును అనగా చమత్కారమును (ఉక్తులు) 7. తిలాభము- నువ్వుపువ్వువంటి దీప్తిని (నాసిక) 8. లాభము- చంద్రుని (లః) వంటి కాంతిని (ఆస్యము) 9. భము- నక్షత్రాతిశయమును (నఖములు) పొందినవని భావము. ఇంత చక్కని పద్యమాంధ్రభారతికే అలంకారప్రాయము.

ప్రబంధవర్ణన-పోలికలు:-

అవధాని తన రచనను గూర్చి- పరికింపగను సుభద్రాపరిణయమును బోలు మత్కావ్యమని చెప్పినాడు. అనగా శబ్దాలంకారములతో చేమకూర వెంకటకవి రచించిన విజయవిలాసమును బోలిన వర్ణనలిందు గలవని కవి భావము. ఆ భావమును కవి 4ఆ.19పద్యమున చెప్పెను. ఈ పద్యము భాగవతము ప్రహ్లాద చరిత్ర మందారమకరందమాధుర్య' మను పద్యపోలిక గలది.

ఈ గ్రంథమందు రామరాజభూషణుని వసుచరిత్రను కాణాదం పెద్దన భద్రాపరిణయము పద్యపోలికలు 2-29ప, 2-35ప, 2-37ప, 2-43ప, 2-64ప, 4-19పద్యములలో గానుపించును.

ప్రబంధవర్ణనల విషయములో నాయికవర్ణన 2-41ప. మన్మథదూషణము 3-46ప. సూర్యాస్తమయవర్ణన 3-43ప సంధ్యాసమయవర్ణన 3-36ప. చంద్రదూషణము 3-124ప. మున్నగునవి రసబంధురముగా వర్ణించబడినవి.

నాయికవర్ణనమున కవి- ఆమె పలుకులు కోకిలకన్నను, వెంట్రుకలు తుమ్మెదలకన్నను, కన్నులు జింక కన్నులకన్నను. నడకలు ఏనుగు నడకలకన్నను సౌభాగ్యవంతమైనవని ఒక సారంగశబ్దమున చెప్పి తన ధీశక్తిని ప్రదర్శించినాడు. అట్టిదీ పద్యము.

క॥ సారంగము దూరున్నుడి
సారంగము దారుమారు నలుపుగచంబుల్
సారంగము గేరుగనుల్
సారంగము మీఱునడలఁ సౌభాగ్యంబుల్

కవిగారి గ్రంథమందు శివస్తోత్రపరమైన మూడు పద్యములు గలవు. అవి కవిగారి శివభక్తిని వ్యక్తము జేయుచున్నవి.

అచ్చతలకట్లు సర్వలఘుగీతము- ఇది సులభముగా నర్థమగును

గీ॥ నగసదన ఘనతరయశ నగరదమన
నవధవళకర ధరతత భవభయహర
ప్రమదవర యనవరత సదమదవరద
హరగరళగళభవ కనదసమనయన [1]

ఇక శివస్తోత్ర పరమగు రెండవ పద్యము. ఇది అపంచవర్గీయము అనగా క, మొదలు మ వఱకు గల ఇరువదియైదు వర్గాక్షరములు లేనట్టిదీ పద్యము. మరియు 'నిర్నాసిక' అనగా నాసికతో పలుకవలసిన అక్షరములు కూడా ఇందుండవు.

గీ॥ శర్వశైలవాస సారసారివిలాస
హారయశోవిశాల సరసశీల
సారశేషహార సర్వేశసురవీర
వృషవరాశ్వయేల వేలశీల. (2 ఆ. 126 ప.)

ఇక శివస్తోత్రపరమగు మూడవది ఓష్ఠ్య రచనగల పద్యము. అనగా కేవలము పెదవులకు తగిలే ప, ఫ, బ, భ, అను నాల్గక్షరములతో నడచినది. దీనిని 'అచల జిహ్వాల' యనికూడా అనవచ్చును.

1 పో. కాశీపతి - సారంగధరీయము 4 ఆ. 30 ప.

గీ॥ మామమామ పాపభీమమౌముప్పారి
పాపమేపుమాపి బాము(బాపి
భూమిబబ్బమబ్బ భేము మమ్మోమమి
మేముబోము భామమేమిభీమ: (2-127 ప.)

ఇటుల చిత్రకవితలో ద్వితీయ తృతీయాశ్వాసములందు తలకట్లతో కూడిన పద్యము 2 ఆ. 125 ప., శుద్ధనిరోష్ఠ్యము 2 ఆ. - 136 ప., ఏకపాది 3 ఆ. - 90 పద్యము., అపంచవర్గీయము 2 ఆ. - 126 ప.. సోష్ఠ్య రచన 2ఆ. - 127 ప., ఏకాక్షరి 2 ఆ. - 118 ప., పాదభ్రమకము (ఏ పాదమున కాపాదము క్రిందుమీదుగా చదివిన నొకేవిధముగా నుండునది.) 2-128, పద్యభ్రమకము 2-129, మున్నగు చిత్రకవితలు - ఏత్వములు 3-43 ప, గుడులు 3-44,ప, అచ్చ తలకట్ల సర్వలఘు సీసము 4-3 ప. మున్నగు పద్యములు గలవు.

గర్భకవితలు :-

కవిగారు 'సారంగధరీయ మందు గర్భకవితలను కూడ చూపెట్టినారు. అవి 'కందగీత మత్తేభగర్భిత సీసము 2-130 ప, కందద్వయ గర్భిత చంపక నాగ బంధము 2-138 ప, మ్మున్నగునవి కవిగారి చిత్ర, గర్భ కవితాసామర్థ్యములను వెల్లడిజేయుచున్నవి.

లోకోక్తులు :-

అవధానిగారు తన గ్రంథమున నచ్చటచ్చట లోకోక్తులను వాడి తనకుగల ప్రాపంచికానుభవమును చాటినారు.

'వనితల చిత్తములు దెలియవశమే ధరిత్రిన్. 4-25 ప, చెలువలేగదా సాహసికల్ 4-31 ప, సరసమగు చోట నాశ్రితుల్ బలుగుటరుదె 3-189 ప, మంచియో చెడ్డయో విచారింప వలదే 4-46 ప. నోరుండెననుచు మందినాడి పోసికొనుట 4-48 ప. ఎవరు జేసికొన్నది వారనుభవింతురు 4-49 ప, కానున్నది కాక యాగబోనే 4-42 ప, సరసమే నీకనులమంట చల్లారునకొ 4-43 ప, ఉసురు దగులుకున్నె యొరుల జెరుప 4-54 ప. మున్నగువెన్ని యోగలవు.

పూర్వకవులు రచించిన ద్వ్యర్థి త్ర్యర్థి కావ్యములలో రామరాజభూషణుడు తాను రచించిన హరిశ్చంద్ర నలోపాఖ్యానమున ప్రబంధరీతిని కొన్ని వర్ణనలు గావించియున్నాడు. మిగతావారలు కేవలము కథాభాగములను సమర్థించుకొని దాటినారు. కాశీపత్యవధానిగారు ప్రబంధరీతిని సారంగధరీయమందష్టాదశ వర్ణనలతోపాటు చిత్రకవితారీతులను చూపెట్టినారు.

పై కవులు రచించిన వానిలో కొన్ని ధ్వని ప్రధానములు, కొన్ని భావ గర్భితములు, మరికొన్ని శ్లేషయుతములైనచో నీకవిగారు పై వానినన్నింటిని దృష్టియందుంచుకొని చతుర్థాశ్వాసమందలి 126 పద్యమున కథను శిల్ప చమత్కృతి గల్గునటుల - గూర్చి కృతినిచ్చినాడ గద్వాలఱేడ యని శిల్పచమత్కృతి గల రచన 'సారంగధరీయము'ను సీతారామభూపాలున కంకితముగావించెను.

ప్రభువున కంకితమిచ్చుచు కృతజ్ఞతగ కవిగారీ పద్యమున శిల్పచమత్కృతిని తెల్పికొనిరి

గీ॥ సోమసదిన సామాఖ్యులచ్చు పడనుండు
ఎంతకాలమె యందాక యీ ప్రబంధ
దీపకుల పేరులగుట గాశీపతికవి
సోమసదిన సామాఖులచ్చు పడనుండు 32 ప.

ఇందు మొదటి నాల్గు పాదములొకటియైనను అర్థములువేరు. ఈ గ్రంథము మొదటిపాదము చంద్రనక్షత్ర సూర్యులున్నంతకాలముండుననియు, ఈ కావ్యమునచ్చువేయించిన 'సోమపదినకీర్తి' (సోమభూపాలుని కీర్తి) అంతకాలము (శాశ్వతముగా) నిలుచునని నాల్గవపాదమున తెల్పి యమకమున కవి శబ్దచమత్కృతిని చూపెట్టినాడు.

శ్రీ శౌరి శైవలీల :-

పూర్వము గద్వాలలో కాణాదం పెద్దనగారు 'శేష శైలేశలీల' యను గ్రంథమును రచించగా కాశీపతిగారు 'శ్రీ శౌరి శైవలీల'యను పేర రెండాశ్వాసముల కావ్యమును రచించినారు. పెద్దనగారు తన గ్రంథమున పంచవర్గీయముగా రచించగా నీకవిగారు పంచవర్గులనేగాక గద్యలనుకూడ పరిహరించి

'య ర ల వ శ ష స హ అ ళ' అనే పది అక్షరములను మాత్రమే గ్రహించి నీ గ్రంథమును రచించిరి. చివరికి కావ్యము పేరుకూడా పది అక్షరములలోనుంచుట ఈ కవిగారి ప్రతిభాసామర్థ్యములకు నిదర్శనమని చెప్పవచ్చును.

ఇతివృత్తము :-

దేవకీవసుదేవుల వివాహము మొదలుకొని ఉగ్రసేన పట్టాభిషేకము వరకు గలదీ కావ్యమందలి కథాభాగము.

తన కవితా వైశిష్ట్యమును గూర్చి కవిగారు-

చ॥ అరయగ నైత యేర్పడినయప్పటినుండియు యాదిగా దశా
క్షరముల కబ్బమెచ్చటనుగానము సుమ్మెవరేని జూపినన్
సొరిది నమస్కరింతు నటుజూపకయె కలదంచునీర్ష్యద
బ్బరలనుకూయు శుంఠముఖభంగము జేతు సభాంతరంబునన్ [1]

అని కవి చెప్పియున్నారు. ఇట్టి నూతన ప్రక్రియలను పూనుకొని కావ్యములు రచించిన కాశీపతిగారు ప్రశంసనీయులనుటలో సందేహము లేదు.

కావ్యపతారికలో తన కవితాశక్తినిగూర్చి ఈ పద్యమును చెప్పిరి.

సీ॥ శ్రీహరిశ్చంద్ర చరిత్రచే నొరులు గాం
చగ నోళ్ళు దెరపింతు చదువరుల ను
ప్రథుల సారంగధరీయంబుచే మూడు
త్రోవలు బట్టింతు కోవిదులను
సిద్ధయోగి చరిత్రచే గర్వభంగ మొ
నర్చి జోగుల జేతు నవరసికుల
నల 'త్రిరిశదర్ధపద్య' మణిచే లొబర్చు
కొందును ముప్పదిమంది బుధుల
సరవి నీశౌరశైశవ పీఠచే ముక్కు
బట్టి యాడింతును పండితులను

1. కాశీపత్యవధానులు- శౌరిశైశవలీల- ప. 12.
డా॥ హరిశివకుమార్ - కాశీపత్యవధానులు వ్యాసము- అక్షరార్చన పుట 201.

గీ॥ చాటువులచేత నాల్కను సాచ జేతు
నోరుమూయింతు గొన్నిట సూరిజనుల
చెతికలమిల బెట్టింతు వ్రాతగాండ్ర
మత్కవితసారమౌ హనుమంతరాయ [1]

---

పై పద్యము రెండర్థములతో కూడి యున్నది.

హరిశ్చంద్రోపాఖ్యానము వినిన పండితులాశ్చర్యపడునట్లు రచించితినని సామాన్యార్థము అది నిరోష్ఠ్యము గావున పెదవులు తగులకుండ నోరు తెరిపింతునని అంతరార్థము అటులే సారంగధరీయము చదివినవారిని తికమక పఠతులని సామాన్యార్థము. అది త్ర్యర్థి కావ్యము గావున వారిని మూడు మార్గములలో ఆలోచించునటుల జేయుదునని అంతరార్థము సిద్ధయోగి చరిత్రచే రసికులను గర్వభంగము జేయుదునని సామాన్యార్థము. అది వేదాంతగ్రంథము. అది జదివినచో రసికులు జోగులగుదురని ధ్వని 'త్రింశదర్థి పద్యరత్నము' లో ముప్పదిమంది విద్వాంసులను లోబరచుకొందుననియు, దానిని ముప్పది అర్థాలతో పండితుల మన్ననలను పొందుదురని ధ్వని. ఈ శౌరిశైశవలీలచేత పండితులను ముక్కుబట్టి ఆడింతునని సామాన్యార్థముకాగా దానిని నాసికమూసి చదువవచ్చును కావున ముక్కుమూయించి చదివింతునని ధ్వని. చాటువులచేత పండితులనాశ్చర్యపడు నట్లు జేయుదుననియు, సోష్ఠ్యములు లేదా అచల జిహ్వాలచే చాటువులుచెప్పి నాలుకజాపి వానిని చదివింతునని ధ్వని కొన్నిపద్యములచే విద్వాంసులమ నోరెత్తకుండ జేయుదు నని అర్థముకాగా ఏకాక్షరులచే పద్యములు జెప్పి నోరుమూసికొని కూడా చదివింతునని ధ్వని. తనతో పోటీపడు వ్రాతగాండ్రను కలాన్ని భూమిపై పడవేయునట్లు జేయుదునని అర్థముకాగా వారు తన కవన వేగమునందుకొనకుండ ఆశువుగా గంటకు నూరు పద్యములు జెప్పి ఓడింతునని తన కవనచాతుర్యమును చెప్పినాడీకవి.

---

ఈ శౌరిశైశవలీలలో కవిగారు సోష్ఠ్యములు, నిరోష్ఠ్యములవంటి పద్యములు వ్రాసి తన చిత్రకవితానైపుణ్యమును చూపెట్టినారు. నిరోష్ఠ్యముగా రచించిన ఈ కావ్యమందలి పద్యమిటులున్నది.

---

1 ఈ పద్యము కాశీపతిగారు తన 'త్రింశదర్థ పద్యరత్నము'ను కృతిపొందినవాడు భాషాభిమాని కర్నూలుజిల్లా ముద్దునూరు వాస్తవ్యులు కాశీపతిగారికి కనకాభిషేకము గావించినట్టి హన్మంతరెడ్డిగారిని సంబోధిస్తూ వ్రాసినదీపద్యము.
శౌరిశైశవలీల - అవతారిక 13 ప.

గీ॥ శేషశాయి శౌరి శ్రీలోల యసురారి
సరససూరి హేల హారిసుశీల
హారిసార హాస యరిశయానోల్లాస
రాగయేల రస సరాళలీల.

ఈ పద్యము అవధాని గారి రచనా సౌలభ్యాన్ని భక్తిపారవశ్యము మవ్యక్తముచేయుచు సాగిన రచనయని చెప్పవచ్చును.

త్రింశదర్థ పద్యరత్నము :-

కాశీపత్యవధానులు ముప్పది అర్థములను తెల్పునట్టి పద్యమును రచించి ఆంధ్రభాషలో (వాఙ్మయమున) తన ప్రతిభాసామర్థ్యమును చూపెట్టినాడు. అదియే ఈ త్రింశదర్థ పద్యరత్నము.

గీ॥ భూరిజఠరగురుడు నీరజాంబక సూతి
మహిత కరుడహీన మణికలాపు
డనఘు సద్గణేశు డగ్రగోపుడు మహా
మర్త్యసింహు డేలు మనల నెపుడు [1]

ఇట్టి త్రింశదర్థ పద్యరత్నము కృతినొందిన సాహిత్యాభిమానులగు మద్దునూరి హన్మంతరెడ్డి గారు అవధానిగారికి కనకాభిషేకముగావించి సత్కరించిరి.

---

పై త్రింశదర్థ పద్యరత్నములో - గణపతి శివుడు బ్రహ్మ విష్ణువు ఇంద్రుడు అగ్ని యముడు నిరృతి వరుణుడు వాయువు కుబేరుడు అష్టదిక్పాలకులు నవగ్రహములు సూర్యుడు చంద్రుడు సముద్రుడు మేఘుడు హిమవంతుడు ఆదిశేషుడు గరుడుడు గజేంద్రుడు అంజనేయుడు నందీశ్వరుడు వీరభద్రుడు కుమారస్వామి మన్మధుడు నారదుడు దత్తాత్రేయుడు విశ్వకర్మ వీరబ్రహ్మంగారను ముప్పదిమంది దేవతలను స్తుతించి తమను రక్షించమని ప్రార్థించుట ఈ పద్యమందలి భావము.

---

1 పోకూరి కాశీపత్యవధానులు - త్రింశదర్థ పద్యరత్నము
డా॥ హరిశివకుమార్ - అక్షరార్చనవుట 202.
(డా॥ పాడిబండ మాధవశర్మగారి షష్టిపూర్తి సంచిక.)

## సిద్ధయోగి చరిత్రము.

కాశీపత్యవధానులుగారు రచించిన సిద్ధయోగిచరిత్రము, అయిదాశ్వాసములు గల గ్రంథము ఇది వీరబ్రహ్మంగారి జీవిత చరిత్రను దెల్పునట్టి వేదాంత పరమైన గ్రంథము. భాగవతమునందెన్ని విధములైన పద్యపోకడలు రచింపబడినవో అన్ని విధములైన పద్యములతో రచింపబడినట్టిదీ గ్రంథము. ఇందు తారక సాంఖ్యఅమనస్కాది యోగములున్నవి

ఇది వేదాంతగ్రంథమగుటవలన శృంగారమునకిందు తావులేదు. అయినను సిద్దయ్య వివాహఘట్టములో సిద్దయ్య భార్య అచ్చాంబిదేవి తనను వివాహమాడుమని చెలికత్తెను సిద్దయ్య వద్దకు పంపినపుడు కథను కొంత మార్చి అచ్చాంబీదేవి సౌందర్యమును చేటికతో సిద్దయ్యకు చెప్పించినపుడు కొంతవరకు శృంగారమును చూపెట్టెను. అట్టిదీ పద్యము.

కం॥ అచ్చాంబీ పిరుదులకెన
అచ్చాంబీ పిరుదులె యననౌనయారె
అచ్చాంబీ మధ్యమునకు
అచ్చాంభీ మధ్యమెసమమననౌనౌరె.[1]

ఈ పద్యమున కవి అనన్వయాలంకారము చూపెట్టుటతోపాటు అచ్చాంబీ, శబ్దమును చమత్కరించుట జరిగినది.

అ + చాం + బి, అను అక్షరములలోగల అడుగుభాగములెట్లున్నవో ఆమె పిరుదులటులున్నవనియు, 'చాంబి' యను రెండక్షరముల మధ్యము (సున్న) అనగా నడుము కనిపించనటులున్నదని (పద్మినీజాతిస్త్రీ నడుము కనబడనటులున్నదని భావన) సామాన్యులకు అర్థము చెప్పిననేగాని కవిగారి రచనలో నున్న చమత్కారమర్థముగాదు.

ఈ గ్రంథమందలి 5ఆ- 61 పద్యములో- ఆమె ముఖ సౌందర్యమునకు కవి చక్కని రూపకల్పన గావించినాడు. బ్రహ్మదేవుడు అచ్చాంబీ నుదుటితో సమానముగా చేయుదమని పాడ్యమినాటి చంద్రుని గ్రహించి అది పొసగక

---

1. పో. కాశీపత్యవధానులు- సిద్ధయోగి చరిత్రము 5ఆ. 60ప.

పున్నమనాటి చంద్రుని గ్రహించినాడు. ఆనాటి చంద్రుడుకూడ ఆమె నుదుటికి సరిపోలడయ్యెను. ఎటులైనను కొంత తగ్గించి చేయవలెనని పట్టుదలతో తగ్గించుచు మరల చెడగొట్టి పెంచుచు చంద్రుని ఆమె ముఖమును బోలునట్లుగా జేయుచునేయున్నాడట అనగా చంద్రుడు తగ్గుట వృద్ధిపొందుట సహజము. అట్టి వస్తువును గ్రహించి తన కవితాచాతుర్యముచే నుత్ప్రేక్షించి చెప్పుట అవధానిగారి భావనాబలమునకు రూపకల్పనకు రచనాచమత్కృతికి నిదర్శనమని తెల్పవచ్చును.

కవితాచమత్కృతి :

కవిగారి కవితాచమత్కృతిని గూర్చి తెలిసికొందము. అచ్చాంబిదేవి సిద్దయ్యను వివాహము జేసికొన నిశ్చయించినదను మాటను 5 ఆశ్వాసము 62 పద్యమున కాశీపతిగారు తన కవితాచమత్కృతిని జ్యోతిషమునందు తనకుగల శక్తిని నిరూపించుకొనెను.

పద్యమందలి భావమిటులున్నది- ఈ పద్యమందు కవిగారు పన్నెండు రాసులనాధారముగా గ్రహించి చమత్కరించినాడు అచ్చాంబి ఉన్న గ్రామము చాలా పెద్దది అందులోని స్త్రీలు చాలా సౌందర్యవంతులు. ఆమె ఉన్న వీధికి పైవీధిలో నున్న స్త్రీలను మిక్కిలి అందమైనవారె అచ్చాంబి కన్య కావున కన్యారాశినుండి లెక్కవేసికొన్నచో ఆయా రాసులను జయించిన సౌందర్యముగలదని అన్వయించుకొనవచ్చును.

మొదటి ఇంటిలోని (కన్యను) సిగ్గుపడునట్లు గావించినది. మూడవ యింటి దానిని (ధనస్సు) తన కనుబొమ్మలచే నోడించినది. నాల్గవయింటి స్త్రీని (మకరము) తన జంఘలచే (తొడలు) సరితూగజాలక గుల్లజేసినది. ఐదవయిల్లైన (కుంభము) స్త్రీని తన స్తనములచే వెలతిపడునట్లు గావించినది. ఆరవ యింటి ఆమెను (మీనము) తన కన్నులతో సరితూగజాలక నీటిలో కలిసిపోవునట్లు గావించినది. పదునొకండవయింటి ఆమెను (సింహాన్ని) తన నౌనుచే నోరు తెరిపించినది మిగతా రాశులు తన సౌయుగమునకు సరితూగజాలవని వదలి ఒక్క తొమ్మిదవ యింటి స్త్రీని మిథునము) జయించజాలక - జయించవలెనను పట్టుదలతో సిద్ధయ్యను వివాహమాడుటకు నిశ్చయించుకొన్నదని కవి చమత్కరించినాడు. కవిగారి రచనలింకను అముద్రితములుగానే ఉన్నవి.

# గాడేపల్లి వీరరాఘవశాస్త్రి :

గద్వాల ప్రభువగు సీతారామభూపాలుని కాలమున గద్వాల సంస్థానమును దర్శించి ఆస్థానకవిగా వెలసిన వారిలో శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రి గారొకరు.

## జన్మస్థలము - తల్లిదండ్రులు :-

శ్రీ శాస్త్రిగారి జన్మస్థలము కర్నూలు జిల్లా మార్కాపురం తాలూకా లోని 'ఎఱ్ఱగొండ పాలెము'ను గ్రామము వీరి జననము క్రీ॥ శ॥ 30-4-1891. మరణము 1945. తల్లిదండ్రులు సుబ్బమ్మ శివరామదీక్షితులు గారు. వీరిది పండిత వంశము. జ్యేష్ఠ సోదరులు పెదకోటావధానులుగారు.

గా. వీరరాఘవయ్య ఉపనయనమైన తర్వాత తన పదకొండవ ఏటనే తండ్రి గారి వద్ద స్మార్త భాగములో షోడశకర్మలను, సంహితలో కొంతవరకు, పదము క్రమము, అరుణము, ఉపనిషత్పంచకము కొంతవరకు శ్రౌత భాగమునుకూడ నేర్చుకొనెను.[1]

అనంతరము రాఘవయ్య బ్రహ్మశ్రీ మేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రి (స్వగ్రామమందు) గారి యొద్ద కావ్యపాదమునారంభించి తర్వాత మారెడ్డివారి పల్లె (నెల్లూరు జిల్లా దర్శి తాలూకా) గ్రామనివాసి శ్రీ భాగవతుల నృసింహ శాస్త్రిగారి వద్ద కావ్య నాటకాలంకార సాహిత్య గ్రంథములను పూర్తిగావించుకొనిరి. క్రీ॥ శ॥ 1916 లో గాడెపల్లివారు ప్రప్రథమమున దొనకొండ గ్రామమున తన కావ్యగురువులగు శ్రీ మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి అధ్యక్షతలో వీరరాఘవశాస్త్రి శతావధానముగావించి గురువుగారి యాశీస్సులను పొందిరి.[2]

శాస్త్రిగారు తన తండ్రి మరణానంతరము తన ఇరువది యొకటవ సంవత్సరమునుండి సంసారబాధ్యతను వహించినవారై అనేక స్థలములలో నవధానములు - ఆశుకవితాప్రదర్శనములు - ఘంటాశతకల్పనలు గావించుచు క్రీ॥ శ॥ 1913 లో గద్వాలకు విచ్చేసిరి.

---

1. గాడెపల్లి - మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి- కవితావిలాసము- బాల్యము- విద్యాభ్యాసము-పుట 15.
2. గాడెపల్లి వారి-చమత్కార కవిత్వము. పుట 11.

గద్వాలలో శాస్త్రిగారు:

శ్రీ శాస్త్రిగారు దైవనందిన్నె- ఆదవేని- పార్లపల్లె- మట్టీడు- మంచాల మున్నగు గ్రామములలో అవధానములు గావించుచు మంత్రాలయమునకు విచ్చేసి మధ్వస్వాములవారిని దర్శించిరి. అచ్చటికి గద్వాల సంస్థాన విద్వాంసులగు శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యులుగారు వచ్చియుండిరి. ఆచార్యులు శ్రీ శాస్త్రిగారి ఆశుకవితా ప్రదర్శనమునకు సంతోషించి విద్వత్ప్రభువులగు రాజా సీతారామభూపాలుని దర్శించ గద్వాలకు రావలసినదని శాస్త్రిగారిని కోరిరి.

శాస్త్రిగారు అదే సంవత్సరము (1913) గద్వాలకు విచ్చేసి రాజుగారిని గూర్చి ఆశువుగా నీ పద్యము చెప్పిరి.

చ॥ కవనము సాహితీపటిమగల్గియు వేదములందు కొద్దిగా
దవిలిపరిశ్రమంబు నవధానమొనర్చెడి రీతినేర్చి స
త్కవిజనకల్పభూజులని ఖ్యాతినిగాంచిన మిమ్ముజూడను
త్సవమునవచ్చినాడను యథార్థముసుమ్ము నృపాలశేఖరా [1]

అని శ్రీ సీతారామాభూపాలుని గూర్చి పద్యముచెప్పి రాజుగారి ప్రేమకు పాత్రులైరి. క్రీ॥శ॥ 1914 మాఘ పూర్ణిమకు శ్రీ శాస్త్రిగారు గద్వాల సభకు విచ్చేయగా నాసభలో శాస్త్రిగారికిచ్చిన సమస్యలిటులున్నవి.

'ఇంకన్ కస్తూరిబొట్టు పెట్టకుము తన్వీఫాలభాగంబునన్'
'శూకాగ్రంబున భాసిలెన్ శుభజలస్తోమంబు కాసారమున్'
'దారములేని హారము నుదారత నీకెవరిచ్చిరమ్మరో'

పై మూడు సమస్యలను పూరించుటలో నవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు- కాంతా! నీ శరీరమిప్పటికే వియోగానల జ్వాలాతప్తమై యుండగా నీవిపుడు కస్తూరి బొట్టుపెట్టినచో మఱింత యుష్ణాధిక్యమగును గాన 'ఇంకన్ కస్తూరిబొట్టు పెట్టకుమని పూరించుటయు దానినే గాడేపల్లి వారు పూరించి చెప్పినదీపద్యము.

1. గా. వీరరాఘవశాస్త్రి- చమత్కార కవిత్వము పుట 24.

శా॥ అంకంబించుక దాల్చునంచుగడు కార్శ్యంబందునంచుంగ దా
పంకేజారిని జూడరోసితిమి దీవ్యత్వన్ముఖాంభోజ మం
దంకంబేమియులేదు కార్శ్యమనగాదద్దానిపై నేల! నీ
వింకన్ కస్తురిబొట్టు వెట్టకుము తన్వీఫాలభాగంబునన్ 1

ఇటుల శాస్త్రిగారు మిగిలిన రెండు సమస్యలనుకూడా పూరించిచెప్పిరి. శాస్త్రిగారు గద్వాల విద్వత్పరీక్షలలోను, కల్పలాచమత్కృతిలోను, ఆశుకవితా ప్రదర్శనము నందును మిన్నయనిపించుకొని ప్రభువగు శ్రీ సీతారామభూపాలుని ప్రేమకు పాత్రులై వారికోరికపై ఆస్థానకవి పదవినలంకరించి గద్వాలలో నిలిచి పోవుట తటస్థించినది.

అవధాన దక్షత :-

శ్రీ శాస్త్రిగారు తన అవధానమునందు తనకు పరిపూర్ణమైన నమ్మకము గలదను భావము గలవారు. గద్వాలలో తన రెండవ అవధానము గావించు సమయమున తాను చెప్పిన పద్యమెవరో వ్రాసినదని ఆక్షేపణ రాగా శాస్త్రి గారాశువుగా చెప్పినదీపద్యము.

ఉ॥ ధారణదప్పకుండ నవధానమొనర్చిన రాఘవున్నుర
స్కారముజేసి ప్రాజ్ఞులె ప్రశంసలొనర్పనెవండొ తా దిర
స్కారము జేసెనంట, యటుచాటున నేమిటి? కింతమందిలో
జేరుకొనంగ రాదేయిట వీరుడు రాఘవుడేమి భీరుడో!

యని తిరపతి వేంకటకవులు 'దోసమటంచెరిగియు, అని పద్యము చెప్పి సవాలు జేసినటుల, శాస్త్రిగారు సవాలు జేసినారు శాస్త్రిగారికి ధనకాంక్ష కన్నను అవధానములవలన కీర్తిగాంచవలెననెడి కోరిక, పెద్దల యాశీస్సు లందు కొనవలెననెడి ఆకాంక్ష తనకున్నటుల చెప్పినదీపద్యము.

---

1 గా. వీం రాఘవశాస్త్రి- చమత్కార కవిత్వం- పుట 24-25.

చం॥ ధనమున కాసజేయక బుధప్రకటస్తవనీయమైన కీ
ర్తిని గొనగాదలంచి యరుదెంచినవాడను గాననో జగ
జ్జనని! భవత్కృపారస మొసంగి మనోజ్ఞ కవిత్వకల్పనా
ద్యనుపమ కౌశలంబులిడుటర్హము కీర్తికరంబు శాంకరీ 1

హాస్యప్రియుడు :-

శ్రీ శాస్త్రిగారాజానుబాహులు. పేరునకు తగినటుల వీరత్వముగలవారు. తన మొదటి భార్య గతించగా 1926 లో మరల కన్యాన్వేషణమునకై చిత్తూరు జిల్లాలో నొక గ్రామమునకు వెళ్ళిరి. ఆ కన్యక శాస్త్రిగారిని చూచి- ఇతడు చాలా పొడువుగానున్నాడె, అన్నదట. శాస్త్రిగారు కొన్ని పద్యములు వ్రాసి ఆ కన్యకు పంపినదానిలోని దీపద్యము.

కం॥ పొడువనిన నిజమె, విద్యకు
పొడువే, కీర్తికిని పొడవె బుద్ధికి పొడవే
పొడవే విత్తమునకు నిక
దొడవులకును బొడవే మానుదువో పూనుదువో.

(గా. కవితావిలాసము)

శాస్త్రిగారి రచనలు-సమస్యలు-అవధానములు :-

శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు వందకుపైగా నవధానములు చేసిరి. ఇరువది అయిదుకు మించి గ్రంథములను రచించిరి. ఇందు శాస్త్రిగారు గద్వాల ప్రభువులకు కృతులిచ్చిన వానిని గూర్చియే వివరించుట జరిగినది.

గాడేపల్లి వారి కృతులలో 'చమత్కారకవిత్వము' ముద్రితము 2. ఇందు శాస్త్రిగారి జీవితవిశేషములు - అవధానములు - శాస్త్రిగారికి గద్వాలకుగల సంబంధము - ఆస్థానపదవి - అధ్యాపకవృత్తి - చమత్కారకవితా విశేషములు- సమస్యపూరణములు మున్నగునవి వివరించబడినవి.

1 గా. వీరరాఘవశాస్త్రి కవితా విలాసము - దేవి ప్రార్థన పద్యము.

2 చమత్కార కవిత్వము - కృష్ణాప్రెస్ - మద్రాసు 1949 లో ప్రథమ ముద్రణము. వెల: రూ 1-50 పైసలు.

ఈ గ్రంథమును కొంత మార్పుగావించి శ్రీ మద్దులపల్లి సుబ్రహ్మణ్యశాస్త్రి (నంద్యాల) గాడేపల్లి వారి కవితావిలాసమను పేరుతో ద్వితీయ ముద్రణము గావించినారు. 1

శ్రీ శాస్త్రిగారు ప్రభువగు సీతారామభూపాలునకు పుత్రోదయమగునట్లా శ్వదించుడని ప్రభువు కోరగా చెప్పినట్టిదీపద్యము.

మ॥ గణనాతీత కవీశపద్మపటలీ కంజాప్తుడాశ్రతురా
ఘ్రన దోర్వీర్యమ ధేభకుంభ విదళత్కంఠీరవుండాశ్రితా
వనదీక్షన్ వహించునీకు ద్వరతో వంశంబు పేర్మిల్వగా
తనయుండై జనియించునిక్కమిది సీతారామభూపాలకా 2

సమస్య - శాస్త్రిగారి పూరణము :-

'నాసాపుటభాగధేయ నశ్వపుకాయా! (సమస్య) శాస్త్రి గారి సమస్య పూరణము.

కం॥ శ్రీసుందరతర పృథుకీ
లాసంభృత లికుచసదృశ లక్షణకుచరూ
పా! సర్వరసిక పుంగన
నాసాకృత భాగధేయ నస్యపుకాయా!

సూర్యాంజనేయ స్తుతి :-

గాడేపల్లి వారి రచనలో సూర్యాంజనేయ స్తుతి యను గ్రంథము ముద్రితము. 3 ఇందు శాస్త్రిగారు సూర్యస్తుతిని చంపకాది చతుష్టయములోను, దండకమందును, ఆంజనేయస్తుతి సీసపద్యములు మరియు దండకమునందును కవి రచన గావించినాడు.

గ్రంధారంభమున కవి శారదను స్తుతించినాడు.

---

1 మ. సుబ్రహ్మణ్యశాస్త్రి - గాడెపల్లి వారి కవితావిలాసము - వావిళ్ళ ప్రెస్ మద్రాసు - 1972 లో ద్వితీయ ముద్రణము.

2 గాడెపల్లి వారి - చమత్కారకవిత్వం - పుట 24.

3 చెన్నకేశవ ముద్రణాలయము. గద్వాల

గీ॥ గ్రంథమన నేమి? ఖిల్ల గావలయుదె
కాకనిలచునె నేదైన ఘటిక కొకటి
నీదయారసమొక్కింత నిలుపుమఖిల
సత్కవిజనానలంబ శ్రీ శారదాంబ.[1]

శాస్త్రిగారి గ్రంథమున సూర్యప్రార్థనలో తన నిత్యనైమిత్తిక కర్మలను గూర్చి స్వామితో విన్నవించిన తీరును వ్రాసినాడు. దండకమున అఖండ సమాసములతో కూడిన సంస్కృత పదజాలము నుపయోగించినాడు,

సర్వ వరలక్ష్మీ ధ్రువ చరిత్రము :-

గాడేపల్లి వారి గ్రంథమును రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి కోరికపై రచించి గతించిన ఆమె కూతురు యువరాజ్ఞి వరలక్ష్మీదేవి కంకితము గావించినారు.[2]

కథావస్తువు :-

ధ్రువచరిత్రమున సురుచి ధ్రువునియుల్లసమాడుట - సునీతి తన పుత్రుని దుర్గతికి విలపించుట - నారదుడు ధ్రువుని మనఃపరీక్ష గావించి తపశ్చర్యకొఱకు ప్రోత్సహించుట - తపశ్చర్యానంతరము ధ్రువుడు తిరిగి వచ్చి తల్లిదండ్రుల మనః ప్రీతి గావించుట - రాజ్యాభిషేకము - తమ్ముడగు నుత్తముని యక్షులు బద్ధుని గావించగా ధ్రువుడు వారితో యుద్ధమొనర్చుట. అతని శక్తిసామర్థ్యములను గాంచి యక్షుడు ప్రశంసించి- 'కుమారా నీ మనఃప్రవృత్తి పరీక్షార్థమునిట్లు కల్పించితిమి. అక్షయగాత్రుడగు నీ సోదరుడిదిగో' యని ఉత్తముని తిరిగి ప్రసాదించుట మున్నగువానిని శాస్త్రిగారు రసస్ఫోరకముగను మంగళాంతముగను రచించినారు.

కవితా గీతి :-

ఈ ధ్రువచరిత్రమున శాస్త్రిగారు రచన సరళముగను, అర్థాలంకారములతో కూడిన కవిత గావించినారు ఇందు లోకోక్తులను ఆయా సందర్భములలో కవి వాడినాడు - 'అద్దిరే ధ్రువుని జ్ఞానమడుగవలెనె', 'పూవునకు దావి

1 గా. వీరరాఘవశాస్త్రి - సూర్యాంజనేయస్తుతి - మొదటి పద్యము.
2 గా. వీరరాఘవకవి - ధ్రువచరిత్రము. చంద్రికా ముద్రాక్షరశాల గుంటూరు. 1941 లో ముద్రణము మూల్యము. రు. 3-00.

సహజమై పొసగుటరుదె, బతిరొవకుడైన సవతినిబట్టవశమే, ఇల్లలికినంతనే పండుగె, శివునియాజ్ఞలేక జీమైనగదలదు. ఇట్టివిగ్రంథమందు గనుపించును.

ఈ గ్రంథమందలి శాస్త్రిగారి కవితా రీతినరయుటకీపద్యము జూడదగును.

కం॥ జనకోత్సంగము నెక్కగ
మనమున దలపోయుదేని మరి నాగర్భం
బున బొడమ జేయ భగవం
తుని గొలువుము పొందగలవు ధ్రువమిదివత్సా [1]

సహజపాండిత్య సంపదగల వీరరాఘవశాస్త్రి రచనలనుగాంచి కవి పండితు లెందరో శాస్త్రిగారిని ప్రశంసించిరి. [2]

శ్రీ వరలక్ష్మనంబా రాజ్ఞీ స్మృతి :-

గాడేపల్లి వారు వరలక్ష్మనంబా రాజ్ఞీ స్మృతి యను గ్రంథమును రచించి ముద్రణముగావించిరి.[3]

ప్రభువగు సీతారామభూపాలుని యనంతరము అతని భార్య రాణి ఆది లక్ష్మిదేవమ్మగారు రాజ్యపాలనము గావించిరి. ఆమెకిరువురు కుమార్తెలు. పెద్ద కూతురు లక్ష్మిదేవమ్మ - ఈమెను పాపన్నపేట సంస్థాన ప్రభువగు రామచంద్రా రెడ్డి గారికిచ్చి వివాహము గావించిరి. చిన్న కూతురు సత్యవరలక్ష్మి దేవి. ఈమెను దోమకొండ సంస్థాన ప్రభువగు రాజా సోమేశ్వరరావు గారికిచ్చి వివాహము గావించిరి. ఈ సత్యవరలక్ష్మిదేవమ్మ తన 22వ ఏట అకాలమరణము నొందెను. ఈమె పేరిట ఈ గ్రంథమంకితము గావింపబడినది.

భార్య యెడబాటును సహింపజాలక బాధజెందుచున్న రాజా సోమేశ్వర రావు (దోమకొండ) గారినోదార్చుటకై వ్రాసినదీ పద్యము.

---

1 గాడెపల్లి వార - సత్యవరలక్ష్మిధ్రువ చరిత్రము - ప. 33.

2 ,, కవితావిలాసము - ప్రశంసలు - పుట 70-73.

3 వరలక్ష్మనంబారాజ్ఞిస్మృతి- ప. 22, చంద్రికాముద్రణాలయము- గుంటూరు క్రీ॥శ॥ 1941 లో ముద్రణము - వెల రు. 1-50.

మ॥ అనుసంవత్సరముత్త మోత్తమ కవీశా వ్యాహతాశీ[ర్వజం
బును మౌళిం ధరియించురాజసుత శ్రీ బుచ్చమ్మ దొర్సాని పా
వన దేహంబునుదాల్పు దచ్చరిత సౌవర్ణాక్షరావాప్తి తే
ఖనితో [వ్రాయకనాకు దప్పదని భక్తిన్ [వ్రాయుదున్ తల్లిరో[1]

అటులే 'తీరెరుణానుబంధము' ప. 34, మున్నగునవి కరుణరస స్ఫోరకములు.

## భగవద్గీత (ఆంధ్రద్విపద):-

గాడేపల్లి వారు 'భగవద్గీత'ను ద్విపదలో నాంధ్రానువాదము గావించి ముద్రించిరి[2] శాస్త్రిగారీ గ్రంథమును విశ్వరూపసందర్శనముతో ప్రారంభించి సులభముగా నర్థమగునటుల ద్విపదలో ననువాదము గావించిరి.

అనువాదరీతి:

అనువాదవిషయమున శాస్త్రిగారు భగవద్గీతను సులభశైలిలో ననువాదము గావించినారు.

మూలము :

శ్లో॥ దేహినిత్యమవధ్యోయం దేహేసర్వస్య భారత
తస్మాత్సర్వాణిభూతాని నత్వంశోచితుమర్హసి॥[3]

శాస్త్రిగారి అనువాదము:

'చంపువారెవ్వరు చచ్చువారెవరు
కంపించుచుంటి వక్కటికంబుదాల్చి
దేహిచావందు సందేహమే లేదు
దేహముల్వీడుచుచు దిరుగుచునుండు'[4]

---

1. వంటత్మనంబారాజ్ఞీస్మృతి ప 22- చంద్రికా ముద్రణాలయము గుంటూరు- క్రీ.శ. 1941లో ముద్రణము వెల రు. 1-50.
2. గాడెపల్లి వారి భగవద్గీత ద్విపద- చెన్నకేశవ ముద్రణాలయము- గద్వాల- 1941లో ముద్రణము. వెల రు. 1-50.
3. భగవద్గీత సాంఖ్యయోగము- శ్లో. 30.
4. గాడెపల్లి వారి- భగవద్గీతా సంగ్రహము- పుట 64.

అనిచెప్పి 'గనుక లేతెమ్ము సంగరమొనరింప' యని శ్రీకృష్ణుడర్జునునితో చేయునదంతయు తనవలననే జరుగునని తెల్పెను.

చివరిదశలో సంస్థానమందు కొంత మార్పురాగా శాస్త్రిగారి గ్రంథమును పామరజనులకర్థమగునటుల వ్రాసితినని గ్రంథమందు తెలియజేసెను.

శాస్త్రిగారి ముద్రిత గ్రంథములు :

1. అహోబిలమహాత్మ్యము - 1919.
2. త్రిపురాంతక స్థలమహాత్మ్యము - 1933.
3. మార్కండేయ చరిత్రము } 1914
4. రామభూపాల శతకము } 1914
5. దీనకల్పద్రుమ శతకము - 1916.
6. విశ్వేశ్వర శతకము - 1917.
7. సోమేశ్వర శతకము - 1919.
8. భగవద్గీతార్థ సంగ్రహము - 1941.
9. పింగళ
10. సత్యవరలక్ష్మీదృవ చరిత్రము -1941.

## చివరిదశ :-

కవులు - లభించిన గ్రంథములు :

గద్వాల సస్థాన సభలకు విచ్చేసి తమ రచనలను సభాముఖమున వినిపించి పరీక్షవుల ఆర్థికసహాయమున తమ గ్రందములను ముద్రణము గావించుకొన్న కవులు లేకపోలేదు. అట్టి గ్రంథములు కొన్ని గద్వాల తాళపత్ర గ్రంథాలయమునందు లభించినవి. వానిని క్లుప్తముగా వివరించు ధర్మము. అట్టి కవులలో మధిలికృష్ణప్పకవి యొకరు.

మధిలికృష్ణప్పకవి :

ఈ కవి జన్మస్థలము కర్నూలుజిల్లా యందలి 'కప్పట్రాళ్ళ' అను గ్రామము వీరు భట్టుకులజులు. ప్రతి సంవత్సరము గద్వాల మాఘమాసోత్సవ సభలకు విచ్చేసినవారిలో వీరొకరు. వీరు క్రీ. శ 1870 ప్రాంతమువారని గద్వాల

గీర్వాణాంధ్రపండితులగు వేంకట కృష్ణమాచార్యులు తమ యభిప్రాయము తెలియజేసిరి.[1] ఈ కవి శ్రీకృష్ణ శతకమును రచించెను. ఇది ప్రభువుల ఆర్థిక సహాయమున ముద్రణము గావింపబడినది.[2] ఇతని రచననుబట్టి చూడగా నీకవి కవిత్వము కదళీపాక విలసితమని తెలియుచున్నది.

ఈ శతకమునందు మొత్తము 119 పద్యములు గలవు. 'శౌరి హరికృష్ణా కృష్ణాకృష్ణానా' యను మకుటముతో నీ పద్యములు గలవు. కవి తన ఇలవేల్పగు నరసింహస్వామికీశతకమంకితము గావించెను కవి పద్యములను దీర్ఘసమాసములతోడను శబ్దాలంకారములతోడను ద్వి, త్రి ప్రాసలతోడను రచన గావించినాడు.

ఈ శతకమందలి మొదటి పద్యమిట్లున్నది-

శా॥ శ్రీలక్ష్మీరమణీయవక్షునతధాత్రీభృత్సుతాలోల నా
పాలబ్రహ్మముఖారవిందఘననా ప్రాంచద్దయాలోల నా
నాలోకస్తుతశౌర్య రక్షువికసన్నవ్యావదాతస్ఫుర
న్నాళీకచ్ఛదనాక్ష శౌరి హరికృష్ణా కృష్ణకృష్ణానా!

చివరి పద్యము-

మ॥ గిరిజేశప్రణుత ప్రభావమధలీకృష్ణ ప్రధానోక్త సుం
దరవర్ణాన్విత మంగళప్రదలసన్నానారస శ్రీసము
త్కర రంగచ్ఛుభవాక్సుమార్చితసముద్రత్పాదరాజీవ శ్రీ
నరసింహాకృతిదేవ శౌరి హరికృష్ణాకృష్ణ కృష్ణానా.

కప్పటాళ్ళ కేశవ శతకము :

మధిరకృష్ణకవిగారి రెండవకృతి కప్పటాళ్ళ కేశవశతకము. ఈ శతకము ముద్రితము[3] రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు గద్వాల తాళపత్రప్రతులలో లభించగా కవులచే పరిష్కరింపజేసి తమ సంస్థానమందు ముద్రణము గావించిరి.

---

1. వేంకటకృష్ణమాచార్యులు- శ్రీకృష్ణ శతకము- పీఠిక. 2-3 పుటలు.
2. మధిలికృష్ణకవి- శ్రీకృష్ణ శతకము- లక్ష్మీప్రెస్ గద్వాల- 1930లో ముద్రితము.
3. మధిలికృష్ణకవి- కప్పటాళ్ళ శతకము- లక్ష్మీప్రెస్ గద్వాల- 1930లో ముద్రితము.

ఈ శతకము 'కష్టప్రాళ్యాధిప చేన్న కేశవహరీబ్రహ్మోద్యమర్త్యాదరీ' అను మకుటముతో రచింపబడినది. ఇందలి పదనొకండవ పద్యమున కవి తాను జడుడను, మూఢుఢనని చెప్పికొని యహంకారమును వీడి వినయము నలవరచుకొని, భగవంతుని ప్రార్థించినటుల వ్రాసినాడు.

కవి తన శతకమును 'ట్ర' యను దుష్కరప్రాసముతో రచన గావించెను. కవి రచనాసామర్థ్యము నరయుటకీ రెండు పద్యములిటులున్నవి.

మొదటి పద్యము-

శా॥ వట్రిలోన్నగ వెడంద కన్నుగవచెల్వంబుల్సదా వెన్నెలల్
దొట్రిల్లోమలరారుచుండగటి నెంతో వింతగా జాళువా
దట్రాజిల్లగనుల్లసిల్లునినునే దల్తున్మనంబందు గ
ప్పట్రాళ్యాధిప చెన్న కేశవహరీబ్రహ్మోద్యమర్త్యాదరీ. ప. 1

చివరి పద్యము-

శా॥ ఖట్రాజుల్ విబుధుల్కవీంద్రులనుతింపన్ శ్రీహరీ నీదుపే
రిట్రాజిల్ల తగ బ్రచించి మధిలీకృష్ణప్పయర్పించె మీ
కీట్రాప్రాసముతో బొసంగుశతకంబింపొందనై కొమ్మ కొ
ప్పట్రాళ్యాధిప చేన్న కేశవహరీ బ్రహ్మోద్యమర్త్యాదరీ! ప. 100

ఈ కవి తన శతకమును తన గ్రామ యిలవేల్పగు చెన్నకేశవునిపై రచించి స్వామికి నంకితము జేసి ధన్యుడైనాడు. కవిగారి యితర గ్రంధములు లభించలేదు.

<u>చెమికల చెన్నారెడ్డి కవి:</u>

చెమికల చెన్నారెడ్డికవి శ్రీ సీతారామభూపాలుని కాలమందును అనంతరమతని ధర్మపత్ని రాణి ఆదిలక్ష్మీదేవమ్మ పాలనమునందును గద్వాల సభలకు విచ్చేసి ప్రభువుల గౌరవమునకు పాత్రులై కొన్ని గ్రంధములను రచించెను.

జన్మస్థలము :

కవిగారి జన్మస్థలము కడపజిల్లా ప్రొద్దుటూరి తాలూకాలోని పర్లపాడు గ్రామము. గద్వాల ప్రభువులు రెడ్డికులజులు. కావున తమ రెడ్డికులములోని కవులన్న మహారాజుగారికెంతో అభిమానము. ఈ కవి ప్రభువుల గౌరవమునకు పాత్రులై ప్రభువుల యిలవేల్పగు గద్వాల కేశవస్వామిపై గ్రంథమును రచించెను. రెడ్డిగారీ కేశవశతకమును రచించి గద్వాల చెన్నకేశవస్వామికి ప్రభువుల కోరికపై అంకితము గావించెను

ఇందు గద్వాల ప్రభువులకు కేశవస్వామిపైగల భక్తి ప్రపత్తులు వర్ణింపబడినవి. రెడ్డిగారిశతకమును 'గద్వాల శ్రీకేశవా'యను మకుటముతో మొత్తము నూటపదునాలుగు పద్యములు శార్దూల మత్తేభవిక్రీడిత వృత్తములలో రచించిరి. రెడ్డిగారు తన ఆశుకవితచే సభను ప్రభువులను సంతోషపఱచి యోగ్యతాపత్రమును పొందిరి.[1]

శ్రీ రెడ్డికవిగారు చక్కని భావపటిమ గలవారు. వీరి రచన గంగాప్రవాహమువలె కవితాధారగలదై తేటతెలుగు నుడికారముతో కూడియున్నదనుటకీ పద్యము గాంచనగును.

మ॥ కవిరత్నాంకితవిశ్వవర్ధకుడై తనరు మాగద్వాల భూభర్తకున్
స్తవనీయోజ్జ్వలకౌస్తుభాభరణ కందర్పాకృతిన్ బుత్రకున్
భువనాప్తున్ దయఁజేసి చల్లనగు నాభూభర్తస్వాంతంబునన్
గవితాలక్ష్మి భజింపశోభిలునయా గద్వాల శ్రీకేశవా[2]

రెడ్డిగారు స్వామివారికి జేయు షోడశోపచార పూజలను కన్నులార గాంచి వానినిందు వర్ణించినారు. మాఘమాసోత్సవమునకు వచ్చెడి విద్వత్కవిగాయక బృందమును, ఆనాటి సభను రెడ్డిగారీ పద్యమున వర్ణించినారు.

---

1. గద్వాలాస్థాన పండితులు శ్రీమాన్ పుల్లగుమ్మి వేంకటాచార్యులవారి రచన- చెమికల చెన్నారెడ్డి కవిగారికిచ్చిన యోగ్యతాపత్రము-
శ్లో॥ చెమికల చెన్నారెడ్డి గీర్వాణాంధ్ర ప్రబంధ రచనేత్యామ్
శ్రీహస్తం మన్యేహం గద్వాల స్సబుధ వేంకటాచార్యః॥.
శతకమున వ్రాయబడినది.

2. చెమికల చెన్నారెడ్డికవి శ్రీ కేశవశతకము- ప. 33.

మ॥ ప్రతి సంవత్సర మాఘమాసకృత దివ్యద్యుప్మ దీయోత్సవా
గతనానాసుకవీశ్వరార్పితమహాకావ్యోత్తమశ్లోక సం
స్తుతి పద్యాధిక రత్నహారనిచయస్తోక ప్రభాపూర సం
గత వక్షస్థలభాసమాన వరదా గద్వాల శ్రీ కేశవా!

అని చెప్పి రెడ్డికవి ప్రభువుల కవుల మెప్పును పొందెను.[1]

ఉప్పల వేంకటశాస్త్రి:

ఉప్పల వేంకటశాస్త్రిగారు 'ఖండ భారతము' అను గ్రంథమును రచించిరి. ఈ గ్రంథము క్రీ.శ. 1949లో ముద్రణము గావింపబడినది. అందు తేదిమాత్రమే ఉన్నది. ఇతరములు లేవు. శ్రీ శాస్త్రిగారు 1924 ప్రాంతమున గద్వాల సభలకు వచ్చి పాల్గొనెడివారు. వీరి తండ్రి సింహాద్రిగారు.

శాస్త్రిగారిని గూర్చి మేడవరం రామబ్రహ్మశాస్త్రి (కర్నూలు మున్సిపల్ హైస్కూల్ పండితులు) మరియు కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణగారు తమ అభిప్రాయముల నిచ్చినారు. వీరు గద్వాల సభలకు వచ్చిన పండితులకోవకు జెందిన వారు.[2] శాస్త్రిగారి 'ఖండభారతము' భీష్మపాండవ సంవాదరూపమైనట్టిది దీనిని శాస్త్రిగారు రాణి ఆదిలక్ష్మీదేవమ్మ గారికి వినిపించి ఆమె అనుగ్రహమున ప్రచురణము గావించిరి.

శైలి:

వీరి రచన మిక్కిలి సులభము. కాని కొన్నిచోట్ల ముద్రారాక్షసములు గనుపించును. గర్ణకఠోరమ్ములాడగాలినలేదే ఇందు దొరలిన అచ్చుపొరపాట్లిట్టివి.

పద్యసంపుటి చిన్నదైనను చదువరులను చవులూరించును. అర్జునుడు కురుక్షేత్ర యుద్ధభూమిలో యుద్ధము గావించుట కరుదెంచిన భీష్మునితో నిట్లనును-

1. మ. సుబ్రహ్మణ్యశాస్త్రి- కవితావిలాసము- పుట 63.
2 ఉ. వేంకటశాస్త్రి- ఖండభారతము- పుట 1-2.

ఉ॥ ఖండితశత్రు మండలుడఖండపరాక్రమశాలియౌగ భీ
ష్ముండు మహానుభావుడనుచున్నిను భూజనులెల్ల మెచ్చగా
నుండి సుయోధనుండు జడుడుల్లసమందనజాత శత్రువున్
ఖండనభూమిదాకుటిది పాడియె తాత సురాపగానుతా.[1]

అట్ులే భీముడు భీష్మునితో ననిన మాటలు- కౌరవులనేక మాయోపాయములు జేసి మమ్ముల జంపప్రయత్నించిరి. అట్టి దుర్నీతిపరుల పక్షమున యుద్ధమునకు సిద్ధము కావద్దని తెల్పెను.

భీష్ముడు పాండవుల నీతి మర్యాదలకు సంతసించెను. భీష్ముడు వారితో నన్నుమీరు దూరినను నాకు మీపై కోపము లేదు. అయినను రాచకొలువు మర్యాద ననుసరించి చనిపోవునంతవరకు రణప్రతిష్ఠకై యుద్ధమును త్యజించుట వీరులకుచితము కాదు. ఏదియెటులైనను మీరు రణమునందు జయాభ్యుదయ సిద్ధి పొందుటకు నన్ను యాచించితిరి. కావున నా మరణమునకు కారణమిది యని భీష్ముడు చెప్పినదీ పద్యము.

గీ॥ ద్రుపదభూతలరాజ పుత్రుడు శిఖండి
పొలతియై పుట్టిపిమ్మట పురుషుడయ్యె
వానిచాటుననుండి ఈవానపియె శ
రాళిబడద్రోయుగాక ననాలముసను

అని భీష్ముడు తన మరణమునకు గల కారణము తెల్పిన త్యాగమూర్తి. శాస్త్రిగారి గ్రంథము నిటుల సంవాద రూపమున రచన గావించినారు.

## జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి:

సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'కేశవేంద్రవిలాసము'ను గ్రంథమును రచించెను. ఇది ముద్రితము.[2]

---

1. ఉ. వేంకటశాస్త్రి- ఖండభారతము- ప. 17.
2. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి- కేశవేంద్ర విలాసము లక్ష్మి ప్రెస్ గద్వాల 1932లో ముద్రణము.

ఇతని స్వస్థలము గద్వాలకు సమీపమున కృష్ణాతీరమున నున్న కల్వపాముల యను గ్రామము. శాస్త్రిగారు గద్వాలసభలో సహస్రావధానము గావించి రాణిగారి గౌరవమునకు పాత్రుటయ్యెను.

శ్రీ శాస్త్రిగారు తన కేశవేంద్రవిలాసమును 'ప్రథిత సంస్థాన సత్సభా సమాన సత్కృపాసద్మ చెన్న కేశవమహాత్మ' యను మకుటముతో నీ గ్రంథము రచించి 'భవ్యపరిజోత్పత్తి వత్సరంబు ఇట్టి సుదినమ్ము శతకము కృతిదిన ముగ, స్మృతి నెఁగి మమ్ము రక్షించుమయ్య' అని స్వామిని వేడుకొని పూర్తి గావించెను. దీనిని కవి చెన్న కేశవస్వామి కంకితము గావించినటుల తెల్పినాడు. 1

సాహస్రావధానము :

శ్రీ శాస్త్రిగారెన్నియో సాహస్రావధానముల గావించినవారు. వీరు గద్వాలలో రాణి ఆదిలక్ష్మిదేవమ్మగారి ఆజ్ఞచే క్రీ.శ. 1924 ప్రాంతమున సహస్రావధానము గావించిరి. రాణిగారు సంతోషించి శాస్త్రిగారిని సత్కరించిరి. అట్టి సమయమున శాస్త్రిగారు చెప్పిన దీ పద్యము-

శా॥ సంతోషంబుజనించె తానకకృపాస్వాంతంబునం జేసియా
శాంతాయాత బుధేంద్రదర్శన సుభాగ్యంబబ్బె ధీమత్పదా
క్రాంతాస్థాన సభాంతరాళమహిమన్గాంచెన్ సహస్రావధా
నాంతః ప్రౌఢిమనిష్టసిద్ధినుమంబా! యాదిలక్ష్మాంబికా. 2

కవితారీతి :

శ్రీ శాస్త్రిగారి కవితారీతి నరయగా గ్రంథమంతయు (100 పద్యములు) శ్రీ కేశవస్వామి లీలను వర్ణించునట్టిదై యున్నది- రచన సరళము. ప్రభువులు గావించు స్వామి సేవలు, వారికి కేశవస్వామిపైగల భక్తిని శాస్త్రిగారు కన్నులార గాంచినారు. కావున వానిని చక్కగా నిందు వర్ణించినారు.

శ్రీ కేశవస్వామిని గద్వాలలో ప్రతిష్ఠించిన తర్వాతనే ఈ సంస్థానము మిక్కిలి ఉన్నతస్థితిని సంతరించుకొన్నది. నాటినుండి ఈ సంస్థానము క్రిమ క్రిమాభివృద్ధి యగుటచే నీ రాజవంశీయులు కేశవస్వామిని యిలవేల్పుగా

1. జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి- కేశవేంద్రవిలాసము- ప. 99.
2 సుబ్రహ్మణ్యశాస్త్రి- శతవధాని కేశవేంద్రవిలాసము- ప 84.

భావించి స్వామికి నిత్య, పక్ష, మాస, సంవత్సరోత్సవములను గావించినారు. ఆ విషయము నవధానిగారు ప్రభువులను పేర్కొనుచు నీ గ్రంథమున స్వామిని స్తుతించినారు.[1]

**పోలికలు :**

శతావధానిగారి రచనలో భాగవతములోని పద్యపోలికలుగల పద్యములు గనుపించును. 'శాద్వలంబు త్యజించి చవిటికి బోవునే-స్తవనీయ సారంగ సముదయంబు' మున్నగునవి 'కేశవేంద్రవిలాసము'న గనుపించును.

గ్రంథమును కేశవస్వామికంకితమిడినతర్వాత రాణిగారు శాస్త్రిగారిని సభాముఖమున సన్మానించినారు. అవధాని గారట్టి సమయమున చెప్పిన దీ పద్యము-

మ॥ కలపాండిత్యమొకింతజూపితి నిత్వద్గద్వాల సంస్థాన ధీ
రులమ్రోలన్సకలాగమాజ్ఞ బుధవర్యుల్నన్ను నాశీః క్రియా
కలనన్వేల్పుచుటజేసి నాహృదయరంగంబందె నామోదమున్
సెలవున్గైకొనిపోయివత్తునిక రాణీ! యాదిలక్ష్మాంబికా.

ఇటుల గద్వాల సంస్థానకాలమున విద్వత్కవులెందరో వచ్చి ప్రభువులచే సత్కరింపబడి గ్రంథ ముద్రణము గావించుకొనిరి [2]

**అజ్ఞాతకవి :-** (వెన్నెలకంటి జన్నయ)

ఈ కవి 'దేవకీనందన శతకము'ను రచించెను. ఈ శతకము గద్వాల తాళపత్ర గ్రంథాలయములో లభించగా ప్రభువులు (ఆదిలక్ష్మిదేవమ్మగారు) ముద్రణము గావించినారు.[3]

---

1. సుబ్రహ్మణ్యశాస్త్రి (సుబ్బన్న శతావధాని) కేశవేంద్రవిలాసము- ప. 44.
2. సుబ్రహ్మణ్యశాస్త్రి (శతావధాని) గారి యితర రచనలు: 1. సాలంకార కృష్ణదేవరాయలు- 2 ఆంధ్రసామ్రాజ్యము- 3. నళిన (పద్యకావ్యము)- 4. నళినరాణి (నవల)- 5 సాధ్వి చిరంజీవియము- (నాటకము) మున్నగునవి.
శ్రీహరి సత్యనారాయణశాస్త్రిగారు మరియు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారిరువురుకలిసి అవధానము గావించెడివారని, డా॥ హరిశివకుమార్ (వరంగల్) హరి సత్యనారాయణశాస్త్రి కుమారులు గారు తెల్పిరి.
3. దేవకీనందన శతకము- లక్ష్మిప్రెస్, గద్వాల- ముద్రణము 1930.

ఈ శతకమును 'వెన్నెలకంటి జన్నయ' అను కవి రచించియుండవచ్చునని డా. చిన్నికృష్ణయ్యగారు (మద్రాసు) తమ అభిప్రాయమును తెల్పిరి ఈ శతకమందలి 65వ పద్యమును చూడగా నీకవి 'కవిరత్నశ్రేష్ఠుడనియు- పదివేల పద్యములవరకు రచించినాడని అందలి నూటఎనిమిది పద్యములీ శతకమున రచించెనని ఈపద్యమువలన తెలియుచున్నది.

మ॥ సదయామూర్తి కవిత్వ కలిగించు కవిరత్నశ్రేష్ఠుడామోదియౌ
పదివేలప్పద్యములందు నూటెనిమిదౌ పద్యంబులర్పింప మీ
పద నీరేజములందు ఉవ్వతటినీపాదః ప్రవహారాభి ము
ఖ్యదళంగాంచినచోట మీకరుణ కృష్ణా దేవకీనందనా.[1]

అని కృష్ణుని కరుణనుగూర్చి కవి రచించెనని తెలియుచున్నది. ఈ శతకము 'కృష్ణాదేవకీనందనా' యను మకుటముతో 108 పద్యములలో (శతకమందు) గలవు.

కవితారీతి :-

ఈ శతకకర్త చక్కని ప్రతిభాపాండిత్యములు గలవాడు. కవితా విషయమున మిక్కిలి నైపుణ్యం గలవాడనుటకీ కవి శతకమంచలి మొదటి పద్యమును గమనింతము.

శా॥ శ్రీకైవల్య రమాధినాధ! మిమునర్థిన్కీర్తనల్జేసి కా
దాంబుజాత భవేంద్ర నారదశుకవ్యాసాంబరీషార్జునుల్
నీ కారుణ్యము గాంచుటల్ వసుమతిన్ నేనెంతధన్యుండనో
నాకుం జేకూరెనట్టి భాగ్యములు కృష్ణా! దేవకీ నందనా![2]

కాకునూరి అప్పకవి తన అప్పకవీయమున నీకవిని ఉదహరించినాడు కావున నీకవి అప్పకవికన్నను పూర్వుడై యుండునని చెప్పవచ్చును.[3]

1 అజ్ఞాతకవి- దేవకీనందనశతకము- ప. 65.
2. అజ్ఞాతకవి- దేవకీనందనశతకము- ఆరంభపద్యము.
3. కాకునూరి అప్పకవి- అప్పకవీయము- 3ఆ. 23ప.

రచనాపద్ధతి:-

ఈ కవి రచనలో చక్కని అర్థగాంభీర్యము, కవితారీతి, ప్రాచీన గ్రంథ పద్యముల పోలికలెన్నియో గానుపించును. బద్దెన భూపాలుని సుమతి శతకమందు 'చీమలు పెట్టిన పుట్టలు, అను పద్యరీతి ఈ శతకమందు 9వ పద్యమునను, వేమన రచనలోని 'సుగుణవంతురాలు సుదతియై యుండిన, అను గీత పద్యము పోలిక, ఇందు 15వ పద్యమందును, భాగవత పద్యచ్ఛాయలు 43వ పద్యమందును, ఇట్లే ప్రాచీన పద్యములను బోలినవి కొన్ని అచ్చటచ్చట గానుపించును

కవిగారి కొకమారు శతకమేల రచించవలెనని సందేహము గల్గినది. దానికి సమాధానముగా కవియే వంటకమొక్కటియే యైనను పాకమందలి రుచి వంటవాని నేర్పరితనమునుబట్టి యుండును. కావున తన వంటయందలి రుచిని జూపించ రచించితినని (ప. 64-65) తెల్పినాడు.

కవి తన శతకమందలి 83, 89 90 పద్యములలో- ప్రభువులను యాచింపరాదనియు, వారు ఖలులు, పరధనాపేక్షాపరులనియు, పరస్త్రీరతులనియు, అట్టివారి సేవజేయుటచే మనస్సునకు శాంతి లభింపదుగాన ప్రాజ్ఞులట్టివారిని చేర బోరనియు తెల్పెను.

కవి శతకమందలి 9వ పద్యమున 'తాను దీనుడననియు. స్వామిని శరణు వేడితిననియు దీనముగా పలికినాడు. కవి 'స్వామీ! నీవు పాండవులను, అక్రూరుని దయతో గాచినాడవు. మమ్ములను రక్షించలేవా? అని ప్రార్థించినాడు. కవి ఈ శతకమందు మధురలో గోకులమందు కృష్ణుని బాల్యక్రీడలను దశావతారములను చక్కగా వర్ణించెను. కవి రచన భావగాంభీర్యమై, కదళీపాకమున, భావోద్వేగమున సాగినదని శతకమును గాంచినచో విశదమగును.

త్రిపురాంతక కవి :-

త్రిపురాంతక కవి 'రఘువీర శతకము' ను రచించెను. రాణి ఆదిలక్ష్మీ దేవమ్మ గారి కోరికపై గద్వాల తాళపత్ర గ్రంథాలయమున లభించిన ఈ శతకము ముద్రణము గావించబడినది. [1]

1. త్రిపురాంతకకవి- రఘువీరశతకము- లక్ష్మీప్రెస్, గద్వాల- ముద్రితము 1980.

జన్మస్థలము :-

త్రిపురాంతకుని జన్మస్థలము కడప జిల్లాలోని 'ఒంటిమిట్ట' గ్రామమని శతకమందలి పద్యమునుబట్టి తెలియుచున్నది.[1] ఈ కవి తండ్రి అయ్యలరాజు గారు. కర్నాటక రాజసభలో త్రిపురాంతకుడు తన కవితా ప్రౌఢిమచే రాజులను మెప్పించినాడు (ప. 10) కావున నీకవి కృష్ణరాయల కాలమో లేక అతని యనంతర కాలము క్రీ॥శ॥ 15 శతాబ్దికి చెందినవాడని పద్యములనుబట్టి యూహించుట కవకాశము గలదు. కవి శతకమందలి 40. 44 పద్యములనుబట్టి విష్ణుభక్తి గలవాడని తెలియుచున్నది. 'రఘువీర జానకీ నాయకా' యను మకుటముతో నీకవి మొత్తము తొంబదియైదు పద్యముల (చంపకాది వృత్త చతుష్టయముల) తో శతకమును పూర్తి గావించినాడు.

రచనాపద్ధతి :-

త్రిపురాంతకుడు 'బాల్యమున కొంతకాలము వృధాగడిపితిని, యౌవనమున సంసార భ్రాంతిచే నిన్ను సేవింపజాలనైతిని (ప. 14)' అని బాధపడెను. కవి రచనాపద్ధతినరయుటకీ శతకమందలి క్రింది రెండు పద్యముల గాంచనగును.

శతకమందలి మొదటిపద్యము-

శా॥ శ్రీకల్యాణగుణాభిరామ! విబుధశ్రేణీ కిరీట ద్యుతి
వ్యాకీర్ణాంఘ్రిసరోరుహద్వయ! సహస్రాక్షస్తుతా! యచ్యుతా!
నాకుం బ్రాపును దాపునీవెయగుచున్న న్నేలుమో రామ భ
ద్రా! కారుణ్యసముద్ర! ధీర! రఘువీరా! జానకీనాయకా!

శతకమందలి చివరిపద్యము-

మ॥ అతులప్రౌఢిమమీర రాయకవి యయ్యప్రాజు సత్పుత్రుడ
చ్యుతభక్తిం ద్రిపురాంతకుండానరిచెన్ శుద్ధంబుగా నాంధ్ర సం
గతపద్యంబుల నూటినిర్వెలయుంగా తన్రవీంద్ర ప్రచా
రత నెందాకనో యంతదాక రఘువీరా! జానకీ నాయకా! (ప. 95)

1. త్రిపురాంతకవి- రఘువీరశతకము- ప 82.

రచనాపద్ధతి :-

ఈ పద్యమందు కవిగారు వందపద్యములను వ్రాసితినని తెల్పినాడు కాని శతకమందు 95 పద్యములే ముద్రితములు మిగిలినవి క్రిమిద్రష్టములో యేమో? తక్కిన పద్యములు కనబడుటలేదు. కవి తన రచనలో 'తాను దుష్టుడననియు, పరయోషాలోలుడనియు, బాలుడననియు, కల్లకపటిననియు తెల్పి, ఇంతకాలము గృహస్థుడనై సమయము వృథాగావించితిని స్వామీ! నీవు తప్ప నన్ను కాపాడువారెవరు లేరని, ఖేదపడెను. (ప. 9)

'గడచిన కాలమంతయు వృథాయయ్యెను మోహాసక్తుడనై నిన్ను కర్తగా భావించి కోరనాడను. నన్ను తరింపజేయుము' అని రాముని వేడుటచే నీకవి శతకను వ్రాయునవుడు ప్రాపంచిక సౌఖ్యములపై విరక్తిగలవాడై మోహాసక్తి గలవాడై స్వామిని భక్తి ప్రపత్తులతో గొలువనారంభించెనని తెలియుచున్నది. కవి 'భార్యాపిల్లలు సంసారమని కొంతకాలము గడిపి చివరకు వైరాగ్యమునకు వచ్చి వైష్ణవ ముద్రలు వేయించుకొని రామునిపై భక్తి జ్ఞాన చింతలతో మనసునిండినవాడయ్యెనని (ప. 62-63) తెలియుచున్నది

కవి అంతఃశుద్ధిని గూర్చి 8 వ పద్యమున, చిత్తశుద్ధిని 57 వ పద్యమున, శరణాగతి లక్షణములను 85 వ పద్యమున హృదయంగమముగా దెల్పినాడు. కవి రఘువీరశతకమందలి 16 50, 59 79 75, 81, 82 మున్నగు పద్యములలో అలంకారములతోపాటు అద్భుత, శాంత, బీభత్స రసములనుకూడ చూపెట్టినాడు. కొంతకాలమీకవి రాజసభలలో నుండి యా నరపతుల ధోరణికి విరక్తి జెందెను. అందువలన నరస్తుతి నీచమైనదని తలంచి యాంతరంగికముగా మనశ్శాంతి గల్గుటకై నీశతకము వ్రాసినాడని చెప్పవచ్చును కవితావిషయమున నీకవి రచనలో ప్రాచీనకవుల పోకడలు గానుపించును.

## సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి : క్రీ. శ. 1930.

శ్రీ సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు 'తత్సమచంద్రిక' యను వ్యాకరణ గ్రంథమును రచించిరి. ఈ గ్రంథము రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి దవ్యసహాయమున ప్రథమ ముద్రణము (1930) గద్వాలలో గావింపబడినది.

ఈ గ్రంథమును శాస్త్రిగారు రాణిగారి కోరికపై ఆమె భర్తయగు శ్రీ సీతారామ భూపాలున కంకితము గావించిరి.[1]

తత్సమచంద్రిక :-

శాస్త్రిగారు 'తత్సమచంద్రిక' యను తన గ్రంథమందు సంధి, కృదంత, ఉపసర్గ, తద్ధిత, స్త్రీప్రత్యయ, అవ్యయ, సమాస, రూపభేధ, లౌకిక న్యాయమను తొమ్మిది ప్రకరణములను వ్రాసినారు. సిద్ధాంతకౌముదియందు లేనట్టి ఉపసర్గ, రూపభేద, లౌకిక న్యాయమను మూడు ప్రకరణములీ గ్రంథమందు చేర్చబడినవి. ఏయే ఉపసర్గలకు ఏ అర్థములు గలవో ఉపసర్గ ప్రకరణమున శాస్త్రిగారు స్పష్టముగా తెల్పినారు.

---

1. సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి తత్సమచంద్రిక- ఓరియంటల్ పవర్ ప్రెస్, తెనాలి. తృతీయ ముద్రణము- 1942.

శాస్త్రిగారి ముద్రిత రచనలు: 1. కావ్యాలంకార సంగ్రహము- 2. ఆంధ్ర శబ్దానుశాసనము- 3 జాతక కథాగుచ్ఛము ప్రథమ-ద్వితీయ భాగములు- 4. కీరసందేశము 5. తత్సమచంద్రిక- 6. ఖడ్గతిక్కన- 7. వాసవదత్త- 8. పువ్వులతోట- 9. కావ్యమంజరి- 10. నడమంత్రపుసిరి- 11. అమృతకణములు- 12. వివేకానందము- 13. రేణుకవిజయం- 14. గోవర్ధనాచార్య సప్తశతీసారము- 15 ఆంధ్రప్రబంధ కథలు- 16. ఆంధ్రకళా విలాసము.

శాస్త్రిగారి అముద్రిత రచనలు:- 1. వ్యాసకోశము- 2. జాతక కథాగుచ్ఛము (తృతీయభాగము)- 3. పరమహంస కథావళి- 4. స్మరగీత (శృంగార పంచశలు)- కాదంబరీ కల్యాణము (నాటకము)- 6. పంచకావ్యము మున్నగునవి.

రూపభేద ప్రకరణమున శాస్త్రిగారు- అంగనము- అంగణము- అంకణము మున్నగు భేదములను చూపెట్టినారు. అటులే కందుకము- కథాలిక- కథానికా, కిసలయము- కిసాలయము- కిసలము- కిసము. ఇటులీ ప్రకరణమున శబ్దరూప భేదములు తెల్పబడినవి.

లౌకిక న్యాయ ప్రకరణమున శాస్త్రిగారు అకారాది క్రమమున-

1. అకాలేకృతమ కృతంస్యాత్ (అకాలమున చేసినను చేయనివే యగును).
2 అతిపరిచయాదవజ్ఞా (అతిపరిచయమవజ్ఞకు కారణమగును).
3. అత్యుచ్ఛ్రయః పతనహేతుః (పెరుగుట విరుగుటకొరకే).
4 అపంథానంతు గచ్ఛంతం సోదరో౽పి విముంచతి పెడదారిని బోవువానిని సోదరుడను విడచును) ఇట్టివి మొత్తము 547 లౌకిక న్యాయప్రకరణమునందు గలవు.

శ్రీ సన్నిధానంవారు శబ్దభేదప్రకాశము, 'శబ్దరూపరహస్యాదర్శనము అను మూలగ్రంథములనుండి కొన్ని రూపభేదములను గ్రహించి రూపభేద ప్రకరణమున చూపెట్టినారు.

'శబ్దరూప రహస్యాదర్శమ'మనవి ద్విరూపకోశ, సరస్వతీ విలాస, విశ్వ పరికాశ, నామలింగానుశాసన, అమరశేష, నానార్థరత్నమాల మున్నగు గ్రంథములయొక్క సంగ్రహరూపమీ గ్రంథము. ఈ గ్రంథమునుండి శాస్త్రిగారు రూపభేదము లను గ్రహించినారు.

శ్రీ సన్నిధానం సూర్యనారాయణశాస్త్రిగారి 'తత్సమచంద్రిక' యను వ్యాకరణ గ్రంథము గ్రాంథికభాషను సముద్ధరించ విశ్వవిద్యాలయములు కృషి గావించుచున్న కాలమున ఆంధ్రభాషకు దాత్తతను గల్పించుటకీ గ్రంథమెంతో తోడ్పడినది - కావుననే మద్రాసు విశ్వవిద్యాలయాధికారులు. యం. ఏ. పట్టా పరీక్షకు దీనిని పాఠ్యగ్రంథముగా నిర్ణయించి భాషకత్యంతోపకార మొనర్చిరి.

శాస్త్రిగారీ గ్రంథమున కీ॥ శే॥ సీతారామభూపాలున కంకితము గావించి నపుడు చెప్పిన దీ పద్యము-

చం॥ మనిచెనుగన్నబిడ్డల సమానముగా బ్రజలన్ నిరంతరం
బునువినివారి కష్టసుఖముల్ విడిపించెను రాజ్యమందు శో
భనముగ నాల్గుపాదముల వర్తిల ధర్మము, రామరాజ్యమే
యన 'గదవాలరాజ్యము' మహామతియాపతి సేసెనేల్బడిన్.

కం॥ ఆ యవనీపతి మౌళికి
నాయీ గ్రంథంబు భక్తినంకితమున గా
జేయుదు నాతని కీరితి
యీ యాంధ్రంబవని వెలగునందాకతగన్.

అని అంకితమిచ్చెను.

## తెల్కపల్లి రామచంద్రశాస్త్రి :-

తెల్కపల్లి శ్రీ రామచంద్రశాస్త్రిగారు 'హయగ్రీవశతకము'ను రచించిరి. రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి యాజ్ఞచే నీ శతకము ముద్రితమైనది.[1]

**జన్మస్థలము-తల్లిదండ్రులు :-**

శ్రీ శాస్త్రిగారు మహబూబ్ నగరమండలము, గోపాలపేట సంస్థానమందలి 'రాజాపురము' అను గ్రామమున జన్మించిరి. వీరి తల్లి శేషమాంబ తండ్రి సుబ్రహ్మణ్యము. రామచంద్రశాస్త్రిగారు విద్వత్కవి పండితులు.

వీరు హయగ్రీవశతకము, లలితాస్తవరురీ మున్నగు వానిని సంస్కృతమున రచించిరి. శాస్త్రిగారు అంగీరసనామ సంవత్సర మాఘసభలకు గద్వాలకు విచ్చేసి తమ రచనలను వినిపించి, న్యాయవేదాంత భాస్కర బిరుదాంచితులైన శ్రీ బులుసు అప్పన్నశాస్త్రిగారి యోగ్యతాపత్రమును రాణిగారి సభాముఖమున పొందగల్గిరి.

రచనారీతి:-

వీరి రచన ప్రాసాదగుణముతో వైదర్భీరీతితో కూడియుండును. మొదట శాస్త్రిగారు హయగ్రీవశతకమును రచించి మైసూరు శ్రీరంగనాథస్వామిని దర్శించి పరకాలస్వాముల వారిపై రచించిన కొన్ని శ్లోకములను చదువగా వానిని స్వామివారు నిరాకరించగా హయగ్రీవశతకమును వినిపించి వారిని సంతోషపరచి శ్రీవారి బహుమానమును పొందిరి. అనంతరము శాస్త్రిగారు శతకమును గద్వాల రాణిగారికి వినిపించి ఆమె మన్ననకు పాత్రుడై రాణిగారి సహాయమున ముద్రణము గావించుకొనిరి.

రచనాపద్ధతి:-

శాస్త్రిగారి రచనాపద్ధతిని తెలిసికొనుటకై శతకమందలి మొదటి శ్లోకమిటులున్నది-

---

1. తెల్కపల్లి రామచంద్రశాస్త్రి- హయగ్రీవ శతకము- చెన్నకేశవ విద్యాముకురము ప్రెస్. గద్వాల- ముద్రణము 1933.

శ్లో॥ శ్రీలక్ష్మీ హయవదనా
శ్రితజనతా సుకవితోపదేశపటుః
శ్రియమాతనోతు మహ్యం
శ్రీ కంధాద్యభయదాన నిష్ణాతః

చివరి శ్లోకము-

శ్లో॥ ఆర్యావర్త ప్రకటిత మహాభక్తి భావ ప్రకారా
శశ్వత్కాంత ద్విజగచరితాధ్యానుకృత్యానురక్తా
సద్భద్రార్థా సుగుణలసితా త్వాదృశీయం కృతిర్మే
సంతోషాయ ప్రభవతుజనన్యాదిలక్ష్మి స్సదాతే.[1]

శాస్త్రిగారు సంస్కృత పండితులు గావున రచన సంస్కృతమున గావించి రాణిగారి గౌరవమును సంపాదించిరి.

## హారతి దేశికాచార్యులు:-

వీరు ఆదిలక్ష్మీదేవమ్మగారి కోరికపై 'మహారాణిశీలము' అను గ్రంథమును రచించిరి. ఇది ముద్రితము.[2] దేశికాచార్యులు రాణిగారి కోరికపై స్వగ్రామము హోసూరు గ్రామమునుండి విచ్చేసి గద్వాలలో స్థిరపడినారు.

గ్రంథవిషయము:-

ఈ గ్రంథము చిన్నదైయైనను ఆచార్యులు ఆనాటి గద్వాల సంస్థాన వైభవము, రాజులకిలవేల్పగు శ్రీ కేశవస్వామివారి పూజావిధానములు, ప్రభువులకు స్వామిపైగల భక్తిప్రపత్తులు కన్నులకు గట్టునట్లు తనగ్రంథమున తెల్పినారు.

రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారు స్నానాదికములు ముగించుకొని, తన బిడ్డలతో గూడి పూజాధ్యానము లొనర్చిన రీతులను ఆచార్యువారు తమ పద్యములలో వర్ణించిరి.

---

1. తె. రామచంద్రశాస్త్రి- హయగ్రీవశతకము- శ్లో॥ 100.
2. రాయలసీమ ముద్రణాలయము- 1940 ముద్రణము (రాణిగారి ఆర్థిక సహాయము).

శతకమునుండి మచ్చునకొక పద్యము-

ఉ॥ ఆరయమధ్యరంగమున నందముగా విలసిల్లు మేల్మి సిం
గారపుపీటపైన బలుకమ్మని వాద్యము వేదనాదమున్
బోరున నింగిముట్టగ ప్రభుస్వముసేర్పడ నందునిల్పినన్
వారక భక్తిభావముల వైష్ణవబృందము నేమమొప్పగాన్.[1]

ఆచార్యులవారి రచన సరళము. వైష్ణవబృందము విష్ణుసహస్రనామములు చెప్పుచుండగా నొక్కొక్క నామమునకొక తులసి దళము స్వామి కర్పించుట మున్నగు పూజావిధానముల నీ గ్రంథమున కవి చూపెట్టినాడు.

## ఆదిపూడి సోమనాథరావు :-

వీరు 'సుబోధశతకము'ను రచించిరి.[2] సోమనాథరావుగారు శ్రీ సీతారామభూపాలుని కాలమందును, అనంతరము వారి ధర్మపత్ని రాణి ఆదిలక్ష్మీదేవమ్మ కాలమందుండినవారు. సోమనాథరావు తల్లిదండ్రులు రామలక్ష్మాంబ బుచ్చి వెంకయామాత్యులు.

రచనాపద్ధతి :-

కవిగారి రచన సరళమై నీతిదాయకమై రాణిగారికి సలహాలనిచ్చినటుల 'సద్గుణశ్రేణి యాదిలక్ష్మమ్మ రాణి' యను మకుటముతో రచింపబడినది. కవిగారు 'తెచ్చితి సుబోధశతకము నిచ్చితి కానుకగను నేడునీకును' అను మాటచే రాణిగారికే అంకితమిచ్చినటుల దెలియుచున్నది. కవి తన జన్మస్థలమునుగాని యితర రచనలనుగాని యిందు తెల్పలేదు.

సోమనాథరావు తన రచనలో 'నన్ను మెచ్చగ నీపతినెన్ని మదిని-నేను దెచ్చిన సదమలకృతినినెన్ని' అను మాటచే రావుగారు సీతారామభూపాలుని కాలముననుమరియు రాణిగారి కాలమునను గద్వాలను దర్శించియుండవచ్చును. శతకమందలి పద్యములు ఆటవెలది, తేటగీతులలోనే రచన గావింపబడినది.

1. హారతి దేశికాచార్యులు- మహారాణి శీలము పుట 4.
2. ఆదిపూడి సోమనాథరావు-సుబోధశతకము-లక్ష్మీప్రెస్ గద్వాల- ముద్రణము 1940.

కవి 'కవులకెల్లను నీవన్న కల్పతరువు, పండితులకెల్ల నీవన్న భాగ్యనిధివి' యని రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి వితరణగుణమును తన గ్రంథమున దెల్పినాడు. కర్నాటకమున విజయనగరము ఖ్యాతిగన్నట్టుల తెలంగాణమున గద్వాల సీమ వాసి గాంచినదని తెల్పుచు ఇచట కవితాచమత్కృతి నెనలుకవులు-గాయకో త్తములెందరో గలరని తెల్పినాడు.[1] మరియు 'గానమందును, చేతి పరిశ్రమ లందును, వివిధ విద్యలకు నెలవు గద్వాలసీమ' యని తెల్పి అట్టి గద్వాల నేలు కొనుమని ఆశీర్వదించెను. శ్రీ సోమనాథరావు ఆనాటి గద్వాల సంస్థాన వైభవము నీశతకమున నెలుగెత్తి చాటినాడు.

## యం. బలరామరెడ్డి కవి :-

ఇతడు బాలకవి. 'సత్యవరలక్ష్మీ ధ్రువచరిత్రము' అను గ్రంథమును మూడాశ్వాసములలో రచించెను. దీనిని శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రి పరిష్కరించిరి. ఈ గ్రంథము రాణిగారి కోరికపై ముద్రణము గావించనైనది.[2] గ్రంథములను ముద్రింపించుట, కవులను-పండితులను సత్కరించుట రాణి ఆదిలక్ష్మీదేవమ్మ కాలమందును ఆచారమై యుండినది.

జన్మస్థలము :-

రెడ్డికవి జన్మస్థలము కర్నూలుజిల్లా, సిరివెల్ల తాలూకాలోని 'జిల్లెళ్ళ' యను గ్రామము. ఈ బాలకవి నంద్యాల పురోన్నత పాఠశాలలో ప్రథమాంధ్రపండితులుగా పనిచేసిన బ్రహ్మశ్రీ విద్వాన్ కావ్యతీర్థ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారివద్ద కొన్ని ఆంధ్రకావ్యములను చదువుకొని శ్రీ శాస్త్రిగారి ప్రోత్సాహమున కవితాశక్తి నలవరచుకొని నీగ్రంథమును రచించితినని తన ధ్రువచరిత్రమున తెల్పినాడు ఈ గ్రంథము బాలకవి ప్రథమకావ్యము.

రాణి ఆదిలక్ష్మీదేవమ్మ చిన్నకూతురు సత్యవరలక్ష్మీదేవమ్మ పిన్నవయసునందే గతించగా నీకవి ఆమె స్మరణార్థమీ గ్రంథమున కా పేరిడెను.

---

1 ఆదిపూడి సోమనాథరావు- సుబోధశతకము- పుట 10.

2. ఎం. బలరామరెడ్డి ధ్రువచరిత్రము - చెన్నకేశవ ముద్రణాలయము, గద్వాల - ముద్రణము - 1941.

కవితారీతి :-

రెడ్డికవి కవితారీతి విషయములో రచన సులభతరమై ధారావాహికముగా నడచినదనుటకీ పద్యమును గాంచిన తెలియగలదు.

చ॥ అతులకృపారసార్ద్రి హృదయాంబురుహాంచిత దన్యసూరి సం
స్తుత సుగుణైకరాశి పరిశుభ్రయశోన్విత ధీరభావ సం
స్థిత గురుశాంతి భూసమవిజృంభిత దానకళాభిరామ క
ల్పతరు సమానయైన వరలక్ష్మమరాజ్ఞి కృతార్థ చూడగన్.[1]

అని సత్యవరలక్ష్మీదేవి గుణగణములను కవి తెల్పినాడు. కవి ధర్మార్థ కామమోక్షములను చతుర్విధ పురుషార్థములను సాధించదలచినచో పద్మనాభుని సంసేవఫలముదప్ప వేరువిధము లేదని తెల్పెను.

రెడ్డి బాలకవి రచించిన 'ధ్రువచరిత్రము'న కొన్ని ప్రాచీన కవుల పద్యములను బోలిన పద్యములీ గ్రంథమున గనుపించును. 2-15ప, 2-34ప. మున్నగునవి. అలంకార విషయమున రెడ్డిగారు ద్విప్రాసతో కూడిన శబ్దాలంకారములను చూపెట్టినారు. 2-106ప, 2-111ప. మున్నగునవి. రెడ్డికవి తన గ్రంథమును యువరాజ్ఞికి అంకితము గావించి ప్రభువుల గౌరవమునకు పాత్రుడయ్యెను.

## పరిసరప్రాంత కవులు-రచనలు:-

గద్వాల సంస్థానమునకు పరిసరప్రాంతమునుండి రచనలు గావించి గద్వాలను దర్శించిన కవులు కొందరు గలరు. అట్టివారిలో పెద్దమంటడి వేంకట కృష్ణ కవిగారొకరు. వీరు నిర్వచనభక్తవిజయమను గ్రంథమును 12 భాగములుగా రచించిరి. కృష్ణకవి గద్వాలసభలలో తమ రచనల చదివి వినిపించి గాడేపల్లి వారిచే 'కవిశరభ' బిరుదమునుపొందెను. ఈకవి దోమకొండ సంస్థానకవిగా కొంత కాలము పనిచేసెను కవి రచించిన 'నిర్వచనభక్తవిజయము' ముద్రితము.[2]

---

1. ఎం బలరామరెడ్డి- సత్యవరలక్ష్మి ధ్రువచరిత్ర- ప. 40.
2. మందడి వేంకటకృష్ణకవి నిర్వచనభక్తవిజయము-మొదటిభాగము- శ్రీరామ ముద్రణాలయము మద్రాసు- ముద్రితము 1935 (ఇతర భాగములు అముద్రితములు).

జన్మస్థలము :-

వేంకట కృష్ణకవి జన్మస్థలము మహబూబ్‌నగర మండలము, వనపర్తి తాలూకాలో పెద్దమందడి యను గ్రామము. వీరిది పూదత్తవంశము (నంబి వారు) తల్లిదండ్రులు శేషమ్మ కృష్ణధన్వంతరిగారలు. కృష్ణకవిగారు చిన్నతనము నందే సంస్కృతాంధ్రభాషలయందపారమైన ప్రజ్ఞ గడించి తియ్యనైన తేటతెనుగున చక్కని కవిత్వము చెప్పి గద్వాల-దోమకొండ సంస్థాన ప్రభువుల గౌరవమునకు భాజనులైనారు.

గ్రంథవిషయము:-

కృష్ణకవిగారు భక్తవిజయమున పండరిపుర భక్తులను ప్రతి భాగమున ముగ్గురిని గూర్చి రచన గావించి ఇటుల పన్నెండు భాగములను రచించినారు. మొదటి భాగమున నీకవి జయదేవ, తులసీదాసు, నామదేవు భక్తుల జీవితములు పద్యములలో రచన గావించినాడు. ఇటులే మిగిలిన భాగములు కూడ పూర్తి గావించితినని కవిగారే తెలియజేసినారు.

కృష్ణకవి గ్రంథమందలి గద్యవలన ఇతడు కవిత్వమునందేగాక గణిత-జ్యోతిష శాస్త్రములందును ప్రజ్ఞ గలవాడని, గణిత శాస్త్రరత్న, రత్నాకర, జ్యోతిష సిద్ధాంతప్రవీణ, మున్నగు బిరుదములనుబట్టి తెలియుచున్నది. కృష్ణకవి తన గ్రంథమున శ్రీ ప్రియదాసులు వారు తులసీదాసునకు కథ చెప్పినటుల పురాణ రీతిలో రచించెను.

జయదేవ చరిత్రమున 'భటులు జయదేవుని మోసగించి అతని వద్దనున్న వైశ్యుడిచ్చిన ధనమును దోచుకొని కాలు సేతులు నరికి పాడుపడిన బావిలో పడ ద్రోసిపోయిరి. జయదేవుడు బావిలో బాధతో తాను రచించిన అష్టపదులను పాడుకొనుచుండెను' ఆ సమయమున వేటకై వచ్చిన మహారాజు ఆ గానము విని తలంచినట్టిదీ పద్యము- కృష్ణకవి కవితారీతి నీ పద్యమున గాంచనగును.

ఉ॥ గానకళాధురంధురల గానము తెన్నియొ వింటినిట్టులన్
వీనులవిందుసేయగల విష్ణుగుణానుభవంబు భూరి వి
జ్ఞానమయంబు దుష్కృతవినాశకరంబగు కీర్తనంబు నే
గాన తదార్యుడెట్టి ఘనకాననమందెటులున్న వాడొకో. 1

అని వాపోవును.

1. మం. వేంకటకృష్ణకవి- నిర్వచనభక్తవిజయము- ప 41.

ఇటుల కృష్ణకవిగారి రచన ద్రాక్షాపాకమున సహజమై భక్తుల జీవితములను దెల్పునదై, నిర్వచనమై సాగినదని చెప్పవచ్చును. కృష్ణకవి తన గ్రంథమును కర్నూలుజిల్లా క్యాతూరు గ్రామనివాసి, సురవరం రంగారెడ్డిగారికి అంకితము గావించినాడు.

## గుండేరావు హర్కారేగారు:-

గద్వాల సంస్థానమున చాలాకాలము నివసించి సభలలో పాల్గొన్న వారిలో శ్రీ గుండేరావు హర్కారేగారొకరు. వీరు 'ఖురాన్ షరీఫ్' అను మహమ్మదీయుల మత గ్రంథమును సంస్కృతభాషలో ననువాదము గావించినారు. వీరు కొంతకాలము గద్వాల సంస్థాన కాలమున జడ్జీ పదవి నలంకరించి కీర్తిగడించిరి.

---

గాడేపల్లి వారు కృష్ణకవిని గూర్చి చెప్పినదీ పద్యము-

శా॥ లాలిత్యాంచితవాగ్విలాస సుషమాలంకార శయ్యారస
శ్రీలన్ గూర్పగజాలు నీకవితనాశ్లేషించి రాజాధిరా
జౌఘశ్రీప్రస్ఫుట రత్నకాంతియుత పన్నాలికుడౌ రాఘవుం
డాలీలన్ విరచించె కృష్ణసుకవీ హాళావచో భారవీ![1]

---

జన్మస్థలము:-

వీరు బీదరుజిల్లా 'కల్యాణ్' అను అగ్రహారమున 13 మార్చి 1897 లో జన్మించిరి. వీరి తండ్రిగారు హైద్రాబాద్ నందలి హైకోర్టులో ఆఫీస్ సూపరింటెండెంటుగా చాలకాలము పని చేసిరి. గుండేరావుగారు మాతృభాష మరాఠీ భాషతోపాటు తెనుగు కన్నడము ఉర్దూ అరబ్బి భాషలను మరియు సంస్కృతము నందసమానమైన పాండిత్యమును సంపాదించిరి. శ్రీ మాణిక్యరావుగారు వీరికి కావ్యనాటకాలంకారములను చెప్పించిరి. తర్వాత గుండేరావుగారు కనకాపు శ్రీనివాసాచార్యులవారివద్ద న్యాయ వేదాంతశాస్త్రమును పూర్తిగా చదివిరి.[2]

---

1. గాడెపల్లి వారి పద్యము- నిర్వచనభక్తవిజయము- ప్రథమ భాగము- పుట 12.
2. శ్రీ తిరుమల రామచంద్ర- మరుపురాని మనిషి- (గ్రంథము) పుట 55.

ప్రతిభాపాండిత్యము లు-రచనలు :-

శ్రీ గుండేరావు హర్కారేగారు న్యాయ, సాహిత్య శిరోమణి మరియు పి.ఓ యల్ (Pandit of Oriental Literature) పరీక్షలలో నుత్తీర్ణులై సెషన్ జడ్జిగా తెలంగాణమందలి గద్వాలలో నియమితులైరి. వీరి ప్రతిభాపాండిత్యములు మొదటిసారి గద్వాల పండితపరిషత్తు సభలలో ప్రకాశించినవి. ఆనాటినుండి గద్వాల రాజా సీతారామభూపాలుడు ప్రతి సంవత్సరము పండితసభలకు వీరి నాహ్వానించుట జరిగినది. గుండేరావుగారనేక భాషలలో వివిధములైన వ్యాసములు రచించిరి. అట్టి వ్యాసములు (సంస్కృత భాషలో) ఆనాటి ఉద్యాన పత్రిక, మధురవాణి మున్నగు సంస్కృత పత్రికలలో ప్రచురితమైనవి.

గ్రంథములు :-

గుండేరావుగారనువదించిన సంస్కృత 'ఖురాన్ షరీఫ్' అను గ్రంథమునకు కేంద్రఅకాడమి బహుమతి లభించినది.[1]

వీరు 'మస్నవీషరీఫ్' (సూఫ అద్వైతము)ను ఫార్సీభాషనుండి సంస్కృతమున కనువాదము గావించినారు. కావున వీరి భావనలు భారతీయ పారసీక, అరబ్బీభాషలలో వీరికిగల సమన్వయ దృష్టిని తెలియజేయుచున్నవి.

శ్రీ గుండేరావు హర్కారేగారు ద్వైతాద్వైత విశిష్టాద్వైత వేదాంత విషయములలో పరిపూర్ణత గలవారు. వేదాలను తఱచి నిరుక్తాన్ని తెలుగు భాషలోని కనువదించిన విద్యావాచస్పతులు ఖురాన్ షరీఫ్‌ను అరబ్బీభాష నుండి, మస్నవీ షరీఫ్‌ను ఫార్సీభాషనుండి సంస్కృతీకరించిన మనీషులు. వీరు తత్వదర్శియైన హాబీబ్ రఫియాయను నతనిని మెప్పించిన తత్త్వవేది.

అనువాద పద్ధతి :-

శ్రీ గుండేరావు హర్కారేగారు 'ఖురాన్ షరీఫ్' అను గ్రంథమందలి మొదటిదగు 'బిస్మిల్లా ఇర్రహిమాన్ ఇర్రహీమ్' (అవిఘ్నమస్తు) అనుదానికి సంస్కృతానువాదము నిటుల గావించినారు.

1. శ్రీ తిరుమల రామచంద్ర- మరుపురాని మనిషి- పుట 55-56.

శ్లో॥ వంద్యస్య వ్యాహరన్నామ
ప్రారభే పరమాత్మనః
అపార కరుణా పారా
వారస్య కరుణా వతః.[1]

వీరు (గ్రంథానువాదములతో పాటు) ఆంగ్ల భాషా రచనల నెన్నింటినో సంస్కృతభాషలలో ననువాదము గావించినారు. వీరు 'థామస్ గ్రే' కవి గ్రంథమగు 'ది కర్ఫ్యూ టోల్సు ది నెల్ ఆఫ్ పార్టింగ్ డే' అను (పద్నాల్గు లైన్లుగల పద్యము) రచనతో సంస్కృతానువాదమును ప్రారంభించిరి.

వీరు 'ఎలిజిని' పద్ధతిలో సంస్కృతమున నిట్లనువాదము గావించిరి,

శ్లో॥ వాదత్యేషా తపనవిరహద్యోతినీ నైశ ఘంటా
ప్రత్యాయాంతి స్వయమిహాశనైర్గోచరాత్గోధనాని
స్వీయం వేశ్మానుసరతి పరిక్లిన్న గాత్ర కృషీకః
యుంజన్ గుహ్యైః నిభృతజగతో మాంచ గాఢాంధకారమ్. [2]

శ్రీ గుండేరావుగారు గద్వాలలో నా కాలమున న్యాయాధికారిగా పని చేయుచున్నపుడు పండిత పరిషత్తులో పాల్గొని అచ్చటి ఆస్థాన విద్వాంసులతో చక్కగా సంస్కృతములో శాస్త్రచర్చ గావించి ఖ్యాతి గడించిరి.

వీరి వయస్సు 80 సంవత్సరములున్నను నేటికిని ఎన్నో సంస్కృతానువాదములునూ 'ఉపనిషత్తత్వముక్తావళీ' అను పేర ఉపనిషద్భాష్యమును వారు వ్రాయుచున్నారు. వీరు ఓరియంటల్ కాన్ఫరెన్సు శాశ్వత సభ్యులు.

వీరు హైదరాబాదులోని అలియాబాదు బస్తీ గోవిందాబాగ్ అను స్వంత గృహములో విశ్రాంతి గైకొనుచు సాహిత్యసేవ గావించుచున్నారు.

---

1. గుండేరావు హర్కారేగారు- ఖురాన్ షరీఫ్- సంస్కృతానువాదము- మొదటి శ్లోకము.

2. గుండేరావు చైతన్యవిలాసము- ఖండకావ్యము- పుట 12.

## శ్రీ శ్యామరాజు-రామరాజుగారు :

వీరిరువురు సోదరులు. శ్యామరాజుగారు 'ద్రౌపదీ మాన సంరక్షణము' మున్నగు హరికథలు రచించి గద్వాల ప్రభువుల సమక్షమున హరికథలు చెప్పి ప్రభువుల గౌరవమునకు పాత్రులైనారు.

జన్మస్థలము :

ఈ సోదరులిరువురి జన్మస్థలము మహబూబ్‌నగర మండలము జడ్చర్ల (స్టేషన్) తాలూకాలోని 'భట్టుపల్లి' యను అగ్రహారము. పెద్దవారు రామ రాజుగారు. వారి తమ్ముడు శ్యామరాజు. వీరి తండ్రిగారు చంద్రమరాజు. ఈ సోదరద్వయము తాటికొండ ప్రభువగు రామారెడ్డి (గద్వాల రాణి ఆదిలక్ష్మి దేవమ్మ అన్నగారు) గారి అభిమానముతో గద్వాల సభలలో సెన్నోమారులు హరికథలు చెప్పిరి. వీరు క్షత్రియశాఖకు జెందిన భట్టుకులసంభవులు-శాండిల్యస గోత్రము. వీరి తండ్రిగారగు చంద్రమరాజుగారు తాటికొండ గ్రామములో నుండి తాటికొండ ప్రభువులగు రామారెడ్డి - చిన్నతమ్ముడు తిమ్మారెడ్డి, రాణి ఆదిలక్ష్మిదేవమ్మ (తాటికొండ ప్రభువుల ఆడపడుచు) గారికి బాల్యమున ఉపాధ్యాయులుగా నుండి విద్య నేర్పిరి.

విద్యాభ్యాసము :-

సోదరులిరువురు జటప్రోలు (కొల్లాపురము) సంస్థానమందలి బ్రహ్మశ్రీ శేషసదాశివశాస్త్రిసన్నిధ సంస్కృతాంధ్రగ్రంథములు నేర్చుకొనిరి. వీరిని పిన్నవయసు నందే కవితాకన్యక వరించినది. వీరు చక్కని హరికథలు రచించి సభలలో హరికథా కాలక్షేపము గావించి తెలంగాణమున సాటిలేనివారనిపించుకొనిరి. శ్యామ రాజుగారు రచించిన హరికథలు ముప్పదికి పైబడి యున్నవి. అందు కొన్ని ముద్రితములు. మరికొన్ని అముద్రితాలు.[1]

---

1. శ్రీ శ్యామరాజుగారి రచనలు:- 1. ద్రౌపదీ మానసంరక్షణము-. 2. హనుమ ద్రామ సంగ్రామము. 3 మయూరధ్వజచరిత్ర. 4. సానందోపాఖ్యానము. 5. సావిత్రీచరిత్రము. 6. ద్రౌపదీ స్వయంవరము. 7. కీచకవధ. 8. శశిరేఖ పరిణయము. 9 గజగౌరీ వ్రతము. 10. బకాసురవధ. 11. కుచేలోపాఖ్యానము. 12. శ్రీపతి శతకము. 13. ఉత్తర గోగ్రహణము. 14. సంస్కృతభాష. 15. ఆంధ్ర భాషా ప్రశంస 16. భారతీయ రత్నములు. మున్నగునవి శ్యామరాజు స్వీయ సోదరద్వయము చేసిన రచనలు:- 1. భల్లాణ చరిత్ర. 2. ప్రహ్లాద చరిత్ర. 3. రుక్మిణీకల్యాణము. 4 ఉషా పరిణయము. 5. దక్షిణ గోగ్రహణము. 6. పార్వతీ కల్యాణము. 7. మద్యపాన నిషేదము - మున్నగునవి,

రచనాపద్ధతి :-

శ్రీ శ్యామరాజుగారి రచన భావగంభీర్యమై యుండును. వీరు క్రీ.శ. 1924 గద్వాల ప్రభువగు శ్రీ సీతారామభూపాలుని మరణవార్త విన్న వెంటనే తమ బాధనొక పద్యమున వ్యక్త మొనర్చిరి.

ఈ సోదరద్వయము గద్వాలకు క్రోధనసంవత్సర మాఘమాసోత్సవములకు విచ్చేసి రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారి కోరికపై మూడు రోజులు హరికథలు చెప్పి ప్రభువులను సభికుల నానందపఱచిరి. వీరు ప్రభువుల గౌరవమును పొందుటయే గాక శాలువలు ప్రత్యేకముగా శ్రీ శ్యామరాజు గారికి సువర్ణ పథకమును రాణిగారు బహుకరించగా స్వీకరించిరి. అట్టి సమయమున రాణి ఆదిలక్ష్మీదేవమ్మగారిని గూర్చి - 'రాణి ఆదిలక్ష్మాంబికా' యను మకుటముతో పద్యములు చెప్పిరి.[1]

## కేశవపంతుల నరసింహశాస్త్రి :

తెలంగాణాముననున్న విద్వన్మణులలో శ్రీ కేశవపంతుల నరసింహశాస్త్రి గారొకరు. వీరును గద్వాల సభలలో పాల్గొని ప్రభువుల మన్ననలను పొందిరి. వీరనేక గ్రంథములను రచించిరి.

జన్మస్థలము :-

శాస్త్రిగారి జన్మస్థలము మహబూబ్‌నగరమండలి అలంపురము తాలూకాలోని పల్లెపాడు గ్రామము. జననము 1919 వీరి తల్లిదండ్రులు రామలక్ష్మమ్మ తిప్పాజ్యోతిష్కులు గారు. ఇంటిపేరు కేశవపంతులవారు అగస్త్యగోత్రము. వీరి పూర్వీకులు చక్కని ఆయుర్వేదవైద్యులు. వీరి పెదతండ్రి సింగంభట్టుగారు జ్యోతిషమునందును సాహిత్యమునందును మంచి పండితులు.

విద్యాభ్యాసము:-

కేశవపంతులువారు కొల్లాపురమునందలి అయ్యవారిపల్లె గ్రామ వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ వెల్లాల శంకరశాస్త్రిగారి వద్ద విద్య నభ్యసించిరి. వీరు సాహిత్య శిరోమణి, విద్వాన్ పరీక్షలందుత్తీర్ణులై కొంతకాలము క్రీ. శే. మాడ

1. భట్టుపల్లి శ్యామరాజుగారి స్వీయరచనలనుండి గ్రహించబడినది. (అముద్రితము)

పాటి హనుమంతరావుగారి ఆంధ్రబాలికోన్నత పాఠశాలలో నధ్యాపకులుగా పని చేసిరి. అనంతరము వీరు ఆలిండియా రేడియోలో ప్రవేశించి రచయితగా, అనౌన్సరుగా, అడ్మినిస్ట్రేటరుగా ప్రోగ్రామ్ ఆఫీసరుగా, ప్రోగ్రామ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగా పనిచేసి పదవీ విరమణ గావించిరి. ప్రస్తుతము వీరు హైదరాబాదులో విశ్రాంతి తీసికొనుచున్నారు.

రచనలు - సాహితీ ప్రచారము:-

శాస్త్రిగారనేక గ్రంథములను రచించిరి.[1] మరియు అనేక సంస్థానములను సందర్శించిరి. ముఖ్యముగా గద్వాల సంస్థానకాలమున గద్వాల సాహిత్య సభలలో పాల్గొనుచు సాహితీ ప్రచారము గావించిరి.

ఒకమారు గాడేపల్లి వారు కొల్లాపురము సంస్థానమునకు వచ్చినపుడు శ్రీ కేశవపంతులు వారు చెప్పిన పద్యముల కవితా నైపుణ్యమునకు మెచ్చుకొని శాస్త్రిగారిని గూర్చి ఈ పద్యము చెప్పిరి.

మ॥ పసిబాలుండనచెంత గూర్చొనుచు మద్భావార్ధసంశోధనా
భ్యసనప్రక్రియలందు సోదరుడవై అస్మద్యశోవల్లికా
కుసుమాలంకృతికిన్ ఫలాప్తికి కనుల్ గోరంతయు వంచకుం
డీ సదూద్దేశ్యకుడో నృసింహాసుకవీ! నానారసోద్యత్కవీ.[2]

అఖిలాంధ్రదేశమందు శాస్త్రిగారి పేరు తెలియని వారుండరు. వీరు రాణిగారి కాలమున గద్వాలకు వెళ్ళి తమ విద్యా ప్రాభావములను వెల్లడించి ప్రభువుల గౌరవమునకు పాత్రులైరి.

---

1. శ్రీ శాస్త్రిగారి రచనలు:- 1. ప్రబంధపాత్రలు (సాహిత్య విమర్శ). 2 సంస్థానముల-సాహిత్యసేవ (ముద్రితము). 3. త్యాగధనులు (ము). 4. బాలవీరులు (ము). 5. రత్నలక్ష్మి శతకము (ము). 6. ఉదయసుందరి కావ్యము (అము). 7. అలంపురము బాలబ్రహ్మేశ్వర సుప్రభాతము (సంస్కృతము). ఇంకను ఖండకావ్యములు- వ్యాసములు- రేడియో నాటికలు- పద్యములు మున్నగునవి ఆంధ్రసారస్వత పత్రిక- శాస్త్రిగారి షష్టిపూర్తి సంచికలో ముద్రితమైనవి

2. శ్రీ కే. నరసింహ్మశాస్త్రిగారు చెప్పగా వ్రాసుకున్న పద్యమిది.

## మణిమయ గోపాలకవి (అష్టావధాని):

గద్వాల పరిసర ప్రాంత కవులలో సాహితీసేవ గావించిన వారిలో మణి మయ గోపాలకవి గారొకరు.

జన్మస్థలము :

కవిగారి జన్మస్థలం మహబూబ్ నగర మండలమందలి అలంపూరు తాలూకా లోని ధర్మవరము గ్రామము. వీరు 19వ శతాబ్ది చివరలో నున్నవారు. గోపాలకవి బాల్యమునుండియు అధ్యాపక వృత్తిలోను, అష్టావధానములు గావించుటలోను ప్రయత్నము గావించి కృతకృత్యులైనారు. కవిగారు పండిత సభలలో పాల్గొని సన్మానములను పొందినారు. వీరు 1. వేంకటేశ్వరశతకము (అచ్చతెనుగు), 2. పుష్పబాణవిలాసము (అనువాదము), 3. శివానందలహరి (అనువాదము) మున్నగు గ్రంథములను రచించిరి. వీరి రచనలను భాషాభి మానులు ముద్రణము గావించి వీరి సేవను ప్రపంచమునకు తెలియజేసిరి.

వేంకటేశ్వర శతకము :

గోపాలకవి రచించిన వేంకటేశ్వర శతకమును ఆంధ్రభాషాభిమానులు వేముల లక్ష్మణస్వామిగారు ద్రవ్యదాతలచే వార్షిక సహాయము గైకొని ఈశత కమును ముద్రణము గావించిరి.[1]

గోపాలకవి అచ్చతెనుగు కావ్యకర్తలగు తెలుగన్న, తిమ్మకవుల గ్రంథ ములను బాగుగా చదివి జీర్ణించుకొని తానును అచ్చతెనుగున శతకము వ్రాయు టకు పూనుకొనెను. కవిగారి శతకమందలి కవితారీతి నరయుట కీపద్యమును గాంచనగును.

ఉ॥ పున్నమచందమామ పొలుపుం బొలియించెడు ముద్దుమోము బ
లెన్నగు తమ్మిపూజిగినినీ యనజాలెడు కన్నుదోయి యుం
గన్నులనిల్తునిందెగడగాదగు చక్కని నీదురూపు నా
కన్నులకర్వు దీరగను గన్గొనజేయుము వేంకటేశ్వరా![2]

---

1. వేంకటేశ్వర శతకము- ముద్రణవ్యయకర్తలు- రైతు సంఘము - ధర్మవరం- ముద్రణము 1969 అలంపురము తాలూకా- వెల ఒక రూపాయి.
2. మణిమయ గోపాలకవి- వేంకటేశ్వర శతకము- మొదటి పద్యము.

పై పద్యమున కవిగారు తెనుగు పదముల నెంత సరళముగా వాడినారో ద్యోతకమగును. కవిగారి రచన సులభముగను, సరళముగను గన్పించును. ఇతని రచనను జూడగా కవి సాధువర్తనుడనియు, సంసారిక బాధల ననేకములనను భవించి భవబంధములనుండి తప్పించుమని వేంకటేశ్వరుని శరణు వేడినటుల గన్పించును.

కవి శతకమున వ్యాధిచే పీడితుడనైన తనను రక్షించుమని స్వామిని శరణు వేడుట కరుణ రసాత్మకమై గన్పట్టును. కవి తన శతకమును వేంకటేశ్వరస్వామి కంకితము గావించినటుల శతకమందలి 12వ పద్యమున తెల్పినాడు.

పుష్పబాణ విలాసము :-

గోపాలకవి యనువాదము గావించిన గ్రంథము 'పుష్పబాణ విలాసము' ఇతని రెండవ కృతి. ఇది శృంగార కావ్యము. కవి కాళిదాస కృతమగు పుష్పబాణవిలాసమున కాంధ్రానువాదము గావించితినని తెల్పినాడు. ఇది ప్రహసనము. ఈ గ్రంథము కాళిదాస కృతమని కొందరు కాదని మరి కొందరందురు. ఇటుల వాదోపవాదములున్నవి. మూలగ్రంథమందలి ఆశ్వాసాంత గద్యలో నిటులున్నది- 'ఇతి శ్రీ వేంకట పండిత సార్వభౌమేన విరచిత శృంగార చంద్రికాఖ్య పుష్పబాణ విలాస వాఖ్యా,[1] అని వ్రాసియున్నది. ఈ చిన్న గ్రంథము 25 శ్లోకములతో కూడియున్నది.

---

శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు తన సంస్కృత వాఙ్మయ చరిత్రలో నిటుల వ్రాసిరి- 'ఇక వక్ష్యమాణములైన రూపకత్రయములుగాక ఋతు సంహారము, శృంగారతిలకము, శృంగార రసాష్టకము సేతు బంధనము జ్యోతిర్విద్యాభరణము కర్పూర మంజరి శ్యామల దండకము పుష్పబాణ విలాసము, కాళిదాస ప్రహసనము ప్రశ్నోత్తర మాల కుంతేశ్వర దౌత్యము రాక్షస కావ్యము నవరత్నమాల మున్నగు ననేక కృతులు కాళిదాసు పేర గానవచ్చుచున్నవి కాని ఇందొకటియు నిజము కాదు. నేనును తొలుత సంస్కృత కవి జీవితమున నిట్టి అభిప్రాయమునే జూపితిని గాని పునః పరిశీలనము గావింపగా నదియు కాళిదాసుది కాదని తోచినది.' అని శాస్త్రిగారు తమ అభిప్రాయమును తెల్పిరి. 2

---

1 R No. 492 & 427 - ఆంధ్ర సారస్వత పరిషత్తు - హైదరాబాదు. (పుష్పబాణ విలాసము) వెల 0-50 పైసలు. వేదం వేంకటరామశాస్త్రి గారి జ్యోతిష్మయి ముద్రాక్షరశాల - మద్రాసు 1909 లో ముద్రితము.

2 మల్లాది సూర్యనారాయణశాస్త్రి - సంస్కృత వాఙ్మయచరిత్ర సం. 2 పుట. 274.

వేంకటాచార్యులు అనువాదము గావించిన 'సంస్కృతాంధ్ర పుష్పబాణ విలాసము గలదు.[1]

అష్టావధానిగారు తన యాంధ్రానువాదమున కాళిదాస కృతమని తెల్పిరి.[2] మూలగ్రంథమందు శ్లోకమునకు వ్యాఖ్య వ్రాసినవారి పేరుమాత్రమే గానవచ్చు చున్నది. వేదం వేంకటరాయ శాస్త్రిగారును కాళిదాస కృతమని పేర్కొనలేదు. వేంకట పండితరాయలు గావించి వ్యాఖ్య, యని మాత్రము తెల్పిరి. 25 శ్లోకములు గల గ్రంథమును మణిమయ గోపాలకవి గారాంధ్రీకరించిరి.

ఇతివృత్తము :-

లీలామానుష విగ్రహుడగు శ్రీకృష్ణుని విచిత్ర చరిత్రమును శృంగార రస భూయిష్ఠముగా రచించుట యిందలి యితివృత్తము. రసమయమగు ప్రహసనము. మూలమందలి ఆరంభ శ్లోకమిటులున్నది

శ్లో॥ శ్రీమద్గోపవధూస్వయంగ్రహా పరిష్వంగేషు తుంగస్తన
వ్యాఘుర్ణద్గళితేపి చందన గజః స్వాంగేవహన్ సౌరభమ్
కశ్చిజ్జాగర జాత రాగ నయన ద్వంద్వః ప్రభాతే శ్రియం
బిభ్రత్కామపి వేణునాదరసికో జారాగ్రణీః పాతునః[3]

గోపాలకవి ఆంధ్రానువాదము :-

ఉ॥ శ్రీరమణీయులున్ శుభచరిత్రలునౌ నెనమండ్రు భార్యల
న్జేరిమి పెండ్లియాడి మఱి వ్రేతలనుం బదియారు వేవురన్
గోరిన లీలలన్దనిపి కుంజవనిన్ విజితేంద్రియుండు నా
బేరును గన్న సర్వమని వేణునినాద వినోదు గొల్చెదన్[4]

1 R. No. 412 వేంకటాచార్యులు - 'సంస్కృతాంధ్ర పుష్పబాణ విలాసము, ఆంధ్ర సారస్వత పరిషత్తు - హైదరాబాదు.

2 మణిమయ గోపాలకవి పుష్పబాణవిలాసము, ఆంధ్రానువాదము - పుట 2-3.

3 R. No. 6409 / 668 పుష్పబాణ విలాసము - మొదటి శ్లోకము, వావిళ్ళ ప్రెస్ మద్రాసు 1946 లో ముద్రణము.

4 మణిమయ గోపాలకవి - పుష్పబాణ విలాసము - మొదటి అనువాద పద్యము. (ఆంధ్రానువాదము)

అనువాద విషయము :-

అనువాద విషయమున గోపాలకవిగారు యథాశక్తి మాతృకను దృష్టి యందుంచుకొని రచనగావించినారు. విభావానుభావ సాత్విక భావములీకవి రచనలో పొందుపఱచబడినవి.

మూలమందలి మొదటి శ్లోకము క్రింద వ్యాఖ్య యిటులున్నది. 'అథకవిః గోపీవల్లభ చరిత్ర ప్రతిపాదన పవిత్రం పుష్పబాణ విలాసాఖ్యం శృంగార కావ్యం చికీర్షుః, అని వ్యాఖ్యలో వ్రాయబడినది.

గోపాలకవిగారు 3వ శ్లోకమున సాత్త్విక భావములు, 4 శ్లో. ప్రౌఢ నాయిక లక్షణము, 7 శ్లో. - కామకేళిందేలి తన మందిరమునకు వెలువడు కామిని వర్ణనము. 8 ప. ప్రోషిత భర్తృక లక్షణము, భర్త యెడబాటును సఖితో చెప్పుట. 9 పద్యమున విరహిణి యొక్క దుర్దశను చెలి తెల్పుట, 10 ప. నాయకుడు మిత్రునితో తన వియోగ కారణమును తెల్పుట. 11 ప. నాయిక దూతికను నిందించుట. 12 ప. విరహిణి మరణోద్యోగము. 13 ప. లో నాయిక యొక్క విరహాతిశయమును దూతిక నాయకునితో తెల్పుట. 14 ప. నాయిక శోకించగా సఖి ఆమెనోదార్చుట. 16 ప నాయకుడు తన స్త్రీ సౌందర్యమును మిత్రునితో వర్ణించి చెప్పుట- పరకీయ నాయికా వర్ణనము - నాయకుడు నాయిక నలుకదీర్చుట మున్నగు (25 శ్లోకములను) వానిని ఆంధ్రానువాదము గావించినారు.

ఈ కావ్యమనువాద గ్రంథమయ్యును చక్కని అర్థాలంకారములలో కూడి విప్రలంభ శృంగారమున స్వతంత్ర రచనగా గన్పట్టును.

శివానంద లహరి:-

ఈ కవి అనువాదము గావించిన మూడవ కృతి శివానంద లహరి. ఈ గ్రంథము ముద్రితము[1] గోపాలకవి శ్రీ మదాది శంకరుల వారి సంస్కృత 'శివానంద లహరి' కాంధ్రానువాదము గావించెను కవి వైష్ణవ మతాభిమాని యయ్యును దీనినితివృత్తముగా నెన్నుకొనుటచే శివకేశవ భేదము లేనివాడని తెలియుచున్నది.

---

1 శివానందలహరి - ఆంధ్రానువాదము - రైతు సంఘము - ధర్మవరము, ముద్రణము 1969. అలంపూరు తాలూకా అని మాత్రమే వ్రాసినారు.

అనువాదపద్ధతి :

గోపాలకవి అనువాదవిషయమున సాధ్యమైనంతవరకు తెనుగు పదజాలమును వాడినాడు. కవి కొన్నిచోట్ల మూలమునయున్న పదములను యథాతథముగా వాడినాడు. ఉదా: 27. కరస్థేహేమాద్రౌ అనుదానికి హేమనగంబుకేల, అని అనువాదము, 51 శ్లో- 'భృంగేచ్ఛాఘనటనోత్కటం' అనునది. మూలపదముల ననువాదమున వాడుట జరిగినది. అనువాదగ్రంథమైనను సరళముగను, సులభముగను గనపట్టును.

నీతి శాస్త్రము:

కవిగారి నీతిశాస్త్రమను గ్రంథము ముద్రితమైనది. అనువాదవిషయము నరయుటకీ కవిగారి పద్యము-

గీ॥ వడుగు జేసినఘనుడన్నమిడిన సుకృతి
భయముడిపినట్టి సుమతి, విద్యయుగరపిన
ప్రాజ్ఞుడును, తన్నుగన్న పావనుడు వీర
లేవురును తల్లిదండ్రు లంచెంచవలయు.[1]

మిగిలిన అముద్రితములు- అవి లభించలేదు.

## గొట్టుముక్కల కృష్ణమూర్తి:

గాడేపల్లి వారి శిష్యులమని గర్వముగా చెప్పుకొనువారు కొందరు నేటికిని గద్వాలలో గలరు. అట్టివారిలో గొట్టుముక్కల కృష్ణమూర్తిగారొకరు. వీరు దైన్యాలోకం, నాగోడు, విజయఢంకా, వేదనాలహరి, మున్నగు గ్రంథములను రచించినారు. వీరి రచనలు ముద్రితములైనవి.[2]

వీరు బాల్యమునుండియు రాజకీయములలో ప్రవేశించి అందలి లోతుల నెరిగినవారు. వీరు సంస్థానకాలమునుండి నేటివరకుగల సంస్థాన విషయములను రాజకీయ మర్మముల నాకళింపు గావించుకొన్న వారు. సాహితీ సంపన్నులు.

---

1. మణిమయ గోపాలకవి నీతి శాస్త్రము- రైతుసంఘము ధర్మవరము- అనువాద పద్యము- అలంపురము తాలూకా 1969లో ముద్రితము.
2. గో॥ కృష్ణమూర్తి రచనలు- యువవిజ్ఞాన సమితి గద్వాల- 1954 ముద్రణము.

రచనలు:

కృష్ణమూర్తిగారి మొదటి కృతి 'దైన్యాలోకం' అను గ్రంథము ఇందు మొత్తము 17 శీర్షికలున్నవి. కవి ఈ గ్రంథమందు సమాజములోని కుళ్ళు నెత్తిచూపుచు వ్యంగరూపమున రచించినాడు. కవి తన రచనలో నిత్యజీవిత వస్తువులనే నితివృత్తములుగా నెన్నుకొని రచన గావించినారు.

కవి రచనా విషయము:

కవిగారు బాహ్య ప్రపంచమును బాగుగా నాకళింపు గావించుకొన్నవారు కావున సమాజములో కొన్ని స్వార్థశక్తులు తననేమి జేయజాలవనును 'స్వార్థ శక్తులునన్ గదల్పంగలేవు' అని తెల్పెను.

కవి 'భారతీ మాతృపూజా ప్రభావమెపుడు నన్ను నొక కంట జూచుచు నున్నజాలు' నని భారతి మాతృపూజ్యుడై తనకు గల అభిమానమును చాటినాడు. భారతీసేవ నహరహము గావించుకోరిక గలవాడు. కవి వాగ్దేవిపాద పద్మ ముల ప్రోల తనువు జాలించు భాగ్యమును గోరినాడు.

తాను 'కోరుకొనియెడు గ్రంథాలు కుప్పవోసి చదువుకొనసిండు' అని తన మనస్సునందు గల కోరికను, ఆవేదనను తెల్పినాడు. అదియే అతనికి స్వర్గ మని తలంచిన కవి యితడు. ఇది ఖండకావ్యము.

భిక్షుకా, యమశీర్షిక గల దానిలో కవిగారి మాట లటులున్నవి. 'భరత జనయిత్రి స్వాతంత్ర్య పర్వదినము కంటనీర్వెట్టగూడదీ యింటిముందు' అటుల కంటనీరు వెట్టుట ప్రజామంత్రి కవమానమగునని భిక్షుని మందలించును.

'మందలింపు' అను శీర్షికలో కవి తన స్వయానుభవములను గూర్చి తెల్పుచు కవి యనిన మాటలు-

గీ॥ స్వార్థపూరిత నాయకుల్సహచరులను
అక్కరలు దీరునందాక ఆదరించి
జేల వుత్తురు టక్కుల నేలనమ్మి
చెడెదుకాదన్న నెక్కడి జీవితాశ.[1]

---

1. గో॥ కృష్ణమూర్తి దైన్యాలోకం- ఖండిక 'మందలింపు'.

అని తెలియజేసెను ఈకవిగారి రచనలన్నియు స్వానుభవమును గడించు కొన్నట్టివి. కవి ఆత్మాభిమానముతో కూడియున్న వాడు. వెనుకుధాగ్నిని రగిలించి తనువు దాల్చి బుగ్గి గావించినన్ దోసిలొగ్గలేనన్నను.

ఇట్టివి సహజముగా కవి వ్యక్తిత్వమును దెల్పునట్టి అంతర్భావనా వాహినులు. కవి 'సమాశ్వాసము' అను ఖండికలో నంతర్లీనమై యున్న తన కోరిక నిట్లు వెల్లడించినాడు.

'మహిత వాగ్దేవి పాదపద్మముల మ్రోల భక్తితో జీవితము నర్పణము గావించి తనువు జాలించుకోర్కె గలదనియు' నంతవరకు తనకు విశ్రాంతి లేదని తెల్పినాడు.

వీరు గద్వాలలోనుండి రాజ ప్రాసాదముల ప్రాచీన వైభవాన్ని తలంచి నేటి దుస్థితికి వాపోవుచు సాహిత్యసేవ గావించియున్నారు.

## ఉపసంహారము :

ఇటుల తెలంగాణమందెన్నియో సంస్థానములు వెలసి ప్రత్యేకించి గద్వాల సంస్థానము (ఆంధ్రభాష)లో సాహిత్యసేవ గావించి అఖిలాంధ్రదేశము నాకర్షించినది. గద్వాల ప్రభువు లాంధ్రభాషతోపాటు సంస్కృత భాషను సమాదరించి పండితులచే, కవులచే గ్రంథములు వ్రాయించి సాహిత్యసేవ గావించుచు తమ జీవితములను చరితార్థము గావించుకొని శాశ్వత కీర్తిని గడించుకొనిరి.

తెలంగాణమున నింకను అచటచట అముద్రిత ప్రతులు గలవు. సంస్థానములలో నింకను వనపర్తి-ఆత్మకూరు-జటప్రోలు (కొల్లాపురము) దోమకొండ గోపాలపేట మున్నగు సంస్థానములు గావించిన సాహిత్యము సేకరించి వెలుగులోనికి తేవలసియున్నది. ఇంకను కొన్ని గ్రంథములు అముద్రితములై వెలుగులోనికి రాలేదు. దాతలు-ప్రభువులు లేనందున మహబూబ్‌నగర మందలి పలు ప్రాంతములనుండి కవులు-వారి గ్రంథముల ముద్రితములుగానే నిలిచిపోయినవి.

ప్రభుత్వము అట్టి వారిని ప్రోత్సహించ ప్రయత్నము గావించినచో నీ మండలమందలి సంస్థానముల ప్రాభవమితోధికముగా పెంపొందగలదు.

సంస్థానముల సాహిత్యపోషణము లేకున్నచో ఆంధ్రవాఙ్మయ మభివృద్ధి కాజాలక పోయెడిదేమో. ప్రాచీన గద్వాల సంస్థానమందలి ఆంధ్ర సాహిత్య సేవ- కళాపోషణము పదుగురకు తెలియజేయు కోరికయే నా సిద్ధాంతవ్యాస మునకు పరమార్థము. ఈ మండలమందలి యితర సంస్థానముల సాహిత్య పోషణమును గూర్చి యువతరము పూనుకొని విస్మృతకవుల రచనలకు వెలుగు జూపింతురని ఆకాంక్షింతును.



# ఉపయుక్త గ్రంథ సూచిక

1. అప్పకవీయము - కాకునూరి అప్పకవి - పుట 298.
2. ఆంధ్రకవి తరంగిణి - చాగంటి శేషయ్య- సం. 11. పుట 33, 94, 130.
3. ఆత్మకూరు సంచిక - డా॥ బి. రామరాజుగారి వ్యాసం- పుట 12.
4. ఆంధ్రాష్టపది - చినసోమభూపాలుడు- పుట 51.
5. ఆంధ్ర పద్మపురాణము - (దేశయాత్రచరిత్రము)- పి. చిదంబరశాస్త్రి, పుట 79, 82, 83.
6. ఆంధ్రకవుల చరిత్రము - కందుకూరి వీరేశలింగం పంతులు - పుట 112.
7. ఆధ్యాత్మ్య రామాయణము - కాణాదం పెద్దన - పుట 182.
8. ,, ,, ,, ఆగస్త్యకృతము (మూలము) - పుట 137.
9. ఆంధ్రభారతము - ఆదిపూడి ప్రభాకరరావు - పుట 240.
10. ఆంధ్రపరాశరస్మృతి - ,, ,, పుట 241.
11. ఉద్యోగపర్వం - కొటికలపూడి వీరరాఘవకవి - పుట 84, 144.
12. కుమారసంభవము (నన్నెచోడ) మా. రామకృష్ణకవి - పుట 38.
13. కృష్ణలీలా తరంగిణి - కా. అప్పళాచార్యులు - పుట 52, 232.
14. కాకతీయ సంచిక - డా. మా. రామారావు - పుట 122.
15. కప్పత్రాళ్ళ శతకము - మధిలికృష్ణకవి - పుట 289.
16. కృష్ణశతకము ,, ,, పుట 288.
17. ,, ,, శ్రీ వేంకటాచార్యులు - పుట 288.
18. కేశవేంద్రవిలాసము - జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి - పుట 294.
19. ఖండభారతము - ఉప్పల వేంకటశాస్త్రి - పుట 292
20. గద్వాల ప్రభాకరము - ఆదిపూడి ప్రభాకరరావు - పుట 59, 84, 239.
21. గిరీశాచల మహాత్మ్యము - ఆస్థానపండితులు గద్వాల - పుట 35.
22. గాడేపల్లి వారి కవితావిలాసము - మ. సుబ్రహ్మణ్యశాస్త్రి- పుట 63, 66.
23. గోలకొండ పత్రిక - వ్యాసం డా. బి. రామరాజు- పుట 26, 11, 61, 81, 361.
24. గోలకొండకవుల సంచిక - సురవరం ప్రతాపరెడ్డి- పుట 112.

25. గీతగోవిందము (పీఠిక) - మా. రామకృష్ణకవి - పుట 228.
26. ఖండకావ్యసంపుటి - ఆదిపూడి ప్రభాకరరావు - పుట 245.
27. ఉమాపత్యభ్యుదయము - ఆదిపూడి ప్రభాకరరావు - పుట 246.
28. కేశవ శతకము - చెమికల చెన్నారెడ్డి - పుట 292.
29. ఖురాన్ షరీఫ్ - గుండేరావు హర్కారెగారు (సంస్కృతానువాదము)- పుట 315.
30. చమత్కార కవిత్వము - గా. వీరరాఘవశాస్త్రి - పుట 63, 66.
31. చంద్రశేఖర శతకము - మేడవరం సుబ్బరాయకవి- పుట 76.
32. చంద్రభాను చరిత్ర - మల్లనమంత్రి (అముద్రితము) - పుట 87.
33. చైతన్య విలాసము - గుండేరావు హర్కారె ఖండకావ్యము - పు. 315.
34. తత్సముచంద్రిక - స. సూర్యనారాయణశాస్త్రి - పుట. 302.
35. తెలంగాణము ప్ర. భాగము - దేశోద్ధారక గ్రంథమాల - సికింద్రాబాదు.
36. త్రింశదర్థ పద్యరత్నము - పో. కాశీపతి వ్యాసము-డా హరిశివకుమార్ పుట. 271-272.
37. ధ్రువచరిత్రము - ఎం. బలరామరెడ్డి- పుట. 309.
38. ,, ,, కా. వీరరాఘవశాస్త్రి - పుట 284.
39. దైన్యాలోకం - గో. కృష్ణమూర్తి - పుట. 329.
40. దేవకీనందనశతకము - అజ్ఞాతకవి, (వెన్నెలకంటి జన్నయ్య)-పుట. 297.
41. దివ్యదేశమహాత్మ్య దీపిక - ము. వేంకటభూపాలుడు (అము)-పుట 123.
42. దాససాహిత్యము - తిరుమలరావు, M. A. (వ్రాతప్రతి) వ్యాసం-అ. 42.
43. ద్రౌపదీకల్యాణము - కుమార వేంకటరాయలు - (అము) పుట. 87.
44. నానారాజ సందర్శనము - తిరుపతి వేంకటకవులు- పుట. 15, 56, 69, 247. 252.
45. నీతిశాస్త్రము - మణిమయ గోపాలకవి - పుట. 327.
46. నిర్వచన భక్తవిజయము - మందడి వేంకటకృష్ణకవి - పుట. 311.
47. నీలాసుందరి పరిణయము - కూచిమంచి తిమ్మకవి - పుట. 260
48. నిరంకుశోపాఖ్యానము - కందుకూరి రుద్రకవి - పుట. 117.
49. పౌండరీకము (పులివేట) - ఆ. ప్రభాకరరావు - పుట. 243.
50. పుష్పబాణవిలాసము (ఆంధ్రానువాదము) మణిమయగోపాలకవి- ఆ. 324.
51. భగవద్గీతార్థ సంగ్రహము - గో. వీరరాఘవశాస్త్రి - పుట. 287.
52. భానుమతీ పరిణయము - రేటూరి రంగరాజు- పుట. 97.

